ఎఫ్. కొరోవికిన్

# ప్రాచీన ప్రపంచ చరిత్ర





"ప్రాచీన ప్రపంచ చరిత్ర" అనే ఈ పుస్తకం డా. ఎఫ్. కొరోవ్కిన్ రచించాడు. ఇది 1973లో సోవియట్ యూనియన్ ప్రభుత్వ బహుమతి పొందింది. ఇది 20 సార్లకి పైగా పునర్ముద్రింపబడింది. ఈ పుస్తకం చదివి పాఠకులు మెసపొటేమియా, ఈజిప్టు, భారతదేశం, చైనాల చరిత్రకు సంబంధించిన ముఖ్యమైన సమాచారం తెలుసుకుంటారు.

ఈ పుస్తకంలో గ్రీసు చరిత్ర, క్రీ.శ. 5వ శతబ్దిలో పశ్చిమ రోమన్ సామ్రాజ్య పతనం వరకు రోమ్ చరిత్ర వివరించబడ్డాయి.

ప్రాచీన ప్రజల మతం, కళ, సంస్కృతులను గురించి ప్రత్యేకించి పేర్కొనబడింది.

ఎఫ్. కొరోవ్కిన్

# ప్రాచీన ప్రపంచ చరిత్ర



“ప్రగతి” ప్రచురణాలయం
మాస్కో

## విషయసూచిక



ప్రాచీన రోమ్

## పరిచయం

చరిత్ర ఒక శాస్త్రం. ఈ శాస్త్రం ప్రజలు ఎలా జీవించారు, వారి కృషి ద్వారా ప్రపంచం ఎలా మారింది, వాళ్ల జీవితం ఎందుకు, ఎలా మారి, యీనాటి జీవితంలోకి పరిణామం చెందింది అన్న విషయాలను పరిశీలిస్తుంది.

ఎన్నో వేల సంవత్సరాల క్రితం జీవించిన ప్రజల జీవితం గురించి మనం ఎలా తెలుసుకోగలం? మానవులు భూమిమీద గుర్తులను విడువకుండా అంతరించిపోరు. వాటినే అవశేషాలు లేక పురావశేషాలు అంటారు. ఈ అవశేషాలను అధ్యయనం చెయ్యడం ద్వారా విజ్ఞానశాస్త్రవేత్తలు ప్రాచీన మానవులు ఎలా జీవించారో తెలుసుకుంటారు.

### ''మాట్లాడే గుర్తులు.''

ప్రాచీన కాలంలో సైతం మనుషులు తమ ఆర్థిక కార్యకలాపాలను గురించీ, ఘటనలను గురించీ రాసి వుంచారు. వాళ్లీ విషయాలను చెట్టు బెరళ్లు, రాళ్లు, పదునుచేసిన చర్మాలు, మొదలైనవాటిమీద రాస్తూవుండేవాళ్లు. లభ్యమైన అత్యంత ప్రాచీన లిఖిత సమాచారం సుమారు 5,000 ఏళ్ల నాటిది (32–33 పేజీల్లో యివ్వబడిన కాల గణన రేఖలో దీన్ని చూడండి). పుస్తకాలు కూడా చాలా కాలం క్రితమే వెలువడ్డాయి. వాటిని చాలా విలువైనవిగా పరిగణించిన ప్రాచీనులు ఒక తరంనుంచి మరో తరానికి వాటిని పదిలంగా అందజేశారు. ఆ గ్రంథాల ద్వారా ప్రాచీన కాలానికి సంబంధించిన కథలనూ, గాథలనూ, వైజ్ఞానికాది రచనలనూ మనం చదవగలుగుతున్నాం.







1 2 3

లిఖిత చారిత్రక మూలాధారాలు. 1. ప్రాచీన ఈజిప్టులో కనుగొనబడిన ఒక శిలా శాసనం. ఎడమ వైపున: పెద్దవి చెయ్యబడిన రెండు మాటలు. ఈ శాసనం ప్రాచీన ఈజిప్షియన్ లిపిని అర్థంచేసుకోడాన్ని సాధ్యం చేసింది. 2. మట్టి పలకమీద లిఖింపబడిన శాసనం. 3. రోమన్ ''పుస్తకాలు,'' వాటిని పదిలపరచే మూతలున్న కొయ్య పెట్టె. (ఈ చారిత్రక మూలాధారాలను గురించి ముందుముందు మీరు మరింత వివరంగా తెలుసుకుంటారు)

అయితే, మనకి ప్రాచీన శాసనాలు దొరికితేనే సరిపోదు. వాటిని చదివి మనం అర్థంచేసుకోగలగాలి. వాటిలో చాలా భాగం యీనాడు ఎవ్వరూ ఉపయోగించని లిపుల్లో, భాషల్లో ఉన్నాయి. అయితేనేం, శాస్త్రజ్ఞులు ప్రాచీన ప్రపంచ ప్రజల రాతలను చదవడం ఎలాగో నేర్చుకున్నారు. ఒకనాడు బోధపడని గుర్తులు యీనాడు మనకి శక్తివంతమైన ప్రాచీన రాజ్యాలు, ప్రజా తిరుగుబాట్లను గురించీ, శాస్త్రీయ జ్ఞాన ఆవిర్భావం గురించీ, మరింకెన్నో విషయాలను గురించీ తెలియజేస్తున్నాయి. శాస్త్రజ్ఞులు చరిత్రను గురించిన తమ జ్ఞానాన్ని యే శాసనాల ద్వారా సంపాదించుకుంటారో వాటిని లిఖిత చారిత్రక మూలాధారాలు లేక చారిత్రక పత్రాలు అంటారు.

వస్తువులు, చిత్రాలు కూడా మనకి చాలా తెలియజేస్తాయి.

ప్రాచీనులు శాసనాలే కాకుండా యింకా అనేక అవశేషాలు వదిలారు. ప్రాచీనుల నివాస గృహ శిథిలాలే కాకుండా, వారి సమాధులు, వాళ్లు వాడిన వస్తువులు కూడా లభించాయి. "నీ ఇల్లు చూపించు, నువ్వెలా జీవిస్తున్నావో నేను చెప్తాను" అని ఒక సామెత వుంది. అలాగే శాస్త్రజ్ఞులు "ప్రాచీన మానవుడి ఎముకలు చూపించండి, అతనెలా ఉండేవాడో మేము చెప్తాం," "ప్రాచీన మానవుడి వస్తువులు చూపించండి. అతనేం చేశాడో, అతనికి యేమి తెలుసో, అతనెలా జీవించాడో మేము చెప్తాం" అంటారు. ప్రాచీన చిత్రాల కూడా ప్రజల జీవితాన్నీ, వాళ్ల కృషినీ, యుద్ధాలనీ, పండగలనీ, వాళ్లు వాడిన వస్తువులనీ గురించి చెప్తాయి.


1


2


3


4


5

వస్తు చారిత్రక మూలాధారాలు. 1. ఆర్మేనియాలో కనుగొనబడిన కొయ్య బండి. 2. ఒక గుహ గోడమీద వున్న గాయపడిన అడవి దున్నపోతు చిత్రం. 3. రాతి గొడ్డలి. 4. ప్రాచీన గ్రీకు చిత్రం. 5. రోములో ఒక స్మారక కట్టడం. (ఈ మూలాధారాల ద్వారా యేమి తెలిసిందో మీరు తర్వాత తెలుసుకుంటారు)

ప్రాచీనుల వస్తువులనూ, చిత్రాలనూ వస్తురూప చారిత్రక మూలాధారాలు అంటారు. ప్రజలకింకా లిఖిత భాష లేని పురాతన కాలంనుంచి అవి మనకి సంక్రమించాయి. మానవ కార్యకలాపాలకు సంబంధించిన గుర్తులు లేక అవశేషాలు — నిర్మాణానికి లేక గృహానికి సంబంధించిన చెత్త సామగ్రి, వివిధ వస్తువులు, పొయ్యిల్లోని, చలిమంటల్లోని బూడిద, అన్ని రకాల కట్టడాలు — జనం నివసించిన తావుల్లో మనకి లభిస్తాయి.

ప్రాచీన మానవుడు భూమిమీద వదిలిన గుర్తులపైన ధూళి, మట్టి, ఇసుక పేర్కొని ఒక పొర ఏర్పడుతుంది. మానవ జనావాసాలన్నింటిపైనా ఏర్పడే ఆ పొరను సాంస్కృతిక పొర అంటారు. అది కొన్ని సెంటీమీటర్లనుంచి రెండు లేక యింకా ఎక్కువ మీటర్ల మందం ఉంటుంది. విజ్ఞానశాస్త్రజ్ఞులు జనం నివసించి, కార్యకలాపాలు సాగించిన స్థలాలను కనుగొన్నప్పుడు ఆ స్థలాల్లో తవ్వకాలు జరుపుతారు.

వస్తురూప మూలాధారాల సాయంతో ప్రజల జీవితాన్ని అధ్యయనం చేసే శాస్త్రాన్ని పురాతత్వ శాస్త్రం — ప్రాచీన కాలానికి సంబంధించిన విజ్ఞానశాస్త్రం — అంటారు. అలా తవ్వకాలు సాగించి, పాదార్థిక మూలాధారాలను అధ్యయనం చేసే శాస్త్రజ్ఞులను పురాతత్వ శాస్త్రజ్ఞులు అంటారు.

**అత్యంత ప్రాచీన కాలంలోకి యాత్ర.**

మారుమూల ద్వీపాల్లోనూ, తదితర కొన్ని ప్రాంతాల్లోనూ నాగరికతకు వెలిగా చాలా వెనకబడిన ప్రజలు యీనాటికీ ఉన్నారు. ఇటీవలి కాలందాకా వాళ్లకి లిఖిత భాషలు లేవు, లోహాల వాడకం తెలియదు. ఈ ప్రజల జీవితానికీ, మన ప్రాచీన పూర్వికుల జీవితానికీ మధ్య చాలా పోలికలు వున్నాయి. వాళ్ల జీవితం గురించి మరింత బాగా అర్థంచేసుకునేందుకుగాను కొందరు విజ్ఞానశాస్త్రజ్ఞులు వాళ్లు నివసించే తావులకు వెళ్లారు. క్రమంగా వాళ్ల జీవిత విధానాన్ని అవలంబించి, వాళ్ల విశ్వాసాన్ని చూరగొన్నారు. తద్వారా వాళ్ల రోజువారీ జీవితాన్నీ,



తమ గుడిసె ముందున్న ఆస్ట్రేలియన్ ఆది వాసులు (ఫొటో)

ఆచార వ్యవహారాలనీ, విశ్వాసాలనీ అధ్యయనం చేశారు. వెనకబడిన ప్రజల జీవిత అధ్యయనం ప్రాచీనులు ఎలా జీవించారో మరింత బాగా తెలుసుకునేందుకు తోడ్పడింది.

? 1. ప్రాచీన ప్రపంచ చరిత్ర మనకి ఏమి తెలియజేస్తుంది? ప్రాచీన ప్రపంచాన్ని గురించిన మన జ్ఞానానికి మూలాధారాలు ఏమిటి? **2.** పురాతత్వ శాస్త్రం అంటే యేమిటి? **3.** పురాతత్వ శాస్త్రజ్ఞుల కృషి గురించి మీరు యింతకుముందు ఎప్పుడైనా విన్నారా లేక చదివారా?

## ఈ పుస్తకం ఎలా అధ్యయనం చేయాలి

ప్రాచీన ప్రపంచ చరిత్రను తెలుసుకునేందుకు పుస్తక వాచకమే కాక, చిత్రాలు కూడా తోడ్పడతాయి. చరిత్రను బాగా నేర్చుకునేందుకు మీరు వాచకంతోబాటు ప్రశ్నలనీ, చరిత్రకు సంబంధించిన మాపులనీ, చిత్రాలనీ, పట్టికలనీ కూడా అధ్యయనం చేయాలి.

విషయసూచిక ద్వారా మీరు యీ పుస్తకం నాలుగు భాగాలుగా, ఒక్కొక్క భాగం ప్రకరణాలుగా, ఒక్కొక్క ప్రకరణం § గుర్తు గల శీర్షికలుగా, ప్రతి శీర్షికా (§) కొన్ని ఉపశీర్షికలుగా విభజింపబడినట్లు చూస్తారు. శీర్షికలు ఆయా భాగాల్లోని విషయ సంగ్రహాన్ని తెలియజేస్తాయి.

ఈ పుస్తకంలో వర్ణ చిత్రాలు, ప్రాచీన కళాఖండాల ఫొటోలు వున్నాయి.

ఈ పుస్తకం చదివేటప్పుడు మాప్ ఆల్బమ్ వినియోగించండి. మాప్ సంఖ్య శీర్షిక (§) కింద యివ్వబడింది.

శీర్షిక (§) వాచకం ముందు ప్రశ్నలు ఉంటే, వాటికి జవాబులు జ్ఞాపకంచేసుకోండి. ఒకవేళ జవాబులు మరచిపోతే సంబంధిత § శీర్షికల వాచకం తిరగెయ్యండి. కొత్త పాఠ్యాంశాన్ని మరింత బాగా అర్థంచేసుకునేందుకు అవి మీకు తోడ్పడుతాయి.

ప్రత్యేక ధ్యానంతో చదివి మననం చెయ్యవలసిన అంశాలు అండర్లైను చెయ్యబడ్డాయి.

పాఠంలో పేర్కొనబడిన భౌగోళిక పేర్లను మాప్‌లలో కనుక్కోండి. §కు సంబంధించిన చిత్రాలను పరిశీలించండి. § శీర్షికల చివర ఏదైనా పత్రం వుంటే, దాన్ని చదివి, ప్రశ్నలకు జవాబులు చెప్పండి.

ఒక్కొక్క § గుర్తున్న వాచకం చదివాక, దాని చివర ఉన్న ప్రశ్నలకు సమాధానాలు రాయండి. ప్రశ్నలూ, హోమ్‌వర్కూ ? గుర్తుతో చూపబడ్డాయి.

## ప్రకరణం ఒకటి

# ఆదిమ కాలపు వేటగాళ్లు, ఆహారం సేకరించుకునేవాళ్లు

## §1. ప్రాచీన కాలపు మానవులు యెలా వుండేవాళ్లు, యెలా జీవించేవాళ్లు



**1. మొట్టమొదటి మానవులు.** మొట్టమొదటి జనులు ఈనాటి జనుల కంటె చాలా భిన్నంగా వుండేవాళ్లు. తోకలేని పెద్ద నరవానరాల్లా కనిపించేవాళ్లు. వాళ్ల నొసళ్లు యిరుకుగా, యేటవాలుగా వుండేవి. వాళ్ల మెదడు నరవానరాల మెదడు కంటె పెద్దగానూ, ఆధునిక మానవుల మెదడు కంటె బాగా చిన్నదిగానూ వుండేది. నడిచేటప్పుడు నిటారుగా లేకుండా, వంగి నడిచేవాళ్లు. చేతివేళ్లు మొరటుగా వుండేవి. ఆ వేళ్లతో వాళ్లు అత్యంత సరళమైన పనులు మాత్రమే చేయగలిగేవాళ్లు – భూమి తవ్వడం, వస్తువు పట్టుకోవడం, చేతితో కొట్టడం లాంటివి.

వాళ్లు నోటితో కొద్ది శబ్దాలు మాత్రమే చేయగలిగేవాళ్లు – పొట్టి, హఠాత్ శబ్దాలు. ఆ శబ్దాలతో కోపమూ, భయమూ వ్యక్తంచేసేవాళ్లు, యితరుల సహాయం అర్థించేవాళ్లు, ప్రమాదం గురించి యితరులను హెచ్చరించేవాళ్లు.

**2. పనిముట్లు.** ఆదిమ మానవులకి క్రూర మృగాల మాదిరిగా బలమైన పంజాలూ, వాడి గోళ్లూ, కోరలూ వుండవు. ప్రాచీన మానవులకు చేతిలో సులభంగా యిమిడే రాళ్లు కనిపించాయి. ఆ రాళ్లను ఒక అంచున పదును చేసేవాళ్లు. పదును చేయడానికి ఒక రాతిని మరొక రాతితో చిన్నచిన్న ముక్కలు విడిపోయేటట్లు కొట్టేవాళ్లు. ఈ పదును రాతిని చేతి గొడ్డలి అంటారు. ఈ పదును అంచులతో మాంసం ముక్కలు చేసేవాళ్లు, యెముకలు పగలగొట్టేవాళ్లు, గదలు తయారు చేసేవాళ్లు, కర్రలకు ఒకవైపున మొన తయారుచేసేవాళ్లు.

చేతి గొడ్డళ్లూ, తవ్వకం కర్రలూ, గదలూ మానవుడి మొదటి పనిముట్లు. వాటి సాయంతో మానవులు ఆహారం సేకరించుకునేవాళ్లు. ఏ జంతువూ అత్యంత సరళమైన పనిముట్టును సైతం తయారుచేసుకోలేదు.

పనిముట్లను తయారుచేసుకునే సామర్థ్యమే ఆదిమ మానవునికీ, జంతువుకీ మధ్య మౌలిక భేదం. శ్రమ మూలంగానే మానవుడు జంతు ప్రపంచంనుంచి 20 లక్షల సంవత్సరాలకు పైగా వెనక వేరుపడ్డాడు.

**3. ఆదిమ మానవుడి కార్యకలాపాలు.** మనుషులు పళ్లనూ, పక్షుల గుడ్లనూ పోగుచేసుకునేవాళ్లు. కందమూలాలనూ, చిన్నచిన్న జంతువులు నివసించే బొరియలనూ కర్రలు, చేతి గొడ్డళ్ల సాయంతో తవ్వుకునేవాళ్లు. ఇలాంటి కార్యకలాపాలకు పోగుచేత అని పేరు. మనుషులు ప్రకృతి మాత తమకు యిచ్చినవాటిని పోగుచేసుకునేవాళ్లు.

దుడ్డు కర్రలు, పదును పెట్టిన రాళ్లు, సూదిగా చెక్కిన కర్రలు పట్టుకొని మనుషుల గుంపులు రోగంతో తీసు









మానవ మంద పనిముట్లు. 1, 2, 3. చేతి గొడ్డళ్లు. 4. గద, తవ్వు కఱ్ఱ

కొంటూ బలహీనపడి, తమతమ మందలనుంచి వెనకబడిన జంతువులను — అడవి దున్నలు, జింకలు, పందులు — వేటాడుతూండేవాళ్లు (వర్ణ చిత్రం 1 చూడండి).

పోగుచేత, వేటలు మానవుడి తొలి కార్యకలాపాలు.

### 4. అగ్ని స్వాధీనం.

అడవి జంతువుల్లాగే ప్రాచీన మానవులు అగ్నికి భయపడేవాళ్లు. పిడుగు పడి అరణ్యం అంటుకున్నప్పుడల్లా వాళ్లు తీవ్ర భయభ్రాంతులతో పారిపోయేవాళ్లు. అగ్ని పర్వతాలు బ్రద్దలైనప్పుడు మంటలుమిసే యెఱ్ఱని లావా ప్రవాహాలు మరీ భయంకరంగా వుండేవి.

అయితే, అగ్ని తమకి ఉపయోగపడవచ్చునని క్రమంగా వాళ్లు తెలుసుకున్నారు: అది వేడిమి నిస్తుంది, క్రూర జంతువులనుండి తమను రక్షిస్తుంది. మండే అడవులనుండీ, అగ్ని పర్వత జ్వాలలనుండీ దివిటీలు ముట్టించుకొని, వాళ్లు సొంత మంటలు తయారుచేసుకొని, అవి ఆరిపోకుండా జాగ్రత్తపడేవాళ్లు. వంతులవారీగా వాళ్లు ఆ మంటలవద్ద కూర్చొని, మంటలో యెండు కట్టెలు వేస్తూ, అది నిరంతరం మండేటట్లు చూసేవాళ్లు. రాత్రి పూట జాజ్వల్యంగా మండుతున్న చలిమంట చుట్టూ కూర్చున్న మనుషులమీద దాడిచేసేందుకు క్రూర మృగాలు సాహసించేవి కావు. చేతిలో మండుతున్న కాగడా వున్న మనిషిని చూస్తే అవి వెనక్కి తగ్గేవి. మంటమీద కాల్చిన మాంసమూ, కందమూలాలూ మరింత రుచిగా వుండేవి.

అగ్నిని వాడడం నేర్చుకున్నాక మానవులు జంతువుల కంటె మరీ భిన్నం అయిపోయారు.

**5. ఆదిమ మానవుల మంద.**

ఆదిమ మానవుల జీవితం యెంతో కష్టంగానూ, ప్రమాదభరితంగానూ వుండేది. వాళ్లకి ఎప్పుడూ తగినంత ఆహారం దొరికేది కాదు. వాళ్లలో సగం మందికి పైగా 20 యేండ్ల వయస్సుదాకా బతికేవాళ్లు కారు. కొంతమందిని దుష్టమృగాలు చీల్చి చంపేవి; మరి కొందరు వివిధ రోగాలతో, ఆకలితో చచ్చిపోయేవాళ్లు.

ఆదిమ మానవులు ఒంటరిగా (విడివిడిగా) బతకలేకపోయారు. వాళ్లు గుంపులుగా కలిసి జీవించకపోతే, ఆహారం సంపాదించుకోవడం గానీ, మంటలు ఆరిపోకుండా చూడడం గానీ సాధ్యమయ్యేది కాదు. ఆకలితోనైనా చచ్చేవాళ్లు, లేదా అడవి జంతువులకు ఆహారమయ్యేవాళ్లు. అందుకనే వాళ్లు కలిసి ఆహారం కొరకు తిరుగుతూ, కలిసి మంటల చుట్టూ కూర్చుంటూ సమష్టిగా జీవించేవాళ్లు.

మామూలుగా ఒక గుంపులో కొన్ని పదులమంది వుండేవాళ్లు. అంతకంటె యెక్కువైతే వాళ్లకు తగినంత ఆహారం అదే చోట దొరకడం సాధ్యం కాదు. ఆ గుంపులు స్థిరమైనవి కావు. అడవి జంతువుల మందల మాదిరిగా వాళ్లు కలుస్తూ, విడిపోతూ వుండేవాళ్లు. ఆదిమ మానవుల గుంపును మనుషుల మంద అంటారు.

ఆదిమ మానవ మందలు వెచ్చగా వుండి, మొక్కామొటికా పుష్కలంగా వుండి, దుస్తులూ, ఇళ్లూ అవసరం లేని చోట్లనే నివసించగలిగారు. ఆదిమ మానవుల అవశేషాలు ఆఫ్రికా, ఆసియా, యూరప్‌లలో కనుగొనబడ్డాయి.

**?** **1.** ఆదిమ మానవులు ఎలా జీవించేవాళ్లు? **2.** ఆదిమ మానవులకీ, యీనాటి మనుషులకీ తేడా యేమిటి? **3.** ఆదిమ మానవులకీ, జంతువులకీ మధ్య వున్న అతి ముఖ్యమైన భేదం యేమిటి? **4.** సుమారు యెంత కాలం క్రితం జంతు ప్రపంచంనుంచి మానవుడు వేరుపడ్డాడు? **5.** తొలి మానవుల బృందాలను ఏమనేవాళ్లు? అలా ఎందుకు అనేవాళ్లో వివరించండి.

## §2. వేటగాళ్ల గణ సమాజాలు



**1. ఉష్ణోగ్రత తగ్గడం.**

భూమిమీద మానవులు సుమారు 20 లక్షల సంవత్సరాలుగా జీవిస్తున్నారు. సుమారు లక్ష సంవత్సరాల క్రితం భూమి ఉష్ణోగ్రత ఆకస్మికంగా తీవ్రంగా తగ్గిపోయింది. యూరప్‌లో మార్పు మరీ యెక్కువగా వుండేది. శీతకాలం దీర్ఘమూ, చాలా శీతలమూ అయింది. ఆ మంచు వేసవిలోనూ కరిగేది కాదు. క్రమంగా యూరప్‌లోని ఉత్తర అర్ధభాగమంతా హిమరాశి కింద అదృశ్యమైంది — రెండు కిలోమీటర్ల దాకా మందం వున్న దట్టమైన మంచు పొర కప్పేసింది. ఆ మంచు కొండకు దక్షిణాన తుప్పలతో కూడిన టుండ్రా అనే ప్రాంతం వుంది. వెచ్చని వాతావరణ స్థితికి అలవాటుపడిన జంతువులు చచ్చిపోయాయి. లేదా బాగా దక్షిణానికి పోయాయి.

అగ్ని సాయంతోనూ, పనిముట్ల సాయంతోనూ ఆదిమ మానవులు నూతన జీవిత పరిస్థితులకు సర్దుకున్నారు.

2. పనిముట్ల అభివృద్ధి.

ఆదిమ జనుల పనిముట్లు చాలా నెమ్మదిగా మారినా, కొన్ని లక్షల యేండ్లు గడిచేటప్పటికి వాళ్ళ రాతి అలుగులు గల ఈటెలూ, గోకుడు రాళ్ళూ, రాతి చాకులూ, రాతి సూదులూ తయారుచేసుకోవడం నేర్చుకొన్నారు.

ఆదిమ మానవులు యెముకలు పగలగొట్టుతూ ఎముకల, కొమ్ముల ముక్కలతో పదునైన పనిముట్లు తయారుచేయ వచ్చునన్న విషయం గమనించారు. వాళ్ళ యెముకలతోనూ కొమ్ములతోనూ ఆరెలూ, సూదులూ, పండ్ల కోలలూ —



మంచు యుగంలో భూమిమీద హిమరాశులచేత కప్పబడిన ప్రాంతం







30,000నుంచి 20,000 ఏళ్ల వెనుకటి పనిముట్లు. 1. ఎముక పండ్ల కోల, రాతి అలుగులు కలిగిన ఈటెలు. 2. రాతి సూది. 3. గోకుడు రాయి

కక్కుల ఈటెలు జంతువుల శరీరాల్లో దిగబడేవి — మొదలైనవి తయారుచేయడం ప్రారంభించారు. అయితే, రాతి పనిముట్లే ఆదిమ మానవులకి అతి ముఖ్యమైనవిగా వుండేవి. రాతి పనిముట్ల ద్వారా మాత్రమే వాళ్ళు కొయ్యనీ, ఎముకలనీ, కొమ్ములనీ కొయ్యగలిగేవాళ్ళు.

వాళ్ళు కొయ్యపని చేసేటప్పుడు ఒక విషయం గమనించారు — యెండిన కట్టెలు ఒక దానితో ఒకటి తగినంత సేపు రాసుకున్నప్పుడు రవ్వలు ఉద్భవిస్తాయి. ఈవిధంగా ఆదిమ మానవులు మంట చేయడం నేర్చుకున్నారు. అగ్ని తయారు చేయడం నేర్చుకున్న తర్వాత, ఆదిమ మానవులు తమకు అవసరమైనప్పుడు మంటలు వేసుకునేవాళ్ళు.

## 3. వేట, చేపలు పట్టడం.

ఆదిమ మానవులు ఈటెలు, పండ్ల కోలలు చేతబట్టి రైన్‌డీర్ల, యెద్దుల, గుర్రాల మందలను వేటాడేవాళ్ళు. ఒక గుంపు వేటగాళ్ళు పొంచి వుండగా, మరొక గుంపు ఈటెలూ, మండే చెట్ల కొమ్మలూ తిప్పుతూ మందను కొండ అంచుకో, లేక పొంచివున్న గుంపు దిశగానో తోలేవాళ్ళు (వర్ణ చిత్రం 3 చూడండి).

ఆదిమ మానవులు మామత్‌లు అనే దట్టమైన బొచ్చు గల బ్రహ్మాండమైన మహాగజాలను సైతం వేటాడేవాళ్ళు. అడవి ఏనుగు బలిష్ఠమైన తన తొండంతో కొట్టే ఒక్క దెబ్బతో మనిషిని చంపెయ్యగలదు. కాని, లోతైన గుంతలు తవ్వి, వాటిని కర్రలతో, కొమ్మలతో కప్పి, ఆ జంతువులకు బోనులు నిర్మించేవాళ్ళు. వేటకాళ్ళు దివిటీలతో మామత్‌లను భయపెట్టి, గుంతవైపు తోలేవాళ్ళు. అది గుంతలో పడ్డాక పైకి రాలేకపోయేది. అప్పుడు వేటగాళ్ళు దాన్ని చంపేవాళ్ళు.

వేటగాళ్ళు ఒక అడవి ఏనుగును చంపగలిగితే లేక అడవి జింకలనో లేక గుర్రాలనో మాటువేసి పట్టుకోగలిగినప్పుడు వాళ్ళకి దండిగా మాంసం లభించేది, అయితే తరచుగా ఆదిమ మానవులు వేట జంతువులకోసం నెలల తరబడి వెతుకులాడవలసివచ్చేది, అవి దొరకనప్పుడు పస్తులుండవలసివచ్చేది.

వేట మానవుల ప్రధాన కార్యకలాపం అయింది. వేట ద్వారా వాళ్ళకి ఆహారమే కాక, దుస్తులు కూడా లభ్యమయ్యేవి. మనుషులు తాము చంపిన జంతువుల చర్మాలను ధరించేవాళ్ళు.



ప్రాచీన వేటగాడి గుడిసె. కర్రలతోనూ, ఎముకలతోనూ, చిలవల కొమ్ములతోనూ యిది నిర్మింపబడేది. పైన తోళ్లతో కప్పబడేది. గుహలు లేని చోట్ల మనుషులు అలాంటి గుడిసెల్లో నివసిస్తూండేవాళ్ళు






ఆదిమ మానవుడినుంచి ప్రాజ్ఞ మానవుడికి పరిణామం. 1. 10 లక్షల సంవత్సరాల క్రితం జీవించిన మనిషి తల; సుమారు ఒక లక్ష సంవత్సరాల క్రితం జీవించిన మనిషి తల; సుమారు 30,000 సంవత్సరాల క్రితం జీవించిన మనిషి తల. (కనుగొనబడిన కపాలాల ప్రకారం పునరుద్ధరించబడ్డాయి) 2. ఒక పెద్ద వానర హస్తం. 3. 30,000 ఏళ్ల క్రితం జీవించిన మనిషి హస్తం. (పురాతనమైన ఎముకల ఆధారంతో పునరుద్ధరించబడ్డాయి)

గుహలు మానవుల తొట్టతొలి గృహాలు. మానవులు భారీ ఎలుగుబంట్లనూ, భయంకరమైన సింహాలనూ గుహలనుంచి తరిమేసేవాళ్లు. మానవులు దరిమిలా ఎముకలతోనూ, చర్మాలతోనూ గుడిసెలు వేసుకోవడం నేర్చుకున్నారు.

పండ్ల కోలలు కనిపెట్టాక ఆదిమ మానవులు చేపల వేట చేపట్టారు. మనిషి ఒడ్డున నిలబడి, పెద్ద చేప ఒడ్డు దగ్గరకి వచ్చినప్పుడు పండ్ల కోలతో కొట్టేవాడు.

**4. ఆదిమ జనులు యెలా మారారు, యెందుకు మారారు.**

శ్రమ పనిముట్లూ, కార్యకలాపాలే కాకుండా ఆదిమ జనులు కూడా మారారు. రాళ్లని చెక్కడం, కొమ్ములను కొయ్యడం, చర్మాలను పదునుపెట్టడం, నిప్పు రాజెయ్యడం వంటి పనుల్లో మానవుల హస్తాలు అభివృద్ధిచెందాయి. అతని కార్యకలాపాలు మరింత కచ్చితమయ్యాయి, అతని వేళ్లు మరింత చురుకెక్కాయి.

పనిముట్లు తయారుచేసేటప్పుడు వాళ్లు ఆ పనిముట్లు ఎలా వుండాలి, దానికోసం తాము యే వస్తువులు ఉపయోగించాలి, యే పనులు చెయ్యాలన్న విషయాలు ఆలోచించుకోవాలి. ఉదాహరణకు వేటకు సన్నాహాలు చేసుకునేటప్పుడు, వేటకాళ్లు యెక్కడెక్కడ నిలబడవలసిందీ, మందను యెక్కడికి, యెప్పుడు తోలవలసిందీ వాళ్లు ఒక అంగీకారానికి రావాలి. పని మానవుని మేధనూ, వాక్కునూ అభివృద్ధిచేసింది. అతని మెదడు అభివృద్ధి అవుతూ వచ్చింది. అతని నొసలు విశాలమవుతూ వచ్చింది, మనుషుల మధ్య సుసంబద్ధమైన వాక్ శక్తి యేర్పడింది. సుమారు 30 వేల సంవత్సరాల క్రితం తొలి మానవుడు మనలాంటి మనిషి అయాడు. విజ్ఞానశాస్త్రంలో అతను ప్రాజ్ఞ మానవుడు (Homo sapiens) అని పేర్కొనబడ్డాడు.

ఉజ్వల పండితుడూ, విప్లవకారుడూ అయిన ఫ్రెడరిక్ ఎంగెల్స్ శ్రమే మానవుని సృష్టించిందని పేర్కొన్నాడు.

**5. గణ సమాజాల అవతరణ.**

సంయుక్త కృషి, ప్రమాదాలకు వ్యతిరేకంగా ఉమ్మడి పోరాటం మనుషులను బాగా సన్నిహితం చేశాయి. సుమారు 30,000 ఏళ్ల క్రితం గణ సమాజాలు, లేక గణాలు ఏర్పడ్డాయి.

గణంలో కొన్ని పదులమంది లేక ఒక వందమంది వుండేవాళ్లు. వాళ్లందరికీ ఒకే మూలపురుషుడు వుండేవాడు. అందుకని అందరూ బంధువులే. బంధువులందరూ ఒకే గుహలో నివసించేవాళ్లు. లేదా కొన్ని పెద్ద గుడిసెలు నిర్మించుకొనేవాళ్లు. పురుషులు వేటకూ, చేపలు పట్టడానికీ వెళ్లేవాళ్లు. స్త్రీలు తినేందుకు పనికివచ్చే మొక్కలు సేకరించేవాళ్లు. స్త్రీలను అందరూ గౌరవించేవాళ్లు. పిల్లలు 3, 4 యేండ్లు వయస్సు వచ్చేటప్పటికి పెద్దవాళ్లకు తోడ్పడేవాళ్లు. ఆహారమంతా బంధువుల మధ్య పంపకమయ్యేది. చర్మాలూ, ఆహార నిల్వలూ, కొమ్ములూ, యెముకలూ బంధువులందరికీ సమిష్టి ఆస్తి. గణ సభ్యుల్లో మిక్కిలి అనుభవజ్ఞులైన గణ పెద్దలు వేటలోనూ, పనిముట్ల తయారీలోనూ, వేట పంపకంలోనూ నాయకత్వం వహించేవాళ్లు (వర్ణ చిత్రం 2 చూడండి).

ఈవిధంగా సమిష్టి ఆస్తి కలిగి, కలిసి జీవిస్తూ, కలిసి పనిచేసే ఈ బంధువుల బృందాలను గణాలు, లేక గణ సమాజాలు అంటారు.

గణం మానవుల మంద కంటె మరింత స్థిరంగా, మరింత బాగా సంఘటితమై వుండేది. ఆదిమ మానవ మందనుంచి గణానికి పరివర్తనకి మానవులు తమ అభివృద్ధి క్రమంలో నూతన, సమున్నత దశకి చేరుకున్నారని అర్థం.

అయినా కూడా ఆదిమ మానవ మందకీ, గణానికీ మధ్య యీకింది ఉమ్మడి లక్షణాలు వున్నాయి: ఆ రెండింటిలోనూ మనుషులకి వస్తువులు సమిష్టిగా వుండేవి, మనుషులు పరస్పరం సమానులుగా వుండేవాళ్లు, అత్యంత కనీస జీవితావసర వస్తువులను కలిగివుండేవాళ్లు.

తొలి మానవుల యిలాంటి సమాజాన్ని ఆదిమ సమిష్టి వ్యవస్థ అంటారు. ఆ వ్యవస్థలో జీవించిన జనాన్ని ఆదిమ మానవులు అంటారు.

? 1. "శ్రమ మానవుని సృష్టించింది" అన్న వాక్యాన్ని వివరించండి. 2. ప్రాచీన మానవులు తీవ్రమైన శీత కాలాల్లో ఎందుకు నశించలేదు? అందుకు గల వాటిలో అతి ముఖ్యమైనవిగా మీరు పరిగణించే మూడు కారణాలను పేర్కొనండి. మీ జవాబులు సరైనవో, కావో సరిచూసుకునేందుకు తోడ్పడే ప్రశ్నలు: (అ) శ్రమ పనిముట్లు ఎలా మారాయి? (ఆ) మానవుల జీవితంలో అగ్ని వహించిన పాత్ర యేమిటి? (ఇ) గణాల ఆచారాలను అతిక్రమించినవాళ్ళ దాన్నుంచి బహిష్కరింపబడేవాళ్ళు; మీ ఉద్దేశంలో అలాంటివాళ్ల గతి ఎలా వుండేది? 3. గణ సమాజం అంటే యేమిటి? గణ సమాజపు లక్షణాలేమిటి? గణపు లక్షణాలేమిటి? మానవుల మందకీ, గణ సమాజానికీ తేడా యేమిటి? 4. ఆదిమ సమష్టి వ్యవస్థ మౌలిక లక్షణాలను పేర్కొనండి. 5. ఆదిమ మానవులని ఎవరిని అంటారు?

## § 3. కళ, మత విశ్వాసాల ఆవిర్భావం

**1. అత్యంత పురాతన కళ.**

సుమారు నూరేళ్ల క్రితం ఒక స్పానిష్ పురాతత్త్వ శాస్త్రజ్ఞుడు ప్రాచీన కాలంలో మానవులు నివసించిన ఒక గుహను పరిశీలిస్తూ ఉన్నాడు. అనుకోకుండా అతను ఆ గుహ పైకప్పుమీద జంతువుల బొమ్మలు చూశాడు. పండితులు మొదట్లో ఆ బొమ్మలు యిటీవల చిత్రింపబడి వుంటాయని అనుకున్నారు. ప్రాచీన మానవుడు చిత్రాలు గియ్యగలడని ఎవరూ నమ్మలేకపోయారు. అయితే దరిమిలా అలాంటి చిత్రాలు చాలా గుహల్లో కనిపించాయి. ఎముకలతోనూ, కొమ్ములతోనూ చెక్కబడిన మనుషుల బొమ్మలను, జంతువుల బొమ్మలను కూడా పురాతత్త్వ శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. ఆ చిత్రాలూ, బొమ్మలూ ప్రాచీన కళాఖండాలన్న విషయంలో యిప్పుడెవరికీ సందేహం లేదు.

కళ సుమారు 30,000 ఏళ్ల క్రితం ఆవిర్భవించింది. ప్రాజ్ఞ మానవుడు తన చుట్టూ చూసినవాటిని చిత్రించేందుకూ, రూపొందించేందుకూ ప్రయత్నించేవాడు. మానవుడికి వేట ద్వారానే ఆహారం లభించింది కనుక, ప్రత్యేకించి వేట చిత్రాలను తరచుగా అతను గీసేవాడు. ఎటుపడితే అటు తేలిగ్గా తిరిగే తొండం కలిగిన మామత్, చిలవలు పలవలు కలిగిన కొమ్ముల అడవి జింకలు, గాయపడి, రక్తం ఓడుతున్న ఎలుగుబంటి – యీ చిత్రాలను గియ్యడంలో ప్రాచీన కళాకారులు అందెవేసినవాళ్ళు. తీవ్రంగా గాయపడిన అడవి దున్న, దాని చేతిలో మరణించిన వేటగాడు – యీ సన్నివేశపు చిత్రాలు కూడా వున్నాయి. కొన్ని గుహల్లో జంతువులను అనుకరిస్తున్న మనుషుల చిత్రాలు వున్నాయి. ఆ మనిషికి తలమీద కొమ్ములు, వెనక తోక వున్నాయి. జింక కదలికలను అనుకరిస్తూ అతను నాట్యం చేస్తూవుంటాడు. ప్రాచీన నాట్యాలు జంతువులనూ, వాటిని వెన్నంటి తరుముతున్న వేటగాళ్లనూ అనుకరించడంనుంచి ఆవిర్భవించాయి.

ప్రాజ్ఞ మానవుడు సునిశితమైన పరిశీలనా శక్తి కలిగినవాడనీ, అతనికి జంతువులు చాలా బాగా తెలుసుననీ ప్రాచీన కళాఖండాల వల్ల మనకు తెలుస్తుంది (వర్ణ చిత్రం 4 చూడండి).

**2. ఆదిమ మానవుడి బలహీనత, ప్రకృతిపట్ల అతని భయం.**

ప్రాజ్ఞ మానవులకీ, ఆదిమ మానవులకీ మధ్య పెద్ద భేదం ఉన్నప్పటికీ, పిడుగులు, వరదలు, రోగాల వంటి వినాశకరమైన ప్రకృతి శక్తుల ముందు వాళ్ళు కూడా నిస్సహాయులుగానే ఉండేవాళ్ళు. వెనకబడిన ఒక తెగకి చెందినవాళ్లు ఒక శాస్త్రజ్ఞుడితో యిలా చెప్పారు: "చెడ్డ వాతావరణాన్ని ఎదుర్కొని మేము మా ఆహారం సంపాదించుకునేందుకు పోరాడుతాము; అలాంటి వాతావరణమంటే మేము భయపడ







1. గాయపడిన ఎలుగుబంటి (ఒక గుహలోని రేఖా చిత్రం). 2. దుప్పి చర్మం కప్పుకొని, దాన్ని అనుకరిస్తున్న మనిషి (ఒక గుహలోని రేఖా చిత్రం). 3. వేటకి ముందు ఆస్ట్రేలియన్ వేటగాళ్లు

తాము. చలిగా వుండే గుడిసెల్లో జీవించే మేము పేదతనం, ఆకలి అంటే భయపడతాము. నిత్యం చూసే రోగాలంటే మేము భయపడతాము. శవాలంటే, మేము వేటాడి చంపే జంతువుల ఆత్మలంటే మేము భయపడతాము. మాకు తెలియని వాట న్నింటిని గురించీ మేము భయపడతాం."

భయంకరమైన ప్రకృతి శక్తులనుంచి ఆదిమ మానవుడు పారిపోయి, దాక్కొనేందుకు మాత్రమే ప్రయత్నించాడు. ప్రాజ్ఞ మానవులు వాటిని వివరించేందుకు కూడా ప్రయత్నించారు.

### 3. మత భావాలు తలెత్తడం.

మనుషుల చుట్టూ వున్న ప్రతి ఒక్కటీ చలనంలో వుంది — సూర్య చంద్రులు ఉదయిస్తారు, అస్తమిస్తారు. తుపాను మేఘాలు ఆకాశంలో పరుగులు తీస్తాయి. మొక్కలు ఎదుగుతాయి, వాడిపోతాయి. చివరకు భూమి సైతం కొన్ని సమయాల్లో మనుషుల పాదాల కింద కంపిస్తుంది. ప్రాకృతిక విషయాలన్నింటికీ వాటివాటి అసలైన కారణాలు వుంటాయి. ప్రకృతి శాస్త్రాలు పురోగతి చెందిన మూలంగా ప్రాకృతిక విషయాలకి మూలంలో వున్న కారణాలు యేమిటో మనకి యీనాడు తెలుసు.

ప్రాకృతిక విషయాలకు కారణాలేమిటో ఆదిమ మానవులకు తెలియదు. అందుకే వాళ్లు మానవాతీత శక్తులు ప్రకృతిని శాసిస్తున్నాయన్న భావాన్ని నమ్మారు. ప్రకృతిలో మనుషుల వంటివే గాని, వాళ్లకంటె బలమైన భూతాలు ఉన్నాయని వాళ్లు అనుకునేవాళ్లు. ఆ భూతాలు మెరుపులు మెరిపిస్తాయి, పిడుగులు కురిపిస్తాయి, గాలులు వీయిస్తాయి, వేటలో మనుషులకి తోడ్పడతాయి, లేక వారికి ఆటంకాలు కల్పిస్తాయి, మనుషులకి రోగాలు తెప్పిస్తాయి అనుకునేవాళ్లు.

జనం ఆ భూతాలు తమకి సాయంచెయ్యాలనీ, లేకపోతే వాటిని తరిమెయ్యాలనీ కోరుకునేవాళ్ళు. రోగి శరీరంనుంచి వ్యాధిని తరిమేసేందుకుగాను వాళ్ళు ధూపం వేసేవాళ్ళు, బిగ్గరగా అరిచేవాళ్ళు, కర్రలు ఝళిపించేవాళ్ళు. వేటగాళ్ళు జంతువులను సమ్మోహితంచేసి వేటలో విజయం సాధించాలని ప్రయత్నించేవాళ్ళు. ఈ లక్ష్యంతోనే జంతువులను చంపుతున్న భంగిమలతో చిత్రాలు వేసేవాళ్ళు.

నిద్ర, మరణం వంటి సహజమైన విషయాలను అర్థంచేసుకోలేక ఆదిమ మానవుడు మనిషి శరీరంలో కంటికి కనిపించని ఆత్మ జీవిస్తోందనీ, మనిషి నిద్రిస్తున్నప్పుడు యీ ఆత్మ శరీరంనుంచి పైకెగిరిపోయి, యితరుల ఆత్మలతో కలిసి భ్రమిస్తుందనీ విశ్వసించేవాళ్ళు. ఆత్మ శరీరంనుంచి శాశ్వతంగా వెళ్ళిపోయినప్పుడు మనిషి మరణిస్తాడని అనుకునేవాళ్ళు.

మానవాతీత శక్తులు ప్రకృతినీ, మానవుల జీవితాలనీ శాసిస్తున్నాయన్న విశ్వాసాన్ని మత విశ్వాసం అంటారు. ఆదిమ మానవుల బలహీనత, ప్రకృతి ఘటనలపట్ల భయం, వాటికి గల ప్రకృతిసిద్ధమైన కారణాలను వారు అర్థంచేసుకోక పోవడమే మత విశ్వాసానికి కారణం.

4. ఆదిమ మానవుల్లో మత విశ్వాసాల ఆవిర్భావం. పండితులు వాటిని గురించి ఎలా తెలుసుకున్నారు.

మతం లేని ఆదిమ మానవులు సామాన్యంగా తమలో చనిపోయినవారిని జంతువులూ, పక్షులూ తినేందుకు వదిలేసేవాళ్ళు. 30 వేలనుంచి 20 వేల సంవత్సరాలకు పూర్వం చనిపోయినవాళ్ల సమాధులను పురాతత్వ శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు. వాటిని చూస్తే అప్పట్లో జనం ఆత్మను నమ్మనారంభించారని తెలియవస్తుంది. వాళ్ళు శవంతోబాటు ఆహారాన్నీ, పనిముట్లనీ, నగలనీ సమాధిలో పూడ్చిపెట్టేవాళ్ళు. ఆత్మ చనిపోయినవాడి శరీరంలోకి తిరిగి రాగలదనీ, అలా వచ్చినప్పుడు మనిషి బతికివున్నప్పుడు అతనికి అవసరమైనవన్నీ కావలసివుంటాయనీ వాళ్ళు నమ్మేవాళ్ళు.

కొన్ని పురాతన కళాఖండాలు – ఈటె పోట్లతో చిల్లులుపడ్డ జంతువుల చిత్రాలు – మానవాతీత శక్తుల్లో విశ్వాస ఆవిర్భావాన్ని కూడా తెలియజేస్తాయి. ఆదిమ తెగల ప్రజల ఆచారాల అధ్యయనం అలాంటి పురాతన కర్మకాండలను అర్థం చేసుకునేందుకు తోడ్పడింది. ఉదాహరణకు, వేటకి బయల్దేరేందుకు ముందు ఆస్ట్రేలియన్ ఆదివాసులు కంగారూ మృగాల చిత్రాలు గీసి, ఆ బొమ్మమీదకి ఈటెలు విసిరేవాళ్ళు (పేజి 20 చూడండి).

? **1.** ఆదిమ ప్రజల కళాఖండాలు ఏమి తెలియజేస్తాయి? కనీసం నాలుగు అంశాలు చెప్పండి. **2.** ఆదిమ ప్రజల్లో మత విశ్వాసాలు ఎందుకు తలెత్తాయి? **3.** మత విశ్వాసాల ఆవిర్భావం గురించి పండితులు ఎలా తెలుసుకున్నారు? వాళ్ల జ్ఞానానికి కనీసం మూడు మూలాధారాలను చెప్పండి.

ప్రకరణం రెండు

# ఆదిమ కాలపు వ్యవసాయదారులు, పశుపాలకులు

## §4. పశువుల పెంపకం, భూమి దున్నడం ఆరంభం

గణ సమాజంలో పని ఎలా విభజింపబడిందో జ్ఞాపకం చేసుకోండి (§2; 5).

1. భూమిమీద ఉష్ణోగ్రత పెరుగుదల. జనం కొత్త భూములకి తరలివెళ్లడం.

సుమారు 13,000 సంవత్సరాల క్రితం మళ్లీ వాతావరణం వేడి అయింది. మంచు గుట్టలు కరగడం ప్రారంభించి ఉత్తరానికి తిరోగమించాయి. భూమిమీద వున్న ''మంచు టోపీ'' అదృశ్యం కాసాగింది. అడవులూ, పొదలూ మళ్లీ అవతరించాయి. చలికి అలవాటుపడిన జంతువులు ఉత్తరానికి వలసపోయాయి. మామత్‌లు పూర్తిగా అదృశ్యమయ్యాయి.

కొందరు జంతువులను అనుసరించి నదులనూ, సరస్సులనూ దాటి వెళ్లారు. మనుషులు రెండు మూడు కర్రమొద్దులను కలిపికట్టి మొట్టమొదటి నావలనదగిన తెప్పలను తయారుచేశారు. దరిమిలా వాళ్లు చెట్టు బోదెలను దొలిచి వాటిని దోనెలుగా ఉపయోగించ నారంభించారు.

క్రమక్రమంగా జనం యూరప్, ఆసియాల్లోని ఉత్తర ప్రాంతాల్లో స్థిరపడ్డారు.

2. అడవి జంతువులను మచ్చికచేయడం.

అడవి కుక్కలు వేటగాళ్ల నివాసాలకు దగ్గరలో తిరుగుతూ వుండేవి. వదలిపెట్టిన ఆహారం యేదైనా అవి తినేసేవి. దుష్ట జంతువులు దగ్గరలో వుంటే, మొరగడం ద్వారా అవి హెచ్చరిక చేసేవి. ఆవిధంగా కుక్కలు మనుషులకు అలవాటుపడి, వాళ్లతో కలిసి బతకసాగాయి. మనుషులు వేటకు పోయినప్పుడు అవి వాళ్ల వెంటపోయి, అడవి జంతువుల జాడలు తెలపడం ద్వారానూ, వాటిని బోనుల్లోకి తరమడం ద్వారానూ వాళ్లకు తోడ్పడేవి.

వేటగాళ్లు కుక్కలను మచ్చికచేశారు. కుక్క మానవుని మొదటి పెంపుడు జంతువు. అది వేటగాళ్ల సహాయకుడు, నిజమైన కాపలాదారు. కుక్కలు జంతువులను కనుక్కొని, వాటిని తరిమేవి.

వంచితే వంగే కొమ్మను వంచి వదలిపెడితే, అది పెద్ద వేగంతో మళ్లీ మొదటి స్థితికి చేరుకుంటుందని మనుషులు గమనించారు. ఫలితంగా వాళ్లు విండ్లు తయారుచేయడం ప్రారంభించారు. విండ్లనుండి ప్రయోగింపబడిన అమ్ములు డజన్ల అడుగుల దూరాన, నూర్ల అడుగుల దూరాన కూడా వున్న జంతువులకు తగిలేవి.

కుక్కలు వెంటరాగా విల్లమ్ములు ధరించిన వేటగాళ్లు ఈటెలూ, గదలూ, మాత్రమే వున్న నాటి కంటె యెక్కువ మాంసం యింటికి తెచ్చేవాళ్లు. తరుచుగా కుటుంబాలకు చాలినంత ఆహారం వుండేది. అలాంటప్పుడు వేటగాళ్లు తమకు చిక్కిన పందిపిల్లలనూ, మేకలనూ, యితర లేత జంతువులనూ చంపకుండా తమ నివాస స్థలాలకి తెచ్చేవాళ్లు. ఆవిధంగా

పందులూ, మేకలూ, గొర్రెలూ, ఆవులూ పెంపుడు జంతువులయ్యాయి. ఈవిధంగా వేటనుంచి పశువుల పెంపకం మొదలైంది.

**3. కొయ్యనాగలి వ్యవసాయం.**

ఆహార యోగ్యమైన గింజలు సేకరించే పనిలో స్త్రీలు ఒక అద్భుతమైన ఆవిష్కరణ చేశారు. మెత్తని నేలలో పడిన గింజ మొలకెత్తుతుందనీ, అది పెరిగితే అనేక గింజలు యిస్తుందనీ వాళ్లు గమనించారు. స్త్రీలు విత్తనాలను నేలలో పాతడం మొదలెట్టారు. ఈవిధంగా ఆహార పదార్థాల పోగుచేతనుంచి వ్యవసాయం మొదలైంది. వ్యవసాయం 10,000నుంచి 9,000 ఏళ్ల క్రితం అవతరించింది.

భూమిని దున్నేందుకు గొడ్డలి, కొయ్య నాగలి, కొడవలి అవసరమయ్యాయి.

జనం పదును పెట్టిన రాతిని కర్రకి కట్టి గొడ్డలిని తయారుచేసుకున్నారు. చివర ముడి వున్న పంగల కర్ర తొలి కొయ్య నాగలిగా ఉపయోగపడింది. దరిమిలా నాగలి కొర్రు ఎముకతోనో, కొమ్ముతోనో చెయ్యబడేది. జంతువు దవడ




1–3. ప్రాచీన వ్యవసాయదారులు వాడిన పనిముట్లు: గొడ్డలి, కొయ్య నాగలి, కొడవలి. 4. ధాన్యం గింజల తిరగలి రాళ్లు. 5. చెట్టు బోదెలో దొలచబడిన పురాతనమైన పడవ, దాన్ని తయారుచేసేందుకు ఉపయోగించబడిన పనిముట్లు

ఎముకకి వాడి అయిన రాతి పెచ్చులు అమర్చి కొడవలి తయారుచేసుకునేవాళ్లు (పేజీలు 23, 27లోని చిత్రాలు చూడండి). పురాతన వ్యవసాయంలో ఉపయోగింపబడిన ప్రధానమైన పనిముట్టు నాగలి కనుక, దాన్ని నాగలి వ్యవసాయం అంటారు. కొయ్య నాగలితో చేసిన వ్యవసాయంలో పంటలు తక్కువగా వుండేవి. అయినా కూడా, గణ సమాజానికి శాకాహారాన్ని సమకూర్చడంలో పోగుచేత కంటె అది మెరుగ్గా వుండేది.

## 4. తొలి చేతివృత్తులు.

వ్యవసాయం, పశువుల పెంపకాలతోబాటు చేతివృత్తులు అభివృద్ధి చెందాయి. చేతితో వివిధ వస్తువులు తయారుచెయ్యడాన్ని చేతివృత్తులు అంటారు. రాతినుంచి వస్తువులు తయారుచెయ్యడంలో మనుషులు బాగా నైపుణ్యం సంపాదించుకున్నారు. సుమారు 7,000 ఏళ్ల క్రితం రాతిని తరివెణ పట్టడం, సానపట్టడం వాళ్లు నేర్చుకున్నారు.

అగ్నిలో కాలిన మట్టి గట్టిపడుతుందని గమనించిన మనుషులు కుండలనూ, తదితర పాత్రలనూ తయారుచేసి కాల్చనారంభించారు. మనుషులు మట్టితోనూ, రాతితోనూ పొయ్యిలు చెయ్యనారంభించారు.

మనుషులు రెమ్మలతోనూ, చెట్టు పట్టాతోనూ బుట్టలు అల్లారు. ఈ అనుభవం వారికి వలలు అల్లుకోవడంలోనూ, ఉన్ని, నారలతో దుస్తులు నేయడంలోనూ తోడ్పడింది.













అతి పురాతనమైన చేతివృత్తులు పనిముట్లు, వస్తువులు. 1. రాతిలో కన్నం వేసేందుకు బర్మా. 2. బొక్క చెయ్యబడిన రాతి గొడ్డలి. 3. పురాతనమైన నేత మగ్గం (లభించిన అవశేషాలనుబట్టీ, వర్ణనలను బట్టీ పునర్నిర్మించబడింది లేక పునరుద్ధరింపబడింది). 4. మట్టి కుండ



ప్రాచీన వ్యవసాయదారుల, పశుపాలకుల జనావాసం (మన కాలపు చిత్రకారుడు గీసిన చిత్రం). చిత్రంలో ఏమి పనిముట్లు చిత్రింపబడ్డాయి? మనుషులు ఏమేం చేస్తున్నారు?

## 5. గణాలూ, తెగలూ.

ఒక పొలాన్ని రాయితో, ఎముకతో చేసిన పనిముట్లతో శుభ్రం చేసి (చెట్లూ, పొదలూ తొలగించి), పైరు పెట్టి, దాన్ని అడవి జంతువుల బారినుండి కాపాడడం ఒక్క మనిషి చేయలేడు. ఒక గణ సమాజం మాత్రమే ఈ పని చేయగలదు. మాసూళ్లూ, పశువులూ, యితర ఆస్తీ సమిష్టిగా వుండేవి. రాతితో, మట్టితో, ఉన్నితో, ఫ్లాక్స్ (నార)తో వస్తువులు తయారుచెయ్యకలిగిన గణ సమాజ సభ్యులు వాటిని సమాజమంతటికీ సమకూర్చేవాళ్లు.

కొన్ని గణాలు కలిసి ఒకే చోట స్థిరపడినప్పుడు, ఒక తెగ యేర్పడేది. తెగలోని సభ్యులందరూ ఒకే భాష మాట్లాడే వాళ్లు, వాళ్ల ఆచారాలు ఒకే మాదిరిగా వుండేవి.

తెగని పెద్దల సమితి పాలించేది. ఆ సమితి వేట భూములనూ, పచ్చిక బీళ్లనూ, పొలాలనూ గణ సమాజాల మధ్య భాగాలు పెట్టేది, తగవులన్నీ పరిష్కరించేది. పెద్దలు మొత్తం తెగ ప్రయోజనాల దృష్టితో వ్యవహరించేవాళ్లు. అందు వల్లనే వాళ్లమీద అందరికీ విశ్వాసం వుండేది, వాళ్ల మాటను అందరూ ఆక్షేపణ లేకుండా శిరసావహించేవాళ్లు. అత్యంత ముఖ్యమైన విషయాలు చర్చించడానికి పెద్దలు మొత్తం తెగలోని సభ్యులనందరినీ పిలిచి సమావేశాలు యేర్పరిచేవాళ్లు.

సాగుకి లాయకైన లేక పచ్చిక బీడుగా పనికివచ్చే భూమికోసం మధ్యమధ్య తెగల మధ్య యుద్ధాలు చెలరేగుతూ వుండేవి. యుద్ధ తరుణాల్లో జనం నాయకుణ్ణి, అంటే సేనా నాయకుణ్ణి ఎన్నుకునేవాళ్లు.

వ్యవసాయం, పశుపాలనల ఆవతరణ ఆదిమ మానవులకి మహత్తర ప్రాముఖ్యం కలిగిన విషయం. అంతకుముందు మానవుడు ప్రకృతి తనకిచ్చినదాన్ని మాత్రమే తీసుకున్నాడు: మొక్కమొటికలు పోగుచేసుకున్నాడు, జంతువులను వేటాడాడు, చేపలు పట్టుకున్నాడు. అందుకు భిన్నంగా వ్యవసాయదారులూ, పశుపాలకులూ తాము స్వయంగా మొక్కలు పెంచారు, జంతువులను పెంచారు.

? 1. పురాతనమైన మరే యితర కార్యకలాపాలనుంచి వ్యవసాయమూ, పశుపాలనా ఉత్పన్నమయ్యాయి? వ్యవసాయంలోనూ, పశుపాలనలోనూ రాతి గొడ్డలి వహించిన పాత్ర యేమిటి? 2. పురాతన వ్యవసాయదారుల కృషి గురించి ఒక చిన్న వ్యాసం రాయండి. 3. తొలి వ్యవసాయదారుల్లో, పశుపాలకుల్లో ఆదిమ సమష్టి సమాజం ఉందా? మీ అభిప్రాయాన్ని రుజువుచెయ్యండి. 4. కాల గణన రేఖను ఉపయోగించి మనుషులు అందాజుగా ఎప్పుడు విల్లును కనిపెట్టారో నిర్ణయించండి.

## § 5. మనుషుల మధ్య అసమానతలు తలెత్తడం

1. లోహ పోత కృషి ఆరంభం.

కొన్ని తెగలు సంపన్నమైన రాగి నిక్షేపాలు ఉన్న ప్రాంతాల్లో నివసించేవి. రాళ్లతో పాటు పొయ్యి మంటలో పడిన రాగి ముక్కలు కరిగేవి. చల్లబడేటప్పుడు అవి కొత్త రూపాలు పొందేవి. రాగికి వున్న యీ ధర్మాలను మనుషులు గమనించి, రాగితో వస్తువులు తయారుచెయ్యనారంభించారు. కావలసిన రూపాన్ని మట్టిలోనో లేక మెత్తటి రాతిలోనో దొలిచి, కరిగించబడిన రాగిని అందులో పోసేవారు. రాగి ద్రవం చల్లబడినప్పుడు అది ఆ మూస రూపాన్ని పొందేది. రాగితో గొడ్డళ్లు, చాకులు, కొడవళ్లు, తదితర వస్తువులు పోత పొయ్యబడేవి. మనుషులు వెండి, బంగారాలతో కూడా వస్తువులు చెయ్యడం నేర్చుకున్నారు.

ప్రధానమైన శ్రమ పనిముట్లు రాతితో చెయ్యబడిన కాలాన్ని రాతి యుగం అంటారు. మానవుల మధ్య రాగి పనిముట్లు అవతరించడంతో రాతి యుగం అంతరించి, లోహాల యుగం ఆరంభమైంది. కొన్ని దేశాల్లో రాగి పోత 7,000–6,000 ఏళ్ల వెనుక ఆరంభం కాగా, మరి కొన్నింటిలో బాగా తర్వాత ఆరంభమైంది (కాల గణన రేఖలో గుర్తించండి).

రాగి మెత్తటి లోహం. దానితో చేసిన వస్తువులు తొందరగా అరిగిపోయేవి. అత్యధిక సంఖ్యాక వ్యవసాయదారులు కొయ్యతోనూ, ఎముకతోనూ చేసిన పారలనూ, కొడవళ్లనే ఉపయోగించేవాళ్లు. కానైతే రాగి పనిముట్లతో కొయ్యతో, ఎముకతో వస్తువులు తయారుచెయ్యడం సులభతరంగా వుండేది. కొయ్య పనిముట్లూ, ఎముక పనిముట్లూ గణనీయంగా మెరుగు పరచబడ్డాయి.

2. నాగలి కనిపెట్టడం.

వ్యవసాయదారులు నాగటి దుంప సైజును పెంచి, దానికొక కాడిని తగిలించారు. కొందరు ఆ నాగటి దుంపను చేనుగుండా లాగగా ఒక మనిషి నాగటి దుంప నేలలోకి మరింత లోతుగా దిగేందుకు మేడిని అదిమిపట్టేవాడు. చేలో చాళ్లు చేసేందుకుగాను నాగలి అలా కనిపెట్టబడింది. క్రమంగా నాగలిని లాగేందుకు ఎడ్లను కట్టేవారు. నాగలిని కనిపెట్టడంతో భూమి సేద్యం త్వరితమై, మెరుగుపడింది. స్త్రీలు మేడి పట్టి, ఎడ్లను తోలడం కష్టసాధ్యమైంది. భూమి దుక్కి ప్రధానంగా పురుషుల పని అయింది.

3. గణ సమాజంనుంచి ప్రాంతీయ సమాజానికి పరివర్తన.

వెనకటి మాదిరిగానే భూమి మొత్తం గణ సమాజానికి చెందివుండేది. సమాజ సభ్యులందరూ తమ పశువులను ఉమ్మడి పచ్చిక బీటిలో మేపుకునేవాళ్లు, ఉమ్మడి అడవిలో వేటాడేవాళ్లు.

కానైతే, అప్పుడిక ఒక్క కుటుంబం ఒక పొలాన్ని దున్న గలిగేది. పొలంలో పండిన పంటను మాసూలుచెయ్యగలిగేది. పొలాన్ని మొత్తం గణ సమాజం సంయుక్తంగా సేద్యం చెయ్యవలసిన అవసరం వుండేది కాదు. పెద్దలు గణ సమాజపు భూములను పొలాలుగా విభజించి గణ సమాజంలోని కుటుంబాలకి పంచియిచ్చేవాళ్లు.

ప్రతి కుటుంబమూ తన పొలాన్ని సాగుచేసేది. దానికి దాని సొంత పనిముట్లూ, కొన్ని పశువులూ ఉండేవి. ఆ పొలంలో పండిన పంట ఆ కుటుంబానికి చెందేది. ఈవిధంగా ఒక ఆర్థిక యూనిట్‌గా వుండే గణ సమాజం విడి కుటుంబ కమతాలుగా విభజింపబడింది.

గణ సమాజపు సంపుటి కూడా మారింది. భూమిని తుప్పా, కంప కొట్టి సాగుకి లాయకిచెయ్యడంలో పాల్గొన్న యిరుగుపొరుగులవాళ్లు కూడా గణ సమాజంలోకి చేర్చుకోబడ్డారు. గణ సమాజం స్థానంలో క్రమంగా ప్రాంతీయ సమాజం యిలా వచ్చింది. ప్రాంతీయ సమాజ సభ్యులను సాముదాయిక వ్యవసాయదారులు అనేవాళ్లు. భూమి వాళ్ల సంయుక్త ఆస్తిగా వుండేది, కాని ప్రతి ఒక్క కుటుంబమూ తన సొంత పొలంలో పనిచేసుకునేది.

**4. గణ సభ్యుల్లోంచి కులీనులు వేరుపడడం.**

గణ సమాజం కుటుంబ కమతాలుగా విడివడటంతో సమాజ సభ్యుల మధ్య సమానత్వం అంతరించనారంభించింది. పెద్దలూ, నాయకులూ మిక్కిలి పెద్ద, మిక్కిలి సారవంతమైన భూఖండాలను ఆక్రమించుకునేవాళ్లు. యుద్ధంలో లభించిన కొల్లసొమ్ములో — పశువులు, రాగి, బంగారం — అత్యధిక భాగాన్ని తమ సొంతం చేసుకునేవాళ్లు. సమాజంలోని యితర సభ్యులు దరిద్రులవుతూ వుండగా, పెద్దలూ, సేనా నాయకులూ ధనికులవుతూ వుండేవాళ్లు.




1. రాగి గొడ్డలి, దాన్ని పోతపోసేందుకు మూసలు. 2. రాగి ఆయుధాలు: ఈటె, బాకు కొనలు. 3. బంగారు ఆభరణాలు. 4. కొయ్య నాగలి (పునరుద్ధరింపబడినది)







ప్రాంతీయ సమాజంగా గణ సమాజం పరివర్తన ఆరంభం (రేఖా చిత్రం). రెండు చిత్రాలనూ పోల్చి చూసి, రెండవ చిత్రంలో మార్పులు ఏమి వచ్చాయో, మారకుండా ఉండిపోయినవి ఏమిటో పరిశీలించండి. కనీసం నాలుగు మార్పులు చూపించండి

సేనా నాయకుడి తాత్కాలిక పదవి స్థిరమైన పదవిగా మారింది. సేనా నాయకుడి, పెద్దల పదవులు వారసత్వంగా సంక్రమించే పదవులు అయ్యాయి. వ్యక్తి స్థానం అతని నైపుణ్యంమీదా, అతని యోగ్యతలమీదా కాక అతను పుట్టిన కుటుంబంమీద ఆధారపడటం మొదలైంది. సేనా నాయకుల, పెద్దల కుటుంబాలు కులీన కుటుంబాలు అని పిలవబడేవి. తెగ మీద కులీనులు తమ పెత్తనాన్ని నెలకొల్పుకున్నారు.

సమాధులను చూస్తే మనుషుల మధ్య అసమానత తెలియవస్తుంది. సమాధులను తవ్వి పరిశీలించిన పురాతత్వ శాస్త్రజ్ఞులకు వాటిలో తిండి పదార్థాలు పెట్టే మట్టి పింగాణీ పాత్రలు దొరికాయి. కొన్ని గూనల్లో పనిముట్లు, మరి కొన్నింటిలో ఖరీదైన ఆయుధాలు, విలువైన ఆభరణాలు లభించాయి.

ఒక ఆర్థిక సముదాయంగా గణం విచ్ఛిన్నమవడం, మానవుల మధ్య అసమానత తలెత్తడం ఆదిమ సమష్టి వ్యవస్థ అంతానికి దారితీసింది.

## 5. సాముదాయిక వ్యవసాయదారుల మత విశ్వాసాలు.

మానవుల జీవితంలో, అలాగే వాళ్ల మత విశ్వాసాల్లో కూడా మార్పు వచ్చింది. వ్యవసాయదారులకి, వాళ్ల జీవితం యే ప్రకృతి శక్తులమీద ఆధారపడి వుందో ఆ శక్తులు — అతని పంటలకు వెచ్చదనాన్ని యిచ్చే సూర్యుడు, అతని చేలకు నీటినిచ్చే మేఘాలు, నేలలో మొలకెత్తి పెరుగుతున్న విత్తనాలూ — ముఖ్యం.

మనుషులు ఆ శక్తుల్ని సర్వశక్తిమంతులైన దేవుళ్ళగా ఊహించుకున్నారు. ఆ దేవుళ్ల యిచ్ఛ మేరకు వసంతం వస్తుందనీ, వర్షం కురుస్తుందనీ, పంట పండుతుందనీ జనం నమ్మేవాళ్ళ.

వాళ్ల కొయ్యనుంచో, రాతినుంచో దేవుళ్ల రూపాలు చెక్కారు. దేవుళ్ల మెప్పుకోసం కానుకలు సమర్పించేవాళ్ళ. వాటిని బలులు అనేవాళ్లు. పెంపుడు జంతువుల్ని బలి యిచ్చేవాళ్లు. మరి కొన్ని సందర్భాల్లో నరబలులు కూడా యిచ్చేవాళ్ళు. బలి రక్తాన్ని విగ్రహాల నోళ్లకు పులిమేవాళ్ళు.

? **1.** గణ సమాజానికీ, ప్రాంతీయ సమాజానికీ మధ్య పోలికలు యేమిటి? తేడాలు యేమిటి? **2.** ఆదిమ సమష్టి వ్యవస్థలోని యే లక్షణాలు ప్రాంతీయ సమాజంలో మిగిలాయి, యేవి అంతరించిపోయాయి? **3.** ఎవరిని కులీనులు అనేవాళ్లు? సమాజంలో తదితర సభ్యుల స్థానానికీ, వాళ్ల స్థానానికీ మధ్య భేదం యేమిటి? **4.** వ్యవసాయదారుల మత విశ్వాసాలకీ, వేటగాళ్ల మత విశ్వాసాలకీ మధ్య తేడాలు యేమిటి?



1



2

1. రెడ్ ఇండియన్ల ఒక దారు దేవతా విగ్రహం. 2. మానవ, జంతు బలి (పసిఫిక్ మహాసముద్రంలోని ఒక దీవిలో బలి ఆచారం చూసిన ఒక యూరపియన్ వేసిన చిత్రం). బలికి నిర్దేశింపబడిన మనిషి తాళ్లతో కట్టబడి నేలమీద పడివున్నాడు. బలి యివ్వబడే మనిషి అరుపులను ముంచెత్తేందుకోసం యిద్దరు గట్టిగా డోళ్లు వాయిస్తున్నారు. అంతకుముందు బలి యివ్వబడిన మనుషుల పుర్రెలు వెనక వున్నాయి. బలి యివ్వబడిన జంతువులు మంచెమీద ఉన్నాయి

| కాలం | పనిముట్లు | ఇతర వస్తువులు |
|---|---|---|
| అత్యంత ప్రాచీన కాలంనుంచి 2 లక్షల ఏళ్ల క్రితందాకా | చేతి గొడ్డలి, తవ్వు కర్ర, గద | |
| 30–20 వేల ఏళ్ల వెనక | ఈటె, పండ్ల ఈటె, గోకుడు రాయి | తోలు దుస్తులు |
| 13–7 వేల ఏళ్ల వెనక | విల్లు, గొడ్డలి, కొయ్య, నాగలి, కొడవలి, పడవ, మగ్గం | నేత వస్త్రపు దుస్తులు, మట్టి పాత్రలు |
| 6–5 వేల ఏళ్ల వెనక | నాగలి, రాగి గొడ్డలి, రాగి కొడవలి | రాగి ఆయుధాలు, బంగారు, వెండి నగలు |

అత్యంత ప్రాచీన మానవులకీ, ఆధునిక మానవులకీ మధ్య విశేషమైన భేదం వుంది.

అత్యంత ప్రాచీన మానవులు భూమిమీద ఎప్పుడు అవతరించారు? వాళ్లకీ, జంతువులకీ మధ్య భేదమేమిటి? వాళ్లకీ, ఆధునిక మానవులకీ మధ్య భేదం యేమిటి?

శ్రమ పర్యవసానంగా మానవులు అభివృద్ధి చెందారు,

మానవులు యెలా అభివృద్ధి చెందారు? ప్రాజ్ఞ మానవుడు యెప్పుడు అవతరించాడు? పుస్తకంలోని యే చిత్రాలు ప్రాజ్ఞ మానవుడి అవతరణను సూచిస్తున్నాయి?

## మీ పరిజ్ఞానాన్ని సరిచూసుకోండి

| ముఖ్య వృత్తులు | ఆదిమ మానవులు, వారి సముదాయాలు | కళలు, మతం |
|---|---|---|
| ఆహార సేకరణ, ఒంటరి జంతువుల వేట | ఆదిమ మానవుల గుంపులు | కళలు గాని, మతం గాని లేవు |
| వేట, చేపలు పట్టడం, ఆహార సేకరణ | ప్రాజ్ఞ మానవుడి ఆవిర్భావం, గణ సమాజాలు ఏర్పడటం | శిల్పాలు, గుహల్లో చిత్రాలు. ఇంద్రజాలం, ఆత్మలో, ప్రేతాత్మలో విశ్వాసం |
| వేట, ఆహార సేకరణ, జంతువులను మచ్చిక చేసుకోవడం, కర్ర నాగలి దుక్కి, చేతి వృత్తులు | గణ సమాజాలు, తెగలు | వ్యవసాయానికి సంబంధించిన ప్రకృతి శక్తుల ఆరాధన. విగ్రహాలు, బలులు |
| వ్యవసాయం, పశు పోషణ, చేతి వృత్తులు | గణ సమాజాలు విచ్ఛిత్తి, ప్రాంతీయ సమాజాల ఆవిర్భావం. గణ నాయకుల, పెద్దల పలుకుబడి పెరుగుదల | |

తమ పనిముట్లను మెరుగుపరచుకున్నారు.

ఆదిమ మానవులు తమ పనిముట్లను ఎలా మెరుగుపరచుకున్నారో వివరించండి. మీరు కథనంలో ఏ ఒక్క అంశాన్నీ మరచిపోలేదని సరిచూసుకునేందుకు పైన టేబిలు చూడండి.

ప్రకృతిని గురించి ఉపయోగకరమైన చాలా పరిశీలనలు జరిపారు.

ఆదిమ మానవులు ముఖ్యమైన ఏయే ప్రాకృతిక విషయాలను గమనించారు? వాళ్లు తమ పరిశీలనలను ఎలా ఉపయోగించుకున్నారు?

జనంలో కొత్త కార్యకలాపాలు తలెత్తి అభివృద్ధి చెందాయి.

ఆదిమ మానవుల కార్యకలాపాలను, అవి అవతరించిన క్రమంలో పేర్కొనండి.

| | |
|---|---|
| జనం ఆదిమ సమష్టి వ్యవస్థలో 20 లక్షల సంవత్సరాలకు పైగా కాలం జీవించారు. | ఆదిమ సమష్టి వ్యవస్థ మౌలిక లక్షణాలు యేమిటి? ఆదిమ మానవులు ఎందుకు గుంపుల్లో మాత్రమే జీవించగలిగారు? |
| మానవుల మధ్య అసమానతలు కొన్ని వేల యేళ్ల క్రితం అవతరించాయి. | మానవుల మధ్య అసమానతలు యెందుకు అవతరించాయి? అవి వాళ్ల జీవితంలో యెలా వ్యక్తం చేయబడ్డాయి? |
| ప్రకృతి శక్తుల ముందు ఆదిమ మానవుల నిస్సహాయత మతావిర్భావానికి దారితీసింది. | ఆదిమ మానవుల్లో ఏ మత విశ్వాసాలు అవతరించాయి? ఆదిమ మానవుల మత విశ్వాసాలను గురించి శాస్త్రవేత్తలు ఎలా తెలుసుకున్నారు? |

## చరిత్రలో కాలమానం

1. ఆదిమ యుగాల్లో కాలమానం.

నియమితమైన కాలం తర్వాత వసంతం వస్తుందనీ, ఆ తర్వాత వేసవి వస్తుందనీ భూమిని సాగుచేసే ఆదిమ మానవులు తెలుసుకొన్నారు. ఒక మాసూలుకీ, మరొక మాసూలుకీ మధ్య కాలవ్యవధులనుబట్టి వాళ్లు లెక్కవేసేవాళ్లు. కాలం సంవత్సరాల్లో గణింపబడటం అలా మొదలైంది.



ప్రత్యేకించి గుర్తుపెట్టుకోవలసిన ఘటన ఏదైనా సంభవించిన సంవత్సరాన్ని జనం మొదటి సంవత్సరం అనేవాళ్లు. ఉదాహరణకు, ఒక దేశంలో భారీగా వరదలు వచ్చిన ఏడాది మొదటి సంవత్సరంగా పరిగణింపబడగా, మరో దేశంలో రాజధాని నగరం రోమ్ నిర్మింపబడిన ఏడాది మొదటి సంవత్సరంగా పరిగణింపబడింది. తర్వాతి సంవత్సరాన్ని రెండవ సంవత్సరం అనీ, అటు తర్వాత దాన్ని మూడవ సంవత్సరం, వగైరా అనేవాళ్ళు. సంవత్సరాలను వేర్వేరు దేశాల్లో వేర్వేరు విధాలుగా లెక్కించేవాళ్లు. ఇది చాలా యిబ్బందికరంగా ఉండేది.

## 2. క్రీస్తు శకం.

మామూలు మనిషి రూపంలో ఒక దేవుడు భూమిమీద జీవిస్తున్నాడని సుమారు 2,000 యేండ్ల క్రితం గాథలు వ్యాపించాయి. ఆ దేవుడి పేరు జీసస్ క్రైస్ట్ (యేసు క్రీస్తు) అన్నారు. తరుచుగా గాథలు పరస్పర విరుద్ధంగా వుండేవి. యేసు క్రీస్తు యెప్పుడూ లేడని విజ్ఞానశాస్త్రం రుజువుచేసింది. కానీ, చాలమంది యేసు క్రీస్తును గురించిన గాథలను నమ్మారు. (ఈ గాథలు యెలా పుట్టిందీ, యెందుకు వ్యాప్తిచెందిందీ § 58లో వివరించబడుతుంది.)

ఈ గాథలు 5, 6 వందల సంవత్సరాల తర్వాత చాలా దేశాల్లో వ్యాపించాయి. రోమ్ నగర స్థాపన దరిమిలా ఫలానా సంవత్సరంలో క్రీస్తు జన్మించినట్లు తలచబడింది. క్రీస్తు గాథలు నమ్మే వాళ్లందరూ క్రీస్తు జన్మ సంవత్సరంనుండి కాలాన్ని లెక్కించడం ప్రారంభించారు. ఈ పద్ధతి చాలా దేశాలకు పాకింది. దాదాపు ప్రపంచమంతటా యిది అంగీకరింపబడింది. ఉదాహరణకు, 1870 లేక 1917 అని మనం అన్నప్పుడు అమెరికా వాళ్లకూ, జపాను వాళ్లకూ, పోలిష్ వాళ్లకూ, అందరికీ అర్థమౌతుంది.

''మొదటి సంవత్సరం''నుండి మన కాలంవరకు గడిచిన కాలాన్ని ''క్రీస్తు శకం'' అంటారు. దీన్నే సంక్షిప్తంగా ''క్రీ.శ.'' అంటారు.

### కాల గణన రేఖ



నూరు సంవత్సరాలను శతాబ్దం అంటారు. పది శతాబ్దాలను సహస్రాబ్దం అంటారు. క్రీస్తు శకం ప్రారంభం నుండి యిప్పటికి దాదాపు రెండు సహస్రాబ్దాలు గడిచాయి.

**3. క్రీస్తు పూర్వపు సంవత్సరాల గణనం.**

క్రీస్తు శకానికి పూర్వం చాలా ఘటనలు జరిగాయి. దీన్ని సంక్షిప్తంగా క్రీస్తు పూర్వ శకం, క్లుప్తంగా క్రీ.పూ. అంటాం.

పైన యివ్వబడిన కాల గణన రేఖను శ్రద్ధగా పరిశీలించండి. దానిలో ఒక్కొక్క గడి ఒక్కొక్క సహస్రాబ్దిని తెలియజేస్తుంది. వ్యవసాయం క్రీ.పూ. సుమారు 7,000 సంవత్సరాల నాడు ఆరంభమైంది. నాటినుండి నేటికి ఎన్ని వేల సంవత్సరాలు గడిచాయి?

క్రీ.పూ. సుమారు 7,000 సంవత్సరాలు, క్రీస్తు శకంలో సుమారు 2,000 సంవత్సరాలు, వెరసి 9,000 సంవత్సరాలు.

రాగి పనిముట్లు క్రీ.పూ. సుమారు 4,000 యేళ్ల క్రితం అవతరించాయి. అంటే, 4,000+2,000 సుమారు 6,000 సంవత్సరాల క్రితం అన్నమాట.

సూత్రీకరించండి: ఏదైనా ఒక ఘటన క్రీ.పూ. ఎన్ని వేల ఏళ్లనాడు జరిగిందో మీకు తెలిసినప్పుడు, అది ఎన్ని సంవత్సరాల వెనక జరిగిందో మీరెలా తెలుసుకోగలరు?

లిపి నేటికి 5,000 సంవత్సరాల క్రితం ఆవిష్కరింపబడింది. అంటే, అది క్రీ.పూ. ఎన్ని వేల సంవత్సరాల క్రితం ఆవిష్కరింపబడినట్లు? 5,000 సంవత్సరాలలో 2,000 సంవత్సరాలు క్రీ.శ.కి చెందుతాయి కనుక, లిపి క్రీ.పూ. 3,000 సంవత్సరాల నాడు ఆవిష్కరింపబడిందన్న మాట.

సూత్రం అన్వయించండి: ఏదైనా ఒక ఘటన నేటికి ఎన్ని వేల సంవత్సరాల క్రితం జరిగిందో మీకు తెలిస్తే ఆ సంఘటన క్రీ.పూ. ఎన్ని సంవత్సరాల క్రితం జరిగిందో మీరెలా తెలుసుకుంటారు?

అభ్యాసం:

విల్లు క్రీ.పూ. సుమారు 8,000ల సంవత్సరాల నాడు కనుగొనబడింది. అంటే, నేటికి సుమారు ఎన్ని సంవత్సరాల క్రితం అది కనుగొనబడింది? (కాల గణన రేఖను ఉపయోగించండి.)

లిపి సుమారు 5,000 సంవత్సరాల క్రితం కనుగొనబడగా, రాగి ఉపయోగం క్రీ.పూ. సుమారు 4,000 సంవత్సరాల క్రితం మొదలైంది. ఈ రెండింటిలో ఏది ఎక్కువ ప్రాచీనమైనది, ఎంత ప్రాచీనమైనది?

## ''ఆదిమ మానవుల జీవితం'' భాగానికి సంబంధించిన మరికొన్ని ప్రశ్నలు

ఒక తెగకి చర్మం, కంచె, కుండ, పైకప్పు, ఈటె, ముడి ఖనిజం, గుడిసె, విత్తులు నాటడం, కరిగించడం అన్న పదాల వాడకం తెలుసు. ఆ తెగ జీవితం ఎలా ఉండేది?

రెండు తరాల మధ్య ఉన్న అంతరం 20 ఏళ్లు అనుకుంటే, పది లక్షల సంవత్సరాల కాలంలో ఎన్ని తరాల ఆదిమ ప్రజలు జీవించివుంటారు?

ఆదిమ మానవుల మత విశ్వాసాలకు సంబంధించిన మన పరిజ్ఞానానికి మూలాధారాలు ఏమిటి?

# ప్రకరణం మూడు

# ప్రాచీన ఈజిప్టు

అత్యంత ప్రాచీన కాలంలో ప్రపంచంలోని జనులందరూ ఆదిమ సమష్టి వ్యవస్థల్లో బతికేవాళ్లు. వాళ్లు ఆహారం పోగుచేసేవాళ్లు, వేటాడేవాళ్లు, చేపలు పట్టేవాళ్లు. క్రమంగా వ్యవసాయమూ, పశుపాలనా అభివృద్ధి చెందాయి. భూమి మెత్తగా, సారవంతంగా వుండి, వాతావరణం వెచ్చగా ఉన్న చోట్ల వ్యవసాయం మరింత వేగంగా అభివృద్ధి చెందింది. అలాంటి సానుకూల పరిస్థితులు లేని భూముల్లో వ్యవసాయం చాలా నెమ్మదిగా అభివృద్ధి చెందింది. కొన్ని తెగల ప్రజలకు యిటీవలి దాకా వ్యవసాయం తెలియదు.

వ్యవసాయం, పశుపాలనా చేపట్టిన మొట్టమొదటి దేశాల్లో ఈశాన్య ఆఫ్రికాలోని ఈజిప్టు ఒకటి.

## §6. ప్రాచీన ఈజిప్టు ప్రకృతి, ప్రాచీన ఈజిప్టు వాసుల వృత్తులు

(మాపులు 1, 2)

**1. ప్రాచీన ఈజిప్టు భౌగోళిక ఉనికి.**

సంవత్సరంలో అధిక భాగం ఈశాన్య ఆఫ్రికాలోని వాతావరణం చాలా వేడిగా వుంటుంది; వానలు అరుదు. కొన్ని వేల కిలోమీటర్లు వ్యాపించిన విస్తారమైన భూభాగం యిసుకతోనూ, యిసుక రాళ్లతోనూ నిండిన యెడారి.

ప్రపంచంలోని పెద్ద నదుల్లో ఒకటైన నైలు ఈ యెడారిగుండా దక్షిణంనుండి ఉత్తరానికి ప్రవహిస్తుంది. మధ్య ఆఫ్రికాలోని పెద్ద సరస్సులనుండి నైలు ఉద్భవిస్తుంది. (మాపు 1లో ఆ సరస్సులనూ, నైలు నదినీ గుర్తించండి.) దాని ప్రవాహంలో అనేక రాతిబండల అవరోధాలు వున్నాయి. ఇరుకు ప్రాంతాల్లో వడిగా ప్రవహించిన మీదట సుమారు 700 కిలోమీటర్ల దూరం లోతైన మైదానంలో నెమ్మదిగా ప్రవహిస్తుంది నైలు. మధ్యధరా సముద్రం దగ్గర చాలా పల్లపు నేలలో నది ప్రవహించి, అనేక పాయలుగా చీలుతుంది. ఆ పాయల వలన డెల్టా యేర్పడింది. (మాపు 2లో నైలు నది రాతిబండల అవరోధాలను, మైదానాన్నీ, డెల్టా ప్రాంతాన్నీ గుర్తించండి.)

రాతిబండల అవరోధాలకు ఉత్తరాన వున్న నైలు మైదానంలోనూ, డెల్టాలోనూ వుండేది ప్రాచీన ఈజిప్టు.

**2. నైలు నది వరదలు.**

మధ్య ఆఫ్రికాలో వేసవిలో వర్షాలు యెక్కువగా పడతాయి. నైలు నదికి నీరు అందించే సరస్సులు అప్పుడు పొంగుతాయి. అదే సమయంలో నైలు ఉపనదులు ఉద్భవించే పర్వతాలలో మంచు కరిగి, పర్వతాలలో దారిలో శిలను అరగదీస్తూ, నీరు వేగంగా దుముకుతుంది. నైలు నది వేగంగా పొంగి, ఒడ్డులు దాటి, పల్లపు ప్రాంతమంతటినీ వరదలతో నింపేస్తుంది.





ఏతాము (ప్రాచీన ఈజిప్షియన్ చిత్రం)

నైలు నదీ మైదానం (ఫొటో)

వరదల సమయంలో నైలు నది పెద్ద మొత్తంలో సరస్సులలోని రకరకాల నీటి మొక్కలను మోసుకవస్తుంది. నీరు మెరిసే ఆకుపచ్చ రంగులో వుంటుంది. తర్వాత ఆ నీరు అరిగిన రాతి రజను మూలంగా రక్తవర్ణం దాలుస్తుంది. వరదలకు లోనైన భూమిమీద ఆ మట్టీ, కుళ్ళుతున్న మొక్కలూ ఒండుమట్టి రూపంలో పడతాయి. నవంబరులో వరద నీరు తగ్గి, నది గట్టుల మధ్యకు తిరోగమిస్తుంది. వరదలు తగిలిన మైదానంలోని నేలకు కావలసినంత తేమా, యెంతో సారవంతమైన నల్లటి ఒండు మట్టీ లభిస్తాయి.

నైలు నది వరద నీరు ప్రాంతం అంతటికీ సమానంగా లభించలేదు. ఆ నీరు పారని మిట్ట ప్రాంతాల్లో ఊసరక్షేత్రం వంటి ఎడారి మిగిలిపోయింది. పల్లపు ప్రాంతాలు జమ్ముతో, తుప్పలతో నిండిన ఊబిగుంటలుగా ఏర్పడ్డాయి. ఆ తుప్పల్లో సింహాలు వేటాడేవి. ఊబి నేలల్లో చాలా విషపూరితమైన పాములు విపరీతంగా ఉండేవి. రోగకారకమైన దోమలు, వగైరా కీటకాలు జుమ్మున ముసురుతూ జ్వరాన్ని వ్యాపింపజేసేవి.

### 3. ఎడారులతో, ఊబి నేలలతో జనం పోరాటం.

జనం పంటలు పండించేందుకుగాను ఎడారుల, ఊబుల, తుప్ప నేలల భూమిని బాగుచేసుకుని ఫలవంతం చేసుకోవలసివచ్చింది.

ఈజిప్షియన్లు అదనపు నీటిని బయటకి పారించేందుకుగాను ఊబి నేలల గుండా కాల్వలు తవ్వారు. తుప్పల్నీ, రెల్లునీ నరికారు. వాళ్ళు రెల్లు కలిపిన బంక మట్టితో ఆనకట్టలు కట్టి, మైదానాన్ని విడివిడి మళ్ళు చేసేవాళ్ళు. ఆనకట్టల్లో తలుపులు అమర్చి, వరదల తరుణాల్లో చేలకి వాటి ద్వారా అవసరమైనంత నీటిని వదిలేవాళ్ళు. వరదల మూలంగా నీరు అందని చేలకు ఏతాముల ద్వారా నీరు తోడి పారించేవాళ్ళు (పై చిత్రం చూడండి).

గాలుల తాకిడికి రేగి పడిన ఎడారి ఇసుకతో కాల్వలు మేటవేస్తూండేవి. అయితే, జనం కాల్వల్లో పూడిక తీస్తూండే



ఈజిప్టులో వ్యవసాయపు పనులు (ఒక సమాధి గోడమీద చిత్రం; చిత్రం కొంచెం దెబ్బ తింది).
వాచకం చదివి చిత్రంలోని మనుషులు యేమి చేస్తున్నారో, ఏ క్రమంలో చేస్తున్నారో వివరించండి

వాళ్లు. వరద నీటిలో ఆనకట్టలు కొట్టుకుపోతూండేవి, కాని జనం వాటిని తిరిగి కడుతూండేవాళ్లు.* జనం చేసిన ఎడతెగని కృషి మూలంగా ఎడారులూ, ఊబులూ లొంగివచ్చేవి.

---

* సోవియట్ యూనియన్ సహాయంతో ఆస్వాన్ నగర సమీపంలో నిర్మింపబడిన బ్రహ్మాండమైన ఆనకట్ట ద్వారా నైలు నది వరద నీరు యీనాడు నియంత్రితం చెయ్యబడుతోంది.



ఆయా పనులు చేస్తున్న ఈజిప్షియన్ చేతిపనివాళ్ళు (ఒక సమాధి గోడమీది చిత్రం). ఆ చేతిపనివాళ్లు ఏయే పదార్థాలతో ఏమేం పనులు చేస్తున్నారు? ఆ పనిముట్లలో యీనాటికీ ఉపయోగింపబడుతున్నవి మీకేమైనా కనిపిస్తున్నాయా?

4. ఈజిప్షియన్ల ప్రధాన వృత్తి అయిన వ్యవసాయం.

వరదల మూలంగా మెత్తగా, తడిగా వున్న నేల పారలతో, తేలికైన కొయ్య నాగళ్లతో తేలిగ్గా సేద్యం చేసేందుకు అనువుగా వుండేది. పొలంమీద విత్తనాలు చల్లి, గొర్రెలనూ, మేకలనూ, పందులనూ తోలేవాళ్లు. అవి విత్తనాలను భూమిలోకి తొక్కేసేవి. ధాన్యం తయారుచేయడానికి కంకులు నేలమీద పరిచి పశువులతో తొక్కించేవాళ్లు. వ్యవసాయమూ, పశుపాలనా ఈజిప్టులో ప్రధాన వృత్తులు అయ్యాయి. బార్లీ, గోధుమ, జనుము నైలు నదీ మైదానంలోనూ, డెల్టాలోనూ పెరిగేవి. తోటల్లో కూరగాయలు, పళ్లు పండేవి.

5. ప్రాచీన ఈజిప్టులో చేతిపనులు, వస్తు మార్పిడి.

వ్యవసాయదారులు మట్టితోనూ, వెదురు ఊచలతోనూ గుడిసెలు నిర్మించుకునేవాళ్లు. బట్ట నేసుకునేవాళ్లు, నాగళ్లు, కుండలు తయారుచేసుకునే వాళ్లు. ఈ పనులను తమ పొరుగువాళ్ల కంటె మెరుగ్గా చెయ్యడం నేర్చుకున్న వాళ్లు వ్యవసాయం చెయ్యడం మానుకున్నారు. వాళ్లు వడ్రంగులు, కుమ్మర్లు, సాలీలు, తదితర చేతిపనివాళ్లు అయారు. చేతిపనివాళ్ల పిల్లలు చిన్నతనంనుంచీ తమ తల్లితండ్రులకు సాయంచేస్తూ వాళ్ల దగ్గర్నుంచి ఆయా వృత్తులు నేర్చుకునేవాళ్లు. ఆయుధాలు, రాగి పనిముట్లు, బంగారు ఆభరణాల తయారీకి ప్రత్యేకించి ఉన్నత నైపుణ్యం అవసరమైంది.

మొదట్లో చేతివృత్తులవాళ్ళు తమ సమాజ సభ్యులకోసం మాత్రమే ఆయా వస్తువులు తయారుచేసి, వాటికి బదులుగా ధాన్యాన్నీ, తదితర పదార్థాలనూ తీసుకునేవాళ్ళు. అయితే, దరిమిలా యితర సమాజాల జనానికి వాటిని మార్చుకోనారంభించారు.

వస్తు మార్పిడికి నైలు నది అనువైన రవాణా మార్గంగా వుండేది. ఆ నది ఏటి పొడుగునా నౌకలు పోయేందుకు అనువుగా వుండేది. ధాన్యం, కలప, చేతివృత్తులవాళ్ల సామానులతో నిండిన నౌకలు నది ఎగువకీ దిగువకీ పయనిస్తూండేవి. నైలు నది ఒడ్డులమీద పట్టణాలు లేచాయి. పట్టణాల్లో సరుకుల మారకం జరిగేది. చేతిపనివాళ్ళు పట్టణాల్లో జీవిస్తూ, అక్కడ పనిచేస్తూవుండేవాళ్ళు.

జనం ఎడతెగకుండా చేసిన కృషి ఫలితంగా నైలు నదీ మైదానం మారిపోయింది. ఒకప్పుడు మానవులు నివసించేందుకు దాదాపు పనికిరానిదిగా వున్న ప్రాంతంనుంచి ఈజిప్టు సాంద్ర జనాభా కలిగిన వ్యావసాయిక దేశంగా మారింది.

? **1.** వరదలు వచ్చివుండకపోతే నైలు నదీ మైదానం ఎలా వుండివుండేది? **2.** ఈజిప్టులో ఏ నైసర్గిక పరిస్థితులు వ్యవసాయానికి అనుకూలంగా వుండేవి, ఏవి ప్రతిబంధకంగా వుండేవి? **3.** మనుషులు నైలు నదీ మైదానాన్ని మానవ జీవితానికీ, వ్యవసాయానికీ ఎలా సానుకూలం చేశారు? **4.** ప్రాచీన ఈజిప్షియన్ వ్యవసాయ కృషిలో ఏతాముల ప్రాముఖ్యం యేమిటి?

## § 7. ఈజిప్టులో వర్గాల ఆవిర్భావం

వ్యవసాయం, పశుపాలన, చేతివృత్తులు అభివృద్ధి చెందడంతో గణ నాయకుల, పెద్దల హోదాలో ఎలాంటి మార్పు వచ్చిందో, కులీనులు అని ఎవరిని పిలిచేవాళ్లో జ్ఞాపకం చేసుకోండి (§5; 4).

1. ఒక మనిషిని మరొక మనిషి దోచుకోవడం తలెత్తేందుకు కారణాలు ఏమిటి?

ఆదిమ వేటగాళ్లకు జీవికకు సరిపడే కనీస ఆహారం మాత్రమే లభ్యమయ్యేది. చివరకు పిల్లలు, వృద్ధులు కూడా తిండికోసం తంటాలుపడవలసివచ్చేది. అలాంటి పరిస్థితిలో తమకోసం యితరులచేత పనిచేయించుకోవడం వల్ల ప్రయోజనం లేదు. ఎందుకంటే, వాళ్ల శ్రమ ఫలితంతో వాళ్ల కడుపులు నిండటమే గగనమయ్యేది. వాళ్ళు ఉత్పత్తి చేసేవన్నీ పనివాళ్లను మేపేందుకు సరిపోయివుండేవి.

ఈజిప్టులో వ్యవసాయదారులు తమ శ్రమ ద్వారా వేటగాళ్ల కంటె ఎక్కువ ఉత్పత్తిచేసేవాళ్ళు. నైలు మైదానపు సారవంతమైన భూముల్లో, ముఖ్యంగా నాగలి కనుగొనబడ్డాక, పుష్కలంగా పంటలు పండేవి. వ్యవసాయదారు తన తిండికీ, తన పశువుల మేతకీ అవసరమైనదాని కంటె ఎక్కువ పండించగలిగేవాడు. పొలంలో పండిన పంట పొలంమీద పనిచేసిన వాళ్ల అవసరాలను తీర్చడమే గాక, కొంత అదనంగా మిగిలేది. అప్పుడు బలవంతాన మనుషులచేత శ్రమచేయించుకోవడం, వాళ్ల శ్రమ వల్ల లభించిన అదనపు ఉత్పాదితాన్ని తీసుకోవడం లాభసాటిగా మారింది. ధాన్యాన్నీ, పశువులనూ రాగికీ, బంగారానికీ, వెండికీ, చేతిపని వస్తువులకీ మార్చడం సాధ్యమైంది.

ఈజిప్టులో వ్యవసాయం అభివృద్ధి చెందడంతో మనుషులను దోచుకునేందుకు అవకాశం ఏర్పడింది. మనుషులను

దోచుకోవడం అంటే, యితరులు తమ శ్రమతో ఉత్పత్తిచేసినదాన్ని తమ సొంతానికి తీసేసుకోవడం అన్నమాట. దోపిడి అంటే యితరుల శ్రమ ద్వారా తయారుచేసినదాన్ని సొంతపరచుకోవడం.

**2. బానిసల అవతరణ, వాళ్లని దోచుకోవడం.**

ఆదిలో తెగల మధ్య జరిగిన యుద్ధాల్లో లభించిన ఖైదీలను ఈజిప్షియన్లు చంపేసేవాళ్లు. అందుకే ఖైదీలను "మృతులు" అనేవాళ్లు. మానవ శ్రమ ఎప్పుడైతే అతని అవసరాలకు మించి అదనపు ఫలితాన్ని యివ్వనారంభించిందో అప్పుడు యుద్ధ ఖైదీలను చంపెయ్యడం నిలిచిపోయింది. కులీనులు వాళ్లని బందీలుగా పట్టుకొని తమ బానిసలుగా చేసుకునేవాళ్లు. బానిసలను "సజీవ మృతులు" అనేవాళ్లు.

తెల్లవారు జామునుంచి రాత్రి పొద్దుపోయేదాకా బానిసలు ఏతాములతో నీళ్లు తోడేవాళ్లు, కాల్వలు తవ్వేవాళ్లు, ఆనకట్టలు కట్టేవాళ్లు, భవనాలకు రాళ్లు మలిచేవాళ్లు. బానిసలకి ఎలాంటి ఆస్తీ ఉండేది కాదు. వాళ్లు తమ యజమానుల ఆస్తిగా ఉండేవాళ్లు. వాళ్లు తమ శ్రమ శక్తితో చేసిన ప్రతిదాన్నీ బానిస యజమాని హరించేవాడు. అతను బానిసలు బతికి వుండి శ్రమచెయ్యగలిగేందుకు సరిపడ అత్యంత కనీసాహారం మాత్రమే వాళ్లకి యిచ్చేవాడు. బానిస యజమాని వాళ్లని కొరడాతో బాదవచ్చు, అమ్మవచ్చు, చంపను కూడా చంపెయ్యవచ్చు.

ఈజిప్టులో సాముదాయిక రైతుల కంటె బానిసల సంఖ్య తక్కువగా ఉండేది. కాని నీటి పారుదలకీ, మురుగు నీటి తొలగింపుకీ సంబంధించిన ముఖ్యమైన పనులు బానిసలే చేసేవాళ్లు. బానిసలను కలిగివున్న కులీనులు ఆ పనులమీదా, పొలాలకి నీటి పంపిణీపైనా అజమాయిషీ సంపాదించుకున్నారు.

**3. కులీనులచేత రైతుల దోపిడి.**

ఈజిప్టులోని ఎక్కువ భాగం భూమిని సాముదాయిక రైతులు సాగుచేస్తూండేవాళ్లు. ప్రతి ఒక్క రైతూ తన సొంత భూఖండంలో తన సొంత పనిముట్లతో పనిచేసేవాడు. అంతే కాకుండా వాళ్లు పొలాలు బాగుచేసేవాళ్లు, కాల్వలు తవ్వేవాళ్లు, ఆనకట్టలు కట్టేవాళ్లు.

కులీనులు నీటి పారుదల, మురుగు నీటి తొలగింపు పనులమీద అజమాయిషీ చేసేవాళ్లు. బాగుచేసిన భూముల్లో మిక్కిలి మేలైన ఖండాలను భుక్తంచేసుకునేవాళ్లు. రైతులు వాళ్లకి తమ పంటలో, పశువుల్లో కొంత భాగాన్ని యివ్వాల్సివచ్చేది.



1



2

1. "సజీవ మృతులు" (ప్రాచీన ఈజిప్షియన్ చిత్రం). 2. ప్రాచీన తూర్పుకి చెందిన ఒక రాజ్యంలో వశంచేసుకోబడిన "కొల్ల సొమ్ము" (ఈజిప్షియన్ చిత్రం). 1, 2 చిత్రాల్లోని మనుషులు భిన్న దేశాలకు చెందినవాళ్లన్న విషయాన్ని ప్రాచీన చిత్రకారుడు ఎలా చూపించాడు?

## ప్రాచీన ఈజిప్టులో వర్గాలు

| వర్గం | ఆస్తి | దోపిడిదారులు లేక దోపిడికి గురి అయినవాళ్లు |
|---|---|---|
| బానిస యజమానులు | భూమి, బానిసలు, పశువుల మందలు, పనిముట్లు, బంగారం | బానిసల, రైతుల శ్రమ ఫలితాలను సొంతం చేసుకునేవాళ్లు |
| రైతులు | చిన్న చిన్న భూఖండాలు, వారు వాడే పనిముట్లు, కొద్ది పశువులు | వారు ఉత్పత్తిచేసినవాటిలో కొంత భాగాన్ని ప్రభువులకి ఇచ్చేవాళ్లు |
| బానిసలు | నిరాస్తిపరులు, బానిస యజమానుల ఆస్తిలో భాగం | వీరు ఉత్పత్తిచేసిన ప్రతీదీ బానిస యజమానులకు చెందేది |

4. ఈజిప్టులో వర్గాల ఆవిర్భావం. క్రీ.పూ. 4–3 సహస్రాబ్దాల్లో ఈజిప్టు జనాభా దోపిడిచెయ్యబడేవాళ్లు, దోపిడిదారులు అనే వర్గాలుగా విభజింపబడింది.

బానిసల వర్గపు పరిస్థితి పరమ అధ్వానంగా ఉండేది.

మరో పీడిత వర్గం రైతులు.

దోపిడిదారీ వర్గమైన బానిస యజమానులు కులీనులు. వాళ్లు పనిచేయకుండా బానిసల, రైతుల శ్రమమీద బతికే వాళ్లు. చూపులకి సైతం వాళ్లు మిగిలిన ఈజిప్టు వాసులకు భిన్నంగా వుండేవాళ్లు. బానిస యజమానులు నాజూకు నార దుస్తులు ధరించేవాళ్లు. వాళ్ల నడుము పటకాలనుండి బంగారు పిడులుగల రాగి ఖడ్గాలు వేలాడుతూండేవి. వాళ్ల చేతులకు బంగారు కడియాలూ, మెడలకు బంగారు గొలుసులూ ఉండేవి. బానిస యజమానులు చల్లటి నీడనిచ్చే చెట్లతో ఆవరింపబడిన విలాసపూరితమైన భవంతుల్లో నివసించేవాళ్లు. గణ నాయకులు బానిస యజమానుల్లో కెల్ల మిక్కిలి ధనవంతులు.

ఈజిప్టులో బానిస యాజమాన్య వ్యవస్థ తలెత్తనారంభించింది. బానిస యాజమాన్య వ్యవస్థలో కొందరు వ్యక్తులు, అంటే బానిస యజమానులు మరికొందరిపైన, అంటే బానిసలపైన యాజమాన్యం కలిగివుండేవాళ్లు, వాళ్లని దోచుకునేవాళ్లు, వాళ్ల శ్రమనీ, ప్రాణాలనీ యిష్టంవచ్చినట్లు వినియోగించుకునేవాళ్లు.

? **1.** దోపిడి అంటే యేమిటో వివరించండి. కొందరు మనుషులు మరికొందరిని దోచుకోవడం ఎలా సాధ్యమైంది? **2.** ఆదిలో ఈజిప్టులో బానిసలను ఎందుకు చంపేసేవాళ్లు, క్రీ.పూ. 4వ, 3వ సహస్రాబ్దాల్లో ఎందుకు సజీవంగా ఉంచేవాళ్లు? **3.** రైతులకీ, బానిసలకీ మధ్య తేడా యేమిటి? వాళ్ల మధ్య సామ్యం యేమిటి? వాళ్లలో ఎవరి పరిస్థితి మరింత అధ్వానంగా ఉండేది? మీ వాదనని రుజువుచెయ్యండి. **4.** పాఠాన్నీ, పట్టికలనీ, చిత్రాలనీ ఉపయోగించి ఈజిప్టులో (అ) బానిసల, (ఆ) రైతుల, (ఇ) బానిస యజమానుల పరిస్థితిని వివరించండి. **5.** బానిస యాజమాన్య వ్యవస్థకీ, ఆదిమ సమష్టి వ్యవస్థకీ మధ్య వున్న తేడాలు ఏమిటి?

## §8. ప్రాచీన ఈజిప్టులో రాజ్య ఆవిర్భావం

గణ సమాజాలు విచ్ఛిన్నమైన కాలంలో తెగల పాలనలో ఎలాంటి మార్పులు వచ్చాయో జ్ఞాపకం చేసుకోండి (§5; 4).

1. ఈజిప్టులో మొదటి రాజ్యాలు.

దోపిడిదారులు, దోపిడి చెయ్యబడేవాళ్లు అనే వర్గాల ఆవిర్భావంతో ఆ వర్గాల మధ్య పోరాటం మొదలైంది. కులీనులు తమ భూమిని ఆక్రమించుకోవడాన్ని రైతులు ప్రతిఘటించారు. తాము కష్టించి సంపాదించుకున్నదాన్ని వదులుకునేందుకు నిరాకరించారు. బానిస యజమానులకోసం యిక పనిచెయ్యరాదని అనుకున్న బానిసలు తమ స్వేచ్ఛని తిరిగి సంపాదించుకొన ప్రయత్నించారు. అప్పుడిక బానిస యజమానులకు విధేయులుగా వుండేటట్లు చేయగలిగేది బలం తప్ప మరొకటి లేకపోయింది.

బానిస యజమానులు తెగ నాయకుల సహాయాన్ని అర్థించారు. ధనవంతులైన నాయకులు సాయుధులైన సైనికులను పెట్టుకోగలిగేవాళ్లు. రక్షక భటులూ, సైనికులూ పారిపోయిన బానిసలను పట్టుకొని, యజమానులకు అప్పగించేవాళ్లు, బానిస యజమానుల భూములను, పశువులను, ఇళ్లను రక్షించేవాళ్లు; తిరుగబడిన రైతులనూ, బానిసలనూ కమ్చీలతో బాది, జైళ్లలో తోసేవాళ్లు, చంపేవాళ్లు.

క్రమంగా రక్షక భటుల, సైనికుల సంఖ్య పెరిగింది. అదే క్రమంలో తెగ నాయకుల అధికారం పెరిగింది. అప్పుడిక వాళ్లే నిరంకుశ పాలకులై, అన్నీ తామే నిర్ణయించేవాళ్లు. గణ నాయకులు రాజులు అయ్యారు.

క్రీ.పూ. 4వ సహస్రాబ్దిలో ఈజిప్టులో రాజ్యాలు ఆవిర్భవించాయి. సైనికులు, రక్షక భటులు, తలారులపైనా జైళ్లపైనా ఆధారపడిన రాజులు వాటిని పాలించేవాళ్లు.

రాజ్యం అన్నది బలప్రయోగ సాధనం. దాని సాయంతో బానిస యజమానులు తాము దోచుకునే రైతులపైనా, బానిసలపైనా తమ పెత్తనాన్ని నిలబెట్టుకునేవాళ్లు.

2. ఫారోల పాలనకింద ఈజిప్టులో సమైక్య రాజ్య నిర్మాణం.

ఈజిప్టులో మొదట్లో సుమారు 40 రాజ్యాలు ఉండేవి. వాటి రాజులు తరుచుగా ఒకరితో మరొకరు యుద్ధానికి దిగేవాళ్లు. గెలిచిన రాజు ఓడిన రాజుల రాజ్యాలను తన రాజ్యంలో కలుపుకునేవాడు. ఇలా క్రమంగా రెండు పెద్ద రాజరిక రాజ్యాలు యేర్పడ్డాయి: నైలు నది డెల్టా ప్రాంతమైన ఉత్తర ఈజిప్టు అంతటా వ్యాపించిన రాజ్యం ఒకటి; దక్షిణ ఈజిప్టు – నైలు నదీ మైదానం – అంతటా వ్యాపించిన రాజ్యం మరొకటి.



క్రీ. పూ. 3,000 ఏళ్ల క్రితం రాతి పలకమీద చెక్కబడిన ఈ ప్రాచీన ఈజిప్షియన్ చిత్రం ఏం తెలియజేస్తోంది? చిత్రం మధ్య శత్రువుపై విజయం సాధించిన యోధుడు ఉన్నాడు. అతని తలమీద దక్షిణ ఈజిప్షియన్ రాజ్య చిహ్నమైన సీసాను పోలిన పొడుగాటి కిరీటం వుంది. దాన్నిబట్టి అతను రాజని తెలియవస్తోంది. డేగ రూపంలో చిత్రింపబడిన హోరస్ దేవత ముక్కుకి తాడువేసిన శిరస్సుని కాలితో పట్టుకొని వుంది. హోరస్ నిలిచివున్న కాండంమీది ప్రతి ఒక్క కంకీ వెయ్యిమంది ఖైదీలని సూచిస్తోంది. పారిపోతున్న శత్రువులు కింద చిత్రింపబడ్డారు. రాజు పాదరక్షలు మోస్తున్న రాజభటుడు ఎడమ పక్కన చిత్రింపబడ్డాడు. పైన గోముఖ దేవత చిత్రింపబడింది

సుమారు క్రీ.పూ. 3000 సంవత్సరాల నాటికి దక్షిణ ఈజిప్టు రాజు ఉత్తర ఈజిప్టును ఆక్రమించుకున్నాడు. ఈ యుద్ధాలు ఒక రాతిమీద చిత్రింపబడ్డాయి (పేజి 44లోని చిత్రాన్నీ, పేజి 85లోని టేబిల్‌నీ చూడండి). అప్పుడిక నైలు నది ఉరవడి ప్రాంతాల రాతిబండల అవరోధాలనుంచి మధ్యధరా సముద్రందాకా వ్యాపించిన ఒకే రాజ్యం ఏర్పడింది. మెంఫిస్ రాజధాని అయింది.

ఈజిప్షియన్ రాజ్యపు రాజుల్ని ఫారోలు అనేవాళ్లు. ఫారోకి అంతులేని అధికారాలు ఉండేవి. ఈజిప్టు అంతటా వున్న జనంమీద, భూమిమీద, జలాలమీద అతనికి సర్వాధికారం వుండేది. ఒక ఫారో మరణిస్తే అతని కొడుక్కో, మరొక బంధువుకో రాజ్యాధికారం సంక్రమించేది.

### 3. ఈజిప్షియన్ సైన్యపు దండయాత్రలు.

జోసెర్ ఫారో పాలన కాలంలో, సుమారు క్రీ.పూ. 2800 ప్రాంతంలో ఈజిప్షియన్ రాజ్యపు అధికారం గణనీయంగా విస్తరించింది.

ఈజిప్షియన్ సేనలు నైలు నదీ రాతిబండల అవరోధాలకి దక్షిణాన వున్న నూబియా పైకీ, నైలు డెల్టా తూర్పు ప్రాంతంలోని సినాయ్ ద్వీపకల్పం పైకీ దండయాత్రలు చేసేవి. ఒక పరాయి దేశంమీదకి దండయాత్రని గురించి ఒక ఈజిప్షియన్ సేనా నాయకుడు యిలా వర్ణించాడు:

పొరుగు దేశాన్ని నాశనం చేసి కొల్లగొట్టి
ద్రాక్షాది తోటలు నేలమట్టంచేసి
గ్రామాలన్నీ నిర్ధూమధామంచేసి

వేలకొలది జనాన్ని ఊచకోతకోసి
మరెంతోమందిని బందీలుగా పట్టుకొని
సేనలు తిరిగివచ్చాయి విజయవంతంగా.
రాజు ప్రశంసలు ముట్టాయి నాకు దండిగా.

(దండయాత్ర సందర్భంగా లభ్యమైన కొల్లసొమ్మును గురించి ఆ సేనాని యిచ్చిన వివరాలను గమనించండి.)

4. పిరమిడ్ల నిర్మాణం.

జోసెరూ, అతని తర్వాత ఈజిప్టును పాలించిన ఫారోలూ పిరమిడ్ల నిర్మాణానికి ఆజ్ఞలు జారీచేశారు. పిరమిడ్లు అంటే, ఫారోల మృత దేహాలను ఉంచి, వాటిపైన కట్టిన బ్రహ్మాండమైన రాతి సమాధులు.

పిరమిడ్లలోకెల్ల పెద్దది హెయోప్స్ ఫారోకి క్రీ.పూ. సుమారు 2600 ప్రాంతంలో నిర్మింపబడింది. దాని ఎత్తు దాదాపు 150 మీటర్లు. మట్టం దగ్గర దాని చుట్టుకొలత ఒక కిలోమీటరు వుంది. ఆ పిరమిడ్ మలిచిన 2,300 రాతిబండలతో నిర్మింపబడింది. ఆ బండల్లోకెల్ల మిక్కిలి చిన్నదాని బరువు రెండున్నర టన్నులు. పిరమిడ్ అడుగున





1. పిరమిడ్లు (విమానంనుంచి తియ్యబడిన ఫొటో). అన్నింట్లోకీ వెనక వున్నది హెయోప్స్ రాజుది. ప్రాచీన కాలంలో పిరమిడ్లు ప్రపంచపు ఏడు వింతల్లో ఒకటిగా పరిగణింపబడుతూండేవి. ముందున్నది రాజ బంధువులకీ, ప్రభువంశీకులకీ చెందిన సమాధులు. 2. పెద్ద స్ఫింక్స్ (ఫొటో)

వున్న గదిని చేరుకునేందుకు ఒక యిరుకు మార్గం ఏర్పాటుచెయ్యబడింది. ఆ చిన్న గదిలో ఫారో మృత దేహం వున్న సర్కోఫాగస్ నిలబెట్టబడుతుంది.

హెరొడోటస్ అనే ప్రాచీన గ్రీకు చరిత్రకారుడు పిరమిడ్ల నిర్మాణం గురించి యిలా వర్ణించాడు: పిరమిడ్ నిర్మాణంకోసం రక్షక భటులు ఈజిప్టు అంతటినుంచీ రైతుల్నీ, బానిసల్నీ బలవంతంగా తోలుకొచ్చారు. పిరమిడ్ నిర్మాణంలో ఏకకాలంలో సుమారు 1,00,000 మంది పనిచేశారు. కొంతమంది పర్వతాలనుండి పెద్దపెద్ద రాతిబండలు తవ్వి తీశారు. మరికొందరు వాటిని దుంగలమీదకి ఎక్కించి లాక్కెళ్లారు. ఇంకొందరు ఆ బండల్ని మలిచి, వాటివాటి స్థానాల్లో అమర్చారు. పిరమిడ్ల నిర్మాణంలో పనిచేసేవాళ్లను నిగామాన్లు కమ్చీలతో ఛెళ్లఛెళ్లన బాదారు. (వర్ణ చిత్రం 7 చూడండి.)

రాతి గనులనుంచి పిరమిడ్‌దాకా రోడ్డు నిర్మాణానికీ, పిరమిడ్ నిర్మాణానికీ 30 ఏళ్లు పట్టింది. రైతులు యిక్కడ పిరమిడ్ నిర్మిస్తూంటే అక్కడ వాళ్ల పొలాల్లో కలుపుమొక్కలు దట్టంగా పెరిగాయి. వాళ్ల పొలాలకి నీరు సరఫరాచేసే పంట కాల్వలు యిసుకతో మేటవేశాయి. మూడు నెలల కొకసారి పనివాళ్లని మార్చుతూవున్నప్పటికీ దుర్భరమైన పని భారం వల్లా, కమ్చీదెబ్బలవల్లా వేలమంది కూలీలు మరణించారు.

పిరమిడ్లకి అనతి దూరంలో ఏక శిలలో స్ఫింక్స్ మలచబడింది. స్ఫింక్స్ అంటే, ఫారో ముఖంతో చెక్కబడిన 20 మీటర్ల ఎత్తుగల బ్రహ్మాండమైన సింహపు విగ్రహం. ఆ రాతి రాక్షసి ఎంత భయంకరంగా ఉండేదంటే, జనం దాన్ని "భీతాహ పిత" అనేవాళ్లు.

ఆనాటి ఫారోల అంతులేని అధికారానికి మూగ సాక్షులుగా పిరమిడ్లు యీనాటికీ ఎడారి మధ్య నిలిచివున్నాయి.

? **1.** ఆదిమ సమష్టి వ్యవస్థలో రాజ్యం ఉండేదా? ప్రాచీన ఈజిప్టులో రాజ్యం ఎందుకు తలెత్తింది? **2.** రాజ్యానికి వుండే మౌలిక లక్షణాలు ఏమిటి? **3.** ఫారోలు ఏ లక్ష్యాలు సాధించేందుకోసం యుద్ధం చేశారు? **4.** ఈజిప్టులో ఎన్ని వేల ఏళ్ల క్రితం సమైక్య రాజ్యం ఏర్పడింది? హెయోప్స్ మహా పిరమిడ్ ఎన్ని శతాబ్దాల క్రితం నిర్మింపబడింది?

# §9. ఈజిప్టులో రాజ్య పరిపాలన, వర్గాల మధ్య పోరాటం

1. "తిరుగుబాటుదారుని చంపెయ్యి," "కులీనుల్ని పైకెత్తు."

దేశమంతటా తన అధికారాన్ని నిలుపుకునేందుకోసం ఫారో ఈజిప్టుకి చెందిన ఆయా ప్రాంతాలకు కులీనుల్ని పాలకులుగా నియమించేవాడు. ఆ పాలకుల చేతికింద పెద్ద సంఖ్యలో అధికారులు, రక్షక భటులు, సైనికులు ఉండేవాళ్లు. బానిస యజమానుల ప్రాణాలకీ, ఆస్తికీ ప్రమాదం కలిగించేవాళ్లపైన, లేక ఫారో ఆజ్ఞల్ని ధిక్కరించేవాళ్లపైన అధికారులు విచారణ జరిపేవాళ్లు. "రాజుకు వ్యతిరేకంగా కుట్ర చేసినవాణ్ణి ధ్వంసంచెయ్యి, చంపేసెయ్యి, వాని దగ్గరివాళ్లను చంపు, వాని స్మృతి చెరిపెయ్యి" అనీ, "మనకు అత్యంత ప్రమాదకరమైన శత్రువులు బీదవాళ్లు" అనీ ఫారో సెలవిచ్చాడు. ఒక అధికారి తన క్రూరత్వం గురించి యిలా గర్వంగా చెప్పుకున్నాడు: "నేను మూకలో బీభత్సం కలిగించాను. ఖైదీలను కాళ్లమీద పడేలా చేశాను. ఖైదీ తన తప్పులు ఒప్పుకునేటట్లు చేశాను." అంటే తిరుగుబాటుదారు ఒప్పదల రాబట్టుకోడానికి అతన్ని చిత్రహింసలు పెట్టాడన్నమాట.







1. కిరీటధారి అయిన ప్రాచీన ఈజిప్షియన్ ఫారో విగ్రహం. 2. కర్ర దెబ్బల శిక్ష (ప్రాచీన ఈజిప్షియన్ చిత్రం). 3. రైతుల దగ్గర పన్నులు వసూలు చెయ్యడం (ప్రాచీన ఈజిప్షియన్ చిత్రం)

ఫారోలు పాలకులూ, అధికారులూ చేసిన సేవలకుగాను వాళ్లకి బానిసలనూ, పశువులనూ యిచ్చేవాళ్లు. "కులీనుల్ని పైకెత్తు, సైనికులకు పెద్ద పదవులు ఇయ్యి, వాళ్లకి భూములూ, పశువులూ ఇయ్యి" అని ఒక ఫారో తన కొడుక్కి బోధించాడు.

2. పన్నుల వసూళ్లు; రైతుల వెట్టి చాకిరి.

ప్రతి ఒక రైతుకీ ఎంత పొలం వుందో, ఎన్ని పశువులు ఉన్నాయో, ఎన్ని పళ్లచెట్లు ఉన్నాయో అధికారులు నమోదుచేసేవాళ్లు. వాటన్నింటికీ గాను రైతులు ధాన్య రూపంలోనూ, యితర వస్తువుల రూపంలోనూ పన్నులు చెల్లించాల్సివచ్చేది. ఈజిప్టు అంతటా రైతులనుంచి తీసుకున్న ధాన్యంతో నిండిన బ్రహ్మాండమైన గాదెలు ఉండేవి. రైతులనుంచి వసూలు చేసిన వస్తువులు కులీనులకి కానుకలు యిచ్చేందుకూ, అధికారుల, రక్షకభటుల, సైనికుల పోషణకీ వినియోగింపబడేవి.

పంటలు చెడి, రైతులు పన్నులు చెల్లించలేకపోతే వాళ్ల పని మూడిందన్న మాటే. ఆనాటి ఒక అధికారి యిలా రాశాడు: "రైతుకి చెడ్డ రోజులు వచ్చాయి! పన్నుల వసూలుదారు ఆ ప్రాంతానికి వచ్చాడు. పంట అంచనావేసే ఆ ఉద్యోగి వెంట రక్షక భటులు ఉన్నారు. వాళ్ల దగ్గర దుడ్డుకర్రలు, తాటి మండలు ఉన్నాయి. రైతుని వాళ్లు ధాన్యం చెల్లించమన్నారు.




ఈజిప్టులో బానిస యజమానుల పెత్తనం ప్రభుత్వపు తోడ్పాటుమీదనే పూర్తిగా ఆధారపడివుండేది. తిరుగుబాటు చేసిన పీడితుల అణచివేతను ప్రభుత్వం తన కర్తవ్యంగా పరిగణించేది

రైతు దగ్గర ధాన్యం లేదు. వాళ్లా రైతుని బాదారు. అతన్నీ, అతని భార్యనీ, పిల్లల్నీ పెడరెక్కలు విరిచి కట్టేశారు.'' ''రైతు బతుకు పులి పంజాల మధ్య యిరుక్కున్నవాడి బతుకులా వుంది.'' (వర్ణ చిత్రం 6 చూడండి.)

పన్నులు చెల్లించడంతోబాటు రైతు వెట్టి చాకిరీ చెయ్యాల్సివుండేది. రైతులు ఆనకట్టలు మరమ్మతుచెయ్యాలి, కాల్వలు తవ్వాలి, ఫారోల, కులీనుల భవనాలకీ, సమాధులకీ బండలు తవ్వితియ్యాలి.

## 3. చేతివృత్తులవాళ్ల పరిస్థితి.

చాలామంది చేతిపనివాళ్లు ఫారోకీ, యితర సంపన్న బానిస యజమానులకీ చెందిన కార్ఖానాల్లో పనిచేసేవాళ్లు. మేస్త్రీలు వాళ్లని కళ్లార్పకుండా కాపలా కాసేవాళ్లు.

చేతిపనివాళ్ల జీవితాన్ని ఒక ప్రాచీన ఈజిప్షియన్ యిలా వర్ణించాడు: ''చేనేత కార్మికుడు ఫ్లాక్సునుండి వచ్చే ధూళిని పీలుస్తూ, పగలంతా మగ్గం దగ్గర వంగి పనిచెయ్యాలి. బయటికి పోయి మంచి గాలి పీలవడానికి అనుమతి కావాలంటే,

అతను మేస్త్రీకి తన భోజనం పెట్టాలి. అతను తన పని పూర్తిచెయ్యకపోతే అతన్ని మేస్త్రీ చావబాదేవాడు. రైతు కంటె వడ్రంగికి యెక్కువ అలసట కలుగుతుంది. అతను శక్తికి మించిన పనిచేయవలసివుంటుంది. రాత్రిపూట కూడా అతను దీపం పెట్టుకొని పనిచేయవలసివుంటుంది. అద్భుతమైన అంతఃపురాలూ, దేవళాలూ నిర్మించేవాడికి కడుపునిండా తిండి కూడా లేదు. అతని బట్టలు చింకి పాతలు. అతన్నీ, అతని పిల్లల్నీ చితకబాదేవాళ్ళు." "నేను నా కళ్లారా చూశాను కొరడాలతో ఒళ్లు హూనం చెయ్యడం."

#### 4. బీదవాళ్ల, బానిసల తిరుగుబాటు.

ఈజిప్టులో రైతులూ, చేతివృత్తులవాళ్లూ, బానిసలూ ఫారోల, తదితర బానిస యజమానుల పీడనకి ఎల్లప్పుడూ తలొగ్గి పడివుండేవాళ్లా? ఈ ప్రశ్నకి ఈజిప్టులో జరిగిన ఒక తిరుగుబాటును గురించి లభించిన వర్ణనలో మనకి జవాబు దొరుకుతుంది. ఆ తిరుగుబాటు క్రీ.పూ. 1750 ప్రాంతంలో జరిగింది. ఈకింద ఉదహరించబడిన పత్రాన్ని జాగ్రత్తగా చదవండి. ఆ తిరుగుబాటు ఎలా ముగిసిందో ఆ పత్రంలో లేదు. అయితే, బానిస యజమానులు ఈజిప్షియన్ రాజ్యపు సర్వ శక్తుల్నీ కూడగట్టుకొని, ఫారో అధికారాన్ని పునరుద్ధరించిన సంగతి తెలిసిందే.

### "దేశ అరిష్టాల వర్ణన"లో కొంత భాగం

దేవుడు స్థాపించిన రాజుల అధికారంమీద ప్రజలు తిరుగుబాటు చేశారు.

రాజధానిని ఒక్క గంటలో ధ్వంసంచేశారు. బీదవాళ్లు రాజును బందీగా పట్టుకున్నారు.

దేశ పాలకులు ప్రాణాలు దక్కించుకునేందుకు పారిపోయారు. అధికారులను చంపారు. పన్ను దస్త్రాలను ధ్వంసంచేశారు.

బీదవాళ్లు గొప్పవాళ్ల భవనాల్లోకి ప్రవేశిస్తున్నారు.

మేలైన బట్టలు వేసుకున్నవాళ్లను కర్రలతో బాదుతున్నారు. విలువైన బట్టలు గలవాళ్లు చింకి పాతలలో వున్నారు. ఐశ్వర్యవంతుల వద్ద యిప్పుడేమీ లేదు.

ఒక జత యెద్దులు కూడా లేని వాళ్లకు యిప్పుడు మందలు మందలు వున్నాయి. ఒకనాడు ధాన్యం వసూలు చేసుకున్నవాళ్లు యీనాడు యితరులకు ధాన్యం చెల్లిస్తున్నారు. బానిసలు బానిస యజమానులయ్యారు.

అబ్బా, నా హృదయం కుమిలిపోతోంది. ఈ అరిష్టాలవల్ల నాకు కలుగుతున్న దుఃఖాన్ని యెంతని చెప్పను!

? **1.** ఈజిప్షియన్ రాజ్యంలో అధికారులు ఏయే విధులు నిర్వహించేవాళ్లు? **2.** బీదవాళ్లను తనకి అత్యంత ప్రమాదకారులైన శత్రువులుగా ఫారో యెందుకు పరిగణించాడో వివరించండి. **3.** ప్రాచీన ఈజిప్టులో రైతుల, బానిసల జీవిత పరిస్థితులను వర్ణించండి. **4.** పైన యివ్వబడిన పత్రాన్ని చదివి, క్రీ.పూ. 1750 నాటి తిరుగుబాటును గురించి మీ కథనం చెప్పండి.

# §10. ఈజిప్షియన్ సామ్రాజ్య ఉన్నతి, పతనం

(మాప్ 2, 50వ పేజిలోని మాప్)

బానిస యాజమాన్య వ్యవస్థలో ఈజిప్టులో ఏయే వర్గాలు ఉండేవో జ్ఞాపకం చేసుకోండి (§7; 4).




1. ప్రాచీన ఈజిప్టు రాజ్యపు దండయాత్రలు. ఈజిప్టు రాజ్య విస్తరణ శిఖర స్థాయిని అందుకున్న నాటి ప్రాచీన ఈజిప్టు భూభాగాన్ని, దాని దండయాత్రల మార్గాలనీ, రాజ్య సరిహద్దులనీ మాప్‌లో చూపించండి. 2. సిరియాలోని ఒక దుర్గంపై ఈజిప్షియన్ల ముట్టడి (ప్రాచీన ఈజిప్షియన్ దేవాలయంలోని చిత్రం). రథారూఢుడైన ఫారో. బాణాలు తగిలిన దుర్గ రక్షకులు కోట గోడలమీదనుంచి నేల కూలుతున్నారు. కింద: సైనికులు స్త్రీలు, బాలబాలికలతోబాటు బానిసలను ఖైదీలుగా పట్టుకుంటున్నారు. 3. ఈజిప్షియన్ పదాతి దళం (ఒక ప్రాచీన ఈజిప్షియన్ దేవాలయ కుడ్య చిత్రం). 4. నూబియాలోని ఒక ప్రాచీన ఈజిప్షియన్ దుర్గం (పునరుద్ధరణ). 5. ఫారో గుణగానం చేస్తున్న మనుషులు

1. క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో ఈజిప్టు ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి.

క్రీ.పూ. 2వ సహస్రాబ్ది నాటికి తమ ఆర్థిక వ్యవస్థను అభివృద్ధిచేసుకోవడంలో ఈజిప్షియన్లు ప్రధానమైన విజయాలు సాధించారు. ఈజిప్టులో రాజ్య ఆవిర్భావం భారీ నీటి పారుదల, మురుగు నీటి తొలగింపు సౌకర్యాల కల్పనకి తోడ్పడింది. అధికారులు యీ పనులకోసం ప్రతి యేడూ వేలకొలది రైతులనూ,


2


3


4


5

బానిసలనూ సమీకరిస్తూండేవాళ్లు. ఆ రైతులూ, బానిసలూ నదీ తీరానికి బాగా దూరాన వున్న ''మెట్ట భూముల'' దగ్గరకి కాల్వలు తవ్వేవాళ్లు. నైలు మైదానంలో సాగుభూమి ప్రాంతం గణనీయంగా పెరిగింది.

ఈజిప్షియన్లు ఆసియానుంచి తెచ్చిన గుర్రాలను, ఒంటెలను పెంచనారంభించారు. చేతిపనివాళ్లు రాగినీ, తగరాన్నీ కలిపి మిశ్ర లోహం తయారుచెయ్యడం నేర్చుకున్నారు. అలాంటి మిశ్ర లోహాన్ని కంచు అనేవాళ్లు. రాగి కంటె కంచు బాగా గట్టిది, శక్తివంతమైనది.

ఈజిప్షియన్ రాజ్యపు కొత్త రాజధాని అయిన థీబ్స్ అందమైన పెద్ద నగరం.

2. ఈజిప్షియన్ సైన్యం బలపడటం.

జన సంఖ్య పెరిగి, ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి కావడంతో ఈజిప్టు ఫారోలకు తమ సైనికుల సంఖ్యను పెంచుకోడానికీ, వాళ్లకు మంచి ఆయుధాలు యివ్వడానికీ వీలు కలిగింది.

సైన్యంలో ప్రధాన బలం పదాతి దళాలు. ఈ దళాలలో వుండేది సైనిక కొలువులోకి బలవంతంగా తోయబడిన రైతులు. పదాతి సైనికుల ఆయుధాలు: ఈటెలు, గొడ్డళ్లు, కత్తులు, పెద్ద విల్లమ్ములు. క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో రథ దళాలు ఏర్పాటుచెయ్యబడ్డాయి. రథాలంటే గుర్రాలు లాగే రెండు చక్రాల బండ్లు. రథంమీద యిద్దరు సైనికులు వుండేవాళ్లు. ఒకడు రథ సారథి, రెండవవాడు బాణాలు ప్రయోగిస్తూవుండేవాడు. యుద్ధంలో రథాలు శత్రువుమీద వేగంగా దాడి చేసేవి, శత్రువుని తరుముకెళ్లేవి.

3. ఫారోల దండయాత్రలు.

క్రీ.పూ. 1500 ప్రాంతంలో ఫారో మూడవ తుత్మోసిస్ ఆసియామీద దండయాత్ర జరిపాడు. దీర్ఘ యుద్ధాల పర్యవసానంగా మూడవ తుత్మోసిస్, అతని తర్వాత పాలించిన ఫారోలూ మధ్యధరా సముద్రపు తూర్పు తీరాన గల పాలస్తీనా, సిరియా దేశాలను ఆక్రమించుకోగలిగారు. ఈజిప్షియన్ సామ్రాజ్యం ఉత్తరాన యూఫ్రటిస్ నది దాకా విస్తరించింది. దక్షిణాన ఫారోలు బంగారు గనులకు ప్రసిద్ధి పొందిన నూబియాను ఆక్రమించుకున్నారు.

ఫారోలు ఆక్రమిత దేశాలను నిర్దాక్షిణ్యంగా కొల్లగొట్టేవాళ్లు. బంగారం, దంతం ఒంటెలమీద ఈజిప్టుకి తరలింపబడేవి. సైనికులు పశువుల, గుర్రాల మందలను తోలుకుపోయేవాళ్లు. విలువైన కలపతో నింపబడిన నౌకలు ఆసియానుంచి ఈజిప్టుకి సాగిపోయేవి. బానిసలు పెద్ద పెద్ద బారుల్లో ఎడారి గుండా ఈజిప్టుకి నడిపించబడేవాళ్లు.

4. క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో ఈజిప్టులో బానిస యాజమాన్య వ్యవస్థ.

యుద్ధాల్లో లభించిన కొల్లలో అత్యధిక భాగం ఫారోకీ, తదితర ఈజిప్షియన్ బానిస యజమానులకీ చేరేది. ఈజిప్టు ఎడారుల్లో ఎంత ఇసుక వుందో ఫారో దగ్గర అంత బంగారం ఉందని తలచబడేది.

ఈజిప్టులో బానిసల సంఖ్య విశేషంగా పెరిగింది. ఒక్క ఆసియా దండయాత్రలోనే 1,00,000 మందికి పైగా ఖైదీలు చిక్కారు.

బీద ఈజిప్షియన్లను కూడా బానిసలుగా మార్చారు. తరచుగా రైతులు, చేతివృత్తులవాళ్లు ధనికులనుంచి ధాన్యాన్నో, ఈజిప్టులో డబ్బుగా చలామణీ అవుతూవున్న రాగిబిళ్లలనో అప్పు తీసుకోవలసివచ్చేది. తను అప్పుగా తీసుకున్న మొత్తాన్ని రుణగ్రహీత సకాలంలో చెల్లించకపోతే రుణదాత అయిన ధనికుడు అధికారి దగ్గర ఫిర్యాదుచేసేవాడు. రుణతీర్మానం నిమిత్తం అధికారి అప్పు తీసుకున్నవాడినో లేక అతని పిల్లలనో బానిసలుగా అమ్మేసేవాడు.

బానిసలు రాతి క్వారీలలో, గనుల్లో పనిచేసేవాళ్లు, భవనాలు నిర్మించేవాళ్లు, కాల్వలు తవ్వేవాళ్లు, బానిస యజమానుల పొలాలు సాగుచేసేవాళ్లు.

చివరకు క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో బానిస యాజమాన్య వ్యవస్థ స్థిరపడి, బలపడింది.

5. ఈజిప్షియన్ సామ్రాజ్య పతనం.

ఫారోల దండయాత్రలు ఈజిప్షియన్ బానిస యజమానులను సంపన్నులను చేసి, ఈజిప్టు శక్తిని సన్నగిలజేశాయి.

సైన్యంలో చేర్చుకోబడిన ఈజిప్షియన్ రైతులు యుద్ధాల్లోనూ, క్లిష్టమైన దండయాత్రల్లో వివిధ రోగాలతోనూ మరణించారు. సైనికుల చేలు సాగు చేసేందుకు ఏ ఒక్కరూ మిగల్లేదు. రైతు కుటుంబాలు నాశనమయ్యాయి. వికలాంగుడైన లేక జబ్బుపడిన ఏ సైనికుడైనా తన స్వగ్రామానికి తిరిగివస్తే అప్పటికి అతని ఆస్తి దొంగిలింపబడటం, అతని భార్యా, పిల్లలూ బానిసలుగా అమ్మివెయ్య బడటం తరచు సంభవిస్తూవుండేది.

తమని కడగండ్ల పాల్జేసి సంపన్నులైన ఫారోనీ, బానిస యజమానులనీ బీదవాళ్లూ, బానిసలూ నానాటికీ అధికంగా ద్వేషించనారంభించారు. ఈజిప్టు దేశపు వివిధ ప్రాంతాల్లో బీదల, బానిసల తిరుగుబాట్లు ప్రజ్వరిల్లాయి. పరాజిత ప్రజలు కూడా ఈజిప్షియన్లకి వ్యతిరేకంగా తమ పోరాటం కొనసాగించారు. ఆక్రమింపబడిన దేశంనుంచి ఈజిప్షియన్ సైన్యం వెళ్లిపోగానే అక్కడ తిరుగుబాటు చెలరేగుతూవుండేది.

ఆ తిరుగుబాట్లను ఎదుర్కొనేందుకు ఫారోలు చుట్టుపక్కల దేశాలనుంచి కిరాయి సైనికులను కుదుర్చుకునేవాళ్లు. ఆ కిరాయి సైనికులు రైతులపట్లా, బానిసలపట్లా అత్యంత క్రూరంగా ప్రవర్తించేవాళ్లు. అయితే, యితర రాజ్యాలతో యుద్ధ సమయాల్లో వాళ్లపై ఆధారపడేందుకు ఆస్కారం ఉండేది కాదు. శత్రువు తమకి మరింత ఎక్కువ చెల్లిస్తానని ఆశ చూపితే కిరాయి సైనికులు జండా మార్చి అటు పోతూండేవాళ్లు.

రైతుల వినాశం, బీదల, బానిసల, పరాజిత ప్రజల తిరుగుబాట్లు తరచుగా జరగడం, ఈజిప్షియన్ సామ్రాజ్యాన్ని బలహీనపరచాయి. ఆసియా, నూబియాల్లో తను జయించిన దేశాలను కోల్పోవడమే కాకుండా, క్రీ.పూ. 1వ సహస్రాబ్ది మొదట్లో పొరుగు దేశాల దాడులనుంచి ఆత్మరక్షణకి సైతం ఈజిప్టు యిబ్బందుల్లో పడింది.

? **1.** ఈజిప్షియన్ రాజ్యపు దండయాత్రల మూలంగా ఎవరు, ఎలా లాభపడ్డారు? యుద్ధాల మూలంగా ఎవరు, ఎలా నష్టపడ్డారు? **2.** క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో బానిస యాజమాన్య వ్యవస్థ మరింత అభివృద్ధి చెందిందన్నదానికి సూచిక ఏమిటి? రాజ్య యంత్రాంగం లేకుండా బానిస యాజమాన్య వ్యవస్థ మన గలిగివుండేదా? **3.** ఈజిప్షియన్ సామ్రాజ్యం బలహీనపడేందుకు కారణాలు యేమిటి? **4.** సమైక్య ఈజిప్షియన్ రాజ్య స్థాపనకీ, మూడవ తుత్మోసిస్ యుద్ధాలకీ మధ్య ఎన్ని సంవత్సరాల వ్యవధి వుంది? మూడవ తుత్మోసిస్ యుద్ధాలకీ, మన కాలానికీ మధ్య సుమారు ఎన్ని వేల సంవత్సరాలు గడిచాయి?

## § 11. ప్రాచీన ఈజిప్టులో మతం

ప్రజల్లో మత విశ్వాసాలు ఎందుకు తలెత్తాయో జ్ఞాపకం చేసుకోండి (§ 3; 2). వ్యవసాయం ప్రారంభమవడంతో మత విశ్వాసాలు ఎలా మార్పు చెందాయి? (§ 5; 5)

1. ప్రకృతి శక్తుల ఆరాధన.

ఈజిప్టులో ప్రాచీన దేవాలయాల శిథిలాలు యీనాటికీ మిగిలివున్నాయి. దేవాలయాలు దేవతలకు వాసస్థానాలుగా పరిగణింపబడ్డాయి. దేవాలయాల్లో విగ్రహాలు వుండేవి. మామూలుగా అవి జంతువుల తలలు కలిగివుండేవి. సూర్యదేవుడు "రా"ని ఈజిప్షియన్లు దేవాధి దేవుడుగా పరిగణించేవాళ్లు. ఫారో ప్రజలను పాలించినట్లే "రా" దేవతలను పాలిస్తాడని వాళ్లు విశ్వసించేవాళ్లు. పగలు తర్వాత రాత్రి,







1. థీబ్స్‌లో ప్రధాన దేవాలయంలోని ఒక హాలు (పునరుద్ధరణ). పైకప్పు బ్రహ్మాండమైన శిలా స్తంభాలమీద ఆధార పడివుంది. అలాంటి ఒక్కొక్క స్తంభంమీద ఒక వందమంది మనుషులు నిలబడగలరు. 2. ప్రాచీన ఈజిప్షియన్లు దేవుళ్లని యిదిగో యిలా ఊహించారు (ఈ చిత్రం ఒక సమాధిలో దొరికింది). 3. ఈజిప్షియన్లు ఆకాశాన్నీ, సూర్యుణ్ణీ యిలా ఊహించారు (ప్రాచీన చిత్రం). సూర్య దేవుడు ''రా'' ఆకాశంలో పయనిస్తున్నాడు





ప్రాచీన ఈజిప్షియన్లు ఓసిరిస్ విచారణను యిలా ఊహించారు (ప్రాచీన చిత్రం). ఓసిరిస్ రాజ సింహాసనంమీద అధిష్ఠితుడయ్యాడు, రాజ్యాధికార చిహ్నాలైన కిరీటం, న్యాయదండం, కొరడాలను ధరించాడు. ఇతర దేవతలు మృతుని హృదయాన్ని తూస్తున్నారు. మృతుడి ఆత్మ ఓసిరిస్ ముందు నిలబడివుంది. మొసలి ముఖంతో వున్న సింహం — రాక్షసి — తీర్పును నిరీక్షిస్తోంది.

రాత్రి తర్వాత పగలు ఎందుకు వస్తాయో తెలియని ఈజిప్షియన్లు, సూర్యభగవానుడు తన బంగారు పడవలో ప్రతి రోజూ ఆకాశంలో ప్రయాణం చేస్తాడనీ, సాయంత్రం ఎడారిలోకి వెళ్లిపోతాడనీ నమ్మేవాళ్లు. సూర్యభగవానుడికి డేగముఖం వుంది. ప్రతి ప్రకృతి శక్తికీ ఒక అధిష్ఠాన దేవత ఉంటుంది. సింహపు శిరస్సు కలిగిన భయంకర యుద్ధ దేవత అంటే ఈజిప్షియన్లు విశేషంగా భయపడేవాళ్లు. యుద్ధ దేవత జనంమీదకి ప్రాణాంతకమైన ప్లేగు అంటువ్యాధిని పంపుతుం దని వాళ్లు అనుకునేవాళ్లు. (పేజి 53లోని చిత్రం చూడండి.)

ఈజిప్షియన్లకు నైలు నది జన్మస్థానం తెలియదు. నైలు దేవుడు కుండతో నీళ్లు కుమ్మరిస్తున్నాడనీ, వరదలకి అతడు ఎక్కువ నీళ్లు కుమ్మరించడమే కారణమనీ వాళ్లు విశ్వసించేవాళ్లు. ఈజిప్షియన్లు నైలును తమ పొలాలకు రమ్మని ప్రార్థించేవాళ్లు. నైలు తమ ప్రార్థనలు విని, తమ ప్రాణాలు కాపాడినందుకు వాళ్లు నదికి కృతజ్ఞతలు తెలుపు కునేవాళ్లు. (నైలును ప్రస్తుతించే ఒక పాట §11 చివర యివ్వబడింది.)

### 2. పునరుత్థానం పొందిన దేవుడి గాథ.

ప్రతి వేసవిలోనూ యాభై రోజులపాటు తేమలేని వేడి గాలులు వీస్తాయి. అవి యెడారులనుండి యిసుక మోసుకవస్తాయి. ఇసుక నిప్పు రవ్వల లాగ చాలా వేడిగా వుంటుంది, దాంతో మనుషులకూ, జంతువులకూ వూపిరాడదు. మొక్కలు వాడిపోతాయి. ఆ యిసుకలో యెక్కడా పచ్చని గడ్డిమొక్క కనిపించదు. ప్రకృతి మరణించినట్లు వుంటుంది. అప్పుడు వేడి గాలి ఆగి, సముద్రంనుండి చల్లని గాలి వస్తుంది. ప్రకృతి పునరుత్థానం పొంది నట్లు పునరుజ్జీవితమవుతుంది.

దీన్నిబట్టి దేవుడు మరణించినట్లూ, మళ్లీ ఉద్ధరింపబడినట్లూ ఒక పురాణ గాథ పుట్టింది. ఈ గాథ ప్రకారం



1. ఓసిరిస్ పునర్జన్మకి సంబంధించిన ప్రాచీన ఈజిప్షియన్ చిత్రం. ఓసిరిస్ కొడుకు హోరస్ ఓసిరిస్ పక్కన నిలబడివున్నాడు. 2. ఫారో బంగారు సర్కోఫాగస్. మూతమీద ఫారో రూపం చెక్కబడింది

సెట్ అనే దుష్టుడైన వడగాడ్పు దేవుడు యెడారినుండి 50 మంది నౌకర్లతో వచ్చేవాడు. వచ్చి, పైర్లు పెరగడానికి తోడ్పడే ఓసిరిస్ అనే దేవుని చంపేవాడు. కాని, ప్రకృతి మాదిరిగానే ఓసిరిస్ పునరుత్థానం పొందేవాడు.

### 3. మరణానంతర జీవితం.

పునరుత్థానం తర్వాత ఓసిరిస్ మృతి చెంది, పూడ్చిపెట్టబడినవాళ్ల ఆత్మలు ఉండే లోకానికి రాజూ, న్యాయాధిపతీ ఐనాడని ఈజిప్షియన్ల నమ్మకం. అలాంటి కాల్పనిక జీవితాన్ని మరణానంతర జీవితం అంటారు. అక్కడ నీరు సమృద్ధిగా వుంటుంది; గోధుమ నిలువెత్తు పెరుగుతుంది. అయితే, ప్రతి జీవాత్మా ఓసిరిస్ రాజ్యానికి వెళ్లదు. చచ్చినవాళ్లను న్యాయ విచారణ చేసేవాడు ఓసిరిస్. తన జీవిత కాలంలో దేవతల యిచ్చను ధిక్కరించినవాణ్ణి ఓసిరిస్ కఠినంగా శిక్షించేవాడు. భయంకరమైన భూతమొకటి వాళ్లను మింగేస్తుంది.

చచ్చినవాడి దేహాన్ని నిలువ వుంచితే, వాని ఆత్మ మళ్లీ ఆ దేహంలోకి వస్తుందని ప్రాచీన ఈజిప్షియన్లు నమ్మేవాళ్లు.





1. ఒక దేవాలయంలో భయంకరమైన యుద్ధ దేవతతోబాటు చెక్కబడిన ఫారో చిత్రం. 2. ప్రాచీన సమాధిలో లభించిన ఒక పూజారి విగ్రహం

మనుషుల దేహాలు కుళ్ళిపోకుండా వుంచడానికి దేహంలోని మెదడునూ, పేగులనూ బయటికి తీసేసి, మృత దేహాన్ని ఉప్పు నీటిలో కడిగి, దాన్ని రెసిన్ ద్రావకంలో బాగా తడిసిన తెల్లగుడ్డలో చుట్టేవాళ్ళు. ఇలా చేసిన దేహాలు కుళ్ళిపోకుండా, యెండిపోయేవి. ఇలా యెండిపోయిన శవాలను మమ్మీలు అంటారు. మృత దేహాన్ని మమ్మీగా చేసేందుకు చాలా వ్యయమవుతుంది. కనుక ధనికులకు మాత్రమే అది సాధ్యమయ్యేది.

4. పూజారులు: అత్యంత ధనిక బానిస యజమానులు.

దేవుళ్ల ప్రాపు పొందేందుకుగాను ఈజిప్షియన్లు దేవుళ్లకి బలులు యిచ్చేవాళ్ళు. రైతులు తాము ఆకలితో ఉండి కూడా బస్తాలకొద్దీ గోధుమలనూ, బుట్టలకొద్దీ కూరగాయలనూ దేవాలయాలకి తీసుకెళ్లేవాళ్లు. బానిస యజమానులు దేవాలయాలకి బంగారాన్నీ, బానిసలనీ, పశువులనీ కానుకగా యిచ్చేవాళ్లు. ఫారోలు కూడా దేవాలయాలకి సారవంతమైన మాన్యాలు యిచ్చేవాళ్లు. దేవాలయాలకి బోలెడంత ఆస్తి వుండేది. థీబ్స్‌లోని ప్రధాన దేవాలయానికి 80,000కి పైగా బానిసలు వుండేవాళ్లు.

ప్రతి దేవాలయంలోనూ పూజారులు—"దేవుని సేవకులు" వుండేవాళ్లు. పూజారులు దేవులకు తిండిపెట్టేవాళ్లని జనం భావించేవాళ్లు. పూజారులు దేవుళ్లతో మాట్లాడగలరనీ, దేవుళ్ల ఆజ్ఞలను ప్రజలకు తెలియజేయగలరనీ, ప్రజల ప్రార్థనలను దేవుళ్లకి అందజేయగలరనీ ఈజిప్షియన్లు నమ్మేవాళ్లు. పూజారులు చెప్పే మాటల్ని దేవుళ్ల మాటలుగా జనం నమ్మేవాళ్లు.

దేవాలయాల ఆస్తితో వ్యవహరించే పూజారులు మిక్కిలి ధనవంతులుగా ఉండేవాళ్లు. బానిసలను, బంగారాన్ని, భూమినీ కలిగివున్న పూజారులు తమ బానిసలనీ, బాకీదారులనీ నిర్దాక్షిణ్యంగా పీడించేవాళ్లు.

5. ఫారోల దైవీకరణ.

ఈజిప్షియన్ ఫారోలకీ, యితర బానిస యజమానులకీ పూర్తిగా లొంగి వుండాలని, వాళ్ల ఆజ్ఞలను నోరెత్తకుండా నెరవేర్చాలనీ పూజారులు చెప్పేవాళ్లు. "తమ ఆజ్ఞలు పాలించేవాళ్లను దేవతలు ప్రేమిస్తారు, ధిక్కరించేవాళ్లను ద్వేషిస్తారు" అని పూజారులు ఉద్ఘాటించేవాళ్లు. ఫారో ఆజ్ఞలు ధిక్కరిస్తే అనావృష్టులు, ప్లేగు వంటి భయంకర జాడ్యాలు, శత్రు దండయాత్రల వంటి అరిష్టాలు దాపురిస్తాయనీ, ఒసిరిస్ శిక్షలకు గురికావలసివస్తుందనీ బెదిరించేవాళ్లు.

ఫారోకి ఉన్న మాదిరి అపరిమిత అధికారాలు మానవమాత్రులకి ఉండజాలవనీ, దేవుళ్లకి మాత్రమే ఉండగలవనీ ఈజిప్షియన్లు భావించారు. వాళ్లు ఫారోని ఒక మహా దేవుడు అనేవాళ్లు. "తన కిరణాలతో సర్వం తిలకించే సూర్యభగవానుడితో" ఫారోని వాళ్లు పోల్చేవాళ్లు. దేవాలయాల్లో ఫారోల బృహత్ విగ్రహాలు దేవుళ్ల విగ్రహాల సరసన నిలపబడ్డాయి. (కలర్ ఫొటో 4 చూడండి.) సామాన్య ప్రజలే కాక, ఉన్నత వంశస్థులు కూడా ఫారో యెదుట సాష్టాంగపడి, అతని పాదం మెట్టిన చోటుని ముద్దుపెట్టుకునేవాళ్లు.

ఈజిప్టులో మతం ఫారో అధికారాన్నీ, బానిస యజమానుల దొరతనాన్నీ పటిష్ఠంచేసింది. పీడిత ప్రజల దైవభీతి, దేవుళ్ల ఆగ్రహంపట్లా, పరలోకంలో దండనపట్లా భయం పీడకులపైన పీడితుల పోరాటానికి అవరోధాలయ్యాయి.

## నైల్ నదిని కీర్తించే ఒక పాటలో కొంత భాగం

ఈ గేయంలోని ఏ పదాలు ఈజిప్షియన్ల జీవితంలో నైలు నది ప్రాముఖ్యాన్ని ప్రతిబింబిస్తున్నాయి?

ఈ గేయంలో నైలు నది జీవం కలిగినదని ఈజిప్షియన్లు విశ్వసించారని తెలిపే మాటలు ఏవి?

నైలు నదీ దేవతా జయం జయం,
ఈజిప్టుకు ప్రాణదాతా జయం.
నీవు మందగిస్తే జీవితం అంతం;
నీవు కోపగిస్తే దేశానికి అరిష్టం;
మాన్యులకీ, సామాన్యులకీ అందరికీ దారిద్ర్యం.
నైలు పొంగితే దేశానికి ఉత్సవం,
సర్వజీవులకీ సంబరం సంతోషం.
నీ వల్లనే మాకు సమృద్ధిగా తిండీ, తీర్థం,
నీ సృష్టే ఈ సౌందర్యం సమస్తం.
యువకులంతా నిన్ను ఆరాధిస్తారు.
రాజువైన నీకు నీ పిల్లలు నమస్కరిస్తున్నారు.

? **1.** మనకి ఈజిప్షియన్ల మతం గురించి మాత్రమే తెలిసినా, వాళ్ల జీవితాలను గురించి మనం చాలా విషయాలను తెలుసుకోగలం. ఈజిప్షియన్ల మత విశ్వాసాల్లో, యేది వాళ్ల పరిసర ప్రకృతిని గురించి తెలియజేస్తోంది? ఈజిప్షియన్ల మతాన్నిబట్టి, వాళ్ల ప్రధాన వృత్తి యేమిటో తెలుసుకోగలమా? ఈజిప్షియన్ల మతంలో రాజ్య, వర్గాల ఆవిర్భావం గురించి సూచించే విషయాలు యేమిటి? **2.** ఈజిప్టులో పునరుత్థానం చెందే దేవుణ్ణి గురించిన కాల్పనిక గాథ ఎందుకు పుట్టింది? **3.** మరణానంతర జీవితంలో ఈజిప్షియన్ల విశ్వాసంనుంచి ఎవరు లాభపడ్డారు, ఎందుకు? **4.** § 11లో ఈజిప్షియన్ బానిస యజమానులను గురించి మీరు కొత్తగా నేర్చుకున్న విషయాలు యేమిటి?

## §12. ప్రాచీన ఈజిప్టులో ప్రాథమిక శాస్త్రీయ జ్ఞానం, లిఖిత భాష ఆవిర్భావం

ఆదిమ మానవులు ప్రకృతిలో ఏ ఉపయోగకర విషయాలను గమనించారో, యీ పరిశీలనలను ఎలా ఉపయోగించుకోగలిగారో జ్ఞాపకంచేసుకోండి.

1. గణితశాస్త్రం పుట్టుక. పంట చేతికి వచ్చినప్పుడు రైతు మళ్లీ విత్తనాలకి యెంత ధాన్యం కావలసిందీ, మళ్లీ పైరు వచ్చిందాకా తినడానికి యెంత ధాన్యం కావలసిందీ లెక్క వేసుకునేవాడు. కంచు తయారుచేసుకునేటప్పుడు తగరంతో యెంత రాగి కలపవలసిందీ లోహకారుడు జాగ్రత్తగా లెక్క వేయవలసివుండేది. ఈజిప్షియన్లు ఆనకట్టలూ, గృహాలూ నిర్మించినప్పుడు సంశ్లిష్టమైన లెక్కలు వేసుకోవలసివచ్చేది. నిర్మాణానికి యెంత కాలం, యెంత సామగ్రి, యెంతమంది కార్మికులు అవసరమయ్యేదీ వాళ్లు లెక్క వేసుకోవలసివుండేది.

ఈవిధంగా, శ్రమ పర్యవసానంగా గణితం ఉత్పన్నమైంది. ఈజిప్షియన్లకు భిన్నాలు తెలుసు; వాళ్లకి లక్షలు, పది



1



2

1. రేఖా గణిత చిత్రం వున్న ప్రాచీన ఈజిప్షియన్ పాపిరస్ కాగితంలో ఒక ముక్క. 2. కంచుతో చేసిన ప్రాచీన ఈజిప్షియన్ వైద్య పరికరాలు

లక్షలు సైతం తెలుసు. పది లక్షలని సూచించవలసివచ్చినప్పుడు అలాంటి పెద్ద సంఖ్యపట్ల చేతులెత్తి ఆశ్చర్యం వెలిబుచ్చే మనిషి బొమ్మ గీసేవాళ్లు.

కాలువలు తవ్వేటప్పుడూ, భూమిని పొలాలుగా విభజించేటప్పుడూ, గృహ నిర్మాణం చేసేటప్పుడూ వాళ్లు ఉపరి తలాలనూ, కోణాలనూ కొలవవలసివుండేది. దీనినుండి రేఖాగణితం (జ్యామెట్రీ) అనే శాస్త్రం పుట్టింది. జ్యామెట్రీ అనే గ్రీకు పదానికి భూమిని కొలవడం అని అర్థం.

## 2. ఖగోళశాస్త్రం పుట్టుక.

ఈజిప్షియన్ వ్యవసాయదారులు, వ్యవసాయానికి సంసిద్ధంగా వుండడానికి, నైల్ నదికి యెప్పుడు వరదలు వచ్చేదీ ముందే తెలుసుకోవలసివుండేది. నైలు వరదలను అనేక సంవత్సరాలు గమనించిన తర్వాత, రైతులు ఒక విషయం గుర్తించారు: వరదలు వచ్చే ముందు ప్రతిసారీ ఆకాశంలో నక్షత్రాలు అదే స్థానంలో వుండేవి. ఈజిప్షియన్లు గ్రహ నక్షత్రాల గమనాలు జాగ్రత్తగా గమనించసాగారు; వాళ్లు ఒక ఆకాశ పటం సైతం తయారుచేశారు. ఈవిధంగా, రైతులు గ్రహ నక్షత్రాలను

గమనించడం ద్వారా, ఆదిలో గ్రహ నక్షత్రాల శాస్త్రం అభివృద్ధి అయింది. దీన్ని ఖగోళశాస్త్రం అంటారు. ఈజిప్షియన్లు సముద్రంలోనూ, ఎడారిలోనూ ఉన్నప్పుడు నక్షత్ర గతినిబట్టి దిక్కులు తెలుసుకునేవాళ్లు. వాళ్లు దిసకంటితో ఆకాశాన్ని పరిశీలించేవాళ్లు కనుక యీనాడు మనకి తెలిసిన చాలా నక్షత్రాలు సహజంగానే వాళ్లకి తెలియవు.

ఈజిప్షియన్లు పంచాంగం రూపొందించారు. 365 రోజులు ఒక సంవత్సరమౌతుందని నిర్ణయించారు.



1



2




1. ఆకాశంలోని నక్షత్రాలకు సంబంధించిన ప్రాచీన ఈజిప్షియన్ పటం. ఈజిప్షియన్లు నక్షత్రాలను రాశులుగా చేర్చి, వాటికి దేవుళ్ల, మనుషుల బొమ్మలనూ, అంతే కాకుండా సముద్రపు ఏనుగు, సింహం, వృశ్చికం, వగైరా జంతువుల బొమ్మలనూ సంకేతాలుగా యిచ్చారు. 2. ప్రాచీన ఈజిప్టులోని రాత పరికరాలు: సిరాబుడ్డి, ముక్కు చెక్కిన రెల్లు పుల్ల, నీటి జాడీ. 3. ఈజిప్షియన్ హైరోగ్లిఫ్‌లు

### 3. ఈజిప్టులో వైద్యశాస్త్రం.

వైద్య పరిజ్ఞానం మొదట ఆదిమ ప్రజల్లో పొడచూపింది. మమ్మీలను తయారు చేసే క్రమంలో ఈజిప్షియన్లు మానవ శరీరపు అంతర్ నిర్మాణాన్ని గురించి తెలుసుకున్నారు. ఆ పరిజ్ఞానం రోగాలను నయంచేసేందుకు తోడ్పడింది. రోగ నిర్ణయం చేసేందుకు వైద్యులు రోగి నాడి పరిశీలించేవాళ్లు. చాలా మొక్కల రోగనివారక గుణాలు వాళ్లకి తెలుసు. ప్రాచీన ఈజిప్టునుంచి కంచుతో చేసిన శస్త్రవైద్య పరికరాలు మనకి లభించాయి.

### 4. ప్రాచీన ఈజిప్టులో లిఖిత భాష.

క్రీ.పూ. 4వ సహస్రాబ్ది నాటికే ఈజిప్షియన్లు తాము జ్ఞాపకం పెట్టుకొని నోటితో యితరులకు అందజేయగలిగినంత కంటె యెక్కువ జ్ఞానం సేకరించారు. లిపి అవసరం ఏర్పడింది. ఈజిప్టులో చివరకు రాజ్య ఆవిర్భావంతో లిఖిత భాష అవతరించింది.

మొదట్లో ఈజిప్షియన్లు తాము చెప్పదలుచుకున్న దాన్ని కేవలం బొమ్మలు గీసి చెప్పేవాళ్లు. "సూర్యుడు" అని రాసేందుకు ఒక వలయం గీసి, మధ్యలో చుక్క పెట్టేవాళ్లు. విల్లమ్ములతో వున్న మనిషి బొమ్మ గీస్తే "సైనికుడు" అన్నమాట. (ఈజిప్టులో సంభవించిన ఘటనలు బొమ్మల్లో ఎలా వర్ణింపబడ్డాయో గుర్తుచేసుకోండి. 44వ పేజీలోని చిత్రం చూడండి.) తర్వాతి కాలంలో పూర్తి పదాలనే కాక, విడివిడిగా అక్షరాలనూ, ధ్వనులనూ సూచించడానికి కూడా గుర్తులు వాడుకలోకి వచ్చాయి.

చిత్ర సంకేతాలను హైరోగ్లిఫ్‌లు అంటారు. ఈజిప్షియన్ లిఖిత భాషలో 750 చిత్ర సంకేతాలు వుండేవి. మరింత వేగంగా రాయగలిగేందుకుగాను మరింత సరళమైన సంకేతాలు రూపొందించబడ్డాయి.

ఈజిప్టులో రాతకి అనువైన పాపిరస్ బెత్తాలు ఉండేవి. పేము వంటి యీ పాపిరస్ కాడలు నైలు నది లంకల్లో నాలుగైదు మీటర్ల పొడవు పెరిగేవి. ఈజిప్షియన్లు మామూలుగా పాపిరస్ కాడలు పల్చని రేకులుగా కోసి, ఒకదాని కొకటి అతికించి కాగితం లాగ తయారుచేసేవాళ్లు. సన్నటి పేము కాడలను రంగులో ముంచి వాళ్లీ కాగితాలమీద రాసేవాళ్లు. ఈ కాగితాలు మళ్లీ ఒకదాని కొకటి అతికించి పెద్ద చుట్టలు తయారుచేసేవాళ్లు. ఈ చుట్టల్లో ఒకటి 40 మీటర్ల పొడవు వుంది. రాతతో వున్న యీ చుట్టలను కూడా పాపిరస్‌లనే అనేవాళ్లు. ఈజిప్షియన్లు రాళ్లమీద శాసనాలు కూడా చెక్కేవాళ్లు.

### 5. ప్రాచీన ఈజిప్టులో పాఠశాలలు, విద్య.

ఈజిప్టు రాజ్యానికి విద్యావంతులైన అధికారులు, భవన నిర్మాణపు పనుల నిర్వాహకులు, తదితర విద్యావంతులు అవసరమయ్యారు. అందుకే ఈజిప్టులో బాలురకి పాఠశాలలు ఉండేవి. ప్రభువుల, అధికారుల, పూజారుల పిల్లలు పాఠశాలలకి హాజరయ్యేవాళ్లు. పిల్లలు పాఠశాలల్లో చాలా ఏళ్లు చదివేవాళ్లు. వాళ్లు అభ్యాసాలు చేసేవాళ్లు, లెక్కలు చేసేవాళ్లు. పెద్ద పిల్లలు పాపిరస్ కాగితాలమీద రాసేవాళ్లు, చిన్న పిల్లలు కాల్చిన కుండపెంకులమీద రాసేవాళ్లు. విద్యార్థులు రాయగా ఉపాధ్యాయులు తప్పులు దిద్దిన అభ్యాసాలు యీమధ్య లభ్యమయ్యాయి.

పాఠశాలల్లో విద్యార్థులను ఉద్దేశించిన యీమాదిరి బోధనలు, దండనలు ఉండేవి: "నీ చేత్తో రాయి, నీ నోటితో చదువు, నీకంటె ఎక్కువ తెలిసినవాళ్లనుంచి సలహా పొందు... లేకపోతే నీ వీపు చిట్లుతుంది. దండం దశగుణం భవేత్. కుర్రాడి చెవులు వీపులమీద వుంటాయి, బడిత భాషే వాడికి అర్థమయ్యేది." ఉపాధ్యాయుడి సహాయకుణ్ణి బెత్తం మనిషి అనేవాళ్లు. అతను సోమరి, పొగరుబోతు కుర్రాళ్లని కొరడాలతో బాదుతూండేవాడు.

ప్రాచీన ఈజిప్టులో రాతకోతలూ, విజ్ఞాన శాస్త్రీయ పరిజ్ఞానమూ బానిస యజమానులకి మాత్రమే అందుబా

టులో ఉన్నప్పటికీ, వాటి అవతరణకి మహత్తర ప్రాముఖ్యం వుంది. విజ్ఞాన శాస్త్రీయ పరిజ్ఞానం వ్యవసాయానికీ, చేతి వృత్తులకీ, భవన నిర్మాణానికీ దోహదంచేసింది. లిఖిత భాష జ్ఞాన పరిరక్షణకీ, దాన్ని వృద్ధ తరంనుంచి యువ తరానికీ, ఒక ప్రజనుంచి మరొక ప్రజకి అందజెయ్యడానికీ తోడ్పడింది.

## ప్రాచీన ఈజిప్షియన్ లిఖిత భాషని ఎలా చదివారు

ప్రాచీన ఈజిప్షియన్ల మౌలిక, లిఖిత భాషని దరిమిలా మరచిపోయారు. ఈజిప్షియన్ శాసనాలను ఎవరూ చదవలేకపోయారు. ఈజిప్షియన్ హైరోగ్లిఫ్‌లను (చిత్ర సంకేత లిపి) శాశ్వతంగా కోల్పోయినట్లే అనిపించింది.

19వ శతాబ్ది మొదట్లో రొజెట్టా అనే ఈజిప్షియన్ నగరంలో దొరికిన ఒక రాతిపలకని యూరప్‌కి తీసుకొచ్చారు. (7వ పేజిలో చిత్రం 1 చూడండి.) ఆ రాతిపలకమీద ఈజిప్షియన్, గ్రీకు భాషల్లో శాసనాలు ఉన్నాయి. ఒక రాజు పేరు ఒక బాక్సులో యివ్వబడింది. గ్రీకు భాష, ఆనాటికి తెలిసిన యితర ప్రాచీన భాషలూ వచ్చిన షంపొల్యోన్ అనే ఒక ఫ్రెంచి పండితుడు రాజు పేరులోని ప్రతి చిత్ర సంకేతమూ ఒక విడి అక్షరాన్ని సూచిస్తుందని ఊహించాడు, అయితే వాటిలో కొన్ని అచ్చులు కొరవడ్డాయి. వివిధ భాషల్లోని శాసనాలను పోల్చిచూడటం ద్వారా షంపొల్యోన్ కొన్ని చిత్ర సంకేతాల అర్థాన్ని తెలుసుకున్నాడు. అతనికి తెలిసిన ఒక స్త్రీ పేరు వున్న మరొక శాసనం దొరకడంతో అతని పరిశోధన కృషి తేలికైంది. తను అర్థంచేసుకున్న చిత్ర సంకేతాలను వినియోగించి తుత్మోసిస్ పేరూ, తదితర ఫారోల పేర్లూ షంపొల్యోన్ చదవగలిగాడు. ఈజిప్షియన్ లిఖిత భాష రహస్యం తెలుసుకునేందుకు యీ పరిశోధన నాంది అయింది.

షంపొల్యోన్ పరిశోధనా కృషిని యితర పండితులు కొనసాగించారు. ప్రాచీన ఈజిప్షియన్ లిపి రహస్యం బయటపడింది. అనేక పాపిరస్‌లూ, శిలా శాసనాలూ బయటపడ్డాయి. పరిశోధకులు వాటిని చదివారు.



"టోలెమీ," "క్లియోపాత్రా"ల నామాంకిత ఫలకాలు. ఈ రెండింట్లోనూ "ట"కి వేర్వేరు సంకేతాలు ఉపయోగింపబడ్డాయి. ఆడ పేర్లలో మొదటి, చివరి సంకేతాలు స్త్రీలింగాన్ని సూచిస్తాయి

? **1.** ఈజిప్టులో శాస్త్రీయ జ్ఞానం ఎలా ఆవిర్భవించింది? **2.** వెనక బీడుగా వున్న "మెట్టభూమి"ని సాగు చెయ్యాలని నిర్ణయింపబడినప్పుడు, ఆ పని చేసేందుకు ఏయే విషయాలను గురించిన జ్ఞానం, లెక్కలూ అవసరం? **3.** సముద్రంలోనూ, ఎడారిలోనూ ప్రయాణం చేసేటప్పుడు ఏయే విషయాలను గురించిన జ్ఞానం, వేటిని గురించిన లెక్కలూ అవసరం? **4.** ఈజిప్టులో లిపి ఎలా ఆవిర్భవించి, అభివృద్ధి చెందిందో వర్ణించండి. **5.** ప్రాచీన ఈజిప్టులో అక్షరాస్యులు ఎందుకు తక్కువగా ఉండేవాళ్లు?

# §13. ప్రాచీన ఈజిప్టులో సాహిత్యం, కళలు

(మాప్ 2)

కళ ఎప్పుడు, ఎలా పుట్టిందో జ్ఞాపకం చేసుకోండి (§ 3; 1).

**1. సాహిత్యం.** ఈజిప్షియన్ పాపిరస్‌లను చదవడం అలవరచుకున్నాక, ఈజిప్టులో కాల్పనిక సాహిత్యం ఉన్న సంగతిని పండితులు కనుక్కున్నారు.

దేవుళ్లనూ, ఫారోలనూ స్తుతించే గీతాలు రచింపబడ్డాయి. కథల్లో ఈజిప్టులో జీవితమూ, విదేశాలకు యాత్రలూ వర్ణింపబడ్డాయి. అనేక పుక్కిటి పురాణాలు – ముఖ్యంగా దేవుళ్లకీ, కాల్పనిక వీరులకీ సంబంధించిన గాథలు – వెలువడ్డాయి. ఒసిరిస్ కట్టుకథ ప్రత్యేకించి ప్రసిద్ధి చెందింది. ఫారోకీ, ప్రభువులకీ విధేయంగా వుండాలంటూ సామాన్య ఈజిప్షియన్లని ఉద్దేశించి చెయ్యబడిన "బోధనలు" ప్రత్యేకించి బహుళ వ్యాపితంగా ఉన్నాయి: "నీ యజమాని ముందు వంగు"; "బిడ్డ తను పుట్టగానే తన యజమాని ముందు మోకరిల్లాలి."










1. సిబ్బందితో కూడిన ఒక ప్రాచీన ఈజిప్షియన్ ఓడ నమూనా. 2. ఒక సమాధిలో లభ్యమైన బానిసల పర్యవేక్షకుడి విగ్రహం. 3. ఒక పెద్ద జాడీని మోస్తున్న ఆసియావాడి చిత్రం చెక్కబడిన కర్ర చెమ్చా

బీదవాళ్లు తమ పాటలనూ, సామెతలనూ రాసి ఉంచలేకపోయారు. అంచేతనే వాటిలో కొద్దిగా మాత్రమే మనకి లభించాయి. అలా అందిన వాటిలో కడుపుమంటతో కూడిన ఫిర్యాదులు ధ్వనిస్తాయి.

2. ప్రాచీన ఈజిప్షియన్ సమాధులు.

లిఖిత ఆధారాలే కాకుండా సమాధులూ, దేవాలయాలూ కూడా ప్రాచీన ఈజిప్షియన్ల మత విశ్వాసాలను గురించీ, దృక్పథాలను గురించీ తెలియజేస్తాయి.

క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో పిరమిడ్లు నిర్మించడం యింక నిలిచిపోయింది. సమాధి ఏకశిలలో తొలచబడేది. దానిలో ఫారోలకీ, ధనికులకీ కొన్ని గదులు కేటాయింపబడేవి. ఒక వేళ మృతుని మమ్మీ పదిలపరచబడకపోతే శిలా విగ్రహమో, కొయ్య విగ్రహమో సమాధిలో నిలపబడేది. ఈజిప్షియన్ల నమ్మకాల ప్రకారం మృత వ్యక్తి ఆత్మ విగ్రహంలో కూడా జీవించి ఉండగలదు. మనిషి ముఖాన్ని రూపొందించడంలో ఈజిప్షియన్ శిల్పులు ఉన్నత శిఖరాలు అందుకున్నారు. ఒక సమాధి లేక ప్రదర్శన శాలలోని మసక వెల్తురులో వాళ్ల శిల్పాలు విగ్రహాల మాదిరిగా కాక, సజీవ వ్యక్తుల మాదిరిగా కనిపిస్తాయి (కలర్ ఫొటో 1 చూడండి).

సమాధిలో ఆ ధనికుడి జమీని చూపే బొమ్మలు గోడలమీద చిత్రింపబడ్డాయి. అలాంటి చిత్రాల్లో ఒత్తుగా పెరిగిన గోధుమ పంటను మనుషులు కోస్తూవుంటారు. చేతిపనివాళ్లు తమ కార్ఖానాల్లో చురుకుగా పనిచేస్తూవుంటారు. విందు కోసం జంతువులూ, కోళ్లూ జిబహచెయ్యబడుతూవుంటాయి. గృహయజమానికీ, అతిథులకీ గాయకులూ, నృత్యకారులూ వినోదం చేకూరుస్తూవుంటారు.

కొయ్యతోనో, మట్టితోనో చేసిన ఒక వంటవాడి బొమ్మ, బరువులు మోస్తున్నవాళ్ల బొమ్మలు, బానిసల మేస్త్రీ బొమ్మ సమాధిలో ఉంచబడేవి. ఆ చిత్రం నిజమైన పొలాలుగా, కార్ఖానాలుగా, ఆ బొమ్మలు మృతుడికోసం పనిచేసే బానిసలుగా మారుతాయని ఈజిప్షియన్లు విశ్వసించేవాళ్లు. తమ మరణానంతరం సైతం బానిస యజమానులుగా ఉండాలని ధనవంతులు కోరుకున్నారు.

ఒక రైతు సమాధిలో అతని శరీరంతోబాటు మమ్మీ స్థానంలో కొయ్యలో చెక్కిన ఒక మనిషి బొమ్మ ఉంచబడింది. మరణించిన బానిసలు ఉమ్మడి సమాధిలో పూడ్చిపెట్టబడేవాళ్లు.

3. ప్రాచీన ఈజిప్టు దేవాలయాలు.

ఈజిప్టులో వాస్తు శిల్పుల మార్గదర్శకత్వంలో బ్రహ్మాండమైన, విశేషంగా అలంకరించబడిన దేవాలయాలు నిర్మింపబడ్డాయి.

దేవాలయాలకి పోయే బాటకి రెండు పక్కలా బారులు తీరిన స్ఫింక్స్‌లు ఉన్నాయి. మనిషి నిలువెత్తు కంటె అయిదారు రెట్లు పెద్దవైన ఫారో విగ్రహాలు దేవాలయం ముందు నిలిచివున్నాయి. రెండు గోపురాల మధ్య వున్న యిరుకు బాట దేవాలయ ప్రాంగణంలోకి దారితీసింది.

ఆ ప్రాంగణానికి చివర మసకగా వుండే ఒక పెద్ద హాలు ఉంది. హాలు పైకప్పు డజన్ల కొలది స్తంభాలమీద ఆధార పడివుంటుంది. కొన్ని హాళ్లలోని స్తంభాలు పాపిరస్ కాడల కట్టను పోలివున్నాయి. మరికొన్ని హాళ్లలో స్తంభాలు నిటారైన తాడిచెట్టు మాదిరిగా, యింకొన్ని హాళ్లలో చివర పూతపూసిన కాడ మాదిరిగా ఉన్నాయి.

థీబ్స్‌లోని ప్రధాన దేవాలయ స్తంభాలు 23 మీటర్ల పొడుగు వున్నాయి. ముదురు నీలం పైకప్పుమీద బంగరు వన్నె నక్షత్రాలు చిత్రింపబడ్డాయి. గోపురాలపైన, గోడలపైన, స్తంభాలపైన ఫారోల పెద్దపెద్ద బొమ్మలూ, జంతువుల శిరస్సులున్న దేవుళ్ల బొమ్మలూ చెక్కబడ్డాయి. (పేజి 54లోని చిత్రం 1 చూడండి). కొన్ని బొమ్మల్లో ఫారోలు దేవుళ్లతో ముచ్చటిస్తూవుంటారు, మరికొన్నింటిలో వివిధ శత్రువులతో పోరాడుతూ, వాళ్లని ఓడిస్తూవుంటారు. ఇంకొన్నింటిలో ఫారో ఒంటి చేత్తో కొందరు ఖైదీలను బంధిస్తాడు. నైలు నది ఒడ్డున ఫారో బృహత్ విగ్రహాలు నిలిచివున్నాయి.

## సినుహేట్ గురించి ఒక ప్రాచీన ఈజిప్షియన్ కథ

ఈ కథ, గేయం ఆధారంగా ప్రాచీన ఈజిప్షియన్ల జీవితం గురించి మీరేం చెప్పగలరు?

సినుహేట్ ఒక ఈజిప్షియన్ ప్రభువు. ఫారో మరణానంతరం అతను కొత్త ఫారో ఆగ్రహానికీ, రాజధానిలో అల్లర్లకూ భయపడి, ఆసియాకు పారిపోయాడు. యెడారిలో అతను దాహంతో చచ్చినంత పని అయింది. తరువాత ఆ అవస్థను వర్ణిస్తూ అతను "నాకు వూపిరాడలేదు. నా గొంతు మండిపోయింది. మరణం యిలాగే వుంటుందనుకున్నాను" అన్నాడు. యెడారిలో గొర్రెల మందలు తోలుకపోయే గొల్లవాళ్ళు కనపడినందున అతను బతకగలిగాడు.

ఆసియాలో సినుహేట్ ఒక రాజు కొలువులో చేరాడు. రాజు అతన్ని సైనికాధికారిని చేశాడు. తన దండయాత్రలను గురించి సినుహేట్ యిలా చెప్పాడు: "నేను దండెత్తిన ప్రతి దేశంలోనూ పచ్చని మైదానాలనుంచీ, బావుల నుంచి మనుషుల్ని దూరంగా తరిమేశాను. పశువుల మందలను ఆక్రమించుకొని, మనుషుల్ని బందీలను చేసే వాణ్ణి. వాళ్ల ఆహారమంతా స్వాధీనం చేసుకునేవాణ్ణి. జనాభాను హతం చేసేవాణ్ణి." సినుహేట్‌కు భోగభాగ్యాలూ, సన్మానాలూ కొదవలేదు. కాని, తాను ఆసియాలో మరణిస్తే, తన దేహం మమ్మీ కాదుగదా అని అతన్ని యెప్పుడూ ఒక భయం పీడించేది.



థీబ్స్‌లోని దేవాలయ శిథిలాలు (ఫొటో)

ఈజిప్టుకు తిరిగి పోవడానికి అతను ఫారో అనుమతి సంపాదించి, ఈజిప్టుకి వెళ్లాడు. రాజభవనంలో అతను ఫారో యెదుట సాష్టాంగపడి, ఫారో తన భటులతో అతన్ని లేవనెత్తించిందాకా లేవలేదు. ఫారో అతని కొక యిల్లూ, ఒక సమాధీ కట్టమని ఆజ్ఞాపించాడు. మరణానంతరం అతను ఆ సమాధిలో ఉంచబడ్డాడు.

గేయం

పొద్దుగూకూలూ మేం
గోధుమ గింజలు మొయ్యాల్సిందే
గాదెలు పూటుగా ఉన్నా
గింజలు కారిపోతున్నా.
ఓడలు నిండి, గింజలు
పక్కల్నించి కారిపోతున్నా
మేమింకా మోస్తూ ఉండాల్సిందే.
మావి గుండెలా, రాతి బండలా!

? **1.** త్రవ్వకాల్లో బయటపడ్డ సమాధులనుబట్టి ఈజిప్షియన్ల జీవితం గురించీ, మతం గురించీ మనం యేమి తెలుసుకోగలం? **2.** ఈజిప్షియన్ శిల్పులు ఎవరి విగ్రహాలు చెక్కారు, చిత్రకారులు ఎవరిని చిత్రించారు? ఈజిప్షియన్ల మనసుల్లో పిరమిడ్లూ, దేవాలయాలూ, విగ్రహాలూ ఎలాంటి ఆలోచనలనూ, భావోద్వేగాలనూ రేకెత్తించేవి? **3.** ఈజిప్షియన్ కళలో మీకేమి నచ్చుతుంది, ఏమి నచ్చదు? **4.** ఈజిప్షియన్ కళకీ, ఆదిమ కళకీ మధ్య ప్రధానమైన తేడాలు యేమిటి? ఈ తేడాల విషయంలో మీరిచ్చే వివరణ యేమిటి?

## ప్రాచీన ఈజిప్టు చరిత్రను గురించి మీరు సరిగా అవగాహన చేసుకున్నారా? బాగా మననం చేసుకున్నారా?

**1.** మాప్ 1లో ప్రాచీన ఈజిప్టు ఎక్కడుందో చూపండి. దాని ఉనికిని గురించి చెప్పండి. **2.** ప్రాచీన ఈజిప్టులో కొందర్ని మరికొందరు దోచుకోవడం అన్నది ఎలా తలెత్తింది? ఈజిప్టులో దోపిడీ, వర్గాలూ తలెత్తాయన్న విషయాన్ని ఏ లిఖిత పత్రాల, ఏ చారిత్రక మూలాధారాల ప్రాతిపదికమీద మీరు నిరూపించగలరు? **3.** ఈజిప్టు బానిస యజమానులు బీద వాళ్లనీ, బానిసల్నీ ఎలా అణచివుంచారు? అందుకు బానిస యజమానులు వినియోగించినవాటిలో కనీసం మూడు పద్ధతులను పేర్కొనండి. దోపిడికి గురైనవాళ్లు పీడననుంచి విముక్తి పొందేందుకు ప్రయత్నించారా? మీ వాదనని నిరూపించండి. **4.** ఫారోలు యుద్ధాలు ఎందుకు చేశారు? ప్రాచీన ఈజిప్టు చరిత్రలో యుద్ధాలు వహించిన పాత్ర యేమిటి? **5.** ప్రాచీన కాలంలో జనం ''ఈజిప్టు నైలు నది వరం'' అనేవాళ్లు. ఇది ఎంతవరకు సరైనది, ఎంతవరకు సరైనది కాదు? మీ వాదనని నిరూపించండి. **6.** పిరమిడ్లు ఈజిప్టులో నిర్మింపబడటంబట్టి యీకింది అంశాల్లో యే నిర్ధారణలు చెయ్యవచ్చు: (అ) ఈజిప్టులో జనం బతికిన వ్యవస్థ గురించి, (ఆ) రాజ్యం గురించి, (ఇ) మతం గురించి, (ఈ) విజ్ఞానశాస్త్రం గురించి? **7.** ఓసిరిస్‌ని గురించిన కట్టుకథలో ప్రాచీన ఈజిప్టులోని ప్రకృతి, మానవ కార్యకలాపాలు, రాజ్యం ఎలా ప్రతిబింబితమయ్యాయి? ప్రాచీన ఈజిప్టు చరిత్రలోని తేదీలను మీరెంత బాగా గుర్తుపెట్టుకున్నదీ తనిఖీ చేసుకోండి. కాలరేఖ పేజి 85లో ఉంది.

ప్రకరణం నాలుగు

# ప్రాచీన కాలంలో ఆసియా మైనర్

ఆసియా మైనర్ మధ్యధరా, నల్ల సముద్రాలకు చేరి వున్న ఆసియా ఖండపు పశ్చిమ భాగం. అది చాలా ఎడారులూ, స్తెప్ మైదానాలూ ఉన్న ప్రాంతం. వాటి మధ్య సారవంతమైన నదీ మైదానాలు ఉన్నాయి. వాటిలో మిక్కిలి పెద్ద మైదానాలు యూఫ్రటిస్, టైగ్రిస్ అనే రెండు మహా నదుల మధ్య ఏర్పడ్డాయి.

## §14. మెసొపొటేమియాలో వర్గాల ఆవిర్భావం

(మాప్ 2)

వ్యవసాయం, పశుపోషణల అభివృద్ధితో ఏయే సమాజాలు తలెత్తాయో జ్ఞాపకం చేసుకోండి (§5; 3).

**1. దక్షిణ మెసొపొటేమియా ప్రకృతి.**

ఆసియాలో, ఈజిప్టుకు ఈశాన్య భాగాన, యూఫ్రటిస్, టైగ్రిస్ అనే రెండు పెద్ద నదులు ప్రవహిస్తున్నాయి. అవి కాకసస్‌కు దక్షిణాన పర్వతాలలో పుట్టి, పర్షియన్ సింధుశాఖలోకి ప్రవహిస్తాయి. ఆ నదుల దిగువ ప్రాంతంలోనూ, మధ్య ప్రాంతంలోనూ, ఆ రెండు నదుల మధ్యా వున్న భూభాగాన్ని ప్రాచీన కాలంలో మెసొపొటేమియా* అనేవారు.

మెసొపొటేమియా దక్షిణ భాగం నది ఒండ్రుతో నిండివున్న చదునైన పల్లపు భూమి. అంత దీర్ఘంకాని చలికాలంలో అక్కడ వర్షపాతం యెక్కువ. నేలంతా మందంగా బురద కప్పుకొని వుంటుంది. వసంత ఋతువులో పర్వతాలలో మంచు కరుగుతుంది. యూఫ్రటిస్, టైగ్రిస్ నదులు పుట్టిన ఆ పర్వతాలలోని మంచు కరిగిన మూలంగా నదులు ఉప్పొంగి వరదలు వస్తాయి.

వరదలు తగ్గేటప్పటికి నేల కలకలలాడే పచ్చటి మొక్కలతో నిండివుంటుంది. కాని నీడలో ఉష్ణోగ్రత 50 డిగ్రీల

* మెసొపొటేమియా అన్న గ్రీకు పదానికి "నదుల మధ్య" అని అర్థం.



దక్షిణ మెసొపొటేమియా (ఫొటో)

సెంటిగ్రేడుకు చేరుకుంటుంది. మొక్కలు త్వరలోనే మాడిపోతాయి. శుష్కమైన ఇటుక రంగు ఎడారి నలువైపులకీ విస్తరిస్తుంది. పల్లపు ప్రాంతాలలో నీరు నిలిచి, మురికి గుంటలౌతాయి.

దక్షిణ మెసొపొటేమియాలో లోహంగాని, రాయిగాని లేదు. కాని నది ఒండ్రు నిండిన నేల అత్యంత సారవంతమైనది.

**2. దక్షిణ మెసొపొటేమియా ఆదివాసులు.**

దక్షిణ మెసొపొటేమియాలోని సారవంతమైన భూమి రైతులను ఆకర్షించింది. అక్కడ నివసించిన మొట్టమొదటి జనులు క్రీ.పూ. 7000–6000 సంవత్సరాల నాడే కొయ్య నాగళ్లతో వ్యవసాయం చేశారు, మేకలు, గొర్రెలు, ఆవులు పెంచారు. వాళ్లు చిత్తడి నేలల మధ్య మట్టితోనూ, రెల్లు చువ్వలతోనూ గుడిసెలు నిర్మించుకున్నారు.

నది వరదలు ఆ గుడిసెలను నాశనంచేసేవి. తరచు వరదల్లో మనుషులు కొట్టుకుపోయేవాళ్లు. పెంపుడు జంతువులు కొట్టుకుపోయేవి. ఒక్కొక్కప్పుడు టైగ్రిస్, యూఫ్రటిస్ నదులు ఏకమైపోయేవి. జనానికి అప్పుడు ప్రపంచం మొత్తానికే జలప్రళయం వచ్చిందేమో అనిపించేది. జనం మలేరియా, తేళ్లు, సవాలక్ష పురుగుల బారినపడేవాళ్లు. సింహాలు పెంపుడు జంతువుల మందలమీద దాడులు చేసేవి. అడవి పందులు రెల్లు పొదల మధ్య నివసిస్తూ పంటల్ని ధ్వంసంచేస్తూండేవి.

ఈ కష్టాల సమక్షంలో జనం నిబ్బరం కోల్పోలేదు. ప్రాంతీయ బృందాలుగా ఏర్పడేవాళ్లు. బురదనేలలనుండి నీరు తొలగించడానికీ, తమ పొలాల్లో నీరు పారించుకోడానికీ రైతులు కాలువలు తవ్వారు. జనావాసాలనూ, పండ్ల తోటలనూ వరదలనుండి రక్షించుకోడానికి వాళ్లు వాటి చుట్టూ కట్టలు కట్టేవాళ్లు. వ్యవసాయదారులు బిగిసిపోయిన చిత్తడి

నేలలను దున్నేందుకు అనువైన నాగలిని కనిపెట్టారు (పేజి 69 చూడండి). మండు టెండల్లో వాళ్ళ తమ పొలాలకి కాల్వల నుంచి పైకి నీళ్ళ తోడేవారు.

**3. క్రీ.పూ. 3వ సహస్రాబ్దిలో దక్షిణ మెసొపొటేమియా ఆర్థిక వ్యవస్థ.**

బురద నేలలపైనా, అనావృష్టిపైనా పట్టుదలతో కూడిన మానవ శ్రమ విజయం సాధించింది. మైదాన ప్రాంతంలో అనేక పంట కాల్వలు తవ్వబడ్డాయి. చేలలో రైధాన్యం, గోధుమా పెరిగేవి. జనావాసాల చుట్టూ పచ్చని ఖర్జూరపు చెట్లు వుండేవి. ఖర్జూరాలతో పిండి, తేనె, తయారుచేసేవాళ్ళు. గింజల్ని పంట చెరుకుగా వాడేవాళ్ళు. ఆ చెట్ల బెరడులోని నారతో తాళ్ళూ, బుట్టలూ తయారు చేసేవాళ్ళు. ఖర్జూర వృక్షానికి మెసొపొటేమియా జీవితంలో యెంత ప్రాముఖ్యం వుండేదంటే ఆ ప్రజలు దాన్ని "జీవన వృక్షం" అనేవాళ్ళు. పచ్చిక మైదానాల నిండా పొడుగాటి బొచ్చుగల గొర్రెలూ, ఆవులూ మేత మేస్తూండేవి.


1


2


3


4

1. దక్షిణ మెసొపొటేమియాలో ఒక నాగలి (ప్రాచీన చిత్రం). గరాటీతో కూడిన గొట్టం నాగలికి అమర్చబడింది. విత్తనాలు గరాటీలో పోస్తారు. దుక్కి, విత్తులు నాటడం ఏక కాలంలో జరుగుతాయి. 2. మెసొపొటేమియాలోని ఒక తూకం రాయి. 3. దేవుడికీ, రాక్షసుడికీ మధ్య జరిగిన పోరాటానికి సంబంధించిన పుక్కిటి కథకి ప్రాచీన చిత్రీకరణ (70వ పేజిలో ఈ పురాణ కథ చదవండి). 4. జలప్రళయాన్ని గురించిన పురాణ కథ చెక్కబడిన ఫలకం

చేతిపనివాళ్ళు పట్టణాల్లో నివసించేవాళ్లు. పట్టణాల్లో వ్యాపారం చురుకుగా జరిగేది. దక్షిణ మెసొపొటేమియా ప్రజలు పొరుగు ప్రజలనుంచి లోహాలు, కలప, రాయి కొనుక్కుని, అందుకు మారకంగా గోధుమ, ఖర్జూరాలు, ఉన్ని యిచ్చేవాళ్లు. క్రీ.పూ. 4వ సహస్రాబ్దిలో చేతిపనివాళ్లు రాగితో, బంగారంతో, కంచుతో (కంచుతో కొంచెం ఆలస్యంగా) వస్తువులు తయారుచెయ్యడం నేర్చుకున్నారు. ఉన్ని బట్టలకు దక్షిణ మెసొపొటేమియా చాలా ప్రసిద్ధి కెక్కింది. మెసొపొటేమియా వాసులు మట్టితో తొట్టెలు, పెట్టెలు, గొట్టాలు తయారుచేసేవాళ్లు, మట్టి ఇటుకలతో ఇళ్లు కట్టుకునేవాళ్లు.

దక్షిణ మెసొపొటేమియాలో భూమి ఎంత సారవంతమైనదంటే, ఒక గింజ నాటితే 100 గింజల పంట లభించేది. ఒక్కొక్క ఖర్జూరపు చెట్టు ఏడాదికి 50 కిలోల ఖర్జూరాలు కాసేది. అలాంటి పుష్కలమైన పంటల మూలంగా మానవ శ్రమ పనిచేసేవాడి అవసరాలకు మించిన ఫలసాయాన్ని సమకూర్చేది. ఆవిధంగా, దోపిడికి అవకాశం తలెత్తింది.

## 4. వర్గాల అవతరణ.

మెసొపొటేమియాలోని కులీనులూ, పూజారులూ విస్తారంగా భూములను ఆక్రమించుకున్నారు. బానిసలను వశంచేసుకున్నారు. అక్కడ మారక ద్రవ్యంగా వినియోగింపబడే వెండి బిళ్లలు వాళ్ల దగ్గర పెద్ద యెత్తున పోగుపడ్డాయి.

చాలామంది రైతులూ, చేతిపనివాళ్ళూ ధనికులకు రుణపడ్డారు. వాళ్లు అసలు సొమ్ముతోబాటు, అదనంగా పెద్ద మొత్తాన్ని తిరిగి చెల్లించాల్సివచ్చేది. సామాన్యంగా బీదవాళ్లు అలా చెల్లించలేకపోయేవాళ్లు. వాళ్లు తమ జీవితకాలమంతా రుణగ్రస్తులై వుండేవాళ్లు. పాత రుణంమీదే అదనపు మొత్తం (వడ్డీ) చెల్లించేందుకుగాను బీదలు నిరంతరాయంగా శ్రమించవలసివచ్చేది. వాయిదా సొమ్ము సకాలంలో చెల్లించకపోతే తన కుటుంబ సభ్యులూ, స్వయంగా తనూ బానిసలుగా అమ్మివెయ్యబడతామని రుణగ్రస్తులు నిరంతర భయంతో కుంగిపోతూండేవాళ్లు.

సొంత పొలం బొత్తిగా లేని బీద రైతులు ధనికులనుంచి కౌలుకి తీసుకునేవాళ్లు. భూమిని కౌలుకి తీసుకున్న రైతులు పొలంలో పండిన పంటలో సగం పాలూ, తోటలో పండిన పళ్లలో మూడింట రెండు వంతులూ భూస్వామికి యివ్వాలి.

యుద్ధంలో పట్టుబడిన ఖైదీలు కూడా బానిసలు అయ్యేవాళ్లు. బానిసలు దేవాలయాలకీ, ప్రభువులకీ చెందిన భూముల్లో పనిచేసేవాళ్లు. మెసొపొటేమియాలో బానిసల్ని "తమ కళ్లు పైకెత్తని వాళ్లు" అని పిలిచేవారు. వాళ్లు తమ యజమానుల కళ్లలోకి చూసేందుకు సైతం సాహసించేవాళ్లు కారు.

దక్షిణ మెసొపొటేమియాలో వ్యవసాయం, పశుపాలన, చేతివృత్తులు అభివృద్ధి చెందడంతో బానిసలు, స్వేచ్ఛాయుత సమష్టి రైతుల వర్గమూ, ధనిక బానిస యజమానుల వర్గమూ రూపొందనారంభించాయి.

## ప్రపంచ సృష్టి గురించీ, జలప్రళయం గురించీ దక్షిణ మెసొపొటేమియా కట్టుకథలు

జల ప్రళయం గురించిన కట్టుకథ దక్షిణ మెసొపొటేమియాలో ఎందుకు పుట్టింది? అది ప్రాచీన ఈజిప్టులో పుట్టగలిగేదా?

1. భూమి అంతా మహా సముద్రంచేత ముంచివెయ్యబడింది. దేవుళ్లు భూమిని నీటినుంచి వేరుచెయ్యకుండా భయంకరమైన ఒక రాక్షసుడు అడ్డుకున్నాడు. దేవాధిదేవుడు ఆ రాక్షసుడితో పోరాడి, వాడిని చంపేసి,

శరీరాన్ని రెండు సగభాగాలుగా చేశాడు. దేవుడు ఆ శరీరపు పై భాగంనుంచి ఆకాశాన్ని చేసి, దాన్ని నక్షత్రాలతో అలంకరించాడు. దేవుడు శరీరపు దిగువ భాగంనుంచి భూమిని సృష్టించి, దానిమీద మొక్కలు మొలిపించాడు, జంతుకోటిని సృష్టించాడు. దేవుడు తొలి మానవులను తన సొంత రూపానికి ప్రతిబింబాలుగా మట్టితో తయారు చేసి, ప్రాణం పోశాడు.

2. భూమినంతనీ వరదల్లో ముంచెయ్యడం ద్వారా జనాన్ని నాశనంచెయ్యాలని దేవుళ్లు నిర్ణయించుకున్నారు. కాని జల దేవత యీ నిర్ణయం గురించి ఒక మనిషి గుడిసె నిర్మాణానికి వినియోగింపబడ్డ రెల్లు కాడలకి చెప్పింది. ఆ రెల్లు కాడలు యీ విషయాన్ని ఆ గుడిసె యజమానికి చెప్పాయి. అతనొక పెద్ద ఓడ నిర్మించాడు, తన కుటుంబ సభ్యుల్నీ, నిపుణులైన చేతిపనివాళ్లనీ, రకరకాల జంతువుల్నీ, పక్షుల్నీ దానిలోకి ఎక్కించాడు. దేవుళ్లు నిర్ణయించిన రోజున ఆకాశాన్ని కారు మబ్బులు అలుముకొన్నాయి. కుండపోతగా వర్షం కురిసింది. భూమి అంతా జలమయమైపోయింది. ఆ ఓడమీద ఉన్నవాళ్లు తప్ప మిగిలిన వాళ్లందరూ చచ్చిపోయారు.

ఆరు రోజులు గడిచాక తుపాను నిలిచిపోయింది. క్రమంగా నీరు తగ్గనారంభించింది. ఒక కాకి ఆ ఓడమీద నుంచి ఎగిరివెళ్లి భూమిని కనుక్కుంది. తర్వాత జంతువులతోపాటు మనుషులు అక్కడికి చేరుకున్నారు.

ఈ కట్టుకథలు మెసొపొటేమియానుంచి యితర దేశాలకి వ్యాపించాయి. ప్రకృతి శక్తులపట్ల భయం దేవుళ్లపట్ల విశ్వాసాన్ని దృఢపరచింది. పూజారులు యీ భయాన్ని ఆసరాచేసుకొని, జనం దేవుళ్లని ధిక్కరిస్తే దేవుళ్లు భూమిమీదకి ఓ కొత్త జల ప్రళయాన్నీ, యితర ముప్పుల్నీ పంపి, వాళ్లని శిక్షిస్తారని బెదిరించారు.

? **1.** దక్షిణ మెసొపొటేమియా, ఈజిప్టుల్లోని భౌగోళిక పరిస్థితులను పోల్చిచూడండి. వాటి మధ్య సామ్యం యేమిటి, భేదం యేమిటి? **2.** ప్రాచీన కాలంలో ఈజిప్టు, దక్షిణ మెసొపొటేమియాల జనాభాలకు ఉమ్మడి నైన కార్యకలాపాలు యేమిటి? దక్షిణ మెసొపొటేమియాలో రైతులు ఎందుకు సముదాయాలుగా నివసించేవాళ్లు? **3.** దక్షిణ మెసొపొటేమియాలో వర్గాలు యెందుకు అవతరించాయి? ఈ ప్రశ్నకి జవాబు చెప్పడం మీకు కష్టమైతే, ప్రాచీన ఈజిప్టులో వర్గాలు ఎందుకు తలెత్తాయో జ్ఞాపకంచేసుకోండి (§7). **4.** ధనిక బానిస యజమానులు స్వతంత్రులైన బీదవాళ్లని ఎలా దోచుకున్నారు? **5.** దక్షిణ మెసొపొటేమియాలో ఎన్ని వేల యేళ్ల క్రితం వ్యవసాయం ఆరంభమైంది?

# §15. మెసొపొటేమియాలో తొట్టతొలి రాజ్యాలు, బాబిలోనియన్ సామ్రాజ్యం

(మాప్ 2)

ఈజిప్టులో రాజ్యం ఎందుకు, ఎలా ఏర్పడిందో జ్ఞాపకం చేసుకోండి. రాజ్య లక్షణాలు ఏమిటి (§8; 1)?

**1. మెసొపొటేమియాలో తొట్టతొలి రాజ్యాలు.** దక్షిణ మెసొపొటేమియాలో క్రీ.పూ. 4వ సహస్రాబ్ది చివర వర్గాల ఆవిర్భావంతో రాజ్యాలు ఏర్పడ్డాయి. దాదాపు ప్రతి ఒక్క నగరంలో ఒక స్వతంత్ర రాజ్యం ఉండేది. ఈ నగర రాజ్యాల రాజులు సైనికుల, అధికారుల, రక్షక భటుల, తలారుల సాయంతో బీదలపట్లా, బానిసలపట్లా క్రూరంగా వ్యవహరించేవాళ్ళు.

నగర రాజ్యాల రాజులు యిరుగుపొరుగు పట్టణాలను ముట్టడించి, వాటిని ధ్వంసంచేసి, జనాభాను బానిసలు గానైనా చేసుకునేవాళ్ళు; లేకపోతే బలవంతాన వాళ్ళనుంచి కప్పమైనా వసూలుచేసేవాళ్ళు.

**2. బాబిలోన్ విజృంభణ.** దక్షిణ మెసొపొటేమియాలో, యూఫ్రటిస్ నది ఒడ్డున బాబిలోన్ నగరం చాలా అనుకూలమైన స్థలంలో, యూఫ్రటిస్ నది టైగ్రిస్ నదికి సమీపాన ప్రవహించే చోట నిర్మింపబడింది. వర్తకులు పెద్ద నౌకలలో స్థానిక ప్రజలకి అవసరమైన సరుకులు తెచ్చేవాళ్ళు. దక్షిణ మెసొపొటేమియాలో ఉత్పత్తి అయ్యే సరుకులు వాళ్ళు తీసుకపోయేవాళ్ళు. (స్థానిక ప్రజలు ఏ వస్తువులు ఉత్పత్తిచేసేవాళ్లో వాళ్లకి అవసరమైన వస్తువులు ఏమిటో గుర్తుచేసుకోండి.) మెసొపొటేమియా ముఖ్య




మెసొపొటేమియాలో రాజ్యాలు ఏర్పడడం

● ఉర్ క్రీ.పూ. 3వ సహస్రాబ్దిలో నగర రాజ్యాలు

హమ్మురాబి పాలనలోని బాబిలోన్ రాజ్య సరిహద్దులు (క్రీ.పూ. 18వ శతాబ్దం)

భూమార్గాలు బాబిలోన్ గుండా పోయేవి. బరువైన సరుకుల మూటలతో గాడిదలు ఆ మార్గాలలో ప్రయాణం చేసేవి.

బాబిలోన్ మెసొపొటేమియాలో కెల్ల మిక్కిలి పెద్ద వాణిజ్య నగరమూ, శక్తివంతమైన ఒక రాజ్యపు రాజధానీ నగరమూ అయింది. నగరం మధ్య గేలరీలతో, గిడ్డంగులతో కూడిన బజారు వుంది. శివార్లలో చేతిపనులవాళ్ళ, హమాలీల, నావికుల పచ్చి యిటుకతో కట్టిన గుడిసెలు ఉండేవి.

### 3. హమ్మురాబి పాలనలో బాబిలోన్ సామ్రాజ్యం.

హమ్మురాబి క్రీ.పూ. 1792–1750 మధ్య బాబిలోన్ సామ్రాజ్యాన్ని పాలించాడు. బాబిలోనియా చాలా ఐశ్వర్యవంతమైనదైనందున, ఆ రాజు ఆయుధ సంపన్నమైన పెద్ద సైన్యం నిర్మించగలిగాడు. అతను నేర్పుగా మెసొపొటేమియా రాజుల మధ్య కలహాలను వినియోగించుకున్నాడు. వాళ్లలో ఒకరితో పొత్తు పెట్టుకున్నాడు. వాళ్లిద్దరూ కలిసి తమ శత్రువుల భూభాగాలు వశపర్చుకొన్నారు. తర్వాత హమ్మురాబి ఆకస్మికంగా తన వెనకటి పొత్తుదారుమీద దాడి చేశాడు. బలప్రయోగంతోనూ, నక్కజిత్తులతోనూ యావత్తు మెసొపొటేమియానూ అతను ఆక్రమించుకున్నాడు. బాబిలోన్ రాజు పాలనలో శక్తివంతమైన రాజ్యం ఏర్పడింది.

### 4. హమ్మురాబి రాజు శాసనాలు.

హమ్మురాబి పాలనలో బాబిలోన్ రాజ్యం అంతటా్లోనూ ప్రజలు పాటించవలసిన శాసనాలు చెయ్యబడ్డాయి. అధికారులు రాజ్య పౌరుల మధ్య తగవులను విచారణ చేసి, నేరస్థులకు రాజుగారి యిచ్ఛ మేరకు చెయ్యబడిన యీ శాసనాల ప్రకారం శిక్షలు విధించేవాళ్లు. ఆ శాసనాలు ప్రతి ఒక్క నేరానికీ శిక్షను నిర్దేశించాయి.

20వ శతాబ్ది మొదట్లో పురాతత్వ శాస్త్రజ్ఞుల నిలువెత్తు కంటె పెద్దదైన ఒక నల్లరాతి పలకను కనుగొన్నారు.





1. లగష్ నగర పాలకుడి విగ్రహం. క్రీ.పూ. 3వ సహస్రాబ్ది. 2. హమ్మురాబి శాసనాలు చెక్కబడిన ఫలక భాగం. దేవుడు రాజుకి అధికార చిహ్నమైన దండాన్ని అందజేస్తున్నాడు

దానిమీద హమ్మురాబి రాజు శాసనాలు, పైభాగాన ఆ రాజు బొమ్మా చెక్కబడివున్నాయి. (కింది శాసనాలను చదివి, ప్రశ్నలకి జవాబు యివ్వండి.)

బాబిలోన్ రాజ్యమేమిటి, ఈజిప్టు రాజ్యమేమిటి ఒక బలప్రయోగ యంత్రం. బానిస యజమానులు ఈ యంత్రం ద్వారా బీదలపైనా, బానిసలపైనా తమ ఆధిపత్యాన్ని నిలుపుకున్నారు. బాబిలోన్ రాజ్యం బానిస యజమానుల రాజ్యం.

## హమ్మురాబి రాజు శాసనాల్లో కొన్ని

ఈ శాసనాలు బాబిలోన్ సామ్రాజ్యంలోని బానిసల స్థితిని గురించి ఏం తెలియజేస్తాయి? రుణాల చెల్లింపు విషయంలో శాసనం ఏం కట్టుదిట్టాలు చేసింది? ఈ శాసనాలు ఎలాంటి సందర్భాల్లో ఒకే నేరానికి వేర్వేరు శిక్షలకు అవకాశం కల్పించింది? హమ్మురాబి తన శాసనాలు న్యాయమైనవనీ, అద్భుతమైనవనీ చెప్పుకున్నాడు; మీరు ఆ మాటతో ఏకీభవిస్తారా?

"నేను, హమ్మురాబిని, దేవతలచే నియుక్తుడనైన నాయకుణ్ని, రాజులకు రాజును, యూఫ్రటిస్ వెంబడి వున్న జనావాసాలను జయించినవాణ్ని, దేశం నాలుకమీద సత్యమూ, న్యాయమూ వుంచాను, దేశ ప్రజల జీవితాన్ని సౌభాగ్యవంతం చేశాను.

"ఈ నాటినుండి నే నిలా శాసిస్తున్నాను:

"దేవళం సొమ్ము గానీ, రాజు సొమ్ము గానీ దొంగిలించినవానికి మరణదండన విధించబడుతుంది; దొంగ సొమ్ము పుచ్చుకున్నవానికి కూడా మరణదండన విధించబడుతుంది.

"బానిసను — మగ బానిసనైనా, ఆడ బానిసనైనా — దొంగిలించినవానికి మరణదండన విధించబడుతుంది.

"పారిపోయిన బానిసను దాచినవానికి మరణదండన విధించబడుతుంది.

"బానిస దేహంమీది గుర్తును తొలగించినవాని వ్రేళ్లు ఖండింపబడతాయి.*

"ఒకడు మరొకని బానిసను చంపితే, ఆ బానిసకు బదులు అతను తన బానిసను యివ్వాలి.

"ఒకడు మరొకని యెద్దును చంపితే, ఆ యెద్దుకు బదులు తన యెద్దును యివ్వాలి.

"రుణం వున్నవాడు తన భార్యను గాని, కొడుకును గాని, కూతుర్ని గాని మూడేండ్లపాటు బానిసగా యివ్వాలి.

"తనకు సరిసమానుడైనవాణ్ని చెంపమీద కొట్టినవాడు జరిమానా చెల్లించాలి.

"తనకంటె అధికుడైనవాణ్ని (అనగా ఒక కులీనుణ్ని లేక పూజారిని) చెంపమీద కొట్టినవాడు ఎద్దు చర్మపు కొరడాతో 60 దెబ్బలు తినాలి."

చివరి భాగంలో యిలా వుంది: "నేను, హమ్మురాబి అనే న్యాయమైన రాజును, సూర్యదేవునినుండి ఈ శాసనాలను కానుకగా పొందాను. నా మాటలు అద్భుతమైనవి, నా చేతలు అద్వితీయమైనవి."

?

**1.** దక్షిణ మెసొపొటేమియాలో రాజ్యాలు ఎందుకు అవతరించాయి? ఈ ప్రశ్నకి జవాబుచెప్పడం మీకు కష్టమైతే, ప్రాచీన ఈజిప్టులో రాజ్యాలు ఎందుకు అవతరించాయో జ్ఞాపకం చేసుకోండి (§8;1).

---

* బానిసల దేహాలమీద యజమానులు తమ గుర్తులు వేసేవాళ్లు. — సం.

**2.** చెప్పండి: (అ) హమ్మురాబి శాసనాలు ఎవరి ప్రయోజనాలను కాపాడాయి? (ఆ) బాబిలోన్ రాజ్యంలో ఎలాంటి సామాజిక వ్యవస్థ అమల్లో ఉండేది? మీ జవాబును నిరూపించండి. **3.** హమ్మురాబి తన అధికారాన్ని పటిష్ఠం చేసుకునేందుకు మతాన్ని ఎలా వినియోగించుకున్నాడు? **4.** §15లో రాజ్యం గురించి మీరు కొత్త అంశాలు ఏమి తెలుసుకున్నారు?




## సంవత్సరాలను లెక్కపెట్టడం

ఈ పేజిలోని రేఖాచిత్రం "క్రీ.పూ. 18వ శతాబ్ది"ని చూడండి. ఆ శతాబ్ది మొదటి సంవత్సరాన్నీ, చివరి సంవత్సరాన్నీ గమనించండి. చివరి అంకె కంటె మొదటి అంకె ఎందుకు పెద్దగా వుందో వివరించండి. శతాబ్ది మొదటి సగాన్ని చూడండి: అది 1800తో మొదలై 1751తో ముగిసింది. ఆ శతాబ్ది రెండవ సగం మొదటి సంవత్సరం యేమిటి, చివరి సంవత్సరం యేమిటి?

ఆ రేఖాచిత్రం హమ్మురాబి పాలన కాలాన్ని చూపిస్తుంది. అతను ఎన్నేళ్లు పాలించాడో లెక్కించండి. ఎన్నేళ్ల క్రితం అది ముగిసింది? క్రీ.పూ. 1792కి ముందరి సంవత్సరం యేమిటి? క్రీ.పూ. 1792కి తర్వాతి సంవత్సరం యేమిటి? బాబిలోన్‌లో హమ్మురాబి పాలిస్తున్న కాలంలో ఈజిప్టులో ఏ సంఘటనలు సంభవించాయి? బాబిలోన్‌ని హమ్మురాబి మరణానంతరం 232 సంవత్సరాలకు కొండజాతులవారు ఆక్రమించుకున్నారు. అది జరిగింది ఎప్పుడు?

# §16. క్రీ.పూ. 1వ సహస్రాబ్ది ప్రథమార్ధంలో ఆసియా మైనర్

(మాప్, 2, 77వ పేజిలోని మాప్)

క్రీ.పూ. 4వ – 2వ సహస్రాబ్దుల్లో ఆసియా మైనర్ వాసులకు ఏయే లోహాలు తెలుసో జ్ఞాపకంచేసుకోండి (§14; 3, 4).

1. ఇనుము తయారీ ప్రారంభం.

ఆసియా మైనర్ వాసులు క్రీ.పూ. 2వ సహస్రాబ్ది చివరా, క్రీ.పూ. 1వ సహస్రాబ్ది మొదట్లోనూ ఇనుము తయారుచెయ్యడం నేర్చుకున్నారు. రాళ్లతో, మట్టితో పొయ్యి తయారుచేసి, దానిలో ఇనుప ఖనిజమూ, కట్టె బొగ్గూ వేసేవాళ్లు. తర్వాత వాళ్లు బొగ్గును అంటించి, అది మరింత బాగా మండేందుకు తిత్తులతో గాలి ఊదేవాళ్లు. ఆ మంట మూలంగా ఇనుప ఖనిజంనుంచి ఇనుప ముద్దలు ఏర్పడేవి. కమ్మర్లు ఆ ముద్దలనుంచి గట్టి పరికరాలనూ, ఆయుధాలనూ మలిచేవాళ్లు.

రాగి, తగరాల కంటె ఇనుప ఖనిజం మరింత ఎక్కువగా లభ్యమయ్యేది. అందుకే రాగి, కంచు పనిముట్ల కంటె ఇనుప పనిముట్లు మరింత విస్తృత వ్యాపితంగా ఉండేవి.

2. ఇనుము కనిపెట్టడం, దాని ప్రాముఖ్యం.

ఇనుప కొర్రు నాగళ్లు నదీ లోయల్లోని మెత్తటి నేలలనే కాకుండా స్టెప్ మైదానాల్లోని గట్టి నేలలను దున్నేందుకు కూడా పనికివచ్చేవి. ఇనుప పారలూ, గునపాలూ కొండ చరియల్లోని రాతి నేలల్లో కాల్వలు తవ్వేందుకు ఉపయోగపడేవి. వ్యవసాయదారులు పర్వతాలనుంచి ప్రవహించే నదుల, సెలయేళ్ల నీటితో పొలాలకు నీరు పారించుకునేవాళ్లు. ఆసియా మైనర్‌లోని స్టెప్ మైదానాల్లోనూ, కొండచరియల్లోనూ వ్యవసాయం వేగంగా వ్యాపించనారంభించింది. క్రీ.పూ. 1వ సహస్రాబ్దిలో, వెనక ఎక్కడ వేటగాళ్లు అడవి జంతువులను వేటాడుతూండేవాళ్లో లేక పశువుల కాపరులు తమ మందలను మేపుతూండేవాళ్లో అక్కడ పంటచేలూ, పళ్లతోటలూ అవతరించాయి. ఇనుప పనిముట్ల సాయంతో మరింత మేలైన ఓడలు నిర్మించేవాళ్లు. అది వర్తకానికి దోహదంచేసింది.



1



2



3

1. క్రీ.పూ. మొదటి సహస్రాబ్ది నాటి ఇనుప పనిముట్లు. 2. పనిముట్లతో వెళ్తున్న రైతులు (ప్రాచీన చిత్రం). 3. ఫొనీషియన్ ఓడ (ప్రాచీన చిత్రం). దీన్ని ఈజిప్షియన్ ఓడతో పోల్చిచూడండి (పేజి 63లోని చిత్రం). సుదీర్ఘ సముద్ర ప్రయాణాలకి ఏది మెరుగైనది? 4. క్రీ.పూ. 6వ శతాబ్దిలో బాబిలోన్. పునరుద్ధరణ (విహంగావలోకిత చిత్రం), ప్లాను. పునరుద్ధరిత ప్లానులో చూపబడిన రాజభవనాలను, ఆకాశ ఉద్యానాలను, తదితర కట్టడాలనూ గుర్తించండి (కలర్ ఫొటో 8 కూడా చూడండి)






అంకెల సూచిక:

1 రాజభవనం
2 ప్రధాన ద్వారం (ఇష్టార్ ద్వారం)
3 ఆకాశ ఉద్యానాలు
4 దేవాలయ గోపురం (బాబిలోన్)
5 ఊరేగింపుల వీధి
6 రాజు వేసవి భవనం

**4**

క్రీ.పూ. 6–5 శతాబ్దాల్లోని పర్షియన్ సామ్రాజ్యం

పాంటికపేయమ్
సార్డిస్
మిలెటస్
టైర్
మెంఫిస్
థీబ్స్
బాబిలోన్
ఎక్‌బటానా
సూస
పెర్సిపోలిస్
అమూదర్యా
సిర్‌దర్యా
నైల్


క్రీ.పూ. 6వ శతాబ్దిలో పర్షియన్ తెగల నివాస ప్రాంతం


క్రీ.పూ. 5వ శతాబ్ది మొదట్లో పర్షియన్ సామ్రాజ్యం


పర్షియన్ దండయాత్రల ప్రధాన మార్గాలు

400 0 400కి.మీ.

ఇనుప పనిముట్ల సాయంతో వ్యవసాయదారులూ, చేతిపనివాళ్ళూ యింతకుముందరి కంటే ఎక్కువ ఉత్పత్తిచెయ్య సాగారు. వాళ్ల శ్రమ ఉత్పాదకత ఎన్నో రెట్లు పెరిగింది.

ఆసియా మైనర్‌లో వ్యవసాయం, చేతివృత్తులు అభివృద్ధి చెందడంతో బానిస యాజమాన్య వ్యవస్థ మరింత వేగంగా అభివృద్ధిచెందింది. మైదానాల్లోనూ, పర్వత ప్రాంతాల్లోనూ కొత్త రాజ్యాలు తలెత్తాయి. ట్రాన్స్ కకేషియాలో ఉరార్తు రాజ్యం యేర్పడింది.

3. ఫొనీషియన్ సముద్ర యాత్రికులు.

వ్యవసాయం, పశుపాలన, చేతివృత్తుల ప్రగతి వర్తకపు అభివృద్ధికి దోహదంచేసింది. క్రీ.పూ. 1వ సహస్రాబ్ది మొదట్లో మధ్యధరా సముద్రపు తూర్పు తీరాన ఉన్న నగరాలు వేగంగా సంపన్నమయ్యాయి. వాటిలో ఫొనీషియన్లు నివసించేవాళ్ళు. ఫొనీషియన్ నగరాల్లో కెల్ల మిక్కిలి సంపన్నమైన టైర్ నగరం సముద్ర తీరానికి సమీపంలో వున్న ఒక ద్వీపంలో ఉంది.

ఫొనీషియన్లు ఆసియా మైనర్‌లో కెల్ల అత్యుత్తమ నౌకా నిర్మాతలు, నావికులు. వాళ్ళు సముద్రాల్లోనే కాక అట్లాంటిక్ మహాసముద్రంలో కూడా నౌకాయానం చేశారు. ఫొనీషియన్ వర్తకులు మధ్యధరా సముద్రపు దాదాపు అన్ని తీరాల్లోనూ వర్తకం చేశారు. ఫొనీషియన్ వర్తకంలో బానిసలు ఒక ముఖ్య సరుకు. ఆసియా మైనర్‌లో వ్యవసాయం, చేతివృత్తులూ అభివృద్ధి చెందడంతో బానిసలకు గిరాకీ పెరిగింది. ఫొనీషియన్లు బానిసలను కొనేవాళ్ళు. దీనికితోడు, తీరాల్లోనూ, యితర నౌకలమీదా వున్న మనుషుల్ని పట్టుకుని, వాళ్లని బానిసలుగా విక్రయించేవాళ్ళు (వర్ణ చిత్రం 9 చూడండి).

ఫొనీషియన్ సముద్ర వ్యాపారం మధ్యధరా సముద్ర తీరంలోని చాలా దేశాల్లో బానిస యాజమాన్య వ్యవస్థ స్థాపనకీ, ఆ దేశాల్లో ఆసియా మైనర్ సంస్కృతి వ్యాప్తికీ దోహదంచేసింది.

ఫొనీషియన్ నగరాలు ఎక్కువ కాలం స్వతంత్రంగా మనలేదు, శక్తివంతమైన ఇరుగుపొరుగు దేశాల పాలనకి తలొగ్గాయి.

4. పర్షియన్ రాజుల దండయాత్రలు.

ఆసియా మైనర్‌లో మొదట ఒక రాజ్యమూ, తర్వాత మరో రాజ్యమూ — యిలా బలపడసాగాయి. క్రీ.పూ. 8వ, 7వ శతాబ్దాల్లో టైగ్రిస్ నదీ తీరాన ఉన్న అస్సీరియన్ సామ్రాజ్యం ప్రాముఖ్యంలోకి వచ్చింది. తరువాత బాబిలోన్ రాజులకి తిరిగి ప్రాబల్యం వచ్చింది.

క్రీ.పూ. 6వ శతాబ్దిలో నూతన విజేతలైన పర్షియన్లు ఆసియా మైనర్‌మీద దండయాత్ర చేశారు. పర్షియన్ రాజ్యం క్రీ.పూ. 6వ శతాబ్దిలో పర్షియన్ సింధు శాఖకి తూర్పున ఏర్పడింది. పర్షియన్లకి చలాకీ ఆయిన ఆశ్విక సైన్యం వుంది. పర్షియన్ విలుకాండ్రు తమ గురికి ప్రసిద్ధి చెందారు. పర్షియన్ రాజు సైరస్ దేశం తర్వాత దేశాన్ని ఆక్రమించుకున్నాడు. లోతైన అగడ్తలూ, రెండు ప్రాకారాలూ కలిగిన బాబిలోన్ దుర్భేద్యమైన కోట. కాని బాబిలోనియన్ పూజారులు విద్రోహానికి ఒడిగట్టి కోట గోడలు తెరిచారు. పర్షియన్లు బాబిలోన్‌ని క్రీ.పూ. 538లో ఆక్రమించుకున్నారు.

మధ్య ఆసియాకి జరిపిన ఒక దండయాత్రలో సైరస్ హత్యచెయ్యబడ్డాడు. ''నువ్వు రక్తపిపాసివి. ఇదిగో రక్తం, నీ కరువుతీరా తాగు'' అంటూ అతని శత్రువులు అతని శిరస్సును రక్తంతో నిండిన ఒక తోలు సంచిలో పడేశారు.

అయితే, సైరస్ మరణంతో పర్షియన్ల దండయాత్రలు ముగిసిపోలేదు. బలమైన పర్షియన్ సైన్యం ఈజిప్టుమీద దాడిచేసింది. కిరాయి సైనికుల్లో ఒక భాగం ఫారోకి ద్రోహంచేశారు. తత్ఫలితంగా ఈజిప్షియన్ సైన్యం ఓడిపోయింది. చివరకు క్రీ.పూ. 525లో పర్షియన్లు ఈజిప్టును ఆక్రమించుకున్నారు.





1. తిరుగుబాటుదార్లపై మొదటి డరియస్ విజయ గౌరవ సూచకంగా శిలపై చెక్కబడిన చిత్రం. నేలపైన వెల్లకిల పడివున్న తిరుగుబాటు నాయకునిపైన డరియస్ తన పాదం మోపి నిలబడివున్నాడు. చేతులు వెనక్కి బంధింపబడిన కొందరు యితర తిరుగుబాటు నాయకులు నిలబడి వున్నారు. రాజు వెనక అతని అంగరక్షకులు నిలబడ్డారు. 2. తాము జయించిన ప్రజలనుండి పర్షియన్లు కప్పాలు వసూలు చేస్తున్నారు (ప్రాచీన ఉబ్బెత్తు చిత్రం)

**5. క్రీ.పూ. 5వ శతాబ్ది మొదట్లో పర్షియన్ సామ్రాజ్యం.**

క్రీ.పూ. 6వ శతాబ్ది అంతంలో, 5వ శతాబ్ది ఆరంభంలో మొదటి డరియస్ రాజు పర్షియాని పాలించాడు. ఆ కాలంలో పర్షియన్ సామ్రాజ్యం తన శిఖర స్థాయిని అందుకుంది. డరియస్ సామ్రాజ్యం ఈజిప్టునుంచి సింధు నదివరకు వ్యాపించింది.

ఆక్రమిత ప్రజలు రాజుకి భారీ యెత్తున కప్పం చెల్లించి, తమ యువకుల్ని రాజు సైన్యంలో కొలువుకి పంపవలసి వుండేది. కప్పం చెల్లించిన మీదట నగరాలూ, గ్రామాలూ శత్రు దండయాత్రకి గురైనవాటి మాదిరిగా కనిపించేవి. రాజు కోశాగారంలో అపారమైన ధనరాసులు పోగుపడేవి. రాజు భవనాల్లోని నేలమాళిగలు బంగారు కడ్డీలతో నిండిపోయేవి.

ఆక్రమిత దేశాల్లో తరచు తిరుగుబాట్లు చెలరేగుతూవుండేవి. ఈ వార్త రాజుకు హుటాహుటిన అందజెయ్యబడేది. పర్షియన్లు రోడ్లమీద గుర్రపు రౌతులతో చెక్‌పోస్టులు ఏర్పాటుచేసేవాళ్లు. రౌతులు "శరవేగం"తో దూసుకెళ్లి అధికార్ల నివేదికలను రాజధానికీ, రాజధానినుంచి రాజు ఆజ్ఞలసూ హుటాహుటిన అందజేసేవాళ్లు. తిరుగుబాటుదార్లపైకి పంపబడిన సైనిక దళాలు వాళ్లని నిర్దాక్షిణ్యంగా అణచివేసేవి. అయితేనేం, విజేతలను ద్వేషించే ఆక్రమిత ప్రజల మీద పర్షియన్ రాజులు తమ అధికారాన్ని బహు కష్టంమీద మాత్రమే నిలుపుకోగలిగేవాళ్లు.

**?** **1.** ఇనుము కనుగొనబడిన తర్వాత ఆసియా మైనర్‌లో కొత్త రాజ్యాలు ఎందుకు తలెత్తాయి? ఈ ప్రశ్నకి జవాబు చెప్పడం మీకు కష్టమైతే, దీన్ని మూడు ప్రశ్నలుగా విభజించండి: (అ) ఇనుము కనిపెట్టడంతో మానవ శ్రమ ఎందుకు మరింత ఉత్పాదకం అయింది? (ఆ) శ్రమ ఉత్పాదకత పెరగడంతో ఎందుకు వర్గాలు అవతరించనారంభించాయి? (ఇ) వర్గాలు ఏర్పడటంతో రాజ్యాలు ఎందుకు తలెత్తాయి? **2.** క్రీ.పూ. 1వ సహస్రాబ్దిలో ఫొనీషియన్ నగరాలు ఎందుకు శీఘ్రంగా సంపన్నమయాయి? **3.** పర్షియన్ సామ్రాజ్యపు భూభాగాన్ని మాప్ 2లో చూపించండి. ఆ భూప్రాంతంలో అంతకుముందు ఉన్న స్వతంత్ర రాజ్యాల్లో మీకు తెలిసినవాటిని పేర్కొనండి. **4.** ఇనుముతో వస్తువులను తయారుచెయ్యడం మనుషులకి సుమారు

ఎన్ని వేల సంవత్సరాలనుంచి తెలుసు? **5.** పర్షియన్లు బాబిలోన్‌ని ఏ శతాబ్దంలో, ఏ అర్ధశతాబ్దంలో, ఏ కాలుశతాబ్దంలో ఆక్రమించారు? పర్షియన్లు ఈజిప్టును ఆక్రమించినదానికంటె ఎన్నేళ్ళ ముందు బాబిలోన్‌ని జయించారు?

## § 17. ప్రాచీన కాలంలో ఆసియా మైనర్‌లో నివసించిన ఆయా ప్రజల సంస్కృతి

(మాప్ 2)

ప్రాచీన ఈజిప్షియన్లు ఏ సంకేతాలు ఉపయోగించారో, వాళ్ళు ఎలా రాశారో జ్ఞాపకం చేసుకోండి (§12; 4); వారిలో విజ్ఞాన శాస్త్రీయ జ్ఞానం ఎలా ఉత్పన్నమైంది (§12; 1–3)?

**1. మెసొపొటేమియాలో పూరావస్తు తవ్వకాలు.**

పురావస్తు శాస్త్రజ్ఞుల దృష్టిని మెసొపొటేమియా మైదానాల్లోని విడివిడి ఒంటరి దిబ్బలు ఆకర్షించాయి. ఆ దిబ్బల తవ్వకాలు 19వ శతాబ్ది మధ్య ప్రారంభమయ్యాయి. తవ్వకాల్లో మట్టి పొరకింద పురావస్తు శాస్త్రజ్ఞులకు రాజభవనాలతో, దేవాలయాలతో, కోటగోడలతో కూడిన ప్రాచీన నగరాల శిధిలాలు లభ్యమయ్యాయి. మొదట అస్సీరియన్ల నగరాలు కనుగొనబడి, తవ్వి బయటకి తియ్యబడ్డాయి (కలర్ ఫొటో 5 చూడండి).

మహా శక్తివంతమైన అస్సీరియా సామ్రాజ్యం క్రీ.పూ. 7వ శతాబ్ది అంతంలో ధ్వంసంచెయ్యబడింది. అస్సీరియన్ నగరాల విధ్వంసం గురించి ప్రాచీన రచయితలు చేసిన వర్ణనలను తవ్వకాల్లో బయటపడ్డ శిధిలాలు ధృవపరిచాయి. శిధిలాల్లో అక్కడ రేగిన మంటల అవశేషాలు లభ్యమయ్యాయి.

అస్సీరియన్ నగరాల తర్వాత ఆసియా మైనర్‌లోని యితర ప్రాచీన నగరాలు తవ్వి వెలికి తియ్యబడ్డాయి.

**2. అస్సీరియన్ కళలు.**

ఆసియా మైనర్‌లో పురావస్తు శాస్త్రజ్ఞులు కనుగొన్న కళాఖండాల్లో అస్సీరియా స్మారక నిర్మాణాలు ప్రత్యేకించి గమనార్హమైనవి.

అస్సీరియన్ రాజుల భవనాలు నగరం కంటె ఎత్తులో ఉన్నాయి. అవి బానిసలు లేపిన దిబ్బలమీద నిర్మింపబడ్డాయి. రాజభవనం చుట్టూ కోట గోడలు వున్నాయి. రాజభవన సింహద్వారం దగ్గర మానవ శిరస్సు, రెక్కలు వున్న బృహత్ శిలా వృషభ విగ్రహాలు ఉన్నాయి. ప్రాకారాల లోపలి భాగానికి ఉబ్బెత్తు చిత్రాలున్న శిలా పలకాలు అమర్చబడ్డాయి. సాధారణంగా ఆ ఉబ్బెత్తు శిల్పాల్లో దేవుళ్ల బొమ్మలు, యుద్ద దృశ్యాలు ఉంటాయి: అస్సీరియన్ సైనికుల దండయాత్రలు, విజయాలు, శత్రు నగరాల విధ్వంసం, ఖైదీలను చంపివెయ్యడం లేక వాళ్లని బానిసలుగా తోలెయ్యడం. కొన్ని ఉబ్బెత్తు చిత్రాల్లో వేటకోసం బోనుల్లో ప్రత్యేకించి తీసుకురాబడ్డ సింహాలను రాజు వేటాడే దృశ్యాలు ఉన్నాయి. వేటగాడిమీద క్రోధంగా దూకుతున్న లేక గాయాలతో చనిపోతున్న జంతువులను చిత్రించడంలో అస్సీరియన్ శిల్పులు విశేషమైన నైపుణ్యం సాధించారు.



1

1. ఒక నగరపు ముట్టడిని చూపే అస్సీరియన్ ఉబ్బెత్తు చిత్రం. కోట గోడమీది మనిషి దయాభిక్ష వేడుకుంటున్నాడు. గోడ పక్కన చక్రాలున్న దుంగ వుంది. బరువైన యీ దుంగకి ఒక చివర మందమైన ఇనుప రేకు దిగకొట్టబడింది. షెడ్డుకి వేలాడదియ్యబడే ఆ దుంగ చక్రాలమీదుగా కోట గోడమీదకి జార్చబడేది. తర్వాత అది కోట గోడని ఛిన్నాభిన్నం చేసేందుకుగాను వెనక్కీ ముందుకీ ఊపబడేది. దుంగ పైకప్పు చర్మంతో, రాగి రేకులతో తాపడం చెయ్యబడింది. కుడి వైపున అస్సీరియన్ సైనికులు. వారిలో ఒకడు రెమ్మలతో తయారు చేసిన నిలువెత్తు కవచాన్ని పట్టుకొనివున్నాడు. పైన కొక్కేలకు వేలాడదీయబడిన ఖైదీలు. కింద మృత ఖైదీ పడివున్నాడు. అస్సీరియన్ల, వారి ప్రత్యర్థుల రూపాల పరిమాణాల్లో తేడా చూపడం ద్వారా శిల్పి వ్యక్తం చేయదలుచుకున్న భావం యేమిటో ఆలోచించండి. 2. రాజు సింహాలను వేటాడటం



2

### 3. కీల లిపి

అస్సీరియన్ రాజధాని నినెవే నగరపు తవ్వకాల్లో పురావస్తు శాస్త్రజ్ఞులకు రాజ భవనంలో ఒక పూర్తి "గ్రంథాలయం" దొరికింది. దానిలో సుమారు 20,000 "గ్రంథాలు" ఉన్నాయి. ఆ "గ్రంథాలు" మట్టితో చేసినవి కనుక, రాజభవనం తగులబడినప్పుడు ఆ గ్రంథాలయానికి అగ్నివల్ల ప్రమాదం జరగలేదు.

మెసొపొటేమియాలో క్రీ.పూ. 4వ సహస్రాబ్దిలో లిఖిత భాష ప్రారంభమైంది. మెసొపొటేమియాలో పాపిరస్ లేదు. కనుక వాళ్లు మెత్తని మట్టి పలకలమీద రాసేవాళ్ళు. రాసేటప్పుడు రాతకాడు యెప్పుడూ తన పక్కన తడి మట్టి ముద్ద వుంచుకునేవాడు. తనకు కావలసిన "కాగితం" తానే తయారుచేసుకోవలసివచ్చేది. పలకనిండా రాసిన తర్వాత, దాన్ని గట్టిపరచడానికి యెండలో యెండబెట్టేవాళ్లు, లేదా మంటలో కాల్చేవాళ్లు.

మెసొపొటేమియాలో మొదట్లో బొమ్మల రూపంలో రాసేవాళ్లు. మట్టిమీద బొమ్మలు గీయడం కష్టం గనుక, వాళ్లు పదునైన పుల్లలతో సరళమైన గీతలు చెక్కడం ప్రారంభించారు. ఒక్కొక్క గుర్తు పూర్తిగా ఒక పదాన్ని గానీ, ఒక అక్షరాన్ని గానీ వ్యక్తంచేస్తుంది. అన్నీ కలిపి సుమారు ఒక వెయ్యి గుర్తులను ఆ జనులు వాడారు. ఈ రకమైన రాతను కీల లిపి అంటారు. కీల లిపి దక్షిణ మెసొపొటేమియాలో పుట్టిన తర్వాత యిరుగుపొరుగు దేశాలకు వ్యాపించింది.

పండితులు కీల లిపి రహస్యం కనుక్కొని ఆ పలకలమీద వున్న ఆ కాలపు పురాణ కథలూ, శాస్త్ర రచనలూ, శాసనాలూ తెలుసుకున్నారు. నినెవేలో లభించిన కొన్ని పలకల్లో ప్రపంచ సృష్టికీ, జలప్రళయానికీ సంబంధించిన పురాణ కథలు దొరికాయి (§14కి అనుబంధం). హమ్మురాబి శాసనాలు కూడా రాతిమీద కీల లిపిలో చెక్కబడ్డాయి.

### 4. తొట్టతొలి అక్షరమాల.

ఫొనీషియన్లు రాత అభివృద్ధికి గణనీయంగా దోహదం చేశారు. వర్తకానికి చకచకా రాతకోతలు జరపడం అవసరం. బాగా సంశ్లిష్టమైన చిత్రసంకేత (హైరోగ్లిఫ్) లిపీ, కీల లిపీ యిందుకు అనువైనవి కావు. ఈజిప్షియన్ లిపిలో చిత్రాలు మాటలనే కాకుండా శబ్దాలను కూడా తెలియజేస్తాయి. ఈ అనుభవాన్ని ఫొనీషియన్లు వినియోగించుకున్నారు. ఫొనీషియన్లు కనిపెట్టిన అక్షరమాలలో 22 హల్లు చిత్రాక్షరాలు వుంటాయి. రాతలో అచ్చులు వదిలెయ్యబడతాయి. అక్షర మాల ఆవిష్కరణ రాత అభివృద్ధికి దోహదంచేసి, జ్ఞానార్జనను సులభతరం చేసింది.

### 5. శాస్త్రీయ జ్ఞానం.

మెసొపొటేమియాలో వాడకంలో వున్న స్కూలు పాఠ్యగ్రంథాలు లభ్యమయాయి. వేర్వేరు వైశాల్యాలు కలిగిన చేలలో పండిన పంటను విద్యార్థులు లెక్కించాలి. వెండిని ఐదుగురు సోదరుల మధ్య, వారిలో ప్రతి ఒకడూ మరొక సోదరుడి కంటె అయిదో వంతు ఎక్కువ పొందే మాదిరిగా పంచాలి. బాకీ మొత్తంమీద వడ్డీ లెక్కకట్టాలి. ఒక పర్వత చరియమీద వేర్వేరు లోతుల్లో వుండే నాలుగు గుంటల్లో ఒక్కొక్కదాన్ని తవ్వేందుకు ఎన్నేసి పనిదినాలు పడతాయో లెక్కకట్టాలి. (ఈ లెక్కల్నిబట్టి మెసొపొటేమియాలో జీవితం గురించి ఏమి నిర్ధారణలు చెయ్యవచ్చు? కనీసం ఐదింటిని పేర్కొనండి. మెసొపొటేమియాలో గణితశాస్త్ర అవతరణకు కారణం యేమిటి?)

రోగచికిత్సా పద్ధతులను తెలిపే సుమారు 40 కీల లిపి పలకలమీద లిఖించబడిన ఒక వైద్యశాస్త్ర గ్రంథం లభించింది.

బాబిలోనియన్ పూజారులు ఎత్తైన ఒక శిఖరంనుంచి నక్షత్ర గమనాన్ని పరిశీలించేవాళ్లు. సూర్య, చంద్ర గ్రహణాలు ఎప్పుడు వచ్చేదీ వాళ్లు జోస్యం చెప్పగలిగేవాళ్లు. బాబిలోనియన్లు సంవత్సరాన్ని నెలలుగానూ, వారాలుగానూ విభజించారు. రోజును గంటలుగానూ, నిమిషాలుగానూ విభజించారు.

ఐనా, ఆసియా మైనర్‌లోని ప్రాచీన జనుల జ్ఞానం నిజమైన శాస్త్ర విజ్ఞానం కానే కాదు. ఉదాహరణకు, ఆకాశ













| పక్షి | నాగలి | కాలు |
| --- | --- | --- |

4

1. మానవ శిరస్సు, రెక్కలు వున్న వృషభ శిల్పం. అస్సీరియన్ల మత విశ్వాసం మేరకు యీ వృషభం రాజభవన సింహ ద్వారాన్ని కావలి కాస్తూ వుంటుంది. 2. కవచధారులైన అస్సీరియన్ సైనికులు (ప్రాచీన ఉబ్బెత్తు శిల్పం). శిరస్త్రాణం, రొమ్ము కవచం, డాలు, యితర ఆయుధాలు. 3. కీల లిపితో వున్న మట్టి ఫలకం. 4. కీల లిపి అక్షరాల్లోకి మారిన రేఖా చిత్రాలు: పక్షి, నాగలి, పాదం. రేఖా చిత్రాలు క్రమంగా ఎలా పరిణామం చెందాయో చూడండి. 5. ఫొనీషియన్ అక్షర మాలకు చెందిన అక్షరాలు

మొక పెద్ద టోపీ అనీ, దానికి కిటికీలు వున్నాయనీ బాబిలోనియనులు అనుకున్నారు. ఈ కిటికీల గుండా భూమిమీద వర్షం పడుతుందట. సూర్యుడూ, చంద్రుడూ, గ్రహాలూ దేవతలని వాళ్లు అనుకున్నారు.

ఆసియా మైనర్‌లో పెంపొందిన సంస్కృతి — రాత, శాస్త్రీయ జ్ఞానం, కళలు — ఈజిప్షియన్ సంస్కృతి అంత ప్రాచీనమైనది.

## అస్సీరియా యుద్ధాలను గురించి సమకాలికుల వర్ణనలు

అస్సీరియా సైన్యం గురించీ, యుద్ధాలను గురించీ మీకేమి తెలుసు? ఈ పత్రాల కర్తలను గురించి మీ అభిప్రాయం యేమిటి?

అస్సీరియన్ సైన్యం గురించిన వర్ణన: "చూడండి, వాళ్లెంత వేగంగా, ఎదుర్కోరాని విధంగా వస్తున్నారో? వాళ్లలో ఏ ఒక్కడూ కునికిపాట్లు పడటం లేదు, నిద్రపోవడం లేదు. గుర్రపు గిట్టలు రాయిలా వున్నాయి. రథచక్రాలు ప్రళయావర్తంలా ఉన్నాయి. వాటి ధ్వని సింహాలు గర్జిస్తున్నట్లు వుంది. వాటినుంచి ఏ ఒక్కడూ తప్పించుకోలేడు."

ట్రాన్స్‌కకేషియాకి అస్సీరియన్ సైన్యపు దండయాత్రని గురించిన వర్ణన: "నేను కొండకొమ్ముల మీదుగా, కనుమల మీదుగా శత్రువుల రక్తాన్ని నదుల్లోకి పారించాను. స్తెప్ మైదానాలు, మైదానాలు, పర్వతాలు ఎర్ర కంబళి మాదిరిగా రక్తరంజితమయ్యాయి. నేను స్థానిక గ్రామాలను జ్వాలాతోరణాలు చేశాను. నేను మంచి నీటి కాల్వలను బురద గుంటలు చేశాను. నా సైనికులు అందమైన పళ్ల తోటల్లోకి ప్రవేశించారు, ఇనుప గొడ్డళ్ల ధ్వనులు మార్మోగాయి... నేనొక్క గోధుమ కంకిని కూడా విడిచిపెట్టలేదు" (వర్ణ చిత్రం 8 చూడండి).

నినెవే ఓటమిని గురించిన వర్ణన: "అతిశయ రోగపూరితమూ, నిరంతర దోపిడీ మగ్నమూ అయిన ఓ పాపిష్ఠి నగరమా, నువ్వు నాశనమగుదువు గాక! ఆశ్విక సైనిక రౌతులు దౌడుతీస్తున్నారు. ఖడ్గాలు ఊగుతున్నాయి. గొడ్డళ్లు మెరుస్తున్నాయి. బోలెడుమంది హతమార్చబడ్డారు, శవాల గుట్టలు పర్వత ప్రమాణాన్ని అందుకుంటున్నాయి.... నినెవే ధ్వంసమైంది! దాన్ని చూసి విచారించే నాథుడెవడు? నినెవే, నిన్ను గురించి విన్న ప్రతి ఒక్కడూ, యిప్పటి నీ గతి చూసి ఆనందాతిరేకంతో ఎగిరి గంతేస్తాడు. ఎందుకంటావేమో, నీ క్రోధాన్ని చవిచూడనివాడు ఎవడున్నాడు?"

? **1.** ప్రాచీన కళాఖండాల ద్వారా ఆసియా మైనర్ చరిత్ర గురించి మీరేమి తెలుసుకున్నారు? **2.** ఈజిప్టులోని ప్రాచీన లిపికీ, మెసపొటేమియాలోని లిపికీ మధ్య తేడాలు ఎందుకు తలెత్తాయి? **3.** ఈజిప్షియన్లకి ఉన్న మాదిరి శాస్త్రీయ జ్ఞానమే మెసపొటేమియాలో కూడా ఎందుకు తలెత్తింది? **4.** అస్సీరియన్ శిల్పుల నేర్పు ఎలా వ్యక్తమైంది? **5.** చిత్రాల, లిఖిత పత్రాల ఆధారంగా అస్సీరియన్ రాజ్యం గురించి ఓ వ్యాసం రాయండి.

| క్రీ.పూ. సహస్రాబ్ది | శతాబ్ది | ప్రాచీన ఈజిప్టులోని అతి ముఖ్య సంఘటనలు | మెసొపొటేమియాలోని అతి ముఖ్య సంఘటనలు |
|---|---|---|---|
| 4 | 32, 31 | ఈజిప్టులో ఏక రాజ్య స్థాపన. క్రీ.పూ. సుమారు 3000 | నగర రాజ్యాల ఆవిర్భావం. క్రీ.పూ. 4వ సహస్రాబ్ది చివర |
| 3 | 30, 29, 28, 27, 26, 25, 24, 23, 22, 21 | హెయోప్స్ మహా పిరమిడ్ నిర్మాణం. సుమారు క్రీ.పూ. 2600 | |
| 2 | 20, 19, 18, 17, 16, 15, 14, 13, 12, 11 | బీదల, బానిసల తిరుగుబాటు. సుమారు క్రీ.పూ. 1750<br>మూడవ తుత్మోసిస్ దండయాత్రలు. సుమారు క్రీ.పూ. 1500 | హమ్మురాబి పాలన. క్రీ.పూ. 1792–1750 |
| 1 | 10, 9, 8, 7, 6 | పర్షియన్లు ఈజిప్టును ఆక్రమించుకోవడం క్రీ.పూ. 525 | పర్షియన్లు బాబిలోన్‌ను ఆక్రమించుకోవడం. క్రీ.పూ. 538 |

(క్రీస్తు పూర్వం)

# ప్రకరణం ఐదు

# ప్రాచీన భారత దేశం

## §18. క్రీ.పూ. 3వ సహస్రాబ్దికీ, 1వ సహస్రాబ్ది మొదటికీ మధ్య భారత దేశం

(మాప్ 3)

ఇనుము కనిపెట్టడానికి గల ప్రాముఖ్యాన్ని జ్ఞాపకం చేసుకోండి (§16; 2).

**1. భారత దేశం ఉనికి, నైసర్గిక పరిస్థితి.**

ప్రపంచంలో కెల్ల యెత్తైన హిమాలయ పర్వతాలు దేశానికి ఉత్తర సరిహద్దు. హిమాలయ శిఖరాలు నిరంతరం మంచుతో కప్పబడివుంటాయి. ప్రాచీన కాలంలో భారత దేశంనుంచి విదేశాలకు పోవడానికి అనుకూలమైన దారులు వాయవ్య దిశలోని పర్వత కనుమల గుండా మాత్రమే వుండేవి.

దక్కన్ ద్వీపకల్పం దాదాపు పూర్తిగా పీఠభూమి. ఈ పీఠభూమికీ, హిమాలయాలకీ మధ్యన ఒక మైదానం వుంది. ఈ మైదానంలో పడమటి భాగాన సింధు నది ప్రవహిస్తోంది. తూర్పున మరొక నది వుంది – గంగా నది. రెండూ హిమాలయాలలో పుట్టి, పర్వతాలలో మంచు కరిగినప్పుడు విస్తారంగా వరదలు కలిగిస్తాయి.

హిమాలయ పర్వతాలు ఉత్తరపు చలి గాడ్పులనుండి భారత దేశాన్ని రక్షిస్తాయి. భారత దేశ వాతావరణం చలి కాలంలో కూడా వెచ్చగా వుంటుంది. సింధు నది మైదానంలో వర్షం చాలా తక్కువ. ఆ ప్రదేశం స్టెప్ మైదానం. గంగా నది మైదానంలో వేసవిలో వర్షం చాలా యెక్కువ. ప్రాచీన కాలంలో ఆ ప్రాంతమంతా దుర్గమమైన బురదనేలలతోనూ, అడవులతోనూ నిండివుండేది. అడవులలో దట్టంగా పెరిగిన ఉష్ణమండలపు వృక్షాలూ, పొదలూ వుంటాయి. పగటి పూట సైతం చీకటిగా వుండే ఆ అడవులలో చిరుత పులులూ, పెద్ద పులులూ, యేనుగులూ, అడవి దున్నలూ వుంటాయి. మనుషులకు, జంతువులకు యెంతో అపాయకరమైన విషసర్పాలు వుంటాయి.

**2. అత్యంత ప్రాచీనమైన భారత దేశ నగరాలు.**

భారత దేశంలో లక్షలాది సంవత్సరాలుగా మానవులు నివసిస్తున్నారు. అక్కడ ఆదిమ కాల జీవిత అవశేషాలు అనేకం లభిస్తాయి. భారత దేశం భూ ప్రాంతంలో జనం వర్గాలుగా విభజింపబడటం, తొలి రాజ్యాల స్థాపనా క్రీ.పూ. 1వ సహస్రాబ్దిలో మాత్రమే సంభవించాయని పండితులు చాలాకాలం విశ్వసించారు. క్రీ.పూ. 3వ, 2వ సహస్రాబ్దుల్లో ఉన్న నగరాల శిథిలాలను సుమారు ఒక అర్ధ శతాబ్దం వెనక పురాతత్వ శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

ఆ నగరాల్లో తిన్నని వీధులు, ఇటుకలతో నిర్మించిన రెండు మూడు అంతస్తుల గృహాలు వున్నాయి. అవి లోపల



భారత దేశంలో యీనాటికీ వున్న ఒక ప్రాచీన కాలువ (ఫొటో). రెండు వైపులా గట్ల మీద దట్టంగా వున్న చెట్లను చూడవచ్చు

శోభాయమానంగా అలంకరింపబడి, ఈతకొలనులతో కూడివున్నాయి. బీదవాళ్ల గుడిసెలు వేరే వీధుల్లో వున్నాయి. నగరానికి ఎగువన ఒక కొండమీద కోట వుంది. కోటకి దగ్గర్లో పెద్ద ధాన్యాగారం ఉంది.

సింధు నదీ మైదానవాసులు ధాన్యానికి తోడు పత్తి కూడా పండించేవాళ్లు. పొలాలకు నీటిపారుదల సౌకర్యాలు ఉండేవి. సింధు మైదానవాసులు పశుపాలన కూడా చేస్తూండేవాళ్లు.

ఆ నగరాలు వర్తకానికీ, చేతివృత్తులకీ కేంద్రాలుగా వుండేవి. చేతిపనివాళ్లు రాగితో, కంచుతో, బంగారంతో వస్తువులు తయారుచేసేవాళ్లు. నూలువస్త్రాలు అక్కడినుంచి మెసొపొటేమియాకి ఎగుమతి చెయ్యబడుతూ వుండేవి.

తవ్వకాల్లో అనేక రాతి, ఎముక ముద్రికలు దొరికాయి. వాటిమీద రాతకి సంకేతాలుగా ఉపయోగింపబడిన పెంపుడు జంతువుల చిత్రాలు, అక్షరాలు చెక్కబడ్డాయి. అయితే అత్యంత ప్రాచీనమైన భారతీయ లిపిని యింతవరకు ఎవరూ చదివి

అర్థంచేసుకోలేకపోయారు. సింధు నదీ మైదానవాసుల జీవితం గురించి మనకి వున్న జ్ఞానానికి వస్తువులు మాత్రమే మూలాధారం.

క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో నగరవాసులు తమ నగరాలను విడిచి వెళ్లిపోయారు. వాళ్లు అలా ఎందుకు వెళ్లిపోయారో చరిత్ర శాస్త్రజ్ఞులకు యింకా తెలియదు.

## 3. భారత దేశంలోకి ఆర్యన్ల చొరబాటు, భారత దేశంలో వాళ్ల స్థిరవాసం.

క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో ఆర్యన్ తెగలు వాయవ్య దిశనుంచి భారత దేశంలో ప్రవేశించాయి. ఆర్యులు అప్పట్లో సంచార జీవులు. తమ సామాన్లతో సహా ఒక చోటునుండి మరొక చోటుకి ప్రయాణం చేసేవాళ్లను సంచార జీవులంటారు. సంచార జీవులు సాధారణంగా పశువులను పెంచేవాళ్లు. ఒక చోట వున్న గడ్డినంతటినీ తమ పశువులు తిని, తొక్కివేసిన తర్వాత, వాళ్లు వాటిని మరొక చోటుకి తోలుకపోయేవాళ్లు. ఆర్యులు ఆవుల్నీ, గుర్రాలనీ పెంచేవాళ్లు. ఆర్యులు పూజించిన ప్రధానమైన దేవుళ్లలో సూర్యుడు ఒకడు. సూర్యుడు ఆకాశంలో బంగారు రథంలో పయనిస్తాడనీ, ప్రకాశవంతమైన ఎర్రని ఏడు గుర్రాలు ఆ రథాన్ని లాగుతాయనీ ఆర్యులు విశ్వసించేవాళ్లు.

ఆ తెగల నాయకులు ఎన్నుకోబడేవాళ్లు. వాళ్లని రాజులు అనేవాళ్లు. రాజు తన తెగలోని జనంనుంచి విరాళాలు పొందేవాడు. అవి ఐచ్ఛికంగా యివ్వబడినవిగా పరిగణింపబడేవి.

సాంస్కృతికాభివృద్ధి విషయంలో యీ ఆర్యన్ సంచార జీవులు సింధు నదీ లోయలోని ప్రాచీన నగరవాసుల కంటె ఎంతో వెనకబడినవాళ్లు. వాళ్లకి లిపి ఉండేది కాదు. వాళ్లు తమ ప్రాచీన గాథలను వృద్ధ తరాలనుంచి యువ తరాలకి ముఖతః అందజేసేవాళ్లు.

ఆర్యులు తమ పశువుల, గుర్రాల మందలతో మైదానాల్లో పయనిస్తూ, క్రమంగా భారత దేశంలోని అధికతర భాగంలో స్థిరపడ్డారు. భూమిని సాగుచెయ్యడం మొదలుపెట్టి, వాళ్లు క్రమంగా స్థిర జీవనానికి మారి, దేశ జనాభాతో కలిసిపోయి, ప్రాంతీయ సమాజాల్లో నివసించనారంభించారు.

## 4. క్రీ.పూ. 1వ సహస్రాబ్ది నాటి భారతీయుల కార్యకలాపాలు.

క్రీ.పూ. సుమారు వెయ్యేళ్ల క్రితం ఇనుమును తవ్వితియ్యడం, ఇనుముతో వస్తువులు తయారుచెయ్యడం నేర్చుకున్నారు.

ఇనుప గొడ్డళ్లూ, పారలూ కలిగివున్నవాళ్లకి అడవులు ఆటంకం కాలేదు. ప్రాంతీయ సమాజాలకు చెందినవాళ్లు తుప్పలూ, పొదలూ కొట్టేసి, కాల్వలు తవ్వి, భూమి దున్ని, పంటలకి లాయకుచేసి, క్రమక్రమంగా గంగా నదీ మైదానంలోని భూమిని సాగులోకి తెచ్చారు. తేమా, ఎండా పుష్కలంగా వున్న మూలంగా సారవంతమైన నేలలో పంటలు విరగపండేవి.

ఇనుప నాగలీ, పారా గట్టి నేలలు దున్నేందుకు కూడా పనికి వచ్చేవి. నాగళ్లకి ఎడ్లని కట్టి భూమి దున్నేవాళ్లు. వ్యవసాయం పీఠభూమికి కూడా విస్తరించనారంభించింది.

భారతీయులు గోధుమ, వరి, చెరుకు, పత్తి పండించేవాళ్లు. నేత వృత్తిలో నిపుణులైన భారతీయులు నేసిన వస్త్రాలు ఉంగరంలో దూరేటంతటి సన్నంగా ఉండేవి, గట్టిగా కూడా వుండేవి.

భారతీయులు పశువులతోబాటు కోళ్లని కూడా పెంచేవాళ్లు. మొదట అడవి కోళ్లని మచ్చికచేసింది భారతీయులే. ఆధునిక కోళ్లు వాటినుంచే అభివృద్ధి చెందాయి.

భారతీయులు ఏనుగుల్ని మచ్చికచేసుకుని, ఆ బృహత్ జంతువులచేత చెట్లు పెళ్లగించడం, మనుషుల్నీ, బరువుల్నీ మొయ్యడం వంటి పనులు చేయించుకున్నారు. భారతీయులు ఏనుగులకి యుద్ధ శిక్షణ యిచ్చి, శత్రు సైనిక శ్రేణులపై

దాడిచెయ్యడం, శత్రు సైనికులను మట్టుపెట్టడం, వగైరా కార్యాలకు వాటిని వినియోగించేవాళ్లు.

సుసంపన్నమైనప్పటికీ, అనేక ప్రమాదాలతో కూడివున్న దేశ ప్రకృతిమీద ఎడతెగని తమ కృషి ద్వారా భారతీయులు విజయం సాధించారు.

? **1.** భారత దేశం, ఈజిప్టుల నైసర్గిక పరిస్థితుల మధ్య సామ్యాలు యేమిటి? తేడా యేమిటి? **2.** ప్రాచీన కాలపు భారత దేశంలో వ్యవసాయాభివృద్ధికి సానుకూలమైన నైసర్గిక పరిస్థితులు యేమిటి? ప్రాచీన కాలపు భారతీయులు అధిగమించవలసివచ్చిన యిబ్బందులు యేమిటి? గంగా నదీ మైదానంలో కంటె సింధు నదీ మైదానంలో ఎందుకు ముందుగా జనావాసాలు ఏర్పడ్డాయి? **3.** క్రీ.పూ. 3వ, 2వ సహస్రాబ్దాల్లో సింధు మైదానంలో వర్గాలూ, రాజ్యాలూ ఉన్నాయా? మీ వాదనని నిరూపించండి. **4.** ఆర్యన్ సంచార జీవులు ఎందుకు ఒక చోటునుంచి మరొక చోటుకి పోతూవుండవలసివచ్చేది? ఆర్యుల మతాన్ని వాళ్ల కార్యకలాపాలు ఎలా ప్రభావితం చేశాయి? **5.** ప్రాచీన కాలపు భారతీయులు ఆర్థిక వ్యవస్థలో సాధించిన విజయాలు యేమిటి?

## §19. క్రీ.పూ. 1వ సహస్రాబ్ది నాటి భారత దేశంలో బానిస యాజమాన్య రాజ్యాల ఆవిర్భావం, అభివృద్ధి

(మాప్ 3)

ప్రాచీన ఈజిప్టులో బానిసల్ని ఏమనేవారో జ్ఞాపకం చేసుకోండి (§7; 2); ప్రాచీన రాజ్యాల లక్షణాలు యేమిటి?

1. వర్గాలు తలెత్తడం.

భారత ప్రజల శ్రమ ద్వారా లాభపడిన వాళ్లు వాళ్ల రాజులు, పూజారులు, తదితర కులీనులు. వాళ్లకు ప్రాంతీయ సమాజాలు తమ పంటలోనూ, తమ పశువులలోనూ కొంత భాగం యివ్వవలసివుండేది. రైతులు మోటు నాగళ్లతో భూమి దున్నడం, వగైరా పనులు చేస్తూంటే ప్రభువులు రథాలమీద తిరిగేవాళ్లు, వేటాడుతూ గడిపేవాళ్లు, అదీ కాక పోతే, యిరుగుపొరుగువాళ్లతో యుద్ధాలు చేసేవాళ్లు.

ప్రభువులు ఖైదీలను బానిసలుగా మార్చుకునేవాళ్లు. బానిసని విదేశీయుడనీ, లేక శత్రువనీ పిలిచేవాళ్లు. నిగామానుల పర్యవేక్షణలో బానిసలు చేలు బాగుచేసి సాగుచేసేవాళ్లు, బానిస యజమాని యింట్లో చాకిరీచేసేవాళ్లు. ప్రభువులు బానిస యజమానులై, రైతులనూ, బానిసలనూ దోచుకునేవాళ్లు.

2. రాజ్య ఆవిర్భావం.

రైతుల్నీ, బానిసల్నీ విధేయులుగా ఉంచేందుకు రాజులు సుశిక్షిత సాయుధ సైనిక దళాలను ఏర్పాటుచేసుకునేవాళ్లు.

ఈ దళాలు స్థాయీ సైన్యాలుగా అభివృద్ధి చెందాయి. బానిసల నిగామానులు రక్షక భటులు అయారు.

రైతులనుండి ధాన్యమూ, పశువులూ వసూలుచేసే రాజ సేవకులు పన్ను వసూలుదార్లు, తీర్పుదారుల వంటి అధికారులయారు.

అంతకు ముందు ఎన్నుకోబడే రాజులు క్రమంగా వారసత్వపు రాజులయ్యారు. వాళ్ల పిల్లలు వాళ్ల అధికారానికి వారసులయారు.

ఈవిధంగా భరత దేశంలో క్రీ.పూ. 1వ సహస్రాబ్దిలో రాజులతో, సైనికులతో, రక్షక భటులతో, అధికారులతో కూడిన రాజ్యాలు యేర్పడ్డాయి.

తమ ఐశ్వర్యమూ, తమ ప్రాణాలూ రక్షించుకోడానికి రాజ్య వ్యవస్థ యెంత ముఖ్యమైందీ బానిస యజమానులు బాగా గుర్తించారు. వాళ్లు అన్న మాటలు యివి: "ధనవంతులను రక్షించడానికి రాజు లేకపోతే, వాళ్లకు మరణమూ, బాధలూ తప్పవు." తాము దోచుకునేవారిమీద తమ పెత్తనాన్ని పటిష్ఠం చేసుకునేందుకు మతాన్ని వినియోగించుకునేందుకు కూడా వాళ్లు ప్రయత్నించారు.

### 3. కుల విభజన.

బ్రహ్మ అనే దేవుడు ప్రపంచాన్నీ, ప్రపంచంలోని మనుషులనూ సృష్టించాడని భారతీయులు విశ్వసించారు. అందుకే భారత దేశంలోని పూజారులను బ్రాహ్మణులు అనేవాళ్లు.

దేవుడు తన దేహంలోని వివిధ భాగాలనుండి మానవులను సృష్టించాడని బ్రాహ్మణులు బోధించారు. బ్రాహ్మణులు దేవుని నోటినుండి పుట్టారు. అందువలన వాళ్లకు దేవుడి తరఫున మాట్లాడే అర్హత కలిగింది. యుద్ధంచేసేవాళ్లు (క్షత్రియులు) బ్రహ్మ చేతులనుండి సృష్టింపబడ్డారు. రైతులూ, చేతిపనివాళ్ళూ బ్రహ్మ తొడలనుండి ఉత్పత్తి ఐనారు. సేవకులు — అనగా, శూద్రులు — మలినమైన పాదాలనుండి పుట్టారు. ఈ రీతిగా దేవుడే మానవులను కులాలుగా విభజించాడని — అనగా, వేరువేరు బాధ్యతలూ, వేరువేరు వృత్తులూ గల వాళ్లుగా విభజించాడని — బ్రాహ్మణులు బోధించారు. ఒక మనిషి యే కులంలో పుట్టాడో ఆ కులంలోనే అతడు జీవితమంతా వుండాలి. అతని సంతానం కూడా ఆ కులమే. బ్రాహ్మణుని కుమారుడు పుట్టుకతోనే బ్రాహ్మణుడు; శూద్రుని కుమారుడు పుట్టుకతోనే శూద్రుడు.

శూద్రుల జీవితం కష్టంగా వుండేది. కాని అంటరానివాళ్ల జీవితం యింకా కష్టంగా, యింకా అవమానకరంగా వుండేది. వాళ్లు ముఖ్య కులాలలో దేనికీ చెందరు. వాళ్లను ముట్టుకుంటేనే మనుషులు అపవిత్రులౌతారు. అంటరాని వాళ్లకు పుట్టిన సంతానం పుట్టుకతోనే అపరిశుద్ధులు. అంటరానివాళ్లు చచ్చిన జంతువుల చర్మాలు తీయడం, కక్కసులు వూడవడం లాంటి మిక్కిలి రోత పనులు చేయవలసివుండేది.

వేరువేరు కులాల ప్రజలు యేమి చేయవలసిందీ, యెలా ప్రవర్తించవలసిందీ దేవుడు నియమాలు చేశాడని కూడా చెప్పబడింది. నియమాలు పాటింపబడేలా చూసేందుకూ, పూజారుల, బానిస యజమానుల పెత్తనాన్ని కాపాడేందుకూ దేవుడు రాజునీ, సైనికులనీ కూడా సృష్టించాడని బ్రాహ్మణులు చెప్పారు. ఈ నియమాలను అతిక్రమించినవాళ్లు క్రూరంగా శిక్షింపబడ్డారు.

రాజ్యం మతాన్ని సమర్థించగా, మతం బానిస యాజమాన్య రాజ్యాన్ని సమర్థించింది.

### 4. మౌర్య సామ్రాజ్యం కింద ఐక్యమైన భారత దేశం.

తొట్టతొలి రాజ్యాలు సారవంతమైన గంగా నదీ మైదానంలో తలెత్తాయి. అటు తర్వాత భారత దేశంలోని యితర ప్రాంతాల్లో రాజ్యాలు ఏర్పడ్డాయి. మొదట్లో అవి చిన్నగా వుండేవి. ఒక్క ఉత్తర భారత దేశంలోనే కొన్ని డజన్ల రాజ్యాలు ఉండేవి.

ఈ రాజ్యాల మధ్య భూమికోసం, బానిసలకోసం, తదితర కొల్లసొమ్ములకోసం నిరంతరాయమైన వినాశకరమైన యుద్ధాలు జరుగుతూండేవి. కొన్ని రాజ్యాలు నశించగా మరికొన్ని రాజ్యాలు ఉచ్చస్థితికి చేరుకున్నాయి.

మగధ రాజ్యం క్రీ.పూ. 6వ శతాబ్దిలో బలపడసాగింది. మగధ రాజులు గంగా నదీ మైదానంలోనూ, దానికి అను

కొని వున్న యితర దేశాల్లోనూ గణనీయమైన భాగాన్ని ఆక్రమించుకోవడంలో విజయం సాధించారు. మగధ సామ్రాజ్యపు రాజధాని పాటలీపుత్రం. అదే యీనాటి పాట్నా నగరం.

క్రీ.పూ. 4వ శతాబ్దిలో మగధ సామ్రాజ్యాన్ని మౌర్య రాజులు పాలించనారంభించారు. అప్పటినుంచి మగధ రాజ్యపు దండయాత్రలు మరింత విజయవంతంగా సాగాయి. ఒక ప్రాచీన రచయిత కథనం ప్రకారం, మౌర్యులకి బ్రహ్మాండమైన సైన్యం వుండేది. వాళ్ల సైన్యం పెద్ద విల్లులు, ఖడ్గాలు, కవచాలు కలిగిన 6,00,000 మంది పదాతి సైనికులతో, 30,000 మంది ఆశ్విక సైనికులతో, 9,000 యుద్ధపు ఏనుగులతో కూడివుండేది.

క్రీ.పూ. 3వ శతాబ్దిలో మౌర్య వంశపు రాజుల్లో మూడవవాడైన అశోకుడి కాలంలో ఆ సామ్రాజ్యం అత్యున్నత స్థితికి చేరుకుంది. దక్కన్ పీఠభూమి దక్షిణ ప్రాంతం తప్ప దాదాపు భారత దేశం అంతా అశోకుడి పాలనలోకి వచ్చింది.

అయితే, బృహత్తరమైన మౌర్య సామ్రాజ్యానికి స్థిరత్వం లేకపోయింది. అశోకుడి పాలన ముగిశాక అది విచ్ఛిన్నం కాసాగింది. క్రీ.పూ. 2వ శతాబ్ది మొదట్లో కొన్ని స్వతంత్ర రాజ్యాలుగా అది చీలిపోయింది. మరో 500 ఏళ్ల తర్వాత ఒక పెద్ద సామ్రాజ్యం స్థాపించబడినప్పటికీ, అది అశోకుడి సామ్రాజ్యంతో పోలిస్తే చాలా చిన్నది.

మౌర్య సామ్రాజ్య అవతరణ, భారత దేశంలో అంతః కలహాలకు స్వస్తి జరగడం సాంస్కృతిక ప్రగతికీ, యితర దేశాలతో సంబంధాలకీ దోహదంచేసిన ముఖ్యాంశాలు.

## కొన్ని బ్రాహ్మణ నియమాలు

భగవంతుని శరీరంలోని ఉత్తమాంగంనుండి బ్రాహ్మణులు సృష్టి అయారు. కనుక వాళ్లు ప్రపంచానికి అధిపతులు. బ్రాహ్మణులకు ప్రీతికరమైంది సంకోచం లేకుండా యివ్వాలి.

భగవంతుడు శూద్రులకు ఒకే ధర్మం విధించాడు. ఉన్నత కులాలకు నమ్రతతో సేవ చేయడమే ఆ ధర్మం. బ్రాహ్మణుడు లేకపోతే క్షత్రియుడు వర్ధిల్లడు, క్షత్రియుడు లేకపోతే బ్రాహ్మణుడు వర్ధిల్లడు.

భగవంతుడు రాజునూ, క్షత్రియులనూ ప్రపంచాన్ని రక్షించడానికి సృష్టించాడు.

శూద్రుడు పైవాళ్లను గురించి అవమానకరంగా మాట్లాడితే, వాని నోట్లో కాలే యినప కడ్డీ గుచ్చాలి. బ్రాహ్మణునికి యెదురు చెప్పిన శూద్రుని నోట్లోనూ, చెవుల్లోనూ రాజు సలసల కాగే నూనె పోయించాలి.

బ్రాహ్మణునికి మరణదండన లేదు; దానికి బదులు అతనికి శిరో ముండనం చెయ్యాలి.

? 1. ప్రాచీన కాలపు భారత దేశంలో రాజ్యం ఎందుకు అవతరించింది? 2. భారత దేశంలో కులాలు ఎందుకు ఏర్పడ్డాయి? ఆదిమ సమష్టి వ్యవస్థలో కులాలు ఏర్పడే అవకాశం ఉందా? మీ వాదనని నిరూపించండి.

# §20. ప్రాచీన భారత దేశంలో సంస్కృతి

(మాప్ 3)

ప్రాచీన కాలాల్లో ఈజిప్టులోనూ, ఆసియా మైనర్‌లోనూ విలసిల్లిన శాస్త్రీయ విజ్ఞానాన్ని గురించి జ్ఞాపకం చేసుకోండి (§ 12, § 17).

**1. ప్రాచీన కాలపు భారత దేశంలో పాటలీపుత్రం, తదితర నగరాలు.**

భారతీయ నగరాలు క్రీ.పూ. 1వ సహస్రాబ్ది మధ్యనుంచి వేగంగా పెరగనారంభించాయి. వాటిలోకెల్ల మిక్కిలి పెద్ద నగరం పాటలీపుత్రం. అది గంగా నది తీరాన కొన్ని కిలోమీటర్ల పొడవున విస్తరించి వుంది. పాటలీపుత్రం చుట్టూ లోతైన కందకం, 64 ద్వారాలతో కూడిన దుర్గప్రాకారం ఉన్నాయి.

నగరం మధ్య రాజభవనం వుంది. అది స్తంభాలతో, నగిషీ పనితో, విగ్రహాలతో అలంకరింపబడింది.

నగరాల్లో చాలామటుకు ప్లాను ప్రకారం నిర్మింపబడ్డాయి. వాటిలో తిన్నని రాజవీధులు ఉన్నాయి. నగరాల్లో చేతి వృత్తులు వేగంగా అభివృద్ధి చెందాయి. నగరంలోని కొన్ని పేటలకి పేటలు ఏనుగు దంతంమీద, రాతిమీద, కొయ్యమీద నగిషీపని చేసేవాళ్ల, సాలీలు, కమ్మర్లు, కుమ్మర్లు, తదితర చేతివృత్తులవాళ్ల కార్ఖానాలతో నిండివున్నాయి. చేతి వృత్తులవాళ్లకి రాజ పోషణ వుండేది, పన్ను మినహాయింపు వుండేది.

పాటలీపుత్రంనుంచి భారత దేశంలోని యితర నగరాలకీ, విదేశాలకీ విశాలమైన రాతిపరుపు రోడ్లు వుండేవి. రోడ్ల వెంబడి వరుసవారీ మజిలీల్లో బావులు తవ్వించబడేవి.

పాటలీపుత్రం, తదితర భారతీయ నగరాలూ విద్యా, వైద్య కేంద్రాలుగా ఉండేవి.

**2. విద్య, లిపి, గణితశాస్త్రం.**

వ్యవసాయం, చేతివృత్తులూ అభివృద్ధిచెంది, రాజ్యం ఆవిర్భవించడంతో విస్మరింపబడిన క్రీ.పూ. 3వ, 2వ సహస్రాబ్ది నాటి లిపి స్థానంలో భారత దేశంలో కొత్త లిపి అవతరించింది. భారతీయులు తమ లిపిని ఫొనీషియన్ లిపి ప్రాతిపదికమీద రూపొందించుకున్నారు. కొన్ని అక్షరాలు శబ్దాలను సూచించగా, మరికొన్ని మొత్తం అక్షరాలను సూచిస్తాయి. భారతీయులు ఎండిన తాళ పత్రాలను (తాటి ఆకుల్ని) కత్తిరించి, వాటిని కాగితాలుగా వాడేవారు.

నగరాల్లోని భవనాల, పేటల రేఖీయ ఆకారాలు, వంకర్లు లేకుండా తిన్నగా వున్న కాల్వలు భారతీయులకు రేఖాగణితం చాలా బాగా తెలుసునన్న విషయాన్ని నిరూపిస్తున్నాయి.

భారతీయులు గణితశాస్త్రంలోకి <u>సున్నని</u> ప్రవేశపెట్టారు. పది అంకెల సాయంతో లెక్కపెట్టే సులభమైన, సౌకర్యమైన పద్ధతిని ప్రాచీన భారతీయులు సృష్టించారు. ఈ పద్ధతినే ఈనాడు దాదాపు యావత్తు ప్రపంచమూ వుపయోగిస్తున్నది. ఈ అంకెలు అరబ్బుల ద్వారా యూరప్‌కు చేరాయి. అందువలన అరబిక్ అంకెలంటారు. కాని అరబ్బులు మాత్రం వీటిని భారతీయ అంకెలనే అన్నారు.

నగరాల్లోని పాఠశాలల్లో ప్రాథమిక విద్య, వ్యాకరణం, గణితశాస్త్రం, సాహిత్యం, మొదలైన పాఠ్యాంశాలు బోధించేవాళ్లు. అయితే జనంలో కుల విభజన విద్యా వ్యాప్తికి గణనీయమైన ఆటంకంగా వుండేది. బ్రాహ్మణుల్లోనూ, క్షత్రియుల్లోనూ చాలామంది విద్యావంతులు ఉండేవాళ్లు. అయితే, పాఠశాలల్లో శూద్రులకీ, అంటరానివాళ్లకీ ప్రవేశార్హత వుండేది కాదు. అంటరానివాళ్లు నగరాల్లో జీవించేందుకు సైతం అనుమతింపబడేవాళ్లు కారు.

**3. వైద్యం.** ఒక్క పాటలీపుత్రంలోనే కాకుండా, భారత దేశంలోని యితర నగరాల్లో కూడా ఆస్పత్రులు, వైద్య పాఠశాలలు ఉండేవి. భవిష్యత్తులో వైద్యులు కాబోయేవాళ్ళు ఏడేళ్లపాటు వైద్య విద్యాభ్యాసం చేసేవాళ్ళు. ప్రాచీన కాలపు భారతీయ వైద్యులకి శస్త్రవైద్యం తెలుసు. వాళ్ల దగ్గర మంచి ఔషధాలు వుండేవి. వాటిలో కొన్ని యితర దేశాలకు సరఫరాచెయ్యబడేవి. అయితే, భారతీయ వైద్యంలో ప్రాచీన కాలపు కర్మకాండ నిలిచివుంది. అప్పట్లో మంత్రగాళ్లూ, భూతవైద్యులూ మంత్రోచ్చాటన ద్వారా రోగులకు వ్యాధులు కుదిర్చేందుకు ప్రయత్నించేవాళ్ళు. మంత్రోచ్చాటన దయ్యాలను పారదోలుతుందని వాళ్ళు విశ్వసించేవాళ్ళు. సరిగా రోగనిదానం చేసి మందులు వాడుతూ లేక శస్త్ర చికిత్స చేస్తూ కూడా భారతీయ వైద్యులు రోగాలు కుదిర్చేందుకు మంత్రాలు చదివేవాళ్ళు.

**4. సాహిత్యం.** భారత దేశంలో లిపి ఆవిర్భావంతో శతాబ్దాల తరబడి ఒక తరంనుంచి మరో తరానికి ముఖతః అందజెయ్యబడుతూ వచ్చిన ప్రాచీన గాథలనూ, పాటలనూ రాసిపెట్టడం సాధ్యమైంది. ''మహాభారతం,'' ''రామాయణం'' అనే రెండు మహా కావ్యాల రచనకు భారతీయ ప్రజలు కల్పించిన యీ గాథలూ, పాటలే ఆధారం.

''మహాభారతం'' అధికారంకోసం రెండు రాజ కుటుంబాల మధ్య జరిగిన వాస్తవ యుద్ధ ఘటనల ఆధారంగా రచింపబడింది. జానపద కవులు ఆ ఘటనలను వర్ణిస్తూ, వాటిని అభూత కాల్పనిక వివరాలతో విపులీకరించారు. (''మహాభారత'' సంగ్రహ కథ § 20 అనుబంధంలో యివ్వబడింది).

''రామాయణం'' అయోధ్య రాజు రాముని వీర కృత్యాలను వర్ణించే మహాకావ్యం. రాముడి తండ్రి దశరథుడు అతన్ని వనవాసం పంపాడు. రాముడి ప్రియపత్ని సీతను లంకాధిపతి అయిన రావణాసురుడు ఎత్తుకుపోయాడు. రాముడు వానర, భల్లూక సేనని కూడగట్టుకొని, శ్రీలంకమీదకి దండెత్తి, యుద్ధంలో రావణుని సంహరించి, సీతను విడిపించి, అయోధ్యకి తిరిగి తెచ్చుకున్నాడు.

పాటలతోబాటు ప్రాచీన భారతీయ ప్రజలు అనేక గాథలూ, నీతికథలూ, సాహిత్యపరమైన మరెన్నో కృతులూ కూర్చారు. ప్రాచీన భారతీయ కథలు దురాశనూ, తెలివి తక్కువనూ, ముఖస్తుతినీ అపహాస్యం చేశాయి. ఒక కథలో ఒక కాకి నోట ఆహారం కరుచుకొని చెట్టుమీద కూర్చొని వుంటుంది. జిత్తులమారి ఐన ఒక గుంట నక్క కాకి కంఠాన్ని పొగుడుతుంది. తెలివితక్కువ కాకి నోరు తెరచి కావు కావు మని పాట పాడుతుంది. ఆహారం కింద పడిపోతుంది. నక్కదాన్ని ఎత్తుకుపోతుంది. ఈ నీతికథా, యిలాంటి యింకెన్నో నీతి కథలూ రష్యాతో సహా యితర దేశాల్లో నీతికథలకి ప్రాతిపదిక అయాయి.

ప్రాచీన కాలపు భారతీయుల పలు నమ్మకాలు సాహిత్యంలో ప్రతిబింబితమయ్యాయి. అయితే, దేవుడిలో, ఆత్మలో, మంత్రాల్లో విశ్వాసం లేనివారి అభిప్రాయాలను కూడా ప్రాచీన భారతీయ సాహిత్యం ప్రతిబింబించింది. వాళ్ళు ''దేవుడు లేడు, దేవుడి గురించి చెప్పేవాళ్లు అబద్ధాలకోర్లు'' అని నిర్భయంగా చాటిచెప్పారు.

**5. శిల్పం, వాస్తుకళ.** ప్రాచీన భారతీయ లిపి విస్మరింపబడిన మాదిరిగానే ప్రాచీన నగరాలు పరిత్యజింపబడిన దరిమిలా దేశంలో రాతి కట్టడం కూడా చాలా కాలం నిలిచిపోయింది. కలప యిళ్లూ, విగ్రహాలూ మన కాలందాకా నిలవలేకపోయాయి. భారత దేశంలో ఒక పెద్ద రాజ్యం ఏర్పడ్డాక క్రీ.పూ. 4వ శతాబ్దిలో మాత్రమే రాతి కట్టడం తిరిగి మొదలైంది. ప్రత్యేకించి అశోక చక్రవర్తి కాలంలో అనేక భవనాలూ, శిలాస్తంభాలూ, విగ్రహాలూ నిర్మింపబడ్డాయి.

అశోకుడి ఆజ్ఞల మేరకు క్రీ.పూ. 3వ శతాబ్దిలో నిర్మింపబడిన ఎత్తైన శిలాస్తంభాలు ఆనాటి భారతీయ సామ్రాజ్య మహత్తర శక్తికి స్మారక చిహ్నాలు. అవన్నీ ఏక శిలాస్తంభాలు. వాటిలో ఒకదాని పైభాగాన నాలుగు రాతి సింహాలు వున్నాయి.



1. క్రీ.పూ. 1వ శతాబ్ది నాటి ఒక భారతీయ దేవాలయం లోపలి దృశ్యం. 2. క్రీ.పూ. 3వ శతాబ్ది నాటి నాలుగు సింహాలు చెక్కబడిన రాతి స్తంభపు పై భాగం. ఈనాడు యిది భారత రిపబ్లిక్ రాజ చిహ్నం. 3. క్రీ.పూ. 1వ శతాబ్ది నాటి సాంచీ ద్వారాల్లో ఒకటి. ఈ శిలా ద్వారం మీద రకరకాల అలంకారాలు, వివిధ మానవ జంతు, వృక్ష ఆకృతులు చెక్కబడ్డాయి





రాజ్యపు నాలుగు సరిహద్దులనూ కాపలా కాస్తున్నట్లు ఆ సింహాలు నాలుగు దిక్కులకీ చూస్తూవుంటాయి.

క్రీ.పూ. 1వ శతాబ్దిలో సాంచీలో నిర్మింపబడిన స్మారక శిలాద్వారం ఒక అపూర్వ కళాఖండం. శిల్పులు ఆ ద్వారంమీద రకరకాల జంతువుల్నీ, పక్షుల్నీ, లతల్నీ, పౌరాణిక వీరులనీ, దేవాలయ ద్వారపాలికల్నీ చెక్కారు.

ప్రాచీన కాలపు భారత దేశంలోని కొన్ని దేవాలయాలు కొండ గుహల్లో దొలచబడ్డాయి. ఈమాదిరి ఒక దేవాలయ (క్రీ.పూ. 1వ శతాబ్దం) స్తంభాలు అద్దంలా తళతళలాడేలా నునుపు చేశారు. అలాంటి దేవాలయాల్లోకి ముందు భాగంలో దొలచబడిన గవాక్షాల ద్వారా మాత్రమే వెల్తురు వస్తుంది. గుహలో చెక్కబడిన మానవ, పశు విగ్రహాలు చిరుచీకట్లో కొట్టవచ్చినట్లు కనిపిస్తాయి.

భారత దేశం చదరంగానికి పుట్టినిల్లు. దంతపు చదరంగం పావులు ప్రాచీన భారతీయ సైన్యానికి ప్రతినిధులు. ముందుండే భటులు కాల్బలంనుండి పుట్టినవి. మధ్యలో రాజు, సైన్యాధిపతి వుంటారు. పక్కల యేనుగులు, గుర్రాలు, శకటులు వుంటాయి. ప్రాచీన భారత దేశంలో చదరంగాన్ని "చతురంగ బలం" అనేవారు.

6. ప్రాచీన కాలంలో ఇతర దేశాలతో భారత దేశపు సంబంధాలు.

ఇతర దేశాలతో క్రీ.పూ. 3వ, 2వ సహస్రాబ్దాల్లో ప్రారంభమైన భారత దేశపు సంబంధాలు సింధు నాగరికత క్షీణించిన అనంతరం సడలిపోయాయి. ఆ సంబంధాలు భారత దేశంలో వ్యవసాయం, పశుపాలన, విద్య, చేతివృత్తులు పుంజుకొని, పెద్ద రాజ్యాలు నెలకొన్నాక మరల విస్తరించాయి. ఓడరేవులనుంచి పశ్చిమాన మెసొపొటేమియా, ఈజిప్టులకీ, తూర్పున ఆగ్నేయాసియా, శ్రీలంక, చైనాలకీ ఓడలు పయనించాయి. వాయవ్యాన పర్వత కనుమల గుండా సరుకులతో ఒంటెల బిడారులు మధ్యాసియాకీ, మధ్యధరా సముద్ర తీర దేశాలకీ రాకపోకలు సాగించాయి. యూరప్‌లో సైతం భారత దేశంనుంచి వచ్చే సన్న వస్త్రాలకీ, రత్నాలకీ, దంతానికీ, తదితర విలాస వస్తువులకీ విశేషమైన విలువ వుండేది. భారత దేశానికి వర్తకులే కాకుండా దూతలు, పండితులు, యాత్రికులు వస్తూండేవాళ్లు. భారత దేశం యితర దేశాలకి తన దూతల్ని పంపుతూండేది.

ప్రాచీన కాలంలో ఆగ్నేయాసియా దేశాలకీ, భారత దేశానికీ మధ్య ప్రత్యేకమైన సన్నిహిత సంబంధాలు వుండేవి. భారతీయులు ఇండోచైనా, ఇండొనేషియా వాసులతో వర్తకం చెయ్యడమే కాకుండా ఆ దేశాల్లో స్థిరపడ్డారు కూడా. భారత దేశంనుంచి వచ్చిన భారతీయులు స్థానిక రాజుల ఆస్థానాల్లో తరచు కొలువుచేస్తూ, ఉన్నత పదవులు ఆక్రమించే వాళ్లు. భారత దేశంతో సంబంధాలు ఆగ్నేయాసియా దేశాల్లో సంస్కృతి, లిపి, కళలు, శాస్త్రీయ జ్ఞానం అభివృద్ధి చెందేందుకు విశేషంగా దోహదంచేశాయి.

స్వీయ సంస్కృతిని సృష్టించుకున్న భారతీయులు ప్రాచీన కాలంలో పురోగతి సాధించిన యితర ప్రజలనుంచి విశేషంగా లబ్ధిపొందారు. తాము సృజించినవాటిలో అధికాంశాన్ని యిరుగుపొరుగు దేశాలకీ, దూర దేశాలకీ అందజెయ్యడం ద్వారా భారతీయులు ప్రాచీన ప్రపంచ సంస్కృతికి విశేషంగా దోహదంచేశారు.

## ప్రాచీన భారతీయ మహాకావ్యం "మహాభారతం" (సంక్షిప్త కథ)

ఈ కావ్యం ఏ సామాజిక వ్యవస్థలో సృజింపబడింది? మీ సమాధానానికి రుజువులు చూపండి.

ఈ కావ్యం పరస్పర బంధుత్వం గల రెండు రాజ కుటుంబాలు అధికారంకోసం చేసిన పోరాటాన్ని వర్ణిస్తుంది. పాండవులు ఐదుగురు సోదరులు. వాళ్ల తండ్రి చిన్నప్పుడే మరణించాడు. వాళ్లను వాళ్ల పెద్ద తండ్రీ, దాయాదులూ స్వదేశంనుండి తరిమేశారు. పాండవులు పెరిగి మహా బలవంతులైన వీరులయారు. ఒక పొరుగు దేశపు రాజు మత్స్య యంత్రాన్ని బాణంతో కొట్టినవానికి తన కూతురు నిస్తానని ప్రకటించాడు. తమ తమ నైపుణ్యం నిరూపించడానికి భారత దేశం నలుమూలలనుండీ యువకులు వచ్చారు. పాండవ సోదరులలో ఒకడు మత్స్య యంత్రాన్ని కొట్టి, రాజకుమారిని పెండ్లిచేసుకున్నాడు.

పాండవులకు తమ రాజ్య భాగం వచ్చింది. వాళ్లలో పెద్దవాడు జూదంలో రాజ్యమంతా ఓడి, తన స్వేచ్ఛనూ, తమ్ముల స్వేచ్ఛనూ, భార్య స్వేచ్ఛనూ కూడా ఓడిపోయాడు. వాళ్లందరూ బానిసలయారు. తరువాత పాండవులకు స్వేచ్ఛ లభించింది గానీ, శాంతియుత పద్ధతుల ద్వారా వాళ్లు తమ రాజ్యం సంపాదించుకోలేకపోయారు. పాండవులకూ, వాళ్ల దాయాదులకూ జీవన్మరణ యుద్ధం జరిగింది. వాళ్ల ప్రధాన శత్రువు యిలా అన్నాడు: "నేను వాళ్లను జయించి ప్రపంచ మంతటినీ పరిపాలిస్తాను. లేదా నా మరణం తర్వాత వాళ్ళు పరిపాలిస్తారు." కొన్ని తెగలు పాండవులకు తోడ్పడ్డాయి. వాళ్ల శత్రువులకు మరికొన్ని తోడ్పడ్డాయి. వాళ్ల మధ్య యుద్ధం 18 రోజులు సాగింది. యుద్ధ గతిని కన్నులకు కట్టినట్లు చిత్రించింది కావ్యం. బ్రహ్మాండమైన జన సమూహాలు, శత్రువును ఓడించాలన్న కోరిక తప్ప సర్వమూ మరిచి, యుద్ధం చేశాయి. బాణాలు బాణాలను ఢీకొన్నాయి. రథం రథంమీద తలపడింది. ఏనుగులు గర్జన్మేఘాల మాదిరి ఒకదాని నొకటి దంతాలతో చీల్చుకున్నాయి. ఆశ్వికులు ఆకాశంలో పక్షుల మాదిరి యుద్ధ రంగమంతా విహరించారు. బాణాలు సర్పాల మాదిరి బుసలు కొడుతూ గాలిలో దూసుకెళ్లాయి. యుద్ధ రంగమంతా శవాలతోనూ, క్షతగాత్రులతోనూ నిండింది. క్షతులు ఈ మారణకాండ ప్రారంభించినవాళ్లను శాపనార్థాలు పెట్టారు.

యుద్ధగతి ఒకోసారి వీళ్లకూ, ఒకోసారి వాళ్లకూ అనుకూలంగా సాగింది. చివరకు పాండవులు జయించారు. వాళ్ళు రాజులై సముద్ర తీరందాకా సమస్త దేశాన్నీ జయించారు.

? **1.** పాటలీపుత్ర నగరం గురించి మీకు తెలిసిందేమిటో చెప్పండి. **2.** క్రీ.పూ. 1వ సహస్రాబ్దిలో భారత దేశంలో నాగరికత అభివృద్ధికి దోహదంచేసిన అంశాలు ఏమిటి? **3.** క్రీ.పూ. 1వ సహస్రాబ్దిలోనూ, క్రీ.శ. 1వ సహస్రాబ్దిలోనూ సంస్కృతిని పెంపొందించడంలో భారతీయ ప్రజలు ఏయే విజయాలు సాధించారు? **4.** ప్రాచీన కాలంలో భారతీయ ప్రజలు కనిపెట్టిన ఏయే వస్తువులు యీనాటికీ ఉపయోగంలో వున్నాయి?

# §21. ప్రాచీన శ్రీలంక

1. శ్రీలంక ఉనికి.

శ్రీలంక భారత ఉపఖండపు దక్షిణ కొనకి సమీపంలో, దాదాపు భూమధ్య రేఖకి సమీపంలో వున్న ఒక పెద్ద ద్వీపం. హిందూ మహాసముద్రపు తూర్పు, పశ్చిమ జలమార్గాలు శ్రీలంకను తాకుతూ వెళ్తాయి. శ్రీలంక భారత దేశంనుంచి కొన్ని కిలోమీటర్ల వెడల్పు గల ఒక సన్నని జలసంధిచేత వేరుచెయ్యబడింది. ఆ జలసంధిలో అనేక చిన్న చిన్న ద్వీపాలూ, పగడపు చట్టులూ ఉన్నందున భారత ఉప

ఖండం, శ్రీలంకల మధ్య రాకపోకలు సులభతరమయ్యాయి. బహుశా యివి ఎప్పుడో సముద్రంలో కుంగిపోయిన పర్వత పంక్తులై వుండవచ్చు. ఈ దీవులకి సంబంధించిన ఒక ప్రాచీన గాథ ప్రకారం యివి భారత దేశంనుంచి శ్రీలంకకి దాటేందుకుగాను రాముడు తన వానర సేనతో నిర్మింపజేసిన సేతువు అవశేషాలు.

**2. శ్రీలంక ప్రకృతి.**

శ్రీలంక అంతటా ఉపరితలం, నేలలు, వర్షపాతం ఒకే మాదిరిగా లేవు. మధ్య భాగంలో పర్వతపంక్తి వుంది. దానికి నాలుగు పక్కలా మైదానాలు వున్నాయి. దీవి నైరుతి మూలలో వర్షపాతం ఎక్కువ. ఉత్తర, తూర్పు ప్రాంతాలు సాపేక్షంగా పొడిగా వుంటాయి. వర్షాలు అధికంగా పడిన తరుణాల్లో పర్వతాలనుంచి పరవళ్ళు తొక్కుతూ ప్రవహించే నదులు తమ వరదలతో పెద్ద ప్రాంతాలను ముంచెత్తుతాయి.

ప్రాచీన కాలంలో శ్రీలంక మెట్ట ప్రాంతాల్లో ముళ్ల పొదలూ, అడవులూ వుండేవి. వర్షపాతం ఎక్కువగా వుండే నైరుతి భాగం దట్టమైన అడవులతో నిండివుంది. అడవుల్లో పెరిగే చెట్లలో తాటి జాతి చెట్లకి ప్రజల జీవితంలో విశేషమైన ప్రాముఖ్యం వుంది.

శ్రీలంకలో అడవి ఏనుగులు, దున్నపోతులు, అనేక యితర జంతువులూ ఉండేవి.

**3. శ్రీలంక ప్రాచీన చారిత్రక వివరాలు.**

పురాతత్వవేత్తల పరిశోధనల ద్వారా శ్రీలంకలో రాతి యుగం నాటికే మానవులు నివసించేవాళ్లని తెలిసింది.

మనకు తెలిసిన శ్రీలంకలోని తొలి మానవులు వెద్దా తెగకి చెందినవాళ్లు. క్రీ.పూ. 6వ శతాబ్ది నాటికి వాళ్లింకా రాతి పనిముట్లనే వాడేవాళ్లు. వాళ్లకి వ్యవసాయం తెలుసు గాని, నీటిపారుదల పద్ధతులు యింకా తెలియవు. వెద్దాలు ఆదిమ సమష్టి వ్యవస్థలో నివసించేవాళ్లు. అయితే కులీనులు తలెత్తనారంభించారు. శ్రీలంకలో వేలాది వెద్దాలలో అనేక ప్రాచీన ఆచారాలు యీనాటికీ నిలిచివున్నాయి.

శ్రీలంక ప్రాచీన చరిత్రకి సంబంధించిన మౌలిక లిఖిత ఆధారాలు ప్రధాన ఐతిహాసిక కావ్యమైన "మహావంశం"లో లభిస్తాయి. "మహావంశ"పు ప్రథమ భాగం క్రీ.శ. 5వ – 6వ శతాబ్దాల్లో జానపద గాథలనుంచీ, ప్రాచీన లిఖిత మూలాధారాలనుంచీ సంకలితం చెయ్యబడింది.

"మహావంశం" కథనం ప్రకారం ఉత్తర భారత దేశంనుంచి క్రీ.పూ. 6వ – 5వ శతాబ్దాల్లో రాజకుమారుడు విజయుడి నాయకత్వాన వచ్చిన ఒక బృందం శ్రీలంకలో స్థిరపడింది. విజయుడు సింహళ తెగకి చెందినవాడు. అంచేత అతనితో వచ్చినవాళ్లని సింహళీయులు అని పిలిచేవారు. శ్రీలంక జనాభాలో యీనాడు సింహళీయులే అధిక సంఖ్యలో వున్నారు.

**4. ప్రాచీన కాలంలో శ్రీలంక ప్రజల కార్యకలాపాలు.**

సింహళీయులు మొదట్లో శ్రీలంక ఉత్తర భాగంలో స్థిరపడ్డారు. వాళ్లు క్రమంగా యితర ప్రాంతాలకు వ్యాపించారు. వ్యవసాయ, పశుపాలనలు సింహళీయుల ప్రధాన వృత్తులు. పర్వతాలనుంచి ప్రవహించే నదీ జలాలను వినియోగించుకొని, సింహళీయులు విస్తృతమైన నీటిపారుదల వ్యవస్థను నిర్మించుకున్నారు. వాళ్లు నదులనుంచి వేలకొలది కాల్వలు తవ్వి, వాననీటిని నిలవచేసేందుకు పెద్ద జలాశయాలు నిర్మించి, పొలాలకు నీటి సరఫరా ఏర్పాట్లు చేసుకున్నారు. క్రీ.శ. 4వ శతాబ్దిలో నిర్మింపబడ్డ బ్రహ్మాండమైన మిన్నేరీ జలాశయం, తదితర ప్రాచీన నీటిపారుదల నిర్మాణాలూ యీనాటికీ భద్రంగా పదిలపరచబడి వినియోగించుకోబడుతున్నాయి. నీటిపారుదల సౌకర్యాలు ఉన్న కారణంగా శ్రీలంకలో పుష్కలంగా నీరు కావలసిన వరిసాగు బాగా అభివృద్ధి చెందింది. దానికితోడు గోధుమ, బార్లీ, మొక్కజొన్న, పత్తి కూడా పండింపబడేవి.

సింహళీయులు దున్నపోతుల్ని, ఏనుగుల్ని, యితర జంతువుల్నీ మచ్చికచేసుకుని వాటిచేత పనులు చేయించుకునేవాళ్లు.

సింహళంలో ఇనుప పనిముట్లు తయారుచేసేందుకు అవసరమైన ఇనుప ఖనిజపు నిక్షేపాలు విశేషంగా వున్నాయి.

జలమార్గాల్లో మంచి అనువైన చోట ఉన్నందున దగ్గరి దేశాలతోనే గాక దూర దేశాలతో సైతం శ్రీలంక విదేశీ వర్తకం ఎన్నడో మొదలైంది. ముత్యాలను, రత్నాలు, మొదలైన విలువైన రాళ్లను, నూలువస్త్రాలను శ్రీలంక పశ్చిమ యూరప్‌కి సైతం ఎగుమతి చేసేది.

వృత్తులు, వర్తకం అభివృద్ధి చెందిన కారణంగా సింహళ ద్వీపంలో నగరాలు విలసిల్లాయి.

## 5. ప్రాచీన శ్రీలంకలో వర్గాలు, రాజ్యాలు.

వ్యవసాయ కార్యకలాపాల్లో ఎక్కువ భాగం రైతులు చేసేవాళ్లు. వాళ్లు ప్రాంతీయ సమూహాలుగా నివసించేవాళ్లు. అయితే, శ్రీలంకలో బానిసల సంఖ్య పెరిగింది. యుద్ధాల్లో ఖైదీలుగా పట్టుబడ్డ బానిసలు, రుణాలు తీర్చలేకపోయిన రుణగ్రస్థులు బానిసలుగా మార్చబడ్డారు. బానిసలు కాల్వలు, జలాశయాలు తవ్వేవాళ్లు, బానిస యజమానుల పొలాలు సాగుచేసేవాళ్లు, వాళ్లకి భవనాలు నిర్మించిపెట్టేవాళ్లు.

జనాభా బానిస యజమానులు, బానిసలు, సాముదాయిక రైతులు అనే వర్గాలుగా విడిపోవడం రాజ్య ఆవిర్భావానికి దారితీసింది. "మహావంశ" కథనం ప్రకారం శ్రీలంక ఉత్తర భాగంలో మొదటి రాజు విజయ. దరిమిలా యితర రాజ్యాలు తలెత్తాయి.

సాముదాయిక రైతులనుంచి పన్నులు వసూలుచెయ్యడం, తిరుగుబాట్లను అణచివేసేందుకూ, యిరుగుపొరుగు రాజ్యాలతో యుద్ధాలు సాగించేందుకూ బలమైన సైన్యాన్ని పోషించడం, నీటిపారుదల సౌకర్యాలను వ్యవస్థీకరించడం — యివీ రాజ్యపు ప్రధాన బాధ్యతలు. నీటిపారుదల సౌకర్యాల మూలంగా రాజులకు సాగుకు లాయకైన భూమి లభించేది. ఆ భూమిని రాజులు కులీనులకీ, సైనికులకీ, అధికారులకీ వారువారు చేసిన సేవలకు బహుమానంగా మాన్యాలకింద యిచ్చేవాళ్లు.

భారత దేశపు ఆదివాసులకు చెందిన తమిళ తెగలు దక్షిణ భారత దేశంనుంచి సముద్రం దాటి శ్రీలంకకి చేరుకున్నారు. కొన్ని పర్యాయాలు ఈ యాత్రలు శాంతియుతంగా సాగేవి, మరికొన్ని సందర్భాల్లో అవి విశేషమైన రక్తపాతానికి దారితీసిన సాయుధ దండయాత్రలుగా ఉండేవి.

క్రీ.పూ. 2వ శతాబ్దిలో తమిళ రాజు అనూరాధపురం రాజధానిగా గల శ్రీలంక ఉత్తర ప్రాంతాన్ని ఆక్రమించుకోవడంలో విజయం సాధించాడు. అతను ఆ ప్రాంతాన్ని నలభై సంవత్సరాలు పాలించాడు. క్రీ.పూ. 1వ శతాబ్ది చివర దక్షిణ శ్రీలంక రాజైన దుతెగేమెను తమిళ రాజును పారదోలి, మొత్తం ద్వీపాన్ని ఏకంచేసి తన పాలనలోకి తెచ్చుకున్నాడు. అప్పుడు ఏర్పడిన బలమైన రాజ్యం కొన్ని శతాబ్దాలపాటు కొనసాగింది.

## 6. సింహళీయుల ప్రాచీన సంస్కృతి.

సింహళ రాజ్య సుస్థిరత్వం యితోధికమైన సాంస్కృతికాభివృద్ధికి దోహదంచేసింది. సింహళీయులు మొదట భారతీయ లిపులను వాడారు కాని, దరిమిలా తమ సొంత లిపిని సృష్టించుకున్నారు. వాళ్లు జాగ్రత్తగా తయారుచేసుకున్న తాళపత్రాలను కాగితంగా వాడేవాళ్లు.

పైన పేర్కొనబడిన "మహావంశం" సింహళీయుల ప్రాచీన మహాకావ్యం. దానికితోడు సింహళీయులు ఎన్నో పాటలను, నీతికథలను, గీతాలను రచించారు. సింహళీయుల నాటక రంగమూ, జానపద నాట్యాలూ బాగా ప్రాచీనమైనవి.

ఒక చైనీజ్ బౌద్ధ యాత్రికుడి యాత్రా వర్ణనల్లో శ్రీలంక ప్రాచీన రాజధాని అయిన అనూరాధపుర వర్ణన మనకి లభిస్తుంది. ఈ వర్ణన క్రీ.శ. 7వ శతాబ్ది నాటిది. అయితే ఆ నగరం అంతకు చాలా కాలం క్రితమే నిర్మింపబడింది. తిన్నగా వుండే అనూరాధపురం వీధులు ఆ నగరాన్ని పేటలుగా విభజిస్తాయి. దానిలో ఎన్నో రెండు అంతస్తుల భవనాలు వున్నాయి. ఆ యాత్రికుడు యింకా యిలా వర్ణించాడు: "దేవాలయాల, భవనాల స్వర్ణ శిఖరాలు ఆకాశంలో ఎత్తున

మిలమిలా మెరుస్తూ వుంటాయి. వీధుల పైగా కమాను వంతెనలు ఉన్నాయి... అక్కడక్కడ పెద్ద పెద్ద పూల కుండీలు ఉన్నాయి. గోడ గూళ్లలో జ్యోతులు పట్టుకు నిలబడ్డ విగ్రహాలు ఉన్నాయి.''

ఈనాటికీ పదిలంగా వున్న ప్రాచీన స్మారక కళాఖండాలు ప్రాచీన సింహళ వాస్తుకళని గురించిన వర్ణనల్లోని సత్యాన్ని నిరూపిస్తున్నాయి. రువాన్‌వెల్లి దేవాలయ గోపురం కొన్ని డజన్ల కిలోమీటర్ల దూరానికి సైతం కానవచ్చేటంత ఎత్తుగా వుంటుంది. ఆ గోపుర నిర్మాణం సింహళ రాజు దుతెగేమెను పాలన కాలంలో మొదలైంది. దాని క్రమబద్ధమైన, అందమైన ఆకృతులు దాని నిర్మాతల కళాత్మక అభిరుచినే కాక, వాళ్ల గణితశాస్త్ర పరిజ్ఞానాన్ని కూడా తెలియజేస్తాయి. సిగిరియా కుడ్య చిత్రాలు సజీవంగా, సుందరంగా ఉంటాయి.

ప్రాచీన కళాఖండాలు యిప్పుడు జాగ్రత్తగా పరిరక్షింపబడుతూ, పాక్షికంగా పునరుద్ధరింపబడుతూవున్నాయి.

? **1.** శ్రీలంక ద్వీపపు ప్రాచీన చరిత్రను తెలుసుకునేందుకు మూలాధారాలు యేమిటి? **2.** శ్రీలంక ప్రాకృతిక పరిస్థితులు దేశవాసుల్లో ఏయే వృత్తులు పెంపొందేందుకు దోహదంచేశాయి? **3.** ప్రాచీన కాలపు శ్రీలంక జనాభా ఏయే జాతులతో కూడివుండేది? **4.** శ్రీలంకలో రాజ్యాలు యేవిధంగా ఆవిర్భవించాయి? శ్రీలంక చరిత్రలో అవి వహించిన పాత్ర యేమిటి?

# ప్రకరణం ఆరు

# ప్రాచీన చైనా

## §22. చైనా రాజ్యం ఏర్పడడం

(మాప్ 3)

1. చైనా ప్రకృతి. చైనాలో తూర్పు భాగమంతా పెద్ద మైదానం. అది సముద్ర తీరందాకా వుంది. చైనా పశ్చిమ భాగంలో పీఠభూములు, పర్వత పంక్తులు వున్నాయి.

సముద్ర తీరంలో చైనాలో వర్షాలు ఎక్కువ. పడమటికి పోయేకొద్దీ వర్షాలు తక్కువ. తీవ్రమైన అనావృష్టి రావడం సాధారణ విషయం.

హ్వాంగ్‌హో, యాంగ్‌జీ అనే రెండు పెద్ద నదులు మైదానం గుండా ప్రవహిస్తున్నాయి. హ్వాంగ్‌హో ఒడ్డులు ఒండ్రు మట్టితో కూడివుంటాయి. పచ్చటి సన్న యిసుక కూరినట్లుండే ఈ ఒండ్రుమట్టిని తవ్వుగోలలతోనూ, నాగళ్లతోనూ తేలికగా దున్నవచ్చు. తగినంత నీరు వుంటే యీ ఒండ్రుమట్టి చాలా సారవంతమైనది.

వర్షా కాలంలో హ్వాంగ్‌హో నదికి వరదలు వస్తాయి, ఆ వరదలు కొన్ని వందల కిలోమీటర్ల ప్రాంతాన్ని ముంచెత్తుతాయి. హ్వాంగ్‌హో ఒడ్డులలోని ఒండ్రుమట్టి సులభంగా కొట్టుకపోతుంది. అందువల్ల నది ఒడ్డులు తరుచుగా వరదలలో ధ్వంసమౌతాయి. నదీ ప్రవాహం యెన్నో సార్లు మారింది. వరదల తర్వాత అది పూర్తిగా కొత్త దిశలో ప్రవహించింది, గ్రామాలకి గ్రామాలు ఆ నదీ గర్భంలో మునిగిపోయాయి. చైనీయులు ఆ నదిని "సంచార నది," "చైనా పీడ" "వేయి బాధల నది" అనీ పిలుస్తూంటారు.

ప్రాచీన కాలంలో సారవంతమైన యాంగ్‌జీ నదీ తీరాలు అడవులతో నిండి వుండేవి.

2. క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో హ్వాంగ్‌హో మైదానం. హ్వాంగ్‌హో నదీ తీరపు మధ్య భాగాల్లో వ్యవసాయదారులు స్థిరపడ్డారు. జొన్న, గోధుమ, వరి, కూరగాయలు పండించేవాళ్లు, పశువులను పెంచేవాళ్లు. వాళ్లు పట్టుపురుగుల్ని పెంచి సిల్కు దారంతో వల్చని గట్టి వస్త్రాలు తయారు చేసేవాళ్లు.

పురాతత్వ శాస్త్రజ్ఞులు హ్వాంగ్‌హో నదీ తీరాలలో అనేక సమాధులు కనుగొన్నారు. సమాధులు క్రీ.పూ. రెండవ సహస్రాబ్దివి. కొన్ని సమాధుల్లో చాపలు చుట్టిన శవాలూ, అన్నం కుండలూ మాత్రం వున్నాయి. మరి కొన్ని మాధులు భూగర్భంలో కట్టిన మనుషుల నివాస గృహాల్లా వున్నాయి. శవపేటిక చుట్టూ బంగారు వస్తువులూ




1. హ్వాంగ్‌హో నది ఒడ్డున వెలికితియ్యబడిన క్రీ.పూ. 2వ సహస్రాబ్ది నాటి ఒక సమాధి. లోతైన సమాధిలో శవ పేటిక ఉంచబడింది. దాని చుట్టూ రాజుతోబాటు పాతిపెట్టబడిన మనుషుల అస్థిపంజరాలు ఉన్నాయి. ఈ సమాధికి కొంత దూరంలో పాతిపెట్టబడిన గుర్రాల అస్థిపంజరాలు వున్నాయి. ఇలాంటి సమాధుల్లోని పాతులు ఏమి తెలియజేస్తాయి? 2. క్రీ.పూ. 2వ సహస్రాబ్ది నాటి ఒక చైనీయ మృణ్మయ పాత్ర

ఆయుధాలూ, శిల్పపు పనితనం గల రాతి, కంచు పాత్రలూ వున్నాయి. చచ్చినవాళ్ల ఆత్మలకు సేవ చెయ్యడానికీ, వాటిని కాపాడడానికీ వాళ్లతోపాటు వందలకొలది మనుషులు పూడ్చిపెట్టబడేవాళ్లు. వాళ్లలో కొంత మందిని అప్పుడే తలలు నరికి పూడ్చిపెట్టగా, మరి కొందరిని చేతులూ కాళ్లూ కట్టేసి, సజీవంగానే పూడ్చి పెట్టేవాళ్లు.

కరువుల గురించీ, వరదల గురించీ నిరంతరం భయం వుండేది. ఈ భయంనుండి దుష్ట వాయుదేవుడూ, దుష్ట వర్షదేవుడూ వున్నారనే నమ్మకం పుట్టింది. ఈ దేవతలకు బానిసలను బలి యిచ్చేవాళ్లు. బానిసలను సజీవంగా దహనం చేసేవాళ్లు, లేదా నదిలో వేసేవాళ్లు. ఒక కరువు సందర్భంలో ఎముక ముక్కమీద రాసిన ఈ రాత దొరికింది: "వర్షంకోసం మేము ఒక బానిసను దహించబోతున్నాము."

క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో హ్వాంగ్‌హో మైదానంలోని ప్రజలలో బానిస యాజమాన్య వ్యవస్థ నెలకొల్పబడిందని పురాతత్వ ఆధారాలు తెలుపుతాయి. చైనాలోని మొట్టమొదటి బానిస యాజమాన్య రాజ్యం క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో అవతరించిందని లిఖిత అవశేషాలు నిరూపిస్తాయి.



చైనా మహా కుడ్యం (ఫొటో)

3. క్రీ.పూ. 1వ సహస్రాబ్దిలో చైనాలో ఆర్థికాభివృద్ధి, కేంద్రీకృత రాజ్య అవతరణ. రైతులు దేవుణ్ణి తమ పొలాలకి వర్షాలు కురిపించమని ప్రార్థించినప్పటికీ, స్వయంకృషి మీదనే వాళ్ల ఎక్కువగా ఆధారపడేవాళ్లు. వాళ్లు యిలా పాడేవాళ్లు:

నాకు మేఘం కంటె పార మేలు
వర్షం బదులు కాలువ తవ్వుకుంటాను
దానితో నీళ్లూ, సారవంతమైన భూమీ లభిస్తాయి
గోధుమ విరగ పండుతుంది....

వాళ్లు హ్వాంగ్‌హో నదికి ఆనకట్టలు కట్టి, వరదలనుంచి పొలాలకు రక్షణ కల్పించారు. మైదానంలో కాల్వలు తవ్వి, దూరాన వున్న పొలాలకి నీటిని పారించారు. యాంగ్‌జీ తీరాన వున్న భూమి కూడా సాగుచెయ్యబడింది. తూర్పు చైనా అంతటా చుట్టూ పొలాలూ, పండ్లతోటలూ గల గ్రామాలు చాలా వుండేవి. పదుల వేల ప్రజలు, లక్షల ప్రజలు కూడా, కల పెద్ద నగరాలు చైనాలో వెలిశాయి.

చైనాలో కొన్ని రాజ్యాలు ఏర్పడ్డాయి. జాతీయ ఆధిపత్యంకోసం ఈ రాజ్యాలు ఒక దానితో ఒకటి ఎడతెగని యుద్ధాలు చేస్తూండేవి.

త్సిన్ రాజ్యం క్రీ.పూ. 3వ శతాబ్దిలో చైనాలో అన్నిటికంటె బలమైన రాజ్యం అయింది. బలంతోనూ, యుక్తితోనూ త్సిన్ రాజు ఆయా రాజ్యాల మధ్య వున్న వైరాన్ని వినియోగించుకుని ఒక ప్రాంతం తర్వాత మరొక ప్రాంతం జయించి

తన రాజ్యానికి కలుపుకున్నాడు. క్రీ.పూ. 221 నాటికి అతను దాదాపు చైనా అంతా వశపరచుకున్నాడు. అతని అధికారం కింద ఒక విస్తారమైన రాజ్యం యేర్పడింది. అతను తనని త్సిన్ షీ హువాంగ్‌తీగా ప్రకటించుకున్నాడు. "మొదటి త్సిన్ రాజు" అని దాని అర్థం.

4. చైనా మహా కుడ్య నిర్మాణం.

సాయుధ హూణ సంచార తెగలు ఉత్తర చైనాలోని పట్టణాలపైనా, గ్రామాలపైనా దాడులు చేస్తూండేవి. త్సిన్ షీ హువాంగ్‌తీ హూణుల దాడులనుంచి దేశాన్ని రక్షించేందుకుగాను ఒక పెద్ద గోడని నిర్మింపజేశాడు. చాలామంది రైతులు, బానిసలు, సైనికులు, శిక్షలు పడ్డ నేరస్థులూ మూకుమ్మడిగా ఆ గోడ నిర్మాణానికి తోలబడ్డారు.

చైనా మహా కుడ్య నిర్మాణ క్రమంలో వేలాదిమంది మరణించారు. జనశ్రుతి ప్రకారం వాళ్ల శరీరాలు ఆ గోడలో సమాధిచెయ్యబడ్డాయి. మరణించినవాళ్ల స్థానాన్ని కొత్త కూలీలతో నింపేవాళ్లు. చైనా ఉత్తర సరిహద్దులో బురుజులతో కూడిన ఆ గోడను రాయిమట్టి, ఇటుకలతో నిర్మించారు.

ఆశ్వికులు ఐదు బారుల్లో పోగలిగినంత వెడల్పున ఉంది ఆ చైనా గోడ. ఆ గోడ నిర్మాణం, మధ్యమధ్య మరమ్మతుల పనులు వెయ్యేళ్లకి పైగా సాగాయి.

5. చైనా రాజ్యపు దండయాత్రలు.

చైనా రాజులు తమ దేశాన్ని కాపాడుకోవడమే కాకుండా, చైనా సరిహద్దుల వెలుపలి ప్రాంతాలను సైతం ఆక్రమించుకున్నారు. ప్రత్యేకించి క్రీ.పూ. 2వ శతాబ్దినుంచి క్రీ.శ. 2వ శతాబ్దిదాకా చైనాని పాలించిన హన్ వంశపు రాజులు విదేశాలపై చాలా దండయాత్రలు చేశారు. భారీ, సుసజ్జిత చైనీయ సేనలు హూణులను అనేక పర్యాయాలు చిత్తుగా ఓడించాయి. చైనీయ సేనల ప్రధాన దండయాత్రలు పశ్చిమ దిశగా సాగాయి. హన్ రాజులు మధ్య ఆసియాకి చెందిన సంపన్న దేశాలను జయించాలని ప్రయత్నించారు.

దాదాపు ఆసియా అంతటా తూర్పునుంచి పడమటికి వ్యాపించిన సుదీర్ఘ మార్గాన్ని "సిల్కు మహా మార్గం" అనేవాళ్లు. ప్రపంచమంతటిలోనూ మంచి గిరాకీ వున్న సిల్కు చైనానుంచి యీ మార్గం గుండా రవాణాచెయ్యబడేది. సిల్కు తయారీ రహస్యాన్ని జాగ్రత్తగా కాపాడిన చైనీయులు సిల్కు వ్యాపారం ద్వారా విశేషమైన లాభాలు పొందారు.





1. నేత మగ్గం (ప్రాచీన చైనీయ చిత్రం). నేతగాళ్లు సిల్కు దారంనుంచి సిల్కు వస్త్రం నేస్తున్నారు.
2. ప్రాచీన చైనీయ నాణెం

చైనీయ పదాతి సైనికులూ, ఆశ్విక సైనికులూ కూడా సిల్కు మహా మార్గం గుండా తరలివెళ్లి మధ్య ఆసియాపైనా, యిరుగుపొరుగు దేశాలపైనా ఆక్రమణపర దండయాత్రలు చేశారు.

? **1.** ప్రాచీన కాలంలో ప్రకృతిని ఎదుర్కోవడంలో చైనా ప్రజలు అధిగమించిన యిబ్బందులు ఏమిటి? ప్రాచీన చైనీయుల మతంలో ఈ యిబ్బందులు ఏవిధంగా ప్రతిబింబించాయి? **2.** క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో చైనాలో బానిస యాజమాన్య రాజ్య ఆవిర్భావాన్ని గురించి ఏ మూలాధారాలు తెలియజేస్తున్నాయి? **3.** మాప్‌లో క్రీ.పూ. 3వ శతాబ్ది నాటి చైనా రాజ్య విస్తీర్ణాన్ని గుర్తించండి. క్రీ.శ. 2వ శతాబ్ది నాటికి చైనా ఆక్రమించు కున్న ప్రాంతాలను గుర్తించండి. **4.** పాఠాన్నీ, చిత్రాలనీ, మాప్‌నీ చూసి చైనా మహా కుడ్యం గురించి చెప్పండి. **5.** ప్రాచీన చైనాలో ఏకీకృత రాజ్యం ఎప్పుడు అవతరించింది?

## §23. చైనాలో ప్రజల తిరుగుబాట్లు

(మాప్ 3)

ప్రాచీన తూర్పు రాజ్యాల్లో మనుషులు ఎలా బానిసలయ్యారో జ్ఞాపకం చేసుకోండి (§ 7; 2; § 10; 4; § 15; అనుబంధం; § 16; 3).

1. రైతుల, బానిసల స్థితి. హన్ రాజుల పాలన కాలంలో ధనికులు మరింత ధనికులయ్యారు. బానిసలనూ, రైతులనూ దోచుకోవడం మరింత తీవ్రమైంది.

ఎక్కడ చూసినా ధనికుల భూములే కాగా, పేదలకి సూదిమొన మోపగలిగినంత భూమి కూడా లేదని సమకాలికులు రాశారు. చాలామంది రైతులు ధనికులనుంచి భూమిని కౌలుకి తీసుకోవడమో లేక వాళ్ల దగ్గర రోజుకూలీలుగా పని చెయ్యడమో తప్ప గత్యంతరం లేని స్థితిలో ఉండేవాళ్లు. రైతుల్ని గురించి ఒక రచయిత యిలా రాశాడు: "రైతు పొలంలో పనిచేసేటప్పుడు, అతని మొండెం నీటిలో వుంటుంది, అతని పాదాలు బురదలో వుంటాయి. అతని జుట్టూ, చర్మమూ ఎండకి మాడిపోయివుంటాయి. అతని శరీరం మిక్కిలి శ్రమ రాపిడికి బిగిసివుంటుంది."

రైతుకి అతని శ్రమ ద్వారా లభించే ప్రతీదీ పన్నులూ, కౌలూ చెల్లించేందుకు సరిపోతుంది. రైతులు "పందులూ, కుక్కలూ తినే మాదిరి తిండి" తినేవాళ్లు. గడ్డితో, ఆకులతో, దబ్బలతో వాళ్ల దుస్తులు తయారయ్యేవి.

చైనాలో బానిసల సంఖ్య గణనీయంగా పెరిగింది. రాజుకి చెందిన గనుల్లో 70,000 మంది బానిసలు పనిచేసేవాళ్లు. సంచార జాతులకి వ్యతిరేకంగా జరిగిన విజయవంతమైన ఒక దాడినుంచి చైనా సైనికులు 2,00,000 మంది బానిసలను తోలుకొచ్చారు. పన్నులు, బాకీలు లేక కౌలు మొత్తాలు చెల్లించలేకపోయినవాళ్లు బానిసలుగా మార్చబడేవాళ్లు. కరువు కాలంలో రైతులు తమ పిల్లల్ని బానిసలుగా అమ్ముకోవలసివచ్చేది. ఏ చిన్న తప్పు చేసినా న్యాయాధిపతులు నేరస్తుణ్నీ, అతని పిల్లల్నీ బానిసత్వంలోకి నెట్టేవాళ్లు. బానిస యజమానులు జైళ్లలోని ఖైదీలను సంతల్లో పశువుల్ని కొన్నట్టు కొనేవాళ్లు.

బానిసలను గొలుసులతో బంధించి చైనా రోడ్లమీద తోలుక పోయేవాళ్లు. కొంతమందిని, అడవి జంతువుల్లాగా, బోనుల్లో పెట్టి రవాణా చేసేవాళ్లు. వాళ్ల తలలు గొరిగించి, ముఖాలమీద గుర్తుల వాతలు వేసేవాళ్లు.

## 2. బానిస యజమానుల జీవితం.

బానిస యజమానుల జీవితం గురించి క్రీ.శ. 2వ శతాబ్దంలో ఒక చైనా రచయిత యిలా అన్నాడు: "వాళ్లకు వేలకొలది బానిసలు — స్త్రీలూ, పురుషులూ — వున్నారు. వాళ్ల విలువైన వస్తువులన్నీ వాళ్ల విశాలమైన భవనాల్లో పట్టవు. వాళ్లకు గుర్రాలూ, ఆవులూ, గొర్రెలూ, పందులూ యెన్ని వున్నాయంటే, కొండల్లోనూ, లోయల్లోనూ యెక్కడా వాటికి కావలసినంత పచ్చిక భూమి దొరకదు. వాళ్లకు చాలామంది గాయకులూ, సంగీతకారులూ వున్నారు. వాళ్లకున్న ద్రాక్ష సారాయి అంతా వాళ్లు తాగలేరు; కనుక అది పులిసిపోతుంది. వాళ్లకున్న మాంసమంతా వాళ్లు తినలేరు; కనుక అది కుళ్లి కంపు కొడుతుంది."

రైతులూ, బానిసలూ బానిస యజమానులను సహేతుకంగానే "ఆత్మశుద్ధి లేనివాళ్లు యితరుల నోటిదగ్గరి కూడు తినే పందికొక్కులు" అనేవాళ్లు.

## 3. తమ పీడకులపై రైతుల, బానిసల పోరాటం.

బానిసలూ, పేదలూ అడవులకూ, కొండలకూ పారిపోయేవాళ్లు. అక్కడ దళాలుగా యేర్పడి బానిస యజమానులమీదా, అధికార్లమీదా దాడి చేసేవాళ్లు. చైనా చారిత్రక గ్రంథాల్లో యీమాదిరి వర్ణనలు తరచు కనిపిస్తాయి: "బానిసలు గని అధికారిని చంపేసి, ఆయుధాలని వశంచేసుకున్నారు," "అధికారులమీద దాడి చేశారు, బానిసల్ని ఎత్తుకుపోయారు, గిడ్డంగుల్నీ, ఆయుధాలనీ కొల్లగొట్టారు," "అధికారులని చంపేసి, ఆయుధాలు వశంచేసుకున్నారు."



చైనాలో వరి పొలం దున్నడం. వరి పంటకి పుష్కలంగా నీరు అవసరం కనుక, చేను నీటిలో మునిగివుంది (ప్రాచీన చైనీయ చిత్రం)

చైనాలో అన్నిటికంటె పెద్ద తిరుగుబాట్లలో క్రీ.శ. మొదటి శతాబ్దిలో జరిగింది. అది "యెర్ర కనుబొమల తిరుగుబాటు"గా పేరుకెక్కింది (ఈ తిరుగుబాటును గురించిన వివరణ పేజీలు 107–108లలో యివ్వబడింది).

4. "పసుపువచ్చ తలపాగాల" తిరుగుబాటు.

క్రీ.శ. 2వ శతాబ్ది చివరలో చైనాలో మరొక తిరుగుబాటుకు రహస్య ప్రయత్నాలు జరిగాయి. దానికి నాయకులు ముగ్గురు ఝాన్ సోదరులు. రాజును కూలదోయడమనీ, సుఖమయ జీవితం నెలకొల్పుకొమ్మనీ వాళ్ల ప్రజలను ఉద్బోధించారు. గనుల్లోనూ, కర్మాగారాల్లోనూ, గ్రామాల్లోనూ, చైనా అంతటా రహస్య దళాలు యేర్పాటు చేయబడ్డాయి.

క్రీ.శ. 184లో సన్నాహాలు దాదాపు పూర్తి అయాయి; కాని, వాళ్ల పథకాలను ఒక ద్రోహి బయట పెట్టాడు.







1. గని కార్మికుడు (ప్రాచీన చైనీయ విగ్రహం). 2. చైనాలో సమాధుల్లో దొరికిన మట్టితో చేసిన ఇళ్ల నమూనాలు

ఝ్వాన్ సోదరుల అనుచరులలో 1,000 మందికి పైగా పట్టుకోబడ్డారు. వారం లోపలనే వాళ్లను చంపేశారు. అప్పుడు, తిరుగుబాటు వెంటనే ప్రారంభం కావాలని ముగ్గురు సోదరులూ ఉత్తరువు యిచ్చారు. వాళ్ల వార్తాహరులు అన్ని నగరాలకీ, రాష్ట్రాలకీ యీ ఉత్తరువును చేరవేశారు. దేశంలోని మధ్య ప్రాంతంలో తిరుగుబాటు మెరుపు వేగంతో వ్యాపించింది. ఏకకాలంలో బానిసలూ, రైతులూ కొన్ని లక్షలమంది తిరుగుబాటు చేశారు. తిరుగుబాటుదార్లు నగరాలు పట్టుకున్నారు, ధనవంతుల ఆస్తులు స్వాధీనం చేసుకున్నారు, జైళ్లలోని ఖైదీలను విడిచిపెట్టారు, బానిసలను విముక్తులను చేశారు. వాళ్లు పసుపుపచ్చ తలపాగాలు ధరించారు. అందువలన ఆ తిరుగుబాటు "పసుపుపచ్చ తలపాగాల తిరుగుబాటు"గా చరిత్రలో ప్రసిద్ధి కెక్కింది.

బానిస యజమానులు ఒక పెద్ద సైన్యం సమకూర్చుకున్నారు. ఉద్యోగుల, సైన్యాధికార్ల కొడుకులనూ, వాళ్ల విశ్వసనీయమైన సేవకులనూ అందరినీ సమీకరించారు. కొత్తగా నిర్మించిన దళాలకు తామే నాయకత్వం వహించారు. దాదాపు చైనా అంతటా దోపిడిదారులకీ, దోపిడికి గురయ్యేవారికీ మధ్య భీకరమైన యుద్ధం సాగింది (వర్ణ చిత్రం 10 చూడండి).

5. "పసుపుపచ్చ తలపాగాల" ఓటమి.

తిరుగుబాటుదార్ల అసాధారణమైన సాహసాన్ని వాళ్ల శత్రువులు కూడా గుర్తించారు. దురదృష్టవశాత్తూ, వాళ్ల సమైక్యం కాలేదు. ప్రతి తిరుగుబాటు దళమూ తనంతకు తాను వ్యవహరించింది. రాజ సైన్యాలతో పోలిస్తే, వాళ్లకు సరైన ఆయుధాలూ లేవు, అనుభవజ్ఞులైన సేనా నాయకులూ లేరు.

రాజ దళాలు తిరుగుబాటుదార్ల శిబిరంమీద హఠాత్తుగా దాడి జరిపి, వాళ్లను బురదనేలలలోకీ, నదిలోకీ తరిమారు. 50 వేలమంది తిరుగుబాటుదారులు వాటిలో మునిగిపోయారు. రైతులూ, బానిసలూ మరొక లక్షమంది మరో యుద్ధంలో మరణించారు. రాజ సైన్యాధిపతి వాళ్ల తలలు కోసి పెద్ద గోపురం లాగా పేర్చమని ఉత్తరువు యిచ్చాడు. పసుపుపచ్చ తలపాగాల ప్రధాన దళాలు ఒకటొకటే ఓడిపోయాయి. ఝ్వాన్ సోదరులు పోరాటంలో మరణించారు. ఓడినవాళ్ల పాటు దారుణంగా వుండేది. తిరుగుబాటుపట్ల సానుభూతి వున్నట్లు అనుమానం గల వాళ్లనందరినీ విజేతలు చంపారు. స్త్రీలనూ, పిల్లలనూ కూడా వదలిపెట్టలేదు.

ప్రధాన బలం ఓడిపోయినప్పటికీ, నాయకులు మరణించినప్పటికీ ఈ తిరుగుబాటు 20 యేండ్లకు పైగా సాగింది. రైతుల, బానిసల దళాలు కొత్త కొత్తవి దేశంలో వివిధ ప్రాంతాలలో తలెత్తేవి. రాజ సైన్యాలు ఈ ఉద్యమాన్ని పూర్తిగా అణచివేసేటప్పటికి అనేక యుద్ధాలు జరిగాయి, చాలమంది తిరుగుబాటుదార్లు కిరాతకంగా చంపివెయ్యబడ్డారు.

ప్రాచీన చైనాలో ప్రజా తిరుగుబాట్లు ఓడిపోయినప్పటికీ, ప్రజలు ద్వేషించే హన్ రాజవంశపు అధికారాన్ని అవి సడలింపజేశాయి. మరికొద్ది సంవత్సరాల్లో చివరి హన్ రాజు చంపివెయ్యబడ్డాడు. చైనా సామ్రాజ్యం అనేక చిన్న రాజ్యాలుగా విచ్ఛిన్నమైంది.

## "యెర్ర కనుబొమలు" తిరుగుబాటు

## (ప్రాచీన చైనీయ చరిత్రకారుల రచనలనుండి సంగ్రహించబడింది)

తిరుగుబాటుదార్లు తేనెటీగల గుంపుల్లాగా కనపడ్డారు. ఫాంగ్‌చూంగ్ ధైర్యం గలవాడు. ప్రజలు అతనితో కలిశారు. ఫాంగ్‌చూంగ్ అతని సహచరులూ తమ కనుబొమలకు యెర్ర రంగు వేసుకున్నారు. తమ మిత్రులనూ, శత్రువులైన రాజ సైనికులనూ వేరుపరచి గుర్తించడానికి వీలుగా వాళ్లీ పని చేశారు.

రాజు 9 మంది సేనాధిపతులను నియమించి, వాళ్లకు "పులులు" అని పేరు పెట్టాడు. వాళ్ల నాయకత్వం కింద వేనవేల సైనికులను వుంచాడు. ప్రతి సైనికునికీ 4,000 నాణాలు యిచ్చాడు. కాని సైనికులు యుద్ధం చెయ్య నిరాకరించారు. ఆరుగురు "పులులు" ఓడిపోయి, పారిపోయారు. ముగ్గురు "పులులు" మిగిలిన సైన్యాలను సమీకరించుకొని, రాజధాని రక్షణకు పూనుకున్నారు.

తిరుగుబాటుదార్లు రాజధానిని అన్ని దిక్కులనుంచి చుట్టుముట్టారు. జైళ్లలోని ఖైదీలను విడుదల చేసి వాళ్లకు ఆయుధాలు యివ్వమని రాజు అజ్ఞాపించాడు. వాళ్లను సైనికులుగా ఉపయోగించాలని రాజు ఉద్దేశం. వాళ్లు నగరం దాటిన వెంటనే పారిపోయారు.

తిరుగుబాటుదార్లు కోట ద్వారాల గుండా రాజధానిలో ప్రవేశించారు. నగరంలో మంటలు చెలరేగాయి; వీధుల్లో పోరాటం సాగింది. రాజు ఒక సరస్సు మధ్యలో ఒక దీవిమీద వున్న అంతఃపురంలోకి పారిపోయాడు. తిరుగుబాటుదార్లు అంతఃపురాన్ని చుట్టుముట్టి రాజ రక్షక భటులమీద బాణాలు ప్రయోగించారు. రక్షక భటులు ఒకరొకరే కూలిపోయారు. ఇంతలో బాణాలు అయిపోయాయి. అప్పుడు బాహాబాహీ యుద్ధం ప్రారంభమైంది. తిరుగుబాటుదార్లు రాజును పట్టుకొని, అతని తల ఖండించారు.

విజయంతో "యెర్ర కనుబొమలు" లాభపడలేదు. తమ బాధల కన్నిటికీ క్రూరుడైన రాజే కారణమని రైతులూ, బానిసలూ అనుకొన్నారు. ధర్మాత్ముడైన రాజు వుంటే తమ జీవితం యెంతో బాగుంటుందని వాళ్లు అనుకొన్నారు. అందువలన సింహాసనమీద మరొక రాజును కూర్చోబెట్టడానికి బానిస యజమానులకు వాళ్లు అనుమతి యిచ్చారు.

? **1.** §23లో మనుషుల్ని బానిసలుగా మార్చే ఏ పద్ధతిని గురించి మీరు తెలుసుకున్నారు? **2.** "పసుపుపచ్చ తలపాగాల" తిరుగుబాటుకి ప్రధాన కారణాలు యేమిటి? ఆ తిరుగుబాటుకి ప్రత్యక్ష కారణం యేమిటి? **3.** ఆ తిరుగుబాటు ఓటమికి కారణం యేమిటి? **4.** "పసుపుపచ్చ తలపాగాల" తిరుగుబాటు ఎన్నేళ్ల క్రితం జరిగింది? ఆ తిరుగుబాటు ఏ శతాబ్దంలో జరిగింది? ఆ శతాబ్ది మొదట్లోనా, చివర్లోనా? చైనాలో ఏకీకృత రాజ్య స్థాపన, "పసుపుపచ్చ తలపాగాల" తిరుగుబాటు జరిగి ఎన్నేళ్ళు అయింది? **5.** పాఠం, చిత్రాలూ చూసి, బానిసగా మార్చబడి, "పసుపుపచ్చ తలపాగాల" తిరుగుబాటులో పాల్గొన్న ఒక రైతు జీవితం గురించి ఒక కథ అల్లండి.

# §24. ప్రాచీన చైనా సంస్కృతి

ఈజిప్టు, మెసొపొటేమియాల్లో ప్రాచీన కాలంలో ఏ శాస్త్రీయ జ్ఞానం, ఎందుకు తలెత్తిందో జ్ఞాపకం చేసుకోండి (§12; 1, 2, 3; §17; 5).

**1. లిఖిత భాష.** చైనాలో లిఖిత భాష సుమారు క్రీ.పూ. 2,000 సంవత్సరాల క్రితం పుట్టింది. అక్షరాలన్నీ గుర్తులు — హైరోగ్లిఫ్‌లు. ప్రతి గుర్తూ ఒక పదాన్ని సూచించేది. ఉదాహరణకు, 木 గుర్తుకి "చెట్టు" అని అర్థం; రెండు అలాంటి 林 గుర్తులకి "అడవి" అని అర్థం; మూడు 森 కి "అరణ్యం" అని అర్థం. చైనా లిఖిత భాషలో కొన్ని వేల గుర్తులు వున్నాయి.







1. వెదురు బద్దలమీద ప్రాచీన చైనీయ లేఖనం. చైనీయ పండితుడు యాత్రకి వెళ్లినప్పుడు బండ్లకొద్దీ అలాంటి "గ్రంథాలను" తనతో తీసుకెళ్లేవాడు. 2. చైనాలో కాగితం తయారీ (ప్రాచీన చిత్రం). ఎడమ పక్కన: ఒక కాగితపు గుజ్జు ఉడుకుతోంది. కుడి పక్కన: గొట్టాల గుండా కారుతున్న కాగితపు గుజ్జునుంచి కాగితాలు తయారుచెయ్యబడుతున్నాయి. పైన: చైనీయ హైరోగ్లిఫ్‌లు

చైనా లిఖిత భాషలోని గుర్తులు (హైరోగ్లిఫ్‌లు) నేర్చుకునేందుకు చాలా ఏళ్లు కృషిచెయ్యాలి. బీదవాళ్లకు తమ పిల్లలకి చదువు చెప్పించే తాహతు వుండేది కాదు. అందుకే చైనా రైతుల పిల్లలకి చదువు అందుబాటులో వుండేది కాదు.

ప్రాచీన కాలంలో చైనావాళ్లు యెముకమీదా, సిల్కుగుడ్డలమీదా, వెదురు పలకలమీదా రాసేవాళ్లు. సిల్కు ఖరీదు యెక్కువ, కనుక చాలా ముఖ్యమైన పత్రాలకు మాత్రమే సిల్కు వాడేవాళ్లు. పుస్తకాలు వెదురు పలకలతో కూడి వుండేవి.

క్రీ.శ. మొదటి శతాబ్దిలో చైనావాళ్లు కాగితం సృష్టించారు. అది బట్టపేలికలు, బెరడు, వెదుళ్లతో తయారుచేయబడింది. అది వెదురు పలకల కంటె చాలా చౌక, చాలా సౌకర్యం. విద్యా వ్యాప్తిలో కాగితం కనిపెట్టడానికి బ్రహ్మాండమైన ప్రాముఖ్యం వుంది.

## 2. శాస్త్రజ్ఞానం.

చైనా పండితులు అనేక శాస్త్ర రచనలు చేశారు. వ్యవసాయానికి సంబంధించిన రచనల్లో ఉపయోగకరమైన మొక్కలు పెంచడంలోనూ, పశువులు, పట్టు పురుగుల పెంపకంలోనూ చైనా రైతులకు వున్న వేల సంవత్సరాల అనుభవం వర్ణించబడింది.

గాయాలు మాన్పడానికీ, రోగాలు నయం చేయడానికీ ప్రాచీన కాలంలో చైనా వైద్యులకి చాలా పద్ధతులు తెలుసు. ఔషధాల్లో టీ ఒకటి. అది రోగి బలాన్ని నిలబెట్టేది. తరువాతి కాలంలో టీ సాధారణ పానీయంగా వాడుకలోకి వచ్చింది. విశ్వ నిర్మాణాన్ని వివరించడానికి ప్రయత్నించిన చైనా ఖగోళశాస్త్రజ్ఞులు విశ్వాన్ని బ్రహ్మాండమైన గుడ్డుతో పోల్చారు.

భూమి పసుపు సొన; ఆకాశం గుడ్డుపైన వుండే పెంకు. నక్షత్రాలూ, గ్రహాలూ ఆకాశానికి లోపలివైపున అంటుకొని వున్నాయి. ఆకాశం నక్షత్రాలతోబాటు భూమి చుట్టూ తిరుగుతూవుంది.

యాత్రికులు చైనా భౌగోళిక పరిస్థితులను గురించి పుస్తకం తయారుచేశారు. దాని పేరు ''పర్వతాలు, సముద్రాలను గురించిన గ్రంథం.'' చైనా దేశపు ప్రాకృతిక పరిస్థితులను గురించి ఆ పుస్తకంలో ఉపయోగకరమైన సమాచారం చాలా వుంది. అయితే గ్రంథకర్తలు దానిలో అపరిచిత ప్రాంతాలని గురించి అభూత కల్పనలు కూడా యిచ్చారు. ఉదాహరణకు, ''అక్కడ మనిషి ముఖాలు, పులి శరీరాలు, చారల చర్మాలు, తెల్లని తోకలు కలిగిన భూతాలు ఉన్నాయి.''

ప్రాచీన చైనీయులు దిక్సూచిని కనిపెట్టారు.

### 3. ''చారిత్రక సమాచారం.''

క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలోనూ, 1వ సహస్రాబ్ది మొదట్లోనూ సీమ చియాన్ అనే ప్రసిద్ధ చరిత్రకారుడు ఉండేవాడు. అతను అనేక చారిత్రక పత్రాలు సేకరించి అధ్యయనం చేశాడు. సీమ చియాన్ చైనాలో అన్ని ప్రాంతాలూ పర్యటించాడు. చైనాలో అతి ముఖ్య ఘటనలు జరిగిన స్థలాలు, ప్రాచీన స్మారక చిహ్నాలు సందర్శించాడు. ఆ చరిత్రకారుడు ఆయా ఘటనల్లో పాల్గొన్నవారి కథనాలను, సుదూర భూతకాల ఘటనలను గురించిన జానపద కథలను విన్నాడు. అతను స్వయంగా అనేక ఘటనలకు సాక్షి. ఆ మూలాధారాల ప్రాతిపదికమీద సీమ చియాన్ ఆదికాలంనుంచి, తన మరణ పర్యంతం చైనా చరిత్రను రచించాడు. జీవిత కాలమంతా కృషిచేసి రచించిన ఆ గ్రంథానికి అతను ''చారిత్రక సమాచారం'' అని పేరుపెట్టాడు.

సీమ చియాన్ ఆ గ్రంథాన్ని ''మంచిని వక్రీకరించకుండా, చెడుని మరుగుపరచకుండా'' రచించాడు. రాజులను గురించీ, ప్రభువులను గురించీ సత్యం తెలిపేందుకు సైతం అతను సంకోచించలేదు. దానితో రాజు కోపానికి అతను గురయ్యాడు.


1


2

1. ఉప్పు గని తవ్వకం (ప్రాచీన చైనీయ ఉబ్బెత్తు చిత్రం). 2. రాజభవనంలో విందు (ప్రాచీన చైనీయ ఉబ్బెత్తు చిత్రం). కింద: పదాతి, అశ్విక పరివారంతో రాజభవనానికి ప్రభువుల రాక. మధ్య వరుస: గృహస్థు అతిథులకు స్వాగతం చెప్తున్నాడు. పైన: వినోదకారులు, గాయకులు, భటులు

## 4. ప్రాచీన చైనా కళలు.

ప్రాచీన కాలంలో చైనా ప్రజలు అనేక గాథలూ, పాటలూ, నవలలూ సృష్టించారు. విభిన్న వర్గాలకు చెందిన మనుషులు వాటిలో తమ అభిప్రాయాలనూ, భావోద్వేగాలనూ వ్యక్తంచేశారు (పేజీలు 111–112లలోని రచనా భాగాలను చదవండి).

ప్రాచీన చైనాలో భవనాలు అత్యధిక భాగం కొయ్యతో నిర్మించినవి. అంచేత అవి మన కాలందాకా మిగల్లేదు. అయితే, అనేక రాతి, కంచు, మట్టి పింగాణీ కళాఖండాలు లభ్యమయాయి. వాటినిబట్టి ప్రాచీన చైనీయుల జీవితం ఎలా వుండేదో, వాళ్ల మత విశ్వాసాలు ఏమిటో మనం తెలుసుకోవచ్చు.

ప్రాచీన కంచు, రాతి పాత్రలు భిన్న భిన్న రూపాల్లో ఉండేవి. డ్రాగన్లు, తదితర కాల్పనిక జంతువులు, అందమైన ఆభరణాలు, పురాణ గాథల్లోని సన్నివేశాలూ ఆ పాత్రలమీద చిత్రింపబడేవి (పేజి 101లోని చిత్రం 2 చూడండి).

హన్ రాజుల పాలన నాటి అనేక కళాఖండాలు లభ్యమయాయి. వాటిలో వివిధ వర్గాలకి చెందిన మనుషుల జీవితం చిత్రింపబడింది: మట్టితో చేసిన శ్రమజీవుల బొమ్మలు, ఒక ధనికుడి ఇంటి, పేదల గుడిసెల సమూనాలు. రాతిమీద చెక్కబడిన ఉబ్బెత్తు చిత్రాలు రాజభవనంలో జరిగే విందునూ, ఉప్పు గనులనూ చిత్రించాయి. శిల్పులు ఒక చిత్రంలో రాజభవన యజమాని డాబుదర్పాలతో కూడిన తాపీగా చేసే కదలికలనూ, నౌకర్లు వినయంగా హడావిడిగా అటూ యిటూ తిరగడాన్నీ, మరో చిత్రంలో బండచాకిరితో బాగా అలసిపోయిన బానిసలనూ ఎంతో నిపుణంగా చిత్రీకరించారు.

ఉప్పు గనులను చిత్రించే ఉబ్బెత్తు చిత్రం చూస్తే ప్రాచీన శిల్పుల్లో కొందరికి బానిసలపట్ల దయ ఉన్నట్లూ, దోపిడిలోని క్రౌర్యాన్నీ, అన్యాయాన్నీ వాళ్ల గుర్తించినట్లూ తెలియవస్తుంది.

## సిమ చియాన్ ''చారిత్రక సమాచారం''నుంచి

ఈ కథనం ప్రాచీన చైనీయుల మత విశ్వాసాలను గురించి ఏమి తెలియజేస్తోంది? పూజారులపట్ల సీమ చియాన్ వైఖరి యేమిటి?

ఒక నగరంలో ఏటా నదీ దేవత కల్యాణం జరిపేవారు. ఆ సందర్భంగా పెద్దలూ, పూజారిణులూ మిక్కిలి అందమైన ఒక అమ్మాయిని వధువుగా ఎంపికచేసి నదిలో పడేసేవాళ్లు. వాళ్లు నగరవాసులనుంచి పెద్ద మొత్తంలో కానుకలు కూడా వసూలుచేసుకునేవాళ్లు. దానితో నగరవాసులు దివాళాతీసేవాళ్లు. ఖజానా నింపే పన్ను వసూళ్లు తగ్గిపోయేవి. ఆ రాష్ట్ర పాలకుడికి కంగారు కలిగింది. అతను నదీ దేవత కల్యాణానికి వచ్చాడు. అతను వధువుకేసి చూసి, ఆమె నదీ దేవతకి తగినంత అందంగా లేదన్నాడు. ప్రధాన పూజారిణి నదీ దేవత దగ్గరకి వెళ్లి, మరింత అందమైన అమ్మాయి దొరికేదాకా నిరీక్షించవలసిందిగా అర్థించాలన్నాడు. ఆ పూజారిణిని నదిలో పడెయ్యమని ఆజ్ఞాపించాడు. ఆమె చాలా సేపు బయటకి రాకపోయేసరికి ఆ పాలకుడు మిగిలిన పూజారిణులను ఆమెను కలుసుకొని సంగతి కనుక్కురావలసిందిగా నదిలోకి పడదోయించాడు. తర్వాత పూజారిణులు విషయాన్ని నదీ దేవతకి సరిగా వివరించలేకపోయినట్లున్నారనీ, పెద్దలు వెళ్తే బాగుంటుందనీ చెప్పి, వాళ్లని నదిలోకి నెట్టమని ఆజ్ఞాపించాడు. అప్పట్నుంచి నదీ దేవత కల్యాణాలు జరిపేందుకు యింకెవరూ సాహసించలేదు.

ప్రాచీన చైనీయ రచయితల రచనలనుంచి

ఈ రచనలు చేసినవాళ్లు ఏ వర్గాలవారి అభిప్రాయాలనూ, ఆసక్తులనూ వ్యక్తంచేశారు?

1. వినండి స్వామీ, తమరు విత్తనూ లేదు, కోయనూ లేదు,
మరెందుకు తమరు మూడు కోట్ల మోపులు సంగ్రహించుకున్నారు?
యెద్దులను తమ అంతఃపురానికి యెందుకు తోలుకపోయినట్లు?
ఉత్తముడైనవాడు తాను పండించని పంట యెప్పుడూ తినడు.
మరి తమరేమో చేస్తున్న దదే!

2. ఆకాశం (అనగా భగవంతుడు) మనుషులతో తాను స్వయంగా మాట్లాడడు. తన భావాలు తెలియజేయడానికి ఆయన ఒక మనిషికి అధికారం యిస్తాడు. ఆ మనిషే రాజు. రాజుకు ఆకాశం మనస్సులో వున్నదంతా తెలుస్తుంది. అందుకనే అతన్ని ఆకాశ పుత్రుడు అంటారు.

ఆకాశ పుత్రుడు ఆకాశంనుండి ఉత్తరువులు స్వీకరిస్తాడు. ఆకాశ పుత్రునినుండి అతని కిందివాళ్లు ఉత్తరువులు స్వీకరిస్తారు.

3. లోకులందరూ సమానులెందుకు కారు?
ధనికుడు వెక్కసంగా మెక్కుతున్నాడు
దరిద్రుడు గంజి మెతుకులకి కటకటలాడుతున్నాడు.
ధనికుడి కంటె దరిద్రుడు చెడ్డవాడా, బానిస మూర్ఖుడా?

?

**1.** చైనీయ లిపి ఎవరి లిపిని పోలివుంది? ఏవిధంగా పోలివుంది? వాటి మధ్య భేదాలు యేమిటి? **2.** ప్రాచీన చైనీయులు ఏమేమి కనిపెట్టారు, ఏయే ఆవిష్కరణలు చేశారు? **3.** సీమ చియాన్ ఏయే మూలాధారాల ప్రాతిపదికమీద తన రచనలు చేశాడు? వ్యక్తిగా, చరిత్రకారుడుగా అతని సద్గుణాలు యేమిటి? **4.** ప్రాచీన కళాఖండాల ఆధారంగా ప్రాచీన చైనా చరిత్ర గురించి మీరేమి గ్రహించారు?

## ప్రాచీన తూర్పు చరిత్రకి సంబంధించి మీ జ్ఞానాన్ని సరిచూసుకోండి

ప్రాచీన తూర్పు అన్నది ఆసియా, ఈశాన్య ఆఫ్రికా దేశాలకు చెందిన ఉమ్మడి పేరు. అక్కడ కొన్ని వేల ఏళ్ల క్రితమే రాజ్యం, వర్గాలూ అవతరించాయి.

ప్రాచీన తూర్పుకి చెందిన పెద్ద దక్షిణ నదీ మైదానాల్లో వ్యవసాయం వేగంగా అభివృద్ధి చెందింది.

ప్రాచీన కాలంలో ఏయే నదీ మైదానాల్లో వ్యవసాయం అభివృద్ధి చెందిందో అలాంటి నదుల్లో అయిదింటిని పేర్కొని, మాప్‌లో చూపించండి. అక్కడ వ్యవసాయానికి దోహదం చేసినది యేమిటి?

అక్కడ క్రీ.పూ. కొన్ని వేల సంవత్సరాల క్రితం జనాన్ని దోచుకునే అవకాశం ఏర్పడింది.

ఒక మనిషిని వేరొక మనిషి దోచుకోవడమంటే యేమిటో వివరించండి. వేటగాళ్లలో, ఆహారం పోగుచేసుకునేవాళ్ల సమాజంలో దోపిడి ఎందుకు లేదు? ప్రాచీన తూర్పుకి చెందిన వ్యవసాయదారుల సమాజంలో దోపిడి ఎందుకు సంభవమైంది?

ఇనుము ఆవిష్కరింపబడటంతో గట్టి నేలల ప్రాంతాల్లోని, అటవీ ప్రాంతాల్లోని జనాన్ని సైతం దోచుకోవడం సాధ్యమైంది.

రాతి, కొయ్య, రాగి పనిముట్లతో పోలిస్తే ఇనుప పనిముట్లకి వున్న మేళ్లు యేమిటి? మనుషులు ఇనుముతో వస్తువులు తయారుచెయ్యడం ఎప్పుడు నేర్చుకున్నారు?

ఒక మనిషిని వేరొక మనిషి దోచుకోవడం సంభవమవడంతో వర్గాలు రూపొంద నారంభించాయి.

ప్రాచీన తూర్పుకి చెందిన దేశాల్లో విభిన్న వర్గాల పరిస్థితిని వర్ణించండి. బానిసల పరిస్థితికీ, రైతుల పరిస్థితికీ మధ్య ఉన్న భేదం యేమిటి? మనుషులు బానిసలుగా యెలా మార్చబడేవారు? బానిస యాజమాన్య వర్గం ఎలా యేర్పడింది?

దోపిడిదారుల వర్గానికీ, దోపిడికి గురయ్యే వారి వర్గానికీ మధ్య తీవ్ర పోరాటం మొదలైంది.

ప్రాచీన తూర్పులో పీడిత వర్గాల మిక్కిలి పెద్ద తిరుగుబాట్లు ఎక్కడ, ఎప్పుడు, ఎలా జరిగాయి?

బానిస యజమానులు పీడితుల ప్రతిఘటనను బలప్రయోగం ద్వారా అణచివేశారు. ఆ బలప్రయోగం రాజ్యయంత్రం ద్వారా జరిగింది.

రాజ్యపు మౌలిక లక్షణాలు యేమిటి? ఆదిమ సమష్టి వ్యవస్థలో రాజ్యం ఎందుకు లేదు? ప్రాచీన తూర్పుకి చెందిన రాజ్యాల్లో మీకు తెలిసినవాటిని మాప్‌మీద గుర్తించండి. భిన్న దేశాల్లో రాజ్యం భిన్న కాలాల్లో ఎందుకు అవతరించింది?

బానిస యాజమాన్య వ్యవస్థ ప్రాచీన తూర్పులో క్రీ.పూ. 3వ–1వ సహస్రాబ్దుల్లో నెలకొల్పబడింది.

బానిస యాజమాన్య వ్యవస్థ మౌలిక లక్షణాలు యేమిటి? ఆదిమ సమష్టి వ్యవస్థకీ, దానికీ మధ్య తేడాలు ఏమిటి?

బానిస యాజమాన్య వ్యవస్థలో ప్రాచీన తూర్పుకి చెందిన ప్రజలు ప్రపంచ ఆర్థిక వ్యవస్థ, సంస్కృతుల అభివృద్ధికి విశేషంగా దోహదంచేశారు.

ప్రాచీన తూర్పు దేశాల ప్రజలు ఏయే పంటలు పండించారు, జంతువులను పెంచారు? అక్కడ ఏ చేతివృత్తులు వికసించాయి? ప్రాచీన తూర్పులో ఏమాదిరి లిపులు రూపొందాయి? ప్రాచీన తూర్పుకి చెందిన దేశాల్లో ఎలాంటి శాస్త్ర జ్ఞానం ఆవిర్భవించింది? ఏమేమి కనుగొనబడ్డాయి, ఏయే ఆవిష్కరణలు జరిగాయి? ప్రాచీన తూర్పు సాహిత్యంలో, వాస్తు కళలో, శిల్పంలో మీకు తెలిసిన కృతులను పేర్కొనండి.

ప్రకరణం ఏడు

# పురాతన కాలపు గ్రీసు

## §25. ప్రాచీన గ్రీసు ప్రకృతి, జనాభా

(మాప్ 4, పేజి 120లోని మాప్)

**1.** బాల్కన్ ద్వీపకల్పం దక్షిణ యూరప్‌లో వుంది. దాని దక్షిణ భాగంలో వుంది గ్రీస్ అనే పర్వతమయమైన చిన్న దేశం.

గ్రీకు పర్వతాలు నిటారుగా వున్న శిఖరాలతో, చరియలతో కూడివుంటాయి. పర్వత దరులలో పొదలు విరివిగా వుండేవి. గడ్డి అరుదుగా వుండేది. పర్వతాల మధ్య లోయల్లో సారవంతమైన భూమి వుండేది. గ్రీసులో యినుము, రాగి, వెండి, పాలరాయి నిక్షేపాలు వున్నాయి.

గ్రీసుకు తూర్పున ఎగేయన్ సముద్రం వుంది. ఆ తీరం చాలా యెగుడు దిగుడులుగా వుంటుంది. చాలా చోట్ల సముద్రం భూమిలోకి చొరుచుకొని వస్తుంది. అందువల్ల తీరం వెంబడి అనేక అఖాతాలు వున్నాయి. వాటిలో అత్యధిక భాగం ఓడలకు మంచి రేవులను సమకూరుస్తాయి. ఆ సముద్రంలో దండిగా చేపలు వుంటాయి.

ఎగేయన్ సముద్రం నిండా దీవులు వున్నాయి. దాదాపు అన్నీ ఒకదానిమీదనుండి మరొకటి కనిపించేటంత దగ్గరగా వున్నాయి.

గ్రీసులో భూకంపాలు వస్తూవుంటాయి. స్వల్పకాలిక శీతకాలంలో తరుచుగా వర్షాలు వస్తాయి. ఒకోసారి ప్రచండమైన తుపానులు వస్తాయి. సంవత్సరంలో తక్కిన కాలంలో యెండ బాగా కాస్తుంది; ఆకాశం నిర్మలంగా, నీలంగా వుంటుంది. వేసవిలో నదులు దాదాపు పూర్తిగా ఎండిపోతాయి. స్నేహితులకి వీడ్కోలు చెప్పేటప్పుడు గ్రీకులు యిలా అనేవాళ్లు: "మీ ప్రయాణం సుఖంగా జరుగుగాక, మంచినీళ్లు సమృద్ధిగా లభించుగాక!"

**2.** నైసర్గిక పరిస్థితులనుబట్టి గ్రీసును మూడు భాగాలుగా విభజించవచ్చు: దక్షిణ, మధ్య, ఉత్తర భాగాలు. పెలొపొనేసస్ అనబడే దక్షిణ గ్రీసు లోతైన సింధుశాఖలచేత తక్కిన భూభాగంనుండి వేరుచేయబడింది. ఒక యిరుకైన భూసంధి దాన్ని గ్రీసుతో కలుపుతుంది. మధ్య గ్రీసుకూ, ఉత్తర గ్రీసుకూ మధ్య యెత్తైన పర్వత శ్రేణులు వున్నాయి. సముద్ర తీరంలో మాత్రం, పర్వతాలకూ, సముద్రానికీ మధ్యన ఒక యిరుకైన సందు వుంది. దీన్ని థర్మోపిలే కనుమ అంటారు. ప్రాచీన కాలంలో మధ్య గ్రీసునుండి ఉత్తరానికి పోయేందుకు యిదొక్కటే భూమార్గం.

ఈ మూడు భాగాల్లో ప్రతి ఒకటీ పర్వత శ్రేణులచేత మళ్లీ చిన్నచిన్న భాగాలుగా విభజింపబడింది. ప్రాచీన కాలంలో ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికి సముద్రంమీదనైనా వెళ్లేవాళ్లు, లేదా కొండల్లో యిరుకుదారుల వెంబడైనా వెళ్లేవాళ్లు.



గ్రీసులో ఒక దృశ్యం (ఫొటో)

3. సుమారొక శతాబ్దం క్రితం గ్రీసు ప్రాచీన చరిత్రను గురించి మనకు తెలిసింది చాలా తక్కువ. పెలొపొనేసస్‌లోని మైకేనె అనే ప్రాచీన గ్రీకు నగరం వుండిన స్థలంలో దాదాపు ఒక శతాబ్దం కిందట 19వ శతాబ్ది రెండవ అర్ధభాగంలో మొదలైన పురాతత్వ త్రవ్వకాల ద్వారా క్రీ.పూ. 2వ సహస్రాబ్ది మధ్యనే ఆ నగరం యిక్కడ వుండేదని తేలిసింది. ఎత్తైన ఒక గుట్టమీద అక్రోపొలిస్*ని ఆవిష్కరించారు. దాని చుట్టూ పెద్ద శిలలతో కట్టబడిన బలమైన కోటగోడ వుండేది.

రాజసౌధానికి దగ్గరలో పురాతత్వ శాస్త్రజ్ఞులు అనేక సమాధులను ఆవిష్కరించారు. గోరీలలో పూడ్చబడిన మనుషుల ముఖాల బంగారు ప్రతిరూపాలు ఉన్నాయి. వాటిలో మంచి పనితనం గల బంగారు ఆభరణాలూ, కంచు ఆయుధాలూ చాలా దొరికాయి.

మైకేనె త్రవ్వకాల అనంతరం యిలాంటివే రాజసౌధాల, కోటగోడల శిథిలాలు గ్రీస్ అంతటా బయటపడ్డాయి. అవి క్రీ.పూ. 2వ సహస్రాబ్ది నాటివి. ఒక రాజసౌధంలో అక్షరాలు గల మట్టి పలకలు పురాతత్వ శాస్త్రజ్ఞులకు దొరికాయి. ఆ రాతి పలకలమీది రచనను పండితులు చదవగలిగారు. ఇవి బానిసల, రైతుల, వాళ్ల పన్ను బకాయిల జాబితాలు. కొలువు

* అక్రోపొలిస్ – గ్రీకు భాషలో "ఎగువ నగరం" అని అర్థం.









1. మైకేనెయన్ అక్రోపొలిస్ సింహద్వారాలు. 2. మైకేనెలో కనుగొనబడిన బంగారు పాత్ర. 3. సమాధిలో మృతుని ముఖాన్ని మూసే బంగారు మాస్కు. 4. అత్యంత ప్రాచీనమైన గ్రీకు లేఖనం వున్న కాల్చిన మట్టి పలక.

లోకి తీసుకున్న సైనికుల, వాళ్లకిచ్చిన ఆయుధాల, దండయాత్రకి సన్నద్ధంచేసిన ఒక నౌకా దళ వివరాలు కూడా ఆ జాబితాలో వున్నాయి. క్రీ.పూ. 2వ సహస్రాబ్ది నాటి దాదాపు అన్ని నగరాల శిధిలాల్లోనూ అగ్ని ప్రమాదాల, విధ్వంసాల అవశేషాలు కానవచ్చాయి. (పురాతత్వ తవ్వకాల్లో లభించిన అవశేషాల ఆధారంగా క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో ప్రాచీన గ్రీసు సమాజం, జనాభా, సంస్కృతులను గురించి నిర్ధారణలు చెయ్యండి.)

**4.** బాల్కన్ ద్వీపకల్పంలోని ఉత్తర భాగంలో డోరియన్లు అనే గ్రీకు తెగవాళ్లు నివసిస్తూండేవారు. వాళ్ల సంస్కృతి మైకేనె సంస్కృతి కంటె తక్కువ స్థాయి కలిగినది.

యుద్ధ ప్రియులైన డోరియన్లు క్రీ.పూ. 2వ సహస్రాబ్ది అంతంలో మధ్య, దక్షిణ గ్రీసుపై దాడిచేసి మైకేనెనీ, తదితర నగరాలనీ ధ్వంసం చేశారు. స్థానిక జనాభాలో కొంత భాగం డోరియన్లచేత జయింపబడింది. తక్కిన వాళ్లు బాల్కన్ ద్వీపకల్పాన్ని వదిలిపెట్టి, ఏగేయన్ సముద్రంలోని వివిధ దీవులకీ, తూర్పు తీరానికీ పారిపోయి తల దాచుకున్నారు.

డోరియన్ దండయాత్ర తర్వాత గ్రీకు సంస్కృతి బాగా క్షీణించింది. అనేక శతాబ్దాలపాటు అక్కడ రాతి కట్టడాలు కట్టబడలేదు. చేతిపని వస్తువుల్లో నాజూకుతనం పోయింది. చివరకు లిఖిత భాష కూడా పూర్తిగా విస్మృతమైంది.

? **1.** § 25లోని 1, 2, 3, 4 విభాగాలకు శీర్షికలు ఆలోచించండి. **2.** మాప్ 4లో ప్రాచీన గ్రీసును, ప్రకృతి సిద్ధంగా దానిలో ఏర్పడిన మూడు భాగాలను గుర్తించండి. ఒక భాగానికీ, మరో భాగానికీ మధ్య భూ మార్గాలు చూపండి. **3.** గ్రీసు, ఈజిప్టు ప్రాకృతిక పరిస్థితుల మధ్య వున్న తేడాలు యేమిటి?

వాటిలో కనీసం నాలుగు తేడాలను పేర్కొనండి. ప్రాచీన గ్రీసులో జనం అత్యంత విజయవంతంగా అనుసరిస్తూ వుండిన వృత్తులు యేమై వుండగలవో వివరించండి. **4.** క్రీ.పూ. 2వ సహస్రాబ్ది అంతంలో గ్రీసులో సంస్కృతి క్షీణించేందుకు గల కారణాలు యేమిటి? ఆ పతనానికి సూచనలు యేమిటి? **5.** మాప్‌లు 4, 5ల్లో క్రీ.పూ. 1వ సహస్రాబ్ది మొదట్లో గ్రీకులు స్థిరపడిన ప్రాంతాలను గుర్తించండి.

## §26. ప్రాచీన గ్రీకు పురాణ గాథలు

(మాప్‌లు 4, 5)

పురాణ గాథ అంటే యేమిటో జ్ఞాపకం చేసుకోండి (§13; 1); ప్రాచీన తూర్పుకి చెందిన పురాణ గాథల్లో మీకు గుర్తున్నవి యేమిటి?

**1. పురాణ గాథలు, గ్రీసు చరిత్రలో వాటి ప్రాముఖ్యం.**

ప్రాచీన గ్రీసు చరిత్రను అధ్యయనం చేయడానికి పురాణ గాథలు ఒక ఆధారం. ఈ పురాణ గాథలు వీరుల గురించీ, దేవతల గురించీ ఆనాటి గ్రీకులు అల్లిన కథలు. అవి ఒక తరంనుంచి మరో తరానికి ముఖతః అందజెయ్యబడ్డాయి. దరిమిలా యీ పురాణ గాథలు గ్రంథస్థం చెయ్యబడ్డాయి. ఈ గాథలలో వర్ణింపబడిన సాహస కృత్యాలు యెప్పుడూ జరగలేదు. మానవాతీత శక్తిగల ఆ వీరులు ప్రజల ఊహలో పుట్టినవాళ్ళు. కాని, వాటి ద్వారా, గ్రీకులు ప్రకృతిని ఎదిరించడానికి చేసిన కృషిని గురించీ, వాళ్ల వృత్తులూ, పనిముట్లూ, ఆచారాలను గురించీ, వాళ్ల దేవతలను గురించీ, వాళ్లు దర్శించిన దేశాలను గురించీ మనకు సమాచారం అందజేయబడింది.

చారిత్రక ఆధార సమాచారంగా పురాణ గాథలకి ప్రాధాన్యం వుంది. డోరియన్ ఆక్రమణ అనంతరం గ్రీకులకు చాలా కాలంపాటు లిపి లేనందున యీ గాథలకి ప్రత్యేక ప్రాధాన్యం వుంది.

**2. హెరాక్లిస్‌ని గురించిన గాథలు.**

హెరాక్లిస్ అనే వీరుని అద్భుత కృత్యాలను గురించిన పురాణ గాథలు చాలా ప్రచారంలో వుండేవి.

ఒక గాథ ఒక పెద్ద సింహానికి సంబంధించింది. ఈ సింహం ప్రజలమీదా, పశువులమీదా దాడిచేస్తూ వుండేది. దాని చర్మం కంచు మొనగల బాణం కూడా భేదించలేనంత మందంగా వుండేది. ఆ సింహాన్ని పట్టుకొని చంపాలనుకొన్న హెరాక్లిస్ ఒక ఓక్ వృక్షాన్ని పడగొట్టి, దానితో ఒక గద తయారుచేశాడు. ఆ గద యిరవై మంది మనుషులు కూడా యెత్తలేనంత బరువైనది. అతను ధైర్యంగా సింహం గుహలో ప్రవేశించాడు. సింహం అతని మీద పడింది. ఒకే ఒక్క బలమైన దెబ్బతో అతను దాన్ని పడగొట్టి, వట్టి చేతులతో దాని గొంతు పిసికాడు. సింహం చర్మాన్ని అతను కవచంగానూ, శిరస్త్రాణంగానూ ఉపయోగించాడు.

బ్రహ్మాండమైన ఒక సర్పం ఒక మడుగులో వుండేది. అది హైడ్రా జాతిది. దానికి తొమ్మిది తలలూ, తళతళ మెరిసే పొలుసులూ వుండేవి. అప్పుడప్పుడు అది మడుగులోనుండి బయటికి వచ్చి పెద్దపెద్ద పశువుల మందలను దిగమింగేది. హెరాక్లిస్ దానితో పోరాడి, దాని తలలు నరికివేయడానికి ప్రయత్నించాడు. కాని ఒక తల నరికితే, దాని స్థానంలో రెండు

తలలు మొలిచేవి. అప్పుడు హెరాక్లిస్ దాని మెడలను దివిటీలతో కాల్చమని తన వెంటవున్న యువకునితో చెప్పాడు. అలా కాల్చిన తర్వాత తలలు మొలవలేదు. హెరాక్లిస్ ఆ మహా సర్పాన్ని చంపేశాడు.

ఔగేయస్ అనే రాజుకు ఐదు వేల యెద్దులు వుండేవి. అతని పశువుల శాలలో యెవరూ యెప్పుడూ వూడవలేదు. అవి పేడతో నిండిపోయాయి. వాటిని ఒక్క రోజులో శుభ్రంచేస్తానని హెరాక్లిస్ రాజుతో చెప్పాడు. ఔగేయస్ తన అతిథులతో కలిసి విందు భోజనం చేస్తూండగా, హెరాక్లిస్ దగ్గరలో వున్న రెండు నదులను అడ్డగించాడు. అవి పొర్లి, జలప్రవాహం పేడను వూడ్చివేసింది.

అట్లాస్‌కి చెందిన తోటలో పండే బంగారు ఆపిల్ పండ్లను వెదుకుతూ ఒక రోజు హెరాక్లిస్ దీర్ఘ ప్రయాణం మీద బయలుదేరాడు. పడమట, గ్రీసుకు చాలా దూరాన, ఒక సముద్ర తీరాన వుండేది ఆ తోట. నీలపు ఆకాశం భూమిని టోపీలా కప్పే బ్రహ్మాండమైన చాందినీ అని గ్రీకులు నమ్మేవాళ్లు. భూమీ, ఆకాశం ఒక సముద్రపు ఒడ్డున కలుసుకుంటా యని వాళ్ల నమ్మకం. మహాబలుడైన అట్లాస్ భుజాలమీద వుంది గనుక, ఆ చాందినీ అలా నిలిచివుందని వాళ్లు అనుకునే వాళ్లు. అట్లాస్ పురాణ ప్రసిద్ధమైన వీరుడు. అతని పేరుమీదుగానే అట్లాంటిక్ మహాసముద్రానికి ఆ పేరు వచ్చింది.

అట్లాస్ హెరాక్లిస్ కోసం ఆపిల్ పండ్లు కోస్తూ వుండగా, హెరాక్లిస్ ఆకాశాన్ని తన భుజాలమీద ఎత్తుకున్నాడు. దాని బరువుకు అతని మోకాళ్లు భూమిలో క్రుంగిపోయాయి, అతని యెముకలు పటపటలాడాయి. ఒళ్లంతా చెమట ధారలుగా కారింది.





1. సింహంతో పోరాడుతున్న హెరాక్లిస్ (ప్రాచీన గ్రీకు విగ్రహం). 2. డేడలస్, ఇకారస్ (ప్రాచీన గ్రీకు ఉబ్బెత్తు చిత్రం). డేడలస్ సామాన్య వృత్తిపనివాడి దుస్తుల్లో వున్నాడు

పురాణ గాథల్లో హెరాక్లిస్ అద్భుత కృత్యాలు యింకా చాలా వున్నాయి. ప్రాచీన గ్రీకు ప్రజలు అతన్ని యెంతో మెచ్చుకునేవాళ్లు. అతను అలసట లేకుండా శ్రమించిన వీరుడు. డోరియన్లు అతన్ని తమ పూర్వీకుడుగా పరిగణించేవాళ్ళు, అతన్ని తలుచుకొని గర్వించేవాళ్లు.

### 3. ఆర్గోనాట్ల పురాణ గాథ.

నల్ల సముద్ర తీరంలోని కాకసస్ భూమిని పాలించే రాజు వద్ద బంగారు ఉన్ని గల పొట్టేలి చర్మం వుంది. ఆ చర్మాన్ని అతను ఒక తోపులో పెట్టాడు. నిద్ర యెరుగని మహా సర్పం ఒకటి దానికి కావలి వుండేది.

ఆ బంగారు ఉన్ని చర్మాన్ని సంగ్రహించేందుకు గ్రీసు నలు మూలలనుంచీ ధైర్యవంతులు ఒక చోట సమావేశమయ్యారు. అపాయాలతో నిండిన దీర్ఘ ప్రయాణానికి పూనుకొన్నారు. జేసన్ అనే ఒక కులీన యువకుడు వాళ్లకి నాయకత్వం వహించాడు. ఆర్గ్ అనే మహా నిపుణుడైన కార్మికుడు కొయ్యతో ఒక ఓడ నిర్మించాడు. అతన్నిబట్టే దానికి "ఆర్గో" అని పేరు వచ్చింది. దాని నావికులే ఆర్గోనాట్లు, అనగా "ఆర్గో"లో ప్రయాణం చేసేవాళ్లు.

ఆర్గోనాట్లు చాలా రోజులు అజ్ఞాత సముద్రంలో ప్రయాణం చేశారు. దారిలో వాళ్లు కదిలే రెండు కొండలను సమీపించారు. వాటి మధ్య యేదైనా ప్రయాణం చేయడానికి ప్రయత్నిస్తే, అవి భీకరమైన శబ్దంతో సమీపించి, దాన్ని నొక్కివేసేవి. ''ఆర్గో'' ఆ కొండలనుండి కొంచెంలో తప్పించుకుంది; దాని చుక్కాని పలకల్లో చివరది మాత్రం ఆ కొండ లకు తగిలి పడిపోయింది. *

అనేక సాహస కృత్యాల తర్వాత ఆ ప్రయాణికులు కాకసస్ చేరుకున్నారు. తాను అప్పగించిన పని జేసన్ నెరవేరిస్తే రాజు వాళ్లకు బంగారు ఉన్ని యిస్తానన్నాడు. ఆ పనిలో జేసన్ మృత్యువు వాత పడతాడని రాజు నమ్మకం. రాజు కుమార్తె మెడేయా జేసన్‌కి సాయంచెయ్య నిశ్చయించుకొని, అతనికి ఒక లేపనం యిచ్చింది. జేసన్ తన దేహానికి మంత్రించిన ఆ లేపనం పూసుకున్నాడు. దానితో అతనికి అద్భుతమైన శక్తి వచ్చింది. అతని కాళ్లు కంచు స్తంభాలంత దృఢంగానూ, అతని చేతులు పట్టకారులంత బలంగానూ తయారయాయి. కంచు గిట్టలూ, అగ్ని శ్వాసలూ గల రెండు పెద్ద యెద్దులను అతనిమీదికి వదలమని రాజు ఆజ్ఞాపించాడు. మోరలు వంచుకొని అవి జేసన్‌మీదికి వురికాయి. కాని అతను వాటి దాడికి ఏమాత్రం చలించక దృఢంగా నిలబడ్డాడు. రాజాజ్ఞ మేరకు జేసన్ వాటిని పట్టుకొని, కాడిగట్టి, పొలం దున్ని సర్ప దంతాలు విత్తాడు.

ఆ విత్తనాలనుంచి రాగి కవచాలు, శిరస్త్రాణాలు, శూలాలు ధరించిన ఒక సైన్యం భూమినుండి ఉద్భవించి జేసన్ మీద దాడిచేసింది. జేసన్ ఆ సైనికుల మధ్యలోకి ఒక రాయి విసిరాడు. వాళ్లు తమలో తాము పోట్లాడుకోనారంభించారు. ఈ పరిస్థితిని ఉపయోగించుకొని జేసన్ వాళ్లనందరినీ తన ఖడ్గంతో సంహరించాడు.

జేసన్ తనకు అప్పగించిన పని నెరవేర్చినప్పటికీ రాజు మోసంచేశాడు, బంగారు ఉన్ని చర్మాన్ని అతనికి యివ్వడానికి నిరాకరించాడు. రాజకుమారి మెడేయా సంపదకి కాపలా కాస్తున్న సర్పాన్ని సమ్మోహితంచేసి నిద్రపోయేటట్లు చేసింది. ఆర్గోనాట్లు బంగారు ఉన్ని చర్మాన్ని తీసుకొని, వెంటనే ఓడ యెక్కి బయలుదేరారు. రాజు తన సైనికులతో వాళ్లను వెంబడించాడు. ఆర్గోనాట్లు యెంతో కష్టంతో తప్పించుకొని, క్షేమంగా గ్రీసుకు తిరిగివచ్చారు.

## డేడలస్, ఇకారస్‌ల గాథ

ఈ పురాణ గాథలో గ్రీకులు వ్యక్తంచేసిన మానవ స్వప్నం యేమిటి?

ఉపయోగకరమైన అనేక పనిముట్లను కనిపెట్టిన ఆరితేరిన వాస్తుశిల్పి, శిల్పి డేడలస్ క్రీట్ ద్వీపంలోని రాజసౌధంలో నివసిస్తూండేవాడు. డేడలస్ ఆ ద్వీపంనుంచి వెళ్లిపోయేందుకు రాజు అనుమతించలేదు. అప్పుడు డేడలస్ తనకోసం, తన కొడుకు ఇకారస్‌కోసం పక్షి ఈకలతోనూ, మైనంతోనూ రెక్కలు తయారుచేశాడు. వాళ్లిద్దరూ ఆ రెక్కలు తగిలించుకొని ఆకాశంలోకి లేచి క్రీట్ ద్వీపంనుంచి బయటకి ఎగిరిపోయారు. సూర్యుడికి మరీ దగ్గరగా పోకుసుమా అని తన కొడుకును డేడలస్ హెచ్చరించాడు. మొదట ఇకారస్ తన తండ్రి దగ్గరగానే ఎగిరాడు, కాని తర్వాత ఆకాశంలో బాగా పైకి ఎగిరాడు. మండుటెండకి మైనం కరిగిపోయి, రెక్కలు ఊడి

---

* ఏగేయన్ సముద్రాన్నీ, నల్ల సముద్రాన్నీ కలిపే జలసంధి చాలా యిరుకైనది. దీన్నిబట్టే కదిలే కొండల పురాణ గాథ యేర్పడి ఉంటుంది.

పోవడంతో ఇకారస్ సముద్రంలో కూలిపోయి, మునిగిపోయాడు. రెక్కలకి వున్న ఈకలు మాత్రమే సముద్రపు అలలమీద తేలాయి. డేడలస్ సిసిలీ ద్వీపానికి చేరుకున్నాడు.

? **1.** హెరాక్లిస్, ఆర్గోనాట్లను గురించిన పురాణ గాథల్లో పేర్కొనబడిన వృత్తులు యేమిటి? **2.** ఆ గాథల్లోని ఏ విషయాలు గ్రీకు ప్రజల్లో అసమానతల అవతరణను సూచిస్తాయి? **3.** ఆ గాథల ప్రకారం గ్రీకులు మనిషిలో వేటికి విలువనిచ్చారు? **4.** ప్రాచీన గ్రీకుల ఊహల ప్రకారం ఆకాశం ఎలా వుంటుంది? ఆకాశాన్ని గురించిన అలాంటి అభిప్రాయాలు మీకు యింతకుముందు ఎక్కడ తటస్థపడ్డాయి? **5.** హెరాక్లిస్‌కి సంబంధించిన గాథలకి శీర్షికలు పెట్టండి.

## §27. హోమర్ రచించిన ''ఇలియడ్,'' ''ఒడిస్సీ'' కావ్యాలు

(మాప్ 4, పేజి 120లోని మాప్)

ప్రభువులంటే ఎవరో జ్ఞాపకం చేసుకోండి (§ 5; 4).

1. పురాణ కావ్యాల పుట్టుక. వివిధ వీరుల అద్భుత కృత్యాలనూ, అసాధారణ సాహస యాత్రలనూ గురించి ప్రాచీన గ్రీసు దేశపు కవులు అనేక గేయాలు కల్పించారు. వాటిని వాళ్లు విందు సమయాల్లో తంత్రీ వాద్యాల తోడ్పాటుతో పాడేవాళ్లు. ట్రాయ్ నగరంమీద గ్రీకుల దండయాత్రా, అక్కడనుండి ఆ సైన్యాలు తిరిగి రావడమూ అత్యంత జనప్రియమైన యితివృత్తాల్లో ఒకటి.

ట్రాయ్, లేక ఇలియన్ ఆసియా మైనర్ తీరంలోని ఒక నగరం. అనేక గ్రీకు తెగలు తమ తెగ నాయకుల నాయకత్వం కింద ట్రాయ్‌పై దండయాత్రలో పాల్గొన్నారు. నగరం దుర్భేద్యమైనది. అది ఒక యెత్తైన కొండమీద వుంది; దాని చుట్టూ రాతి గోడ వుంది. గ్రీకులు తమ కొయ్య పడవలను ఒడ్డుకు లాక్కువెళ్లి, వాటి చుట్టూ శిబిరంగా యేర్పడి, పది సంవత్సరాలపాటు ట్రాయ్‌ని ముట్టడించారు.

ఆ పాటలమీద ఆధారపడ్డాయి ''ఇలియడ్,'' ''ఒడిస్సీ'' అనే రెండు పెద్ద పురాణ కావ్యాలు. ఆనాటినుండి వస్తున్న జనశ్రుతి ప్రకారం, క్రీ.పూ. 6వ శతాబ్దిలో జీవించిన హోమర్ అనే ప్రసిద్ధ అంధకవి ఆ పాటలను సేకరించి, వాటికి కావ్య రూపం యిచ్చాడు. ఆ కావ్యాలు క్రీ.పూ. 6వ శతాబ్దిలో రచింపబడ్డాయి.

2. ''ఇలియడ్'' ఇతివృత్తం. ఈ కావ్యానికి ఇలియన్ నగరంనుంచి యీ పేరు వచ్చింది. ఈ కావ్యంలో ట్రాయ్ నగరపు ముట్టడి పదో సంవత్సరంలో జరిగిన ఘటనలు వర్ణింపబడ్డాయి.

దీర్ఘ కాలంపాటు జరిగినా ట్రాయ్ ముట్టడి విజయవంతం కాకపోవడంతో గ్రీకు సైనికుల్లో ధైర్యం సడలింది. గ్రీకులను ప్రోత్సహించడానికి తెగ నాయకులు ప్రజా సభ జరపడానికి నిర్ణయించారు. గ్రీకు శిబిరపు మైదానంలో గుమికూడిన జనంలో కలకలం చెలరేగింది. యుద్ధంలో దొరికిన వస్తువులన్నీ తెగ నాయకులే సంగ్రహించుకున్నారని థెర్సిటిస్ అనే సాధారణ సైనికుడు ధైర్యంగా తెగ నాయకులను నిందించాడు. స్వదేశానికి వెళ్లిపొమ్మని





1. హోమర్ కవి ప్రాచీన గ్రీకు బస్టు హోమర్ జన్మస్థలం తమ నగరమేనంటూ ఏడు గ్రీకు నగరాలు వివాదపడ్డాయి. 2. తవ్వకాల్లో లభించిన ట్రాయ్ ప్రాకార శిథిలాలు

అతను సైనికులను ఉద్బోధించాడు. ఒడిస్సస్ అనే సేనా నాయకుడు అతన్ని క్రూరంగా కొట్టి, అతని నోరు మూయించాడు. తెగ నాయకులు యెంతో కష్టంతో ట్రాయ్ ముట్టడిని కొనసాగించడానికి సైనికులను ఒప్పించారు.

మళ్లీ గ్రీకులకూ, ట్రాయనులకూ దీర్ఘ ఘోర యుద్ధాలు ప్రారంభమయాయి. దాడిచేసేటప్పుడు గ్రీకులు తెగలను బట్టీ, గణాలనుబట్టీ విడివిడి దళాలుగా యేర్పడేవాళ్లు. సాధారణ సైనికులు పదాతి దళాల్లో యుద్ధం చేసేవాళ్లు. వాళ్లు నూలు బట్టలు ధరించేవాళ్లు. ఈటెలూ, రాళ్లూ మాత్రమే వాళ్ల ఆయుధాలు. నాయకులు రాగి కవచాలతో తమ దేహాలను రక్షించుకొనేవాళ్లు, గుర్రాలు లాగే రథాలలో యెక్కేవాళ్లు. ఈటెలకు తోడు వాళ్లకు కంచు ఖడ్గాలు వుండేవి.

ఒక తెగ నాయకుడూ, బలిష్ఠుడూ, వేగరీ అయిన అఖిలెస్ గ్రీకుల్లో కెల్ల అత్యుత్తమ యోధుడుగా పేరు పొందాడు. ట్రాయన్లలో కెల్ల మిక్కిలి బలవంతుడు, అత్యంత సాహసికుడు హెక్టర్. ''ఇలియడ్'' కావ్యంలో వాళ్లిద్దరి మధ్య జరిగిన ద్వంద్వ యుద్ధం వర్ణింపబడింది (అనుబంధం చూడండి).

''ఇలియడ్'' యుద్ధంలో దేవతల జోక్యాన్ని వర్ణించింది; కొందరు దేవతలు గ్రీకులకూ, మరికొందరు ట్రాయనులకూ తోడ్పడ్డారు. ఉదాహరణకు, కమ్మరపని దేవుడు హెఫేస్టస్ అఖిలెస్‌కు కవచం తయారుచేశాడు.

### 3. ట్రాయ్ పతనం.

ట్రాయన్ యుద్ధ సమాప్తి యితర గేయాలలోనూ, గాథలలోనూ వర్ణింపబడింది. హెక్టర్‌తో పోరాటం తర్వాత త్వరలో అఖిలెస్ సంహరింపబడ్డాడు. గ్రీకు గాథ ప్రకారం, అఖిలెస్ శిశువుగా వున్నప్పుడు దేవత అయిన అతని తల్లి అతన్ని ఒక భూగర్భ నదిలో స్నానం చేయించింది. దాని ఫలితంగా అతని దేహం దుర్భేద్యమయింది. కాని అతని తల్లి అతని మడమ పట్టుకొని స్నానం చేయించింది. కనుక అది మాత్రం మామూలుగా వుండిపోయింది. ఒక విష లిప్త బాణం అఖిలెస్

మడమకు గుచ్చుకున్నందున అతను మరణించాడు. దీన్నిబట్టి దుర్బలమైన భాగం అనే అర్థంలో ''అఖిలెస్ మడమ'' అనే నానుడి యేర్పడింది.

ట్రాయ్ నగరాన్ని ఆక్రమించుకునేందుకు గ్రీకులు ఒక యుక్తి పన్నారు. ఒడిస్సస్ చాలా యుక్తిపరుడు. ఒక పెద్ద కొయ్య గుర్రం నిర్మించమని అతను గ్రీకులకు సలహా చెప్పాడు. సైనికుల దళం ఒకటి అందులో దాక్కుంది. తక్కినవాళ్లు అర్ధరాత్రి పూట ఓడలెక్కి సమీపంలో వున్న ఒక ద్వీపానికి పోయి, అక్కడ పొంచివున్నారు. ట్రాయన్లు ఆ గుర్రాన్ని చూసి, కోట గోడలో కంత పెట్టి, దాని గుండా ఆ కొయ్య గుర్రాన్ని తమ నగరంలోకి లాక్కుపోయారు.

రాత్రివేళ గ్రీకు సైనికులు గుర్రంలోనుండి బయటికి వచ్చి, కోట ద్వారాలు తెరిచారు. అదే సమయంలో ఓడలెక్కి పోయినవాళ్లు నిశ్శబ్దంగా తిరిగివచ్చి ట్రాయ్ నగరంలోకి ప్రవేశించారు. వాళ్లు పురుషులందర్నీ చంపేసి, స్త్రీలను, పిల్లలను ఖైదీలుగా పట్టుకున్నారు, నగరాన్ని కొల్లగొట్టి, అగ్గి పెట్టారు. విలువైన కొల్ల సొమ్ముతో గ్రీకులు స్వదేశానికి తిరిగిపోయారు. అప్పటినుంచి ''ట్రాయన్ గుర్రం'' అంటే హానికరమైన కానుక అనే అర్థం రూఢమైంది.

## 4. ''ఒడిస్సీ'' ఇతివృత్తం.

ఈ కావ్యం ఒడిస్సస్ ట్రాయ్‌నుండి గ్రీసు దేశపు పశ్చిమ తీరం దగ్గరవున్న తన స్వదేశమైన ఇథాకా అనే దీవికి ప్రయాణం చేసేటప్పుడు జరిపిన సాహస కృత్యాలను వర్ణిస్తుంది.



1



2

1. ట్రాయన్లు చంపిన పట్రోక్లిస్ శవంకోసం పోరాటం (క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి శిల్పం). మధ్యలో గ్రీకులను సమర్థించిన ఏథెనా దేవత నిలబడివుంది. పట్రోక్లిస్ ఆమె పాదాల దగ్గర ఉన్నాడు. 2. ఒడిస్సస్, సిరెనీలు (గ్రీకు వాజు మీది చిత్రం). గ్రీకు పురాణాల ప్రకారం నిర్జన ద్వీపాల్లో నివసించే సగం స్త్రీలు, సగం పక్షులు అయిన సిరెనీలు తమ పాటల ద్వారా నావికులను ఆకర్షించి వారిని మృత్యువుకి కబళం చేసేవాళ్లు. ఆ దీవి పక్కగా పయనిస్తున్న ఒడిస్సస్ తన సహచరులను మైనంతో చెవులు మూసుకొమ్మనీ, తనను ఓడ తెరచాప కొయ్యకు బంధించమనీ ఆజ్ఞాపించాడు. సిరెనీలు పాడగా విని కూడా ప్రాణాలతో బయటపడిన ఏకైక వ్యక్తి ఒడిస్సస్

ఇథాకా సైనికులు పన్రెండు ఓడలలో బయలుదేరారు. అప్పటికి ట్రాయ్ శిథిలాలు యింకా మండుతున్నాయి. ఉత్తర శీతల వాయుదేవుడు తుపాను రేపాడు. గ్రీకులు దారి తప్పారు. రెండు సార్లు ఒడిస్సనూ, అతని అనుచరులూ రాక్షసులు నివసించే దీవులలో దిగారు. రెండవ దీవిలోని పర్వతాలంత యెత్తు వున్న రాక్షసులు ఓడలమీదికి శిలలు విసిరి, పదకొండు ఓడలను ధ్వంసం చేసి, ఆ ఓడలలోని వాళ్లనందరినీ మృత్యువుపాలు చేశారు. ఒక్క ఒడిస్సస్ ఓడ మాత్రం తప్పించుకొని, ప్రయాణం సాగించి, సముద్రాన్ని చేరుకుంది. ఒడిస్సస్ అనుచరులు జీయస్‌కు ఆగ్రహం తెప్పించారు. జీయస్ ఉరుముల మెరుపుల దేవుడు. అతను మిరుమిట్లు గొలిపే మెరుపుతో ఒక పిడుగును ఓడమీద విసిరాడు. ఒడిస్సస్ ఒక్కడే తెరచాప కొయ్య తుంట పట్టుకొని, సజీవంగా మిగిలాడు. సముద్రపు అలలు అతన్ని ఒడ్డుకి చేర్చాయి.

పదేండ్లు ప్రయాణం చేసిన తర్వాత చివరకు ఒడిస్సస్ ఇథాకా చేరాడు. అతను మొదట తన బానిసలలో ఒకనితో కలిసి జీవించాడు. ఆ బానిస అతని పందులు కాసేవాడు. ఆ బానిస స్వతంత్రుల కుటుంబంలో పుట్టినవాడు. కాని చిన్నప్పుడే ఫొనీషియన్ వర్తకులు అతన్ని దొంగిలించి, ఇథాకాలో బానిసగా అమ్మారు. ఒడిస్సస్ లేనప్పుడు యితర ప్రభువులు అతని యింటిని ఆక్రమించుకున్నారు. అంచేత ఒడిస్సస్ తన యింటికి బిచ్చగాని దుస్తులలో వచ్చాడు. తన భవంతిలోని అవాంఛిత అతిథులను చంపి, ఒడిస్సస్ తిరిగి ఇథాకాను పాలించనారంభించాడు.

**5. గ్రీసు చరిత్ర అధ్యయనంలో కావ్యాల ప్రాముఖ్యం.**

హోమర్ కావ్యాలలో యెన్ని అద్భుతమైన ఘటనలు వున్నాయంటే, చాలాకాలం పండితులు అవన్నీ కేవలం కల్పన అనుకున్నారు. ట్రాయ్ అనే నగరమే యెప్పుడూ లేదని కూడా చాలామంది భావించారు.

ఆసియా మైనర్‌లో, సముద్రానికి అనతిదూరంలో వున్న కొండమీద, 19వ శతాబ్ది ఉత్తరార్ధంలో పురాతత్వ త్రవ్వకాలు మొదలుపెట్టారు. పది సార్లకి పైగా ఆ స్థలంలో జనులు స్థిరనివాసాలు యేర్పరచుకున్నట్లు తేలింది. ప్రతి జనావాసమూ తన ఆనవాళ్లు వదలిపెట్టి పోయింది. ఆనవాళ్లంటే గృహశిథిలాలు, మనుషులు పారవేసిన వస్తువులు లేదా జాగ్రత్తగా దాచిపెట్టిన వస్తువులు. అవన్నీ మట్టిలో పూడివున్నాయి. పెద్ద మంట సంభవించినట్లు ట్రాయ్ శిథిలాలలో అసందిగ్ధమైన సాక్ష్యం వుంది.

ట్రాయ్ నగరం నిజంగా వుండేదనీ, అది వాస్తవంగా ధ్వంసం చేయబడిందనీ త్రవ్వకాలు నిస్సందేహంగా రుజువు చేశాయి. క్రీ.పూ. 1200వ సంవత్సర ప్రాంతంలో గ్రీకులు దాన్ని ముట్టడించారు. ప్రాచీన గ్రీసులో ప్రజల ఆచారాలూ, వృత్తులూ, నివాస గృహాలూ, పనిముట్లూ, ఆయుధాలూ – వీటిని గురించి హోమర్ సరైన చిత్రం యిచ్చాడు. క్రీ.పూ. 11వ, 9వ శతాబ్దుల నాటి గ్రీసు చరిత్రను అధ్యయనం చేయడంలో హోమర్ కావ్యాల ప్రాముఖ్యం యెంత వుందంటే, ఆ కాలానికి హోమర్ యుగం అని పేరు వచ్చింది.

హోమర్ కావ్యాలకి మిక్కిలి గొప్ప సాహిత్య కృతుల్లో స్థానం వుంది. అవి సుసంపన్నమైన, అలంకార సహితమైన భాషలో రచింపబడ్డ గంభీరమైన కవితా ఖండాలు (ఆ కావ్యాలనుంచి కొన్ని భాగాలు § 27, 28, 29లకి అనుబంధాల్లో యివ్వబడ్డాయి).

''ఇలియడ్''నుండి.

## అఖిలెస్‌కీ, హెక్టర్‌కీ జరిగిన యుద్ధం

గ్రీకులకూ, ట్రాయన్లకూ యుద్ధం జరిగేటప్పుడు, గ్రీకులను అభిమానించే ఏథెనా అనే దేవత హెక్టర్ సోదరుని మాదిరి మారువేషం ధరించింది. అఖిలెస్‌ను ద్వంద్వ యుద్ధానికి సవాలు చేయమనీ, తాను సహాయం చేస్తాననీ చెప్పి ఆమె హెక్టర్‌ను ఒప్పించింది.

మొదట అఖిలెస్ హెక్టర్‌మీద ఈటె విసిరాడు. హెక్టర్ వంగి తప్పించుకున్నాడు. తరువాత అతను విసిరిన ఈటె అఖిలెస్ డాలుకు తగిలింది. ఆ డాలు హెఫేస్టస్ అనే దేవుడు తయారు చేసింది. అది చాలా గట్టిది. అఖిలెస్‌కు దెబ్బ తగల్లేదు. అప్పుడు ఏథెనా అఖిలెస్‌కు మరొక ఈటెని అందించింది. హెక్టర్ తన సోదరుని పిలిచాడు. కాని అతనికి మరొక ఈటె అందివ్వడానికి అక్కడ యెవరూ లేకపోయారు. అందువలన అతను అఖిలెస్‌మీద ఖడ్గంతో తలపడ్డాడు:

''ఇటు హెక్టర్ చర్రున భారీ ఖడ్గం దూశాడు,
గగనంలో విహరించే గరుడపక్షి
బితుకుబితుకుమనే కుందేటిపై దూకినట్లు
శక్తినంతనీ కూడదీసుకు అఖిలెస్‌పై ఉరికాడు.
అటు అఖిలెస్ ప్రళయ రుద్రుడయ్యాడు
ప్రచండ వేగంతో సమర సనూయత్తుడయ్యాడు
వక్షోపరి కవచం అగ్ని దీధితులు బరపగ
సూర్యకాంతిలో శిరస్త్రాణం తళతళ లాడగ
రాజ చిహ్నం ఉరమున అటు యిటు ఊగగ
గుర్రపుజూలు బంగరు ఎండలో మెరియగ
అగ్నిదేవత వోలె, ప్రళయ రుద్రునిభాతి
రయాన దూకెను అఖిలెస్ వీరుడు.''

అఖిలెస్ హెక్టర్‌ని శూలంతో పొడిచాడు. అఖిలెస్ తన శత్రువును అవమానించడానికి, హెక్టర్ కాళ్లను తన రథానికి కట్టి, రథాన్ని వేగంగా తన స్కంధావారంలోకి తోలాడు. విజయ గర్వితులైన గ్రీకులు పొలికేకలతో అభినందించారు.



హెక్టర్ శవంతో అఖిలెస్ (ఒక ప్రాచీన గ్రీకు వాజుమీది చిత్రం)

## ''ఒడిస్సీ''నుండి. సైక్లప్స్ దీవిమీద గ్రీకులు

ఈ కథ ద్వారా గ్రీకుల వృత్తులను గురించి మీరు కొత్త విషయాలు ఏం తెలుసుకున్నారు?

ఒడిస్సస్, అతని అనుచరులూ ఒక పెద్ద తుపానులో దారితప్పారు. నొసటి మధ్య ఒక్క కన్ను మాత్రమే వున్న సైక్లప్స్ అనే రాక్షసులు వుండే దీవికి వాళ్ళు చేరారు. సైక్లప్స్ వుండే గుహలో ఒడిస్సస్ తన అనుచరులతో సహా ప్రవేశించాడు. గుహలో జున్ను, రొట్టెలూ, పెరుగు పాత్రలూ అనేకం వున్నాయి. సైక్లప్ గొర్రెలూ, మేకలూ పెంచేవాడు.

''గొర్రెల మందల కాపేటి
ఒంటి కంటి రాకాసి
ఒంటరి గుహవాసి
భీతి గొలుపు వదనం
పెను కొండబోలు ఆకారం
జీబూతం లాంటి జుట్టు
వికటాట్ట హాసం
సైక్లప్ రాకాసి తిరుగు
దీవికెల్ల రాజు లాగు.
ఎదురులేని జోదు లాగు.''

సాయంత్రం సైక్లప్ తన మందను గుహలోకి తోలుకొని వచ్చాడు. గుహ ద్వారాన్ని అతను పెద్ద బండతో మూశాడు. ఒడిస్సస్‌కీ, అతని అనుచరులకీ ఆ బండను కదిలించేటంత బలం లేదు. రాక్షసుడు గ్రీకులను చూస్తూనే,

యిద్దరిని భక్షించాడు. మరు దినం మరి నలుగురిని తిన్నాడు. ఒడిస్సస్ ఆ రాక్షసుడిచేత ద్రాక్షసారాయి తాగించాడు. సైక్లప్ నిద్రపోగానే, మిగిలిన వాళ్ళు అతనికున్న ఒక్క కంటినీ పదునైన కొయ్యతో పొడిచారు. ఉదయం గొర్రెలనూ, మేకలనూ బయటికి తోలడానికి గుడ్డి సైక్లప్ గుహ ద్వారం తెరిచాడు. మందతోపాటు మనుషులు బయటికి పోకుండా అతను ద్వారం దగ్గర కూర్చున్నాడు. మూడు పొట్టేళ్లను ఒకటిగా కట్టి, వాటి కడుపుల కింద మనిషిని వుంచే పద్ధతిని ఒడిస్సస్ సూచించాడు. ఈవిధంగా గ్రీకులందరూ తప్పించుకొని బయటపడి, ఓడ యెక్కి పారిపోయారు.

? 1. "ఇలియడ్," "ఒడిస్సీ" కావ్యాలను ఎవరు, ఎప్పుడు రచించారు? 2. ఆ కావ్యాల్లోని ఏ ఘట్టాల ద్వారా హోమర్ యుగపు గ్రీసులో గణాలు ఉండేవని తెలుస్తుంది? గ్రీకు సమాజంలో అసమానత్వం ఉండేదని మీరు ఎలా చెప్పగలరు? కనీసం నాలుగు ఉదాహరణలు యివ్వండి. 3. 210వ పేజిలోని కాలక్రమ పట్టికలో హోమర్ యుగాన్ని గుర్తించండి. ఆ యుగం ఎన్ని శతాబ్దాల క్రితం ఆరంభమైంది, అంతమైంది? 4. హోమర్ కావ్యాల్లో మీకు నచ్చింది యేమిటి?

## §28. క్రీ.పూ. 11వ–9వ శతాబ్దాల్లో గ్రీకుల వృత్తులు, వర్గాల ఆవిర్భావం

ఆసియా మైనర్ దేశాలకు ఇనుము పోత ప్రాముఖ్యాన్ని జ్ఞాపకం చేసుకోండి (§16; 2).

పురాణ గాథల ద్వారా, హోమర్ కావ్యాల ద్వారా ప్రాచీన గ్రీకుల జీవితం గురించి మీరు చాలా తెలుసుకున్నారు. § 28ని అధ్యయనంచేసి, మీ యీ జ్ఞానానికి అనుబంధంగా హోమర్ యుగం నాటి గ్రీసు చరిత్రకి సంబంధించిన నూతన విషయాలను తెలుసుకోండి.

**1. వ్యవసాయం, చేతిపనులు.** హోమర్ యుగంలో గ్రీకులు ప్రధానంగా వ్యవసాయంలోనూ, పశుపాలనలోనూ నిమగ్నులయ్యారు.

గ్రీసులోని రాతి నేలల్లో వ్యవసాయం కష్టమైన పనిగా వుండేది. మొదట పొలంలో రాళ్లన్నీ యేరివేయాలి. అనేక చోట్ల భూమి చాలా గట్టిగా వుండేది, దాన్ని కొయ్య నాగలితో మూడు నాలుగు సార్లు దున్నాల్సివచ్చేది. అప్పటికీ మళ్లీ తవ్వుగోలతో కెళ్లగించాల్సివచ్చేది. తరుచుగా ఈ ప్రయత్నాలన్నీ విఫలమయ్యేవి. వర్షం లేక పైర్లు యెండిపోయేవి, లేదా అతి వృష్టి వలన కొండ వాగులు పొంగి పైర్లను వూడ్చివేసేవి. గ్రీకులు ప్రధానంగా బార్లీ విత్తేవాళ్లు. అది అనావృష్టికి తట్టుకొని, త్వరగా పైరు అయ్యేది. బార్లీ రొట్టెలు, జావయే రైతుల ప్రధాన ఆహారం. గుట్టలమీది యేటవాలు ప్రదేశాలలో గోధుమ తక్కువగా నాటేవారు. (గ్రీకులకి ఏ మొక్కల తోటల పెంపకం తెలుసు? గ్రీకులు పెంచిన జంతువులేమిటో జ్ఞాపకం చేసుకోండి.)

రైతులు తమ అవసరాలకు కావలసినవి దాదాపు అన్నీ తామే తయారుచేసుకునేవాళ్లు. వాళ్లు ముతక బట్టలు ధరించే





1. గ్రీసులో వ్యవసాయపు పనులు (క్రీ.పూ. 6వ శతాబ్ది నాటి ఒక గ్రీకు వాజుమీది చిత్రం). రోజు కూలీలు పారలతో, నాగళ్లతో చేలను దున్నుతున్నారు. రోజు కూలీ తాత్కాలికమైన పని చేసే పేదవాడే గాని స్వతంత్రుడు. 2. ధాన్యం దంపడం (ఒక గ్రీకు వాజుమీది చిత్రం)

వాళ్లు. మేకల, గొర్రెల వున్నితో చేసిన ముతక కంబళ్లమీద పడుకునేవాళ్లు. వాళ్లు మట్టితో కుండలూ, చర్మంతో తేలిక పాదరక్షలూ, చెప్పులూ చేసుకునేవాళ్లు.

ఇనుముతో చేసిన వస్తువులు గ్రీసులో క్రీ.పూ. సుమారు 1000 సంవత్సరాల నాడు అవతరించాయి. (గ్రీకుల, ట్రాయన్ల ఆయుధాలు వేటితో చెయ్యబడ్డాయో జ్ఞాపకం చేసుకోండి.) ట్రాయ్ ముట్టడి కాలంలో జరిగిన గ్రీకు క్రీడల పోటీల్లో ఒక ఇనుప ముక్క ప్రధాన బహుమతుల్లో ఒకటి.

ఇనుప పనిముట్లు వ్యాప్తి చెందడంతో భూమిని సాగుచెయ్యడం సులభతరమైంది, పంటల రకాలు పెరిగాయి, మాసూళ్లు యెక్కువయాయి.

**2. సముద్రయానం.**

ఎగేయన్ సముద్రంమీద నౌకా యానానికి పరిస్థితులు అనుకూలంగా వుండేవి. గ్రీకులు సముద్రంలో చేపలు పట్టేందుకూ, హోమర్ యుగం మొదట్లోనే దీర్ఘ నౌకా యానాలకూ వెళ్తూండేవారు. (గ్రీకులు చేసిన ఏ నౌకా యానాలను గురించి మీకు తెలుసు?) గ్రీకులకు కొయ్య పడవలు నిర్మించడం తెలుసు. అవి పెద్ద నౌకల లాగుండేవి. ఆ పడవలలో ఎగేయన్ సముద్రంలో సైతం తీరానికి దూరంగా పోవడం ప్రమాదకరం. అందుకే గ్రీకులు ప్రశాంత వాతావరణంలో, పగటి పూట మాత్రమే, తీరం యెప్పుడూ కనుచూపు మేర దాటిపోకుండా, తీరం వెంబడి గాని, ఒక దీవినుండి మరొక దీవికి గాని ఆ పడవల్లో ప్రయాణం చేసేవాళ్లు. రాత్రికల్లా తమ పడవలను ఒడ్డుకు లాగేసేవాళ్లు.

### 3. హోమర్ యుగపు గ్రీసులో తెగ, గణం.

గ్రీసులో దాదాపు ప్రతి మైదానంలోనూ, ప్రతి ద్వీపంలోనూ ఒక భిన్న తెగ నివసించేది. ప్రతి తెగలో కొన్ని గణాలూ, ప్రతి గణంలో కొన్ని కుటుంబాలూ వుండేవి.

భూమి గణానికి సమష్టి ఆస్తిగా వుండేది. ఆ భూమిలో తనకి కేటాయింపబడిన ఖండాన్ని ప్రతి కుటుంబమూ సాగుచేసేది. పశువులు మేసే పచ్చిక మైదానాలు సమష్టి ఆస్తిగా వుండేవి.

గణంలో యెవరైనా శత్రువుచేతిలో మరణిస్తే, అందరూ కలిసి పగ తీర్చుకునేవాళ్ళు. యుద్ధ సమయంలో తెగలోని పురుషులందరూ ప్రజా సభకు హాజరయ్యేవాళ్ళు.

గణ సభ్యులలో సమానత్వం ఉండేది కాదు. కొంతమంది బీదవాళ్ళయి, యితరుల క్షేత్రాల్లో కూలీలుగా పనిచేసే వాళ్ళు, లేదా బిచ్చమెత్తుకునేవాళ్ళు. ఒడిస్సస్ ఇథాకాలో బిచ్చగాని వేషంలో కనిపించినప్పుడు యెవరూ ఆశ్చర్యపడకపోవడం యిందుకొక ఉదాహరణ. ఆనాటికే గ్రీసులో బీదవాళ్ళు చాలామంది ఉండేవారు. గణంలోని ప్రభువులు ధనికులయ్యారు.

### 4. కులీనుల గృహక్షేత్రాలు.

నదికో, కాలవకో దగ్గర్లో వున్న అత్యుత్తమమైన భూములు కులీనుల కుటుంబీకులకి చెందివుండేవి. సాధారణంగా వాళ్ల పొలాలను వాళ్లే సేద్యం చేసుకునే వాళ్ళు. ఉదాహరణకు, ఒడిస్సస్ సేద్యం చేసేవాడు, వడ్రంగం పని చేసేవాడు. (ఎడ్లను కట్టడం, నాగలితో పొలం దున్నడం తెలిసిన యితర కులీనులు ఎవరు?) కాని పొలం పనికి వాళ్ళు రోజు కూలీలను కూడా కుదుర్చుకునేవాళ్లు. కూలివాళ్లకు కొద్దిగా తిండీ, బట్టా యిచ్చేవాళ్ళు.

ఇనుప పనిముట్ల అవతరణతో అదనపు భూమిని ఆక్రమించుకోవడం లాభసాటిగా తయారైంది. భూమిని సేద్యం చేసేందుకోసం రోజు కూలీలను కుదుర్చుకోవడంతో యజమాని కూలివాళ్లకి యివ్వవలసివచ్చేదానికన్న చాలా ఎక్కువ ధాన్యం, వగైరాలు లభ్యమయ్యేవి. మిగిలిన ఫలసాయమంతా అతను సొంతంచేసుకునేవాడు. ప్రభువులకి గణ సభ్యుల్లో యితరుల కంటె చాలా ఎక్కువ పశువులు వుండేవి. గణానికి చెందిన పచ్చికబీళ్లను క్రమంగా అతను చేజిక్కించుకునేవాడు.

గ్రీకు ప్రభువులకి యుద్ధం ద్వారా కూడా యెక్కువ సంపద ఒనగూడేది. వాళ్లకు ఖైదీలూ, కొల్ల సొమ్ములో అగ్రభాగమూ లభించేవి. (ఈ విషయంలో "ఇలియడ్" ఏమి సమాచారం యిస్తోంది? గ్రీకు ప్రభువులకి ఇంకేయే పద్ధతుల్లో బానిసలు లభ్యమయ్యేవాళ్ళ?) కులీనులు బానిసలతో పనిచేయించుకునేవాళ్ళు. బానిసలు బట్టలు నేసేవాళ్ళు, తోటలు పెంచేవాళ్ళు, పశువులను మేపేవాళ్ళు, వంట చేసేవాళ్ళు.

బానిసలూ, కూలివాళ్ళూ వున్నందువలన గణ నాయకులకూ, వాళ్ల కుటుంబాలకూ యెప్పుడూ పుష్కలంగా ఆహారమూ, ద్రాక్ష సారా; బట్టలూ, చెప్పులూ వుండేవి; రాగి, కంచు వస్తువులూ, అందమైన వస్త్రాలూ, బంగారు ఆభరణాలూ మార్పిడి ద్వారా తెచ్చుకోడానికి మిగులు పశు సంపద కూడా కొంత వుండేది. ఈ వస్తువులు ప్రియంగా ఉండేవి. ఉదాహరణకి, అన్నం వండుకునే ఒక్క రాగి కుంపటికి 12 ఎడ్లను చెల్లించాల్సివచ్చేది.

### 5. కులీనుల అధికారం.

గణ నాయకులూ, పెద్దలూ తమ సంపదనీ, గణ సభ్యులమీద తమ అధికారాన్నీ కాపాడుకునేందుకు తరచు బలప్రయోగానికి పూనుకోవలసివచ్చేది. (గణ నాయకుడు సామాన్య సైనికుణ్ణి ఎలా నోరుమూయించాడు?) ప్రజా సభ సమావేశాలు అరుదైనాయి. ఉదాహరణకు, ఇథాకాలో 20 సంవత్సరాల కాలంలో ఒక సమావేశం మాత్రమే జరిగింది. తెగ వ్యవహారాలన్నీ తెగ నాయకుని నాయకత్వం కింద పెద్దల సభ చూసేది. గణ నాయకులూ, పెద్దలూ తమ ఐశ్వర్యాలనే గాక గణాలమీద తమకు గల విశేషమైన అధికారాలను కూడా తమ కొడుకులకూ, వారసులకూ యిచ్చిపోయేవాళ్ళు. తమ గణంలోని సాధా

రణ సభ్యుల కంటె యింకా ఉన్నతమైన స్థానం పొందడానికి వాళ్ళు తాము దేవతల సంతతివాళ్ళమని చెప్పుకొనేవాళ్ళు. ("ఇలియడ్" కావ్యంలో యే వీరుడు దేవతా పుత్రుడుగా వర్ణింపబడ్డాడు?)

హోమర్ యుగంలో ఆదిమ సమష్టి వ్యవస్థనుండి బానిస యాజమాన్య వ్యవస్థకు క్రమంగా పరివర్తన చెందే దశలో ప్రవేశించింది గ్రీసు.




క్రీ.పూ. 11–9 శతాబ్దాల్లో గ్రీసులో వర్గాల ఆవిర్భావం

## "ఇలియడ్"లో అఖిలెస్ డాలు వర్ణననుంచి

"ఇలియడ్" కావ్యంలో డాలు, రాజసౌధాల వర్ణనుబట్టి గణ నాయకుడి క్షేత్రం గురించి మనకి ఏమి తెలుస్తోంది? కులీనులు తమ సంపదకి మూలం ఏమని చెప్తారు?

నిలువెత్తెదిగిన చేలలో
బంగరు కంకులు గాలికి
తలలూపుతున్నాయి
కొడవళ్లు చేబూని కోత కూలీలు
నడుమెత్తకుండా పంట కోస్తున్నారు...
ఊచకొడవళ్లు చేబూని కొందరు
ఒత్తైన పచ్చికను కోసివేస్తున్నారు
కూలీలు పచ్చికను కుప్పలెడుతున్నారు
లేత పిల్లలు పరిగ పరకలనేరి
కింద మీదా పడుతు మోసుకెళ్తున్నారు

ఉలుకు పలుకూ లేక కూర్చున్న భూస్వామి
కుప్పల జూసి కనురెప్ప లప్పళిస్తున్నాడు.
ఇటు దట్టమైన చెట్టు నీడన దొరకి
విందుభోజనమ్ము వడ్డిస్తువున్నారు...
అటు మోరలెత్తిన ఎడ్లు బోరలెత్తుకు చూస్తు
పచ్చిక బీళ్ల దిశ పరుగుదీస్తున్నాయి...

''ఒడిస్సీ''లో రాజభవనపు వర్ణననుంచి

కలకలలాడే భవనం
బిలబిలలాడే దాసిజనం
తిరగలి తిప్పుతు కొందరు
ధాన్యం దంపుతు కొందరు
రాట్నం తిప్పుతు కొందరు
సేవలు చేస్తూ అందరు...
భవనం చుట్టూ విశాల ఉపవనం.
వనం చుట్టూ ఎత్తగు ప్రాకారం
బారుల్లో మేలి జాతి ద్రాక్షలు
పూలమొక్కలు, ఫల వృక్షలు
సతత హరిత వనౌషధులు
తోటలొ అటుయిటు జలయంత్రాలు
నయనానందకరమగు ఈ వనం
దేవతలే నాటిరొ యేమో!...

? **1.** ప్రాచీన గ్రీకు ప్రజల వృత్తులను గురించి మీకేమి తెలుసు? **2.** హోమర్ యుగానికి చెందిన కులీనుల జీవితం గురించి వివరించండి. పౌరాణిక గాథలనుంచీ, కావ్యాలనుంచీ యిందుకు ఉదాహరణలు యివ్వండి. **3.** హోమర్ యుగంలో సమాజంలో ఏయే వర్గాలు అవతరించాయి? వర్గాలు ఎందుకు తలెత్తాయి? **4.** ఈకింది పట్టికను పూరించండి:

| హోమర్ యుగంలో ఆదిమ సమష్టి వ్యవస్థకి చెందిన ఏయే అంశాలు గ్రీకుల్లో మిగిలివున్నాయి | హోమర్ యుగంలో గ్రీకుల్లో బానిస యాజమాన్య వ్యవస్థ ఆవిర్భావాన్ని గురించి తెలిపే అంశాలు యేమిటి? |
|---|---|
| | |

## §29. ప్రాచీన గ్రీకుల మతం

(మాప్ 4)

ఆదిమ ప్రజల్లో మతం ఎలా తలెత్తిందో జ్ఞాపకం చేసుకోండి (§3; 2, 3). ప్రాచీన ఈజిప్షియన్లు ఏ దేవుళ్లను పూజించారు (§11)?

1. <u>ప్రకృతి శక్తుల ఆరాధన.</u> ప్రాచీన యుగంలో యితర దేశాల ప్రజలందరి లాగే గ్రీకులు ప్రకృతిని చూసి భయపడేవాళ్లు. ప్రకృతి వాళ్లకు అర్థం కాలేదు. ప్రకృతిని దేవుళ్లు, దేవతలు పాలిస్తున్నారని వాళ్లు విశ్వసించేవాళ్లు. దేవతలు మనుషుల లాగే వుంటారనీ, అయితే మరణం లేనివాళ్లనీ, మహా శక్తివంతులనీ గ్రీకుల ఊహ.





1. అపోలో దేవుడి విగ్రహం (క్రీ.పూ. 4వ శతాబ్ది). 2. ఏథెనా దేవత విగ్రహం (క్రీ.పూ. 5వ శతాబ్ది). ఏథెనా కుడి చేతిలో విజయ దేవత విగ్రహం వుంది, ఆమె ఎడమ చెయ్యి ఒక పెద్ద గుండ్రటి డాలుమీద వుంది. 3. గ్రీకు దేవుళ్లు, దేవతలు. జీయస్, పొసైడాన్, ఐడ్స్‌లు ప్రపంచాన్ని తమ మధ్య పంచుకున్నారు. జీయస్ ఆకాశాన్నీ, భూమినీ తీసుకున్నాడు. పొసైడాన్‌కి సముద్రం వచ్చింది. ఐడ్స్‌కి పాతాళం వచ్చింది. మూడు శిరస్సులు కలిగిన సెర్బిరస్ అనే కుక్క ఐడ్స్ పాదాల దగ్గర వుంది. హెరాక్లిస్ సింహపు చర్మంతో అలంకరింపబడిన గదమీద ఆనుకున్నాడు. హెరాక్లిస్ సాహస కృత్యాల తర్వాత విశ్రమిస్తున్నాడు




ఉదాహరణకు, మహా బలవంతుడైన జీయస్ మెరుపులనే బంగారు బాణాలతో మనుషులను కొట్టగలడని వాళ్లు నమ్మేవాళ్లు. జీయస్ "మేఘాలను పోగుచేసి" వర్షాలు కురిపిస్తాడనీ, అనావృష్టి తెచ్చేది కూడా అతనేననీ అనుకునేవాళ్లు.

గ్రీకులు జీయస్‌కు యెంతగా భయపడేవాళ్లో "భూకంపాల కారకుడు" పొసైడాన్ అనే సముద్ర దేవునికి కూడా అంతగా భయపడేవాళ్లు. పొసైడాన్ తన త్రిశూలంతో తుపాను సృష్టించి ఓడలు ముంచగలడని నమ్మేవాళ్లు.

తెల్ల గుర్రాలు పూన్చిన బంగారు రథంమీద యెక్కి సూర్య దేవుడు ఆకాశంమీదికి వచ్చినప్పుడు పగలు వస్తుందని గ్రీకుల భావన.

వన దేవతలను సెటీర్‌లు అనేవాళ్లు. సెటీర్‌లు మామూలు మనుషులే, కాని వాళ్లకి మేక కాళ్లూ, దేహంమీద బొచ్చూ వుంటాయి. సెలయేళ్ల దేవతలు అందమైన కన్యలు. వాళ్లని నింఫ్‌లు, అంటే వధువులు అనేవాళ్లు.

**2. ఆర్థిక వ్యవహారాలనూ, కళలనూ సంరక్షించే దేవతలు.**

ఆర్థిక వ్యవహారాల్లో ప్రతి రంగానికీ – వ్యవసాయం, పశుపాలన, వేట, నేత, మొదలైన ప్రతిదానికీ – ఒక దేవుడో, దేవతో సంరక్షణ చేయడానికి వున్నాడని భావింపబడింది.

డయోనిసస్ ద్రాక్ష సారాయి దేవుడు. సంవత్సరానికి రెండు సార్లు – వసంతంలో ద్రాక్ష తోటల్లో పని ప్రారంభించే ముందూ, మళ్లీ డిసెంబర్‌లో కొత్త ద్రాక్ష సారాయి తయారైనప్పుడూ – ఆ దేవుని గౌరవార్థం గ్రీకులు పండుగలు చేసుకునేవాళ్లు.

గ్రీకులు లోహాలను వాడడం నేర్చుకున్నప్పుడు, లోహకారులను సంరక్షించే దేవుడైన హెఫేస్టస్‌ను గురించి ఒక పురాణ గాథ అల్లారు. పాతాళంలోని కార్ఖానాలో అతను పనిచేస్తుంటాడనీ, మంటలూ, పొగా వెళ్లగక్కే అగ్ని పర్వతాలు హెఫేస్టస్ కార్ఖానా పొగగొట్టాలనీ అనుకునేవాళ్లు. హెఫేస్టస్ సామాన్యమైన చేతిపనివాడి దుస్తులు ధరించేవాడు. అతని చేతులూ, ముఖమూ యెప్పుడూ మసి నిండుకొని వుంటాయని వాళ్లు ఊహించేవాళ్లు.

వర్తకం అభివృద్ధి చెందడంతో దానికి కూడా సంరక్షక దేవుడు ఏర్పడ్డాడు. అతనే వాణిజ్య దేవత హెర్మెస్. అతను జీయస్‌కి వార్తాహరుడుగా కూడా పనిచేస్తూ ఒక నగరంనుంచి మరో నగరాకి ఎగిరివెళ్తూండేవాడు. అందుకనే హెర్మెస్ పాదరక్షలకు రెక్కలున్నవాడుగా తరచు చిత్రింపబడేవాడు.

అపోలో అనే అందమైన యువకుడు లలిత కళల దేవుడు. అతని వెంట యెప్పుడూ నృత్యం, సంగీతం, కవిత్వం, చరిత్రల కళాధిదేవతలు (మ్యూజెస్) వుంటారు.

**3. గ్రీకుల్లో ఆనాటి అసమానతను ప్రతిబింబించిన మతం.**

శక్తిపరులైన జీయస్, అపోలో, తదితర ముఖ్య దేవతలు గ్రీసులోని అత్యంత ఉన్నత పర్వతమైన ఒలింపస్‌మీద వున్నారని గ్రీకుల నమ్మకం. ఈ దేవతలను ఒలింపియన్ దేవతలు అనేవాళ్లు.

గ్రీకులు ఒలింపియన్ దేవతల జీవితాన్ని కులీనుల జీవితంతో పోల్చేవాళ్లు. దేవతలు భవనాల్లో నివసిస్తారనీ, మనోహరమైన దుస్తులు ధరిస్తారనీ, యెన్నో విందులు చేసుకుంటారనీ వాళ్లు ఊహించేవాళ్లు. కులీనులు తెగలను పరిపాలిస్తారు. ఒలింపియన్ దేవతలు, జీయస్ అధినాయకత్వం కింద యిటు మానవులనూ, అటు ప్రకృతినీ పరిపాలిస్తారు. కులీనులకి వున్నట్లే దేవతలకు కూడా క్రౌర్యమూ, ఆశా, పగా వుంటాయని – గ్రీకులు నమ్మేవాళ్లు.

గ్రీకుల ఊహ ప్రకారం, మొత్తం ప్రజల జీవిత వ్యవస్థ నంతటినీ దేవతలు నిర్ణయిస్తారు; దేవతలు కొందరిని కులీనులుగా, ధనికులుగా చేస్తారు, మరి కొందరిని బీదలుగా, యింకా కొందరిని బానిసలుగా చేస్తారు. కనుక ఆనాటి వ్యవస్థ మీద తిరుగుబాటు చేసేవాళ్లకు దేవతల ఆగ్రహమూ, కఠినమైన శిక్షా తప్ప మరేమీ లభించదు.

**4. ప్రొమీథియస్‌ని గురించిన పురాణ గాథ.**

దేవతలు అగ్నిని మనుషులకు తెలియకుండా దాచిపెట్టారు. మనుషులు ప్రకృతి యెదుట అసహాయులుగా వుండాలనీ, మృత్యువుకు బలికావాలనీ వాళ్ల కోరిక. ప్రొమీథియస్ అనే ఉదాత్త వీరుడు హెఫేస్టస్‌నుండి అగ్నిని దొంగిలించి మానవులకిచ్చి, అపాయంనుండి వాళ్లను రక్షించాడు.

ఆగ్రహావేశంతో జీయస్ కాకసస్‌లోని ఒక పర్వతానికి ప్రొమీథియస్‌ను గొలుసులతో బంధించమని హెఫేస్టస్‌కు ఉత్తరువు యిచ్చాడు. ప్రొమీథియస్ కాలేయాన్ని పొడుచుకు తినడానికి రోజూ జీయస్ ఒక గ్రద్దను పంపేవాడు. అభిమానమూ, ధైర్యమూ గల ప్రొమీథియస్ దుర్భరమైన బాధలో కూడా జీయస్‌తో రాజీపడకుండా నిబ్బరంగా ఉండిపోయాడు. ప్రజల సౌఖ్యం కొరకు దుష్ట అధర్మ దేవతలతో పోరాడిన వీరునిగా ప్రొమీథియస్‌ను వాళ్లు ఆరాధించేవాళ్లు.

ఇతర దేశాల ప్రజల లాగే ప్రాచీన గ్రీకులు భయంకరమైన, అజ్ఞాత ప్రకృతి శక్తులకు భయపడి మతాన్ని ఆశ్రయించారు. సమాజంలో కొత్త వృత్తులు, అసమానత తలయెత్తడం గ్రీకు మత విశ్వాసాలలో ప్రతిఫలించాయి.

ఒడిస్సస్ తన చివరి నౌక
ఎలా నాశనమైందో చెప్పిన కథ

నౌక ఎలా నాశనమైందో ఒడిస్సస్ యిలా వర్ణిస్తాడు:

నట్టనడి సంద్రాన నీటిని చీల్చుకొంటూ
వడివడిగా పోతోంది మా ఓడ....
ఇంతలో — సముద్రం కల్లోలితమైంది
పెనుగాలి రేగింది ఉరుము ఉరిమింది
జీయస్ దేవుడి పగ సెగలు కక్కింది
కాలమేఘం ఆకాశాన్ని కప్పివేసింది
సముద్ర వర్ణం నల్లని నలుపు తిరిగింది
ఎటుచూచిన ప్రళయార్భటి
తటిల్లతల దీధితి
ఆవర్తంలో చిక్కిన ఓడ
గిరగిర తిరిగింది
ఒక్కుమ్మడి నీళ్ళలోకి
జనం విసరివెయ్యబడ్డారు.
అంతలోనే ఓడ ఐపు లేకపోయింది.

''ఇలియడ్''నుంచి.

అఖిలెస్ మిత్రుడు ప్రట్రోక్లిస్ దహన సంస్కారం

ఎటుచూసిన నూరడుగుల
శవ వేదిక నిర్మించిరి
వేదికపైనేమో శవముంచిరి తీవిగ
పిక్కబలిసిన గొర్రెలూ
క్రరిరంగు ఎద్దులూ

ఒక్క వేటున తెగనరికిరి
వాటి కొవ్వుతోడ అఖిలెస్
పూతపెట్టె మిత్రుడి దేహానికి
శవం చుట్టు పేర్చె కళేబరాలను
తేనె, సుగంధ తైలాల కూజాలు
వేలాడదీశాడు శవవేదికకి
జాతి గుర్రాలు నాలుగు
నెట్టబడ్డాయి చితిపైకి
తొమ్మిది యింటికుక్కల్లో రెండు
యజమాని సేవకై దూకాయి చితిలోన
ఘోరాతి ఘోరమ్ము చిట్టచివరి బలి
ట్రాయన్ ఖైదీలు పన్నెండుమంది
నెట్టబడ్డారు చితిలోకి ఘోరాతి ఘోరంగ.

## డెమెటర్, పెర్సిఫోనెల కథ

ఈ పౌరాణిక గాథలో ఏ ప్రాకృతిక విషయాలు ప్రతిబింబింపబడ్డాయి?

సంతాన దేవత డెమెటర్ సుందర పుత్రిక పెర్సిఫోనె పచ్చిక మైదానంలో నడుస్తోంది. అంతలో అకస్మాత్తుగా భూమిని చీల్చుకొని పాతాళ దేవుడు ఐడ్స్ తన నల్ల గుర్రాల రథంమీద బయటకి వచ్చాడు. అతను పెర్సిఫోనెని అపహరించి మృతాత్మలు నివసించే తన లోకానికి తీసుకుపోయాడు. డెమెటర్ తన కూతుర్ని గురించి బెంగపెట్టుకుంది. పువ్వులు వాడిపోయాయి, చెట్లనుంచి ఆకులు రాలిపోయాయి. బార్లీ గాని, ద్రాక్ష గాని మొలకెత్తలేదు. భూలోకంలో ఆకలి చెలరేగింది. జీయస్ అప్పుడు పెర్సిఫోనెని ఏటా కొన్ని నెలలపాటు ఆమె తల్లి దగ్గరకి పంపమని ఐడ్స్‌ని ఆజ్ఞాపించాడు. పెర్సిఫోనె భూమిమీదకి వచ్చినప్పుడు డెమెటర్ ఆనందానికి అవధి వుండదు, తిరిగి వసంతం మొదలవుతుంది. పెర్సిఫోనె పాతాళానికి తిరిగి వెళ్లినప్పుడు ఆమె తల్లి విషాదంలో మునుగుతుంది, ఆకురాలు కాలం మొదలవుతుంది.

? **1.** గ్రీకుల మతంలో ప్రకృతి ఎలా ప్రతిబింబితమైంది? గ్రీకుల, ఈజిప్షియన్ల, బాబిలోనియన్ల మత విశ్వాసాల్లో ప్రతిబింబించే ప్రాకృతిక ఘటనలను తులనాత్మకంగా పరిశీలించండి. వాటిలో పోలికలు యేమిటి? తేడాలు యేమిటి? **2.** గ్రీకుల వృత్తులు వాళ్ల మతంలో ఎలా ప్రతిబింబించాయి? **3.** గ్రీకు సమాజంలో అసమానతల అవతరణ వాళ్ల మతంలో ఎలా ప్రతిబింబించింది? **4.** ఇప్పటివరకు చదివిన విషయాల ప్రాతిపదికమీద ప్రాచీన కాలంలో మత విశ్వాసాలకు కారణభూతమైన సాధారణ అంశాలేమిటో నిర్ధరించండి. **5.** గ్రీసులో మతం ప్రభువుల పెత్తనాన్ని ఎలా కట్టుదిట్టంచేసింది? ప్రాచీన ప్రపంచపు వివిధ దేశాల్లో మతం ఎలాంటి పాత్ర వహించింది?



ఒలింపియాలోని జీయస్ దేవాలయపు అంతర్భాగం (పునరుద్ధరణ). జీయస్ సింహాసనంమీద కూర్చున్నాడు. అతని ఒక చేతిలో రాజదండం, మరో చేతిలో విజయ దేవత బొమ్మ వున్నాయి. ఈ దేవాలయం క్రీ.పూ. 5వ శతాబ్దిలో నిర్మింపబడింది. ఫిడియస్ చెక్కిన యీ దారు శిల్పం దంతంతో తాపడం చెయ్యబడింది. ప్రాచీన కాలంలో ప్రపంచపు ఏడు వింతల్లో యిది ఒకటిగా పరిగణింపబడేది. ఒలింపియా గురించి మీరు తర్వాత చదువుతారు

ప్రకరణం ఎనిమిది

# గ్రీసులో బానిస యాజమాన్య వ్యవస్థ స్థాపన, క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల్లో గ్రీకు నగర రాజ్యాల అవతరణ

## §§ 30–31. ఏథెన్స్‌లో బానిస యాజమాన్య రాజ్యం ఏర్పడటం

(మాప్ 4)

### క్రీ.పూ. 8వ–7వ శతాబ్దాల్లో ప్రభువర్గ పాలన కింద ఏథెన్స్

గ్రీసులో భౌగోళిక పరిస్థితులకి అనువుగా వృద్ధి చెందిన మానవ వృత్తులను జ్ఞాపకం చేసుకోండి (§25; 1).

1. హోమర్ యుగాంతంలో అట్టికా. మధ్య గ్రీసులోని ఆగ్నేయ భాగంలో ఒక పెద్ద ద్వీపకల్పం సముద్రంలోకి పొడుచుకొని వచ్చింది. ఈ ద్వీపకల్పమే అట్టికా అనే జిల్లా. అట్టికా జనాభాలో అత్యధిక సంఖ్యాకులు వ్యవసాయానికి అనుకూలమైన మైదానాల్లో నివసించేవాళ్లు. వాళ్లు పర్వతాల్లో మేకల్నీ, గొర్రెల్నీ మేపుకునేవాళ్లు.

అట్టికాలోని పశ్చిమ భాగంలో విస్తృతమైన మైదానం వుంది. ఆ మైదానం మధ్య యెత్తైన కొండలు వున్నాయి. ఆ కొండలమీద, క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో ఏథెన్స్ అనే నగరం నిర్మింపబడింది. దాని చుట్టూ రాతి గోడ కట్టబడింది. ఇలాంటి నగరాన్ని గ్రీకులు అక్రోపొలిస్ (యెత్తున వున్న దుర్గం) అనేవాళ్లు. ఏథెన్స్ వాసుల యిళ్లు కొండచరియలమీద ఉండేవి. శత్రువులు దాడిచేసినప్పుడు ఆ పరిసరాలలోని ప్రజలు దుర్భేద్యమైన ఆ కోట గోడల వెనుక దాక్కునేవాళ్లు.

మధ్య గ్రీసుమీద డోరియన్ దండయాత్ర జరిగినప్పుడు ఏథెనియన్లు దాడుల నన్నిటినీ ప్రతిఘటించి తమ స్వాతంత్ర్యం నిలుపుకున్నారు. హోమర్ యుగంలో ఏథెనియన్ ప్రభువులు అట్టికా ప్రజలందరిమీదా పెత్తనం సంపాదించుకున్నారు. అట్టికా వాసులందరూ రాజధాని ఏథెన్స్ పేరు మీదుగా ఏథెనియన్లు అని పిలవబడేవాళ్లు.












1. ఆలివ్ పంట కోత (ఒక గ్రీకు వాజుమీది చిత్రం). 2. రెండు పక్కలా హాండిల్సు వున్న పెద్ద కూజాల వంటి గూనల్లో ఆలివ్ నూనె రవాణా (ఒక గ్రీకు వాజుమీది చిత్రం). 3. ఆలివ్ నూనె అమ్మకం (ఒక గ్రీకు వాజుమీది చిత్రం). 4. ప్రాచీన ఏథెనియన్ నాణెం. నాణానికి ఒక వైపున ఏథెనా దేవత శిరస్సు, రెండో వైపున ఆ దేవత పవిత్ర పక్షి అయిన గుడ్లగూబ చిత్రం వున్నాయి.

## 2. అట్టికాలో వ్యవసాయం, చేతివృత్తుల అభివృద్ధి.

అట్టికా జనాభాకి తగినంత తిండి లభించేది కాదు. చేలల్లో బార్లీ, గోధుమ పంటలు నాసిగా వుండేవి. కాని మైదానాల్లో ఆలివ్ చెట్లూ, కొండచరియలమీద ద్రాక్ష తోటలూ బాగా పెరిగేవి. క్రీ.పూ. 8వ–7వ శతాబ్దాల్లో అట్టికాలో ద్రాక్ష సారా, ఆలివ్ నూనెల తయారీ బాగా అభివృద్ధి చెందింది.

ద్రాక్ష సారాయినీ, ఆలివ్ నూనెనీ ఎగుమతిచేసేందుకుగాను గ్రీకులు పట్టుకునేందుకు రెండు పక్కలా చెవులున్న బంక మట్టి అంఫోరాలు (గూనలు) తయారుచేసేవాళ్ళు. బంక మట్టిని పెంకులు, మురుగు నీటి తూరలు, ద్రాక్ష సారా, ధాన్యం పోసుకునే గూనలు, కూజాలు తయారుచేసేందుకు కూడా వాళ్ళు వాడేవాళ్ళు. కళాకారులు వాటిమీద బొమ్మలు చిత్రించేవాళ్ళు. అట్టికాలో కుండల తయారీ వేగంగా వృద్ధిచెందనారంభించింది. ఇతర చేతివృత్తులవాళ్ళు ఉన్ని వడికే వాళ్ళు. కొలుముల్లో ఆయుధాలు తయారుచేసేవాళ్ళు, వెండి, బంగారు నగలు తయారుచేసేవాళ్ళు. సర్వసాధారణంగా చేతిపనివాడు తన కార్ఖానాలో స్వయంగా తనే పనిచేసేవాడు. కొన్ని సందర్భాల్లో తన యిద్దరుముగ్గురు బానిసలతో పని చేయించుకునేవాడు.

ఏథెనియన్లు ద్వీపకల్పం దక్షిణాన వెండి నిక్షేపాల త్రవ్వకం అభివృద్ధిచేశారు. క్రీ.పూ. 7వ శతాబ్దంలో వెండి నాణాలు పోతపొయ్యడం మొదలుపెట్టారు. దరిమిలా అవి గ్రీసు అంతటా చలామణీలోకి వచ్చాయి.

**3. వర్తకం, సముద్ర యానాల అభివృద్ధి.** ఏథెన్స్ నగరం వేగంగా పెరిగింది. అక్రోపొలిస్‌కి వాయవ్య మూల చేతిపనివాళ్ల కార్ఖానాలు తలెత్తాయి. మార్కెట్టు (అగోరా) నగరం మధ్యలో ఏర్పాటు చెయ్యబడింది. మైదాన ప్రాంతంవాళ్లు యిక్కడికి ద్రాక్ష సారాయినీ, ఆలివ్ నూనెనీ అమ్మకానికి తెచ్చేవాళ్లు. పర్వత ప్రాంతీయులు పశువుల్ని తోలుకొచ్చేవాళ్లు. చేతివృత్తులవాళ్లు తమ తమ సరుకుల్ని తెచ్చేవాళ్లు.







5

6

7

5. రొట్టె అమ్మకందారు (ప్రాచీన గ్రీకు మట్టి బొమ్మ). 6. చెప్పులు కుట్టేవాడి కార్ఖానా (ఒక వాజుమీది చిత్రం). చెప్పులు కుట్టేవాడు ఒక స్త్రీ పాదపు కొలతలు తీసుకొంటున్నాడు. అతని సహాయకుడు తయారైన పాదరక్షలు చూపిస్తున్నాడు. కుడివైపున ఆ స్త్రీ భర్త చెప్పులు కుట్టేవాడికి పాదరక్షలు ఎలా వుండాలో ఆదేశాలు యిస్తున్నాడు. 7. కమ్మరివాడి కార్ఖానా (ఒక వాజుమీది చిత్రం). కమ్మరి పటకారుతో ఎర్రగా కాలివున్న లోహఖండాన్ని దాగలిమీద పట్టుకున్నాడు. ఒక బానిస దాన్ని సమ్మెటతో కొడుతున్నాడు. కాతాదారులు కుడి పక్కన నిలబడివున్నారు. కమ్మరి పనిముట్లు, అతను తయారుచేసిన వస్తువులు గోడకి తగిలించి వున్నాయి

ఏథెన్స్‌కి సమీపంలోని రేవుల్లో ఓడలు లంగరు వేసి ఏథెనియన్ చేతిపనివాళ్ళ తయారుచేసిన వస్తువులనూ, నూనె, ద్రాక్ష సారాయీ నింపిన అంఫోరాలనూ యెత్తుకొనేవి; ఆ సరుకులు గ్రీసులోని యితర భాగాలలోనూ, విదేశాలలోనూ అమ్మకమయ్యేవి. ఓడలు ధాన్యమూ, ఉప్పూ, ఉప్పు చేపలూ అందించేవి. ఏథెన్స్‌లో అమ్మేందుకు యితర దేశాల్లో కొన్న బానిసలను ఆ ఓడలు తెచ్చేవి.

**4. రైతుల దివాళా.**

అట్టికాలో తరచు అనావృష్టి సంభవిస్తూండేది. రైతులకి నాటేందుకు సైతం తగినన్ని విత్తనాలు ఉండేవి కావు. ఆలివ్ చెట్లూ, ద్రాక్షతీగలూ నాటాలంటే పెద్ద మొత్తాల్లో ఖర్చు పెట్టాలి. పైగా అవి ఫలసాయానికి వచ్చేదాకా కొన్ని యేళ్ళు వేచివుండాలి. దానితో రైతులు కులీనుల దగ్గర్నుంచి హెచ్చు వడ్డీతో అప్పులు తీసుకోక గత్యంతరంలేని పరిస్థితిలో పడేవాళ్ళు.







క్రీ.పూ. 8–7 దశాబ్దాల్లో ఏథెన్సులో రాజ్యం పటిష్ఠమవడం. ఆ కాలంలో ఏథెనియన్ రాజ్యం ఎవరి ప్రయోజనాలను బలపరచింది?

కులీనులు రైతులకి అప్పు యిచ్చినప్పుడు వాళ్ల పొలాలలో పెద్ద రాళ్లు పాతేవాళ్లు. ఆ రాళ్లమీద రైతు యెవరికి బాకీ వున్నదీ, బాకీ యెప్పుడు చెల్లించవలసిందీ చెక్కబడేది. రైతు సకాలంలో బాకీ తీర్చలేకపోతే, అతను తన పొలమూ, యితర ఆస్తీ పోగొట్టుకోవడమే గాక, తానూ, తన కుటుంబమూ బానిసలయ్యేవాళ్లు. తలిదండ్రులు తరచు తమ పిల్లల్ని బానిసలుగా అమ్మకతప్పని పరిస్థితిలో పడేవాళ్లు.

క్రీ.పూ. 7వ శతాబ్ది అంతం నాటికి అట్టికాలోని సాగుభూమిలో అత్యధిక భాగం కులీనుల చేతుల్లోకి పోయింది. చాలామంది రైతులు తమ సర్వస్వమూ కోల్పోయి, బానిసలయ్యారు. తక్కినవాళ్లు అదే గతి తమ కెప్పుడు సంభవిస్తుందో అనే భయంతో జీవిస్తూవుండేవాళ్లు. బానిసల దేహంమీద అవమానకరమైన వాతల గుర్తుల్లాగ చేలల్లో తనఖా రాళ్లు నిలిచివుండేవి.

## 5. ఏథెన్స్‌లో ప్రభువర్గ పాలన.

రైతులకీ, సామాన్య జనానికీ ప్రభువర్గపు నిరంకుశ చర్యలనుంచి ఎక్కడా రక్షణ లభించేది కాదు. ఏథెన్స్‌ను పెద్దల సభా, ఆ సభచేత ఎన్నుకోబడిన తొమ్మిదిమంది గవర్నర్లూ పాలించేవాళ్లు. పెద్దల సభ సభ్యులు గాని, గవర్నర్లు గాని, జడ్జీలు గాని అయ్యే హక్కు కులీనులైన ఏథెనియన్లకి మాత్రమే వుండేది.

కులీన కుటుంబంలో పుట్టిన ఒక గ్రీకు కవి యిలా రాశాడు: "యజమానుల పెత్తనమనే గట్టి కళ్లేలను" ఐచ్ఛికంగా సహించే మనుషులెవరూ వుండరు, అందుకే "జనాన్ని తొక్కి నారతియ్యాలి," అంతకీ మాట వినకపోతే "రాగి బల్లెంతో కుమ్మాలి."

జడ్జీలు సహజంగానే అన్ని కేసుల్లోనూ ప్రభువులకే అనుకూలంగా తీర్పుచెప్పేవాళ్లు. విధేయులు కానివాళ్లను అణచడానికి కులీనులకు రక్షక భటులు ఉండేవాళ్లు. అత్యంత స్వల్పమైన నేరాలకి సైతం కఠిన శిక్షలు నిర్దేశిస్తూ క్రీ.పూ. 7వ శతాబ్దంలో చట్టాలు జారీచెయ్యబడ్డాయి. ఉదాహరణకు, మరొకరి ద్రాక్ష తోటలో ఒకడు ఒక ద్రాక్షగుత్తి దొంగిలిస్తే, అతనికి మరణ దండన విధింపబడుతుంది. ఈ చట్టాలు సిరాతో కాక రక్తంతో లిఖించబడ్డాయని చెప్పబడుతూ వుండేది. ఈ చట్టాలను డ్రకో రూపొందించాడని ప్రతీతి. అందుకే క్రూరమైన చట్టాలను మనం యీనాడు డ్రకోనియన్ చట్టాలు అంటున్నాం.

గ్రీకు ప్రభువులు తమ పాలనను ప్రభువర్గ పాలన అనేవాళ్లు. అత్యుత్తమ వ్యక్తుల అధికారం అని దీని అర్థం. ఏథెన్స్‌లో క్రీ.పూ. 8వ–7వ శతాబ్దిలో ఏర్పడిన రాజ్యం బానిసలమీదా, రైతులమీదా, అట్టికా జనాభాలో మిగిలిన వాళ్లమీదా బలప్రయోగంతో ప్రభువర్గ పాలనను సాగించింది.

?

**1.** హోమర్ యుగపు గ్రీసుతో పోలిస్తే, క్రీ.పూ. 6వ శతాబ్ది నాటికి అట్టికా ఆర్థిక వ్యవస్థలో ఎలాంటి మార్పులు వచ్చాయి? **2.** అట్టికాలోని ఏ భౌగోళిక పరిస్థితులు అక్కడ చేతివృత్తులు, వర్తకం అభివృద్ధి చెందేందుకు దోహదంచేశాయి? **3.** క్రీ.పూ. 8వ–7వ శతాబ్దాల్లో ఏథెన్సులో జనం బానిసలుగా ఎలా మార్చబడ్డారు? **4.** క్రీ.పూ. 8వ–7వ శతాబ్దిలో ఏథెన్స్‌లో రాజ్యం అవతరించింది అనేందుకు సూచనలు ఏమిటి? ఆ శతాబ్దాల్లో ఏథెనియన్ రాజ్యం ఎవరి ప్రయోజనాలను కాపాడింది?

## సామాన్యుల విజయం, ఏథెన్స్ రాజ్యం పటిష్ఠమవడం

**6. సామాన్య ప్రజలు.** అట్టికాలోని స్వతంత్ర ప్రజలలో, పాలకులైన ప్రభువర్గీయులు కానివాళ్లను సామాన్యులు (demos) అనేవాళ్లు.

సామాన్యులలో అత్యధిక భాగం రైతులూ, చేతిపనివాళ్లూ, నావికులూ, రోజు కూలివాళ్లూ. క్రీ.పూ. 8వ–7వ శతాబ్దిలో వాళ్లలో కొందరు ధనవంతులయ్యారు. సామాన్యుల్లో వర్తకులూ, ఓడల యజమానులూ, కార్ఖానా యజమానులూ తలెత్తారు. వాళ్లకి బానిసలు వుండేవాళ్లు. వాళ్లు రోజు కూలీలను కుదుర్చుకునేవాళ్లు. ధనికులైనా, బీదలైనా మొత్తం సామాన్యులందరికీ ఏథెన్స్ పాలనలో పాల్గొనే హక్కు లేదు. ఈ హక్కు ఉన్నత వర్గానికి మాత్రమే వుండేది.

**7. సామాన్యుల విజయం.** ప్రభువర్గ పరిపాలనతో అట్టికాలో సామాన్యులు చాలా అసంతృప్తి చెందారు. రాజ్య పాలనలో భాగం కావాలని వాళ్లు గట్టిగా పోరాడారు. బీదవాళ్లు తమ రుణాలన్నీ రద్దుకావాలనీ, ఉన్నత వర్గీయుల భూములన్నీ స్వాధీనం చేసుకొని, భూములు లేనివాళ్లకు పంచిపెట్టాలనీ డిమాండుచేశారు.

క్రీ.పూ. 6వ శతాబ్ది ఆరంభంలో సామాన్యులలో తిరుగుబాటు సన్నాహాలు మొదలయ్యాయి. జనం గుమికూడి ప్రభువర్గీయులకు వ్యతిరేకంగా సంయుక్తంగా పోరాడాలని కూడబలుక్కున్నారు. ప్రాచీన గ్రీకు తత్వవేత్త అరిస్టాటిల్ ''సామాన్యులు ప్రభువర్గీయులకు వ్యతిరేకంగా తిరగబడ్డారు'' అని రాశాడు. సామాన్యులకూ, ప్రభువర్గీయులకూ మధ్య రక్తపాతంతో కూడిన తీవ్ర ఘర్షణలు మొదలయ్యాయి.

మొత్తం ప్రజల తిరుగుబాటు జరుగుతుందనే భయంతో ప్రభువర్గీయులు అనేక రాయితీలు యివ్వడానికి నిశ్చయిం



1



2

1. సోలోన్ (ప్రాచీన గ్రీకు బస్టు). 2. యుద్ధానికి వెళ్తున్న యోధుణ్ణి సన్నద్ధంచెయ్యడం (ఒక గ్రీకు వాజుమీది చిత్రం)

చారు. క్రీ.పూ. 594లో ఏథెన్స్‌కి సాలోన్ అనే కొత్త గవర్నరు యెన్నుకోబడ్డాడు. సాలోన్ ప్రభువంశానికి చెందిన బీద కుటుంబంనుండి వచ్చినవాడు. సామాన్యులకూ, ప్రభువర్గీయులకూ రాజీ కుదిర్చి, వాళ్ల మధ్య గల విభేదాలను తొలగించే పని సాలోన్‌కు అప్పగించబడింది. అతను ధైర్యవంతుడైన యోధుడుగా, కవిగా, వక్తగా ప్రసిద్ధిచెందినవాడు. ఏథెన్స్ ప్రజా సభ తోడ్పాటు కలిగిన సాలోన్ ప్రభుత్వంలోనూ, సామాన్యుల స్థితి గతుల్లోనూ సంస్కరణలు అమలుజరిపాడు.

8. రుణాలు రద్దు చెయ్యబడ్డాయి.

సాలోన్ సూచన మేరకు రైతుల రుణాలన్నీ రద్దు చెయ్యబడ్డాయి. పొలాలలోని తనఖా రాళ్లన్నీ తొలగించబడ్డాయి. అప్పులు చెల్లించలేక బానిసలైన వాళ్లందరూ విముక్తి చెయ్యబడ్డారు. స్వతంత్ర ప్రజలను బానిసలుగా మార్చడాన్ని నిషేధిస్తూ చట్టం చేయబడింది. రుణాలకు బానిసలను చేయడం పూర్తిగా రద్దుచెయ్యబడింది.

దీన్ని గురించి సాలోన్ స్వయంగా రాసింది యిది:

"మన నల్లని తల్లి దీర్ఘ బాధిత భూమినుండి
అవమానకరమైన రాళ్లన్నీ తొలగించాను,
నిన్నటిదాకా నీవు బానిసవు, యిప్పుడు స్వతంత్రురాలివి.

విదేశాలలో బానిసత్వంనుండి
నీ పిల్లలను వాపస్ తెచ్చాను
ప్రపంచపు అద్భుతమైన ఏథెన్స్ నగరానికి.
యిక్కడ మన ప్రియమైన మాతృభూమిలో కూడా
ప్రభువుల భయంతో తల్లడిల్లే
బానిసల కందరికీ మళ్లీ స్వేచ్ఛ యిచ్చాను."

రుణాలూ, రుణ బానిసలూ రద్దు కావడంతో, అట్టికాలో రైతు కమతాలు యెంతో బలపడ్డాయి. అట్టికాలో రైతు క్షేత్రాల సంఖ్య పెరిగింది.

గ్రీసులోని యితర ప్రాంతాలనుండీ, విదేశాలనుండీ ఏథెన్స్‌కు కొనిరాబడిన బానిసల స్థితి సాలోన్ సంస్కరణల ద్వారా మెరుగు కాలేదు. వాళ్ల జీవితం యెప్పటిలా దుర్భరంగానే వుంది. బానిసల సంఖ్య పెరుగుతూనే వుంది.

9. ఏథెనియన్ పౌరులు.

సాలోన్ మనుషుల్ని – అట్టికా వాసుల్ని – వాళ్లవాళ్ల ఆస్తుల్నిబట్టి నాలుగు తరగతులుగా విభజించాడు. వాళ్లందరూ ఏథెనియన్ రాజ్య పౌరులే. సాలోన్ సంస్కరణల ప్రకారం ఏథెనియన్ పౌరులు సైన్యంలో లేక నౌకా దళంలో కొలువు చెయ్యాలి. యువకులు రెండేళ్లపాటు విధిగా సైనిక శిక్షణ పొందాలి. యుద్ధం వచ్చినప్పుడు పౌరులు తమ సొంత ఆయుధాలతో కొలువులోకి రావాలి. థెటీస్ లేక భూముల్లేని పేదలు పదాతి సైనికులుగా లేక నావికులుగా, సైనిక నౌకలమీద కలాసీలుగా పనిచేసేవాళ్లు. కవచాలు కొనుక్కోగల రైతులు ప్రత్యేక పదాతి దళంలో కొలువుచేసేవాళ్లు. వాళ్ల దళం ఏథెనియన్ సైన్యపు ప్రధాన బలగంగా ఉండేది. జీనుగల గుర్రాన్ని కొనగలంత డబ్బున్నవాళ్లు ఆశ్విక దళంలో కొలువుచేసేవాళ్లు. ధనికులు ఓడలకు సాధన సంపద సమకూర్చేవాళ్లు.

ఏథెన్స్‌లో పౌరులందరూ ప్రజా సభల్లో పాల్గొనేవాళ్లు.



సొలోన్ సంస్కరణల తర్వాత ఏథెనియన్ సైన్యంలోనూ, నౌకా దళంలోనూ కొలువు

## 10. ఏథెనియన్ రాజ్య పరిపాలన.

సొలోన్ సంస్కరణల తర్వాత ఏథెనియన్ రాజ్య నిర్వహణలో ప్రజా సభ ప్రధాన పాత్ర వహించసాగింది. ప్రజా సభ ముఖ్యమైన రాజ్య వ్యవహారాలను పరిష్కరించేది, గవర్నర్లను, జడ్జీలను, యితర అధికార్లను ఎన్నుకునేది. అట్టికాలో పౌరులందరూ జడ్జీలుగా ఎన్నుకోబడవచ్చు. ఇతర అధికారులు, ప్రభువర్గానికి చెందినవాళ్లా, కాదా అన్నదానితో ప్రసక్తి లేకుండా, ఏథెనియన్లలోని ధనికులనుంచీ, సంపన్నులనుంచీ ఎన్నుకోబడేవాళ్లు. ఈ పదవులు వహించే అర్హత థెటీస్‌కి ఉండేది కాదు.

సొలోన్ సంస్కరణల మూలంగా ఏథెన్స్‌లో ప్రభువర్గీయుల పాలన సడలింది. ఏథెనియన్ రాజ్య పాలనలో పాల్గొనే అవకాశం సామాన్యులకి లభించింది.

సొలోన్ సంస్కరణల తర్వాత సైతం ప్రభువర్గీయులకీ, సామాన్యులకీ మధ్య వైరం అంతరించిపోలేదు. ప్రభువర్గీయులు తమ పూర్వపు అధికారం తిరిగి పొందాలని కోరగా, సామాన్యులు తాము సంపాదించుకున్న హక్కులను నిలుపుకోవాలనీ, వాటిని విస్తృతంచేసుకోవాలనీ ప్రయత్నించారు. అయితే ప్రభువంశీక, సామాన్య బానిస యజమానులు తమ బానిసలను తమ అదుపులో ఉంచుకోవాలనీ, కొత్త బానిసలను సంపాదించుకోవాలనీ వాంఛించారు. అందుకే యీ రెండు గ్రూపులూ బానిసలమీద తమ పెత్తనాన్ని నిలిపి వుంచిన ఏథెనియన్ రాజ్యాన్ని పటిష్ఠంచేసే విషయంలో ఆసక్తి కలిగి వుండేవి.

ఏథెన్స్‌లో క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల్లో బానిస యాజమాన్య వ్యవస్థ నెలకొంది, బానిస యాజమాన్య రాజ్యం అవతరించింది.

సైనిక కొలువులో ప్రవేశించే
ఏథెనియన్ యువకుల ప్రమాణం

నేను యెక్కడ వున్నప్పటికీ, ఈ పవిత్ర ఆయుధానికి అవమానం కలిగించను, యుద్ధ రంగంలో నా సహచరుని వదిలిపోను. నేను నా కొంపకోసం పోరాడుతాను. నేను నా దేశాన్ని బలహీనపడనివ్వను, దాన్ని మరింత బలీయమూ, శక్తివంతమూ చేసేందుకు నా ప్రాణాన్ని పణం పెడతాను. నేను, అందరితోనూ కలిసి, ఈనాడు వున్న చట్టాలనూ, రేపు రాబోయే చట్టాలనూ అనుసరిస్తాను. నేను మాతృదేశపు పవిత్ర స్థలాలను గౌరవిస్తాను. సకల దేవతలూ, నా దేశ సరిహద్దులూ, గోధుమ పొలాలూ, బార్లీ పొలాలూ, ద్రాక్ష తోటలూ ఆలివ్ తోటలూ నాకు సాక్షులు

? 1. క్రీ.పూ. 8వ–7వ శతాబ్దాల్లో ఏథెన్స్‌లో సామాన్యులు ఎవరు? వారిలో ఒకే వర్గానికి చెందినవాళ్లు ఉండేవారా లేక కొన్ని వర్గాలకి చెందినవాళ్లు ఉండేవారా? 2. సొలోన్ సంస్కరణలు ఎందుకు అమలుజరపబడ్డాయి? వాటి మూలంగా ఎవరు లాభపడ్డారు? 3. సొలోన్ సంస్కరణల అనంతరం ఏథెన్స్ పౌరులకి వున్న హక్కులు యేమిటి, విధులు యేమిటి? 4. ఏథెనియన్ రాజ్యం సొలోన్ సంస్కరణలకి ముందు ఎవరి ప్రయోజనాలను కాపాడింది, తర్వాత ఎవరి ప్రయోజనాలను కాపాడింది? సొలోన్ సంస్కరణలు ఏథెనియన్ రాజ్యాన్ని పటిష్ఠం చేశాయని మీరెందుకు తలుస్తున్నారు? 5. సొలోన్ సంస్కరణలు ఏ శతాబ్దిలో అమలు జరపబడ్డాయి? ఆ శతాబ్దిలోని యే కాలుభాగంలో అవి అమలుజరిగాయి? సొలోన్ సంస్కరణల కాలంలో ఈజిప్టులో స్వతంత్ర రాజ్యం ఉందా? సొలోన్ సంస్కరణల అనంతరం 2500 సంవత్సరాలు లెక్కపెట్టినప్పుడు, అది యే సంవత్సరం అవుతుంది?

## §32. క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల్లో స్పార్టా బానిస యాజమాన్య రాజ్యం

క్రీ.పూ. 2వ సహస్రాబ్ది చివర గ్రీసుపై ఏ తెగలు దాడిచేశాయో జ్ఞాపకం చేసుకోండి (§25; 4).

**1.** పెలొపొనేసస్ ఆగ్నేయ భాగంలో లకోనియా అనే ప్రాంతం వుంది. దాని కేంద్రంలో ఒక నదీ మైదానం, మైదానానికి మూడు వైపులా పర్వతాలు వున్నాయి. పర్వతాల్లో ఇనుప నిక్షేపాలు వున్నాయి. లకోనియా తీరాలు నిటారుగా వున్న కొండలతో లేక ఊబి గుంటలతో నిండి వుంటాయి. అవి నౌకా యానానికి పనికి రావు. మైదానంలోని భూమి సారవంతమైనది, పచ్చిక బీళ్లు మేలైనవి. పెలొపొనేసస్ నైరుతి భాగాన వున్న మెసేనియా అనే ప్రాంతంలో సారవంతమైన భూములు వుండేవి.

**2.** డోరియన్లు లకోనియాను ఆక్రమించి స్పార్టా అనే నగరాన్ని స్థాపించారు. విజేతలు స్పార్టన్లు అని పిలవబడసాగారు. దీర్ఘ యుద్ధాల తర్వాత స్పార్టన్లు మెసేనియాను కూడా జయించారు.

స్పార్టన్లు తాము ఆక్రమించుకున్న ప్రదేశాల్లోని జనాభాలో అత్యధిక భాగాన్ని బానిసలుగా మార్చారు. బానిసలను హెలట్లు అనేవాళ్లు. ఈ పదానికి ''బందీలు'' అని అర్థం.

విజేతలు బానిస యజమానుల వర్గం. ప్రతి స్పార్టన్‌కూ కొంత పొలం లభించేది. హెలట్ల కుటుంబాలు కొన్ని ఆ పొలం సాగుచెయ్యాల్సివుండేది. ఒక సమకాలికుడి కథనం ప్రకారం హెలట్లు ''తాము ఎంత అవసరంలో ఉన్నా కూడా ఫలసాయంలో సగం తమ యజమానులకి అప్పగించేవాళ్లు.''

బానిసలు తమ పీడకులైన స్పార్టన్లను గాఢంగా ద్వేషించేవాళ్లు. విముక్తి పొందడానికి వాళ్లు అనేక సార్లు సాయుధ తిరుగుబాట్లు చేశారు. హెలట్లను భయభీతుల్ని చేసి, తిరుగుబాట్లేవీ జరగకుండా నివారించేందుకుగాను స్పార్టన్లు హెలట్లలోని మిక్కిలి బలమైనవాళ్లనీ, అత్యంత సాహసికుల్నీ చంపేసేవాళ్లు.

హెలట్లకీ, స్పార్టన్లకీ మధ్య జరిగిన పోరాటం బానిసలు, బానిస యజమానులు అనే రాజీలేని రెండు వర్గాల మధ్య జరిగిన పోరాటం. అది వర్గపోరాటం.

**3.** హెలట్ల మిక్కిలి పెద్ద తిరుగుబాట్లలో ఒకటి మెసేనియాలో క్రీ.పూ. 7వ శతాబ్దిలో జరిగింది. చాలా ఏళ్లపాటు పోరాటం జరిగింది. తిరుగుబాటుదారులు ఓడిపోయారు. సజీవంగా మిగిలినవాళ్లు తిరోగమించి, ఒక కొండమీద దాక్కున్నారు.

స్పార్టన్లు హెలట్ల శిబిరాన్ని ముట్టడించారు. ఒక రాత్రి, తీవ్రమైన తుపానులో, ధారాపాతంగా పడుతున్న వర్షంలో గుట్టు చప్పుడు కాకుండా వాళ్లు కొండచరియ ఎక్కారు. ఎడతెగని మెరుపుల వెలుతురులో కొండమీద మళ్లీ తీవ్ర యుద్ధం జరిగింది. హెలట్లే కాకుండా, వాళ్ల భార్యలు కూడా ఆ యుద్ధంలో పాల్గొన్నారు. ఒక ప్రాచీన రచయిత కథనం ప్రకారం ''స్త్రీలు కూడా శత్రువులను యెదిరించారు. వాళ్లు శత్రువులమీద రాళ్లు విసిరారు. బానిసత్వంలో అణగివుండే బదులు, పురుషులతోపాటు యుద్ధ రంగంలో మరణించడానికి సిద్ధపడిన స్త్రీలను చూసి పురుషుల ధైర్య సాహసాలు యినుమడించాయి.''

పోరాటం మూడు రోజులు రాత్రింబగళ్లు సాగింది. తిరుగుబాటుదార్లు చుట్టుముట్టడింపబడ్డారు. వాళ్ల స్థితి ఆశా రహితంగా వుంది. కాని అంత బలమైన ప్రతిఘటనను యెదుర్కొన్న స్పార్టన్లు తమకు కూడా పెద్ద నష్టం సంభవించడం చూశారు. దానితో మెసేనియానుండి వెళ్లిపోయే షరతుమీద హెలట్లను వదలిపెట్టడానికి స్పార్టన్లు ఒప్పుకున్నారు. వీరోచిత యుద్ధ ఫలితంగా హెలట్లలో కొంతమంది బానిసత్వంనుండి విముక్తి పొందారు, కాని వాళ్లు తమ జన్మభూమిని శాశ్వతంగా వదలిపెట్టి పోవలసివచ్చింది.

**4.** హెలట్లమీద తమ పెత్తనం నిలుపుకోడానికి స్పార్టన్లకు ఒక రాజ్యం, అంటే సైన్యమూ, చట్టాలూ, న్యాయస్థానాలూ అవసరమయ్యాయి.

రాజ్యంలో అధికారమంతా పూర్తిగా స్పార్టన్ల చేతిలో వుంది. ప్రజా సభలలో వాళ్లు పెద్దల సమితిని యెన్నుకునేవాళ్లు. పెద్దల సభ సభ్యులు కులీనులనుండి మాత్రమే యెన్నికౌతారు. వాళ్లలో యిద్దరిని రాజులనేవాళ్లు; వాళ్లు సైన్యానికి అధినాయకులు. ముఖ్యమైన వ్యవహారాలన్నిటినీ, ముఖ్యమైన దావాలతో సహా, పెద్దల సమితి చర్చించేది.

ఆయుధం పట్టగల స్పార్టన్లందరూ సైన్యంలో చేరవలసిందే. వాళ్లు సైనిక వృత్తి తప్ప మరే వృత్తీ చేపట్టకూడదని శాసనం వుండేది. శాంతి కాలంలో స్పార్టన్లు రోజంతా సైనిక శిబిరాల్లో గడిపేవాళ్లు. వాళ్లు ఆ శిబిరాల్లో కవాతు చేస్తూ, పరుగెత్తుతూ, ఈటెలు విసరడంలో సాధనచేస్తూ, తదితర సైనిక కవాతులు చేస్తూండేవాళ్లు. స్పార్టన్లు నిద్రకి ఉపక్రమించేటప్పుడు సైతం తమ ఆయుధాలను చేతికి అందుబాటులో పెట్టుకునేవాళ్లు.

స్పార్టన్ సైనికులకు మంచి ఆయుధాలు వుండేవి. వాళ్లు పదాతి దళాలుగా యుద్ధం చేసేవాళ్లు. యుద్ధ రంగంలో వాళ్లు బారులుగా నిలబడేవాళ్లు. ఇలా నిలబడిన దళాలను ఫలాంక్స్ అనే వాళ్లు. వాయిద్యాల, ఉమ్మడి గానాల నేపథ్యంలో



యుద్ధంలో స్పార్టన్ యోధుడు (ఒక ప్రాచీన విగ్రహం)

మెసేనియాలో హెలట్ల తిరుగుబాటుదార్లకీ, స్పార్టన్లకీ మధ్య పోరాటం (ఆధునిక చిత్రకారుడు గీసిన చిత్రం)



యుద్ధం జరిగేది. స్పార్టన్లు తరలి వెళ్తూంటే ఈలెలు సర్రుసర్రుమంటూండగా డాలులు తాపిన గోడ ముందుకు వెళ్తున్నట్లుండేది.

5. స్పార్టన్ బాలురను చిన్నతనంనుంచీ భావి సైనికులుగా, బానిస యాజమాన్య వర్గపు విశ్వసనీయ రక్షకులుగా పెంచే వాళ్లు. వాళ్లు తమ శరీరాలనూ, సంకల్పాన్నీ పటిష్ఠంచేసుకొనేలా, కష్టభూయిష్ఠమైన పరిస్థితుల్లో జీవించగలిగేలా తర్ఫీదు యిచ్చేవాళ్లు. వాళ్ల కాలమంతా శరీర వ్యాయామాల్లోనే గడిచేది.*

బాధని ఓపిగ్గా భరించడం నేర్పేందుకుగాను కుర్రాళ్లని క్రూరంగా కమ్చీలతో బాదేవాళ్లు. కొన్ని సందర్భాల్లో అలా శిక్షింపబడిన కుర్రాళ్ల ఒంటినుండి కారిన రక్తంతో వాళ్లు పడుకున్న స్థలం తడిసిపోయేది. యువకుల్లో క్రౌర్యాన్ని పెంపొందించేందుకుగాను వాళ్లచేత హెలట్లను చంపించేవాళ్లు.

పిల్లలూ, యువకులూ మారుమాట లేకుండా పెద్దవాళ్లు చెప్పినట్లు వినాలి. పెద్దవాళ్లు అనుమతించినప్పుడే చిన్నవాళ్లు మాట్లాడగలిగేవాళ్లు. స్పార్టన్ పిల్లవాని మాట వినడం కంటె రాతి విగ్రహం మాట సులభంగా వినవచ్చునని గ్రీసులో హాస్యంగా అనడం పరిపాటి.

స్పార్టన్లకి క్లుప్తంగా, కచ్చితంగా మాట్లాడటం నేర్పేవాళ్లు. క్లుప్తమైన, కచ్చితమైన వాక్యాలను లకోనిక్ వాక్యాలు అంటారు. వీటికి లకోనియాలో మాట్లాడే బాపతు వాక్యాలు అని అర్థం. ఉదాహరణకు, కొడుకును యుద్ధ రంగానికి పంపే స్పార్టన్ స్త్రీ అతనికి డాలును అందిస్తూ యిలా చెప్పేది: ''డాలుతో గానీ, డాలుమీద గానీ.'' స్పార్టాలో డాలు పోగొట్టుకోవడం అవమానంగా భావించబడేది; ధైర్యంగా పోరాడి యుద్ధ రంగంలో చనిపోయినవాణ్ణి డాలుమీద యింటికి తెచ్చేవాళ్లు. పిరికిగా ఉండటం కంటె గౌరవంగా వీరోచిత మరణం పొందడం మేలని పై మాటల తాత్పర్యం.

స్పార్టన్ యువకులు బలిష్ఠులుగా, ధైర్యవంతులుగా, కష్టాలను బాగా ఓర్చుకునేవాళ్లుగా పెరిగి పెద్దవాళ్లయేవాళ్లు. కాని చాలా క్రూరంగా, మొరటుగా వుండేవాళ్లు. వాళ్లకు చదువు సరిగా రాదు.

## స్పార్టన్ కుర్రాళ్ల జీవితం
## (ప్రాచీన గ్రీకు చరిత్రకారుడైన ప్లుటార్క్ గ్రంథంనుంచి)

తండ్రి తన శిశువును పెద్దల యెదుటికి తెచ్చేవాడు. పెద్దలు శిశువును పరీక్షించేవాళ్లు. శిశువు ఆరోగ్యంగా, బలంగా వుంటే, ఆ శిశువును పెంచేందుకు తండ్రికి అనుమతి యిచ్చేవాళ్లు. శిశువు దుర్బలంగా గానీ, వికారంగా గానీ వుంటే, ఆ శిశువును కొండమీదనుంచి విసిరేసేవాళ్లు.

ఏడేండ్ల కుర్రాళ్ల నందరినీ ఒక చోట చేర్చి, దళాలుగా విభజించేవాళ్లు. అందరూ సమానులుగా కలిసి భోంచేస్తూ, కలిసి జీవిస్తూ, కలిసి ఆడుకుంటూ, పరస్పర సాహచర్యానికి వాళ్లు అలవాటుపడేవాళ్లు. సైనిక పోటీలలో అత్యంత సాహసం ప్రదర్శించి, అందరి కంటె తెలివితేటలుగల పిల్లవాడు తన దళానికి నాయకుడయ్యే వాడు. ఇతరులందరూ అతన్ని ఆదర్శంగా స్వీకరించి, అతని ఆజ్ఞలు పాలించి, అతను విధించే శిక్షలు ధైర్యంగా భరించాలి. స్పార్టన్ పాఠశాలల్లో నిర్నిబంధమైన విధేయత వుండేది.

---

* స్పార్టన్ మాదిరిగా బతకడమంటే చలికీ, కష్టాలకీ జంకకుండా తన శరీరాన్ని కాకలుతీర్చడం అని అర్థం.

బాలురకు కనీస స్థాయిలో చదవనూ, రాయనూ — విధిగా అవసరమైనంత మాత్రమే — నేర్పించేవాళ్ళు. తక్కిన విద్య అంతా వాళ్ళకు పరిపూర్ణ విధేయతా, కష్టాలు సహించడమూ, యుద్ధంలో గెలవడమూ నేర్పడానికి ఉద్దేశింపబడినవి. వాళ్ళు పెద్దవాళ్ళయ్యేకొద్దీ నిబంధనలు మరింత కఠినంగా వుండేవి. బోడిగుళ్ళు చెయ్యబడేవి. వాళ్ళకు వుత్త కాళ్ళతో నడవడమూ, దిగంబరంగా ఆటలాడడమూ నేర్పించేవాళ్ళు. పన్నెండేళ్ళు వచ్చాక ఒక్కొక్క ఏడాదికి ఒక్కొక్క కేప్ (వెనక్కి జీరాడే చేతుల్లేని ఉడుపు) యిచ్చేవాళ్ళు. వాళ్ళ చర్మం కరుకుగా వుండేది. సాధారణంగా వాళ్ళు వేడి నీళ్ళతో స్నానం చేసేవాళ్ళు కాదు. వాళ్ళు కత్తులు ఉపయోగించకుండా ఉత్తచేతులతో చీల్చిన వెదురు పేళ్ళతో అల్లిన చాపలమీద పడుకునేవాళ్ళు.

## స్పార్టన్ కవి టిర్టేయస్ కావ్యంనుంచి

పిల్లపాపల రక్షిస్తూ మాతృదేశంకోసం పోరుదాం
వీరోచిత పోరాటంలో వీరమరణం చెందుదాం.
యువకుల్లారా లేవండి వెనుజూపక పోరండి.
భీరువులై తిరోగమించక ధీరుల ఒరవడి పెట్టండి.
భయం గియం విడవండి సదా ధైర్యం పూనండి.





1. కాలిలో గుచ్చుకున్న ముల్లు తీసుకుంటున్న బాలుడు (ప్రాచీన గ్రీకు బొమ్మ). పరుగు పందెంలో ఆ బాలుడికి ముల్లు గుచ్చుకుంది. కాలు బాధపెడుతున్నా పరుగు విరమించుకోక, అతను పోటీలో ప్రథముడుగా గెలిచాడు. ఆ తర్వాతనే అతను ముల్లు తీసుకున్నాడు. 2. కుస్తీ పోటీదారులు (ప్రాచీన గ్రీకు శిల్పం)

శత్రువులను జాలిచూపక నిర్దాక్షిణ్యంగా వధించండి...
పళ్లను గిట్టకరచి దృఢముగ కాళ్లూని
అచలంవోలె అచంచలంగా నిలవండి.

? **1.** స్పార్టాలో ఏయే వర్గాలు వుండేవి? స్పార్టా, అట్టికాల జనాభా సంపుటిలో వున్న తేడా యేమిటి? **2.** వర్గ పోరాటం అంటే యేమిటి? స్పార్టన్ సమాజంలో వర్గపోరాటం ఎలా ప్రతిబింబితమైంది? ప్రాచీన తూర్పు దేశాల్లోని వర్గపోరాటానికి ఉదాహరణలు యివ్వండి. **3.** స్పార్టన్ రాజ్యం ఎవరి ప్రయోజనాలను కాపాడింది? మీ జవాబును నిరూపించండి. **4.** స్పార్టన్ కుర్రాళ్ల పెంపకపు ప్రధాన లక్ష్యం యేమిటి? ఈ లక్ష్యం వేటి ద్వారా సాధింపబడేది? స్పార్టన్ విద్యా విధానంలో మీకు నచ్చింది యేమిటి? నచ్చనిది యేమిటి? **5.** § 32కి ఉపశీర్షికలు సూచించండి.

## § 33. గ్రీసులోనూ, మధ్యధరా సముద్ర తీరంలోనూ, నల్ల సముద్ర తీరంలోనూ నగర రాజ్యాల ఆవిర్భావం

(మాప్‌లు 4, 5)

క్రీ.పూ. 1వ సహస్రాబ్ది ఆరంభం నాటికి గ్రీకులు ఎక్కడెక్కడికి వెళ్లి స్థిరపడ్డారు? (120వ పేజీలోని మాప్ చూడండి.)

1. గ్రీసులో నగర రాజ్యాలు. క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల కాలంలో దాదాపు గ్రీకు నగరాలు అన్నింట్లోనూ స్వతంత్ర రాజ్యాలు యేర్పడ్డాయి. దాదాపు ప్రతి నగరమూ, దాని పరిసర గ్రామాలతో కలిసి, ఒక రాజ్యంగా అభివృద్ధి అయింది. అలాంటి నగర రాజ్యాలకు వాటి సొంత సైనిక దళాలు, ఖజానా ఉండేవి. అవి తమ సొంత నాణాలను ముద్రించేవి.

నగర రాజ్యాలలో ప్రభువర్గాలకీ, సామాన్యులకీ మధ్య భీషణమైన పోరాటం సాగింది. కొన్ని నగరాలలో సామాన్యులు రుణ బానిసత్వం రద్దు చేయించి, రాజ్య పరిపాలనలో పాల్గొనే హక్కు సంపాదించారు. కొన్ని నగర రాజ్యాలలో ప్రభువులు తమ అధికారాన్ని తమ చేతుల్లో నిలుపుకున్నారు. అలాంటి నగరాల్లో సామాన్యుల జీవిత పరిస్థితి ఎలా వుండేదో క్రీ.పూ. 8వ శతాబ్ది అంతంలోనూ, 7వ శతాబ్ది ఆరంభంలోనూ జీవించిన హెసియాడ్ అనే గ్రీకు కవి రాసిన నీతికథలో చక్కగా వర్ణింపబడింది (§33కి అనుబంధం చూడండి).

నగర రాజ్యాల్లో జరిగే పోరాటాల మూలంగా చాలామంది గ్రీకులు దేశం విడిచిపోవలసివచ్చేది. ''అప్పులనుండి విముక్తి చెందడానికి, ఆకలినుండి తప్పించుకోడానికి'' పేద ప్రజలు దేశం వదలిపోయారని హెసియాడ్ రాశాడు. కులీనులకు విజయం కలిగినప్పుడల్లా వాళ్ల వ్యతిరేకులు పగ సాధింపునుండి తప్పించుకోడానికి దేశంనుండి పారిపోయేవాళ్లు. సామాన్యులు అధికారంలోకి వచ్చినప్పుడు, వాళ్లు తమ శత్రువులైన ప్రభువులను దేశాంతరాలకు తరిమివేశారు. దేశం విడిచి పారి





1. క్రైమియాలోని గ్రీకు నగరం హెర్సొనేస్‌లో కోటగోడ శిథిలాలు (ఫొటో). ద్వారాలతో కూడివున్న కోటగోడ దిగువ భాగం నేలలో కప్పబడిపోయింది. ద్వారాలపైన గోడలో ఒక తలుపు ఏర్పాటుచెయ్యబడింది. రాళ్లు ఎలా మలచ బడ్డాయో గమనించండి. 2. సిసిలీలోని క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి ఒక గ్రీకు దేవాలయం (ఫొటో)







3. సిసిలీలోని సిరక్యూజ్ నగరపు నాణెం. దానిమీద సూర్య దేవుడు స్వర్ణ రథంలో ఆకాశంలో పయనించడం చిత్రింపబడింది. 4. ఒక ప్రాచీన గ్రీకు వర్తక ఓడ. 5. ఒక ప్రాచీన గ్రీకు యుద్ధ ఓడ (వాజుమీది చిత్రాలు). ఆ ఓడ ముఖ భాగం కంచుతో గాని, ఇనుముతో గాని తాపడం చెయ్యబడేది. దానితో అది శత్రు నౌకలను కుమ్మేది. యుద్ధ ఓడని వర్తక ఓడతో పోల్చిచూడండి






ప్రాచీన గ్రీసు ఏ వస్తువులను ఎగుమతి చేసేది? వేటిని దిగుమతి చేసుకునేది? చిత్రాల్లో చూపబడిన ఆయా వస్తువులను పేర్కొనండి

పోయిన ఒక ప్రభువు యిలా రాశాడు: "ప్రాణాలతో పారిపోగలిగేందుకు నేను గతిలేక నా విశాల భవనాన్ని ఒక చిన్న ఓడకోసం అమ్ముకున్నాను."

## 2. వలసల స్థాపన.

గట్టి కొయ్య ఓడలు చేయడం గ్రీకులు నేర్చుకున్నారు. చేతిపనులవాళ్ల తయారు చేసిన సరుకులు యితర దేశాలకు తీసుకపోవడానికి గ్రీకు వర్తకులు ఈ ఓడలను ఉపయోగించేవాళ్లు. ఆసియా మైనరులో అత్యంత పెద్ద గ్రీకు నగరమైన మిలెటస్ వున్ని బట్టలకు ప్రసిద్ధి కెక్కింది. కోరింత్ అత్యుత్తమమైన ఆయుధాలు ఉత్పత్తిచేసేది, అత్యుత్తమమైన జాడీలు ఏథెన్స్‌లో తయారయ్యేవి.

మొదట్లో వర్తకులు విదేశ తీరాల్లో స్థానికులతో వస్తువులు మార్పిడి చేసుకునేందుకు మాత్రమే తమ ఓడలను

నిలిపేవాళ్లు. కాలం గడిచేకొద్దీ, గ్రీకు వర్తక నగరాలు మధ్యధరా సముద్ర తీరంలోనూ, నల్ల సముద్ర తీరంలోనూ స్థిర మైన వలసలు* స్థాపించడం ప్రారంభించాయి.

వలసల్లో స్థిరపడగోరే మనుషులు గ్రీసులో చాలామంది ఉండేవాళ్లు: తమ సరుకులకు మంచి గిరాకీ వుంటుందని ఆశించిన చేతివృత్తులవాళ్లు, తమ భూములు కోల్పోయిన రైతులు, స్వదేశంనుంచి పారిపోవలసివచ్చినవాళ్లు. ఒక కొత్త వలసను నెలకొల్పే నగరం అక్కడకి సైనిక, వర్తక నౌకల దండును పంపేది.

### 3. వలసలలో జీవితం.

విదేశాలకు పోయిన గ్రీకులు అనువైన అఖాతం దగ్గరో, నదీ ముఖద్వారం దగ్గరో వున్న భూమిని ఆక్రమించుకునేవాళ్లు. వాళ్లు అక్కడ నగరం కట్టుకొని, దాని చుట్టూ కోట గోడలు కట్టేవాళ్లు. వలసదారులు చేతిపనుల కార్ఖానాలు పెట్టే వాళ్లు. నగర సమీపంలోని భూమిని సాగుచేసేవాళ్లు. పశువుల్ని పెంచేవాళ్లు. స్థానిక తెగలవాళ్లతో వర్తకం చేసేవాళ్లు. గ్రీకులు స్థానిక తెగలనుంచి బానిసలను సంపాదించేవాళ్లు. బానిసల్లో కొందర్ని పనులకోసం ఉంచుకొని, మరి కొందర్ని గ్రీసులో అమ్మకంకోసం పంపేవాళ్లు.

వలసల్లో స్వతంత్ర బానిస యాజమాన్య నగర రాజ్యాలు నెలకొన్నాయి. వలసల్లో చాలామటుకు గ్రీసులోని నగరాలంత ఉండేవి. గ్రీకులు సముద్ర తీరంనుంచి దూరం పోయేవాళ్లు కాదు. ఒక ప్రాచీన రచయిత వలసల్లోని గ్రీకులను చెరువు చుట్టూ కూర్చునే కప్పలతో పోల్చాడు.

### 4. వలసల ప్రాముఖ్యం.

వలసలతో వర్తకం మూలంగా గ్రీకు చేతిపనులకు డిమాండు పెరిగింది. దాని మూలంగా గ్రీసులో చేతిపనులు, వర్తకం మరింత అభివృద్ధి చెందాయి. అనువైన రేవుల సమీపంలోని గ్రీకు నగరాలు వేగంగా పెరగనారంభించాయి. వలసలనుండి బానిసలు రావడం గ్రీసులో బానిస యాజమాన్యానికి దోహదం చేసింది. గ్రీకు వలసలు ఉద్భవించిన దేశాలలో కూడా వర్తకమూ, చేతిపనులూ గణనీయంగా పెరిగాయి. స్థానిక తెగలు ఆదిమ సమష్టి సమాజ వ్యవస్థనుండి బానిస యాజ మాన్య వ్యవస్థకు పురోగమించడానికి తక్కువ కాలం పట్టింది.

గ్రీకులు విస్తారమైన ప్రాంతంలో స్థిరపడినప్పటికీ, వాళ్లు తమ మాతృభాషలోనే మాట్లాడటం కొనసాగించారు. వాళ్లు తమని తాము హెలెనీజ్ అనీ, తమ మాతృదేశాన్ని హెల్లాస్ అనీ పిలుచుకునేవాళ్లు.

క్రీ.పూ. 5వ శతాబ్ది నాటికి కాకసస్‌నుండి స్పెయిన్‌దాకా వ్యాపించివున్న సముద్ర తీరాల వెంట వందలాది గ్రీకు నగర రాజ్యాలు ఆవిర్భవించాయి.

## హెసియాడ్ నీతి కథ ''కోకిల, డేగ''

కవి తన యీ కవితలో ఎవరిని కోకిలగా చిత్రించాడు? ఎవరిని డేగగా చిత్రించాడు?

మిలమిల మెరిసే కళ్ల చిన్నారి కోకిల క్రూరమైన
డేగ గుప్పిట్లో చిక్కింది

---

* వలసలు — ఇక్కడ యీ మాటకి మరో దేశంలో స్థిరపడే మనుషుల సమూహం అని అర్థం.

ఆకాశంలో ఎగిరే క్రూరమైన డేగ విలవిలలాడే
కోకిల మూలుగునే విన్నది
తన వంకర గోళ్లలో చిక్కిన కోకిల రోదన విని
డేగ కడు దర్పంగా యిట్లన్నది:
"కుహుకుహు మూల్గెదవెందుకె దౌర్భాగ్యపు కోకిలా,
తెలియద నీకంటె యెంతొ బలమైనదాన్నని.
నోరునొప్పి పెట్టుదాక పాడుకో, వేడుకో
నేను మాత్రం నిన్ను ఎత్తుకునే పోతా
చిత్తం వస్తే విడిచేస్తా, చిర్రెత్తుకొస్తే తినివేస్తా."

? **1.** ఏథెన్స్, స్పార్టాల చరిత్రనుంచి ఉదాహరణలు పేర్కొని, గ్రీసులో రాజ్యాలు ఎందుకు అవతరించాయో చెప్పండి. **2.** గ్రీకు నగర రాజ్యాల పాలనలో తేడాలు యేమిటి? ఈ తేడాలు ఎలా ఉత్పన్నమయాయి? **3.** గ్రీకులు వలసలను ఎలా నెలకొల్పారో, ఎందుకు నెలకొల్పారో వివరించండి.

---

క్రీ.పూ. 11వ–9వ శతాబ్దాల నాటి, క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల నాటి గ్రీసు చరిత్రను గురించి యిప్పుడు మీరు కొన్ని విషయాలు తెలుసుకున్నారు. ఈ రెండు దశల్లోనూ గ్రీకుల జీవితం ఎలా వుండేదో మీరు తెలుసుకున్నారు. చరిత్ర శాస్త్రంలో దశలన్నవి ఒకదాని వెంట మరొకటిగా వచ్చే కాల వ్యవధులు. ఆ దశల్లో ప్రతి ఒక్కదానిలోనూ ప్రజల జీవితం అంతకుముందరి దశలోని, అటు తర్వాతి దశలోని ప్రజా జీవితానికి గణనీయంగా భిన్నంగా వుంటుంది. చరిత్రను ఆయా దశలుగా వర్గీకరించడం చరిత్ర సాధారణ క్రమాన్ని మరింత బాగా అర్థం చేసుకునేందుకు తోడ్పడుతుంది. ఈ పాఠ్యగ్రంథపు విషయసూచిక పట్టీ గ్రీసు చరిత్రలోని ప్రధాన దశలను తెలుసుకునేందుకు మీకు తోడ్పడుతుంది.

క్రీ.పూ. 11వ–9వ శతాబ్దాల నాటి గ్రీకుల జీవితాన్నీ, క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల నాటి గ్రీకుల జీవితాన్నీ తులనాత్మకంగా పరిశీలించండి.

అ) క్రీ.పూ. 5వ శతాబ్ది ఆరంభం నాటికి గ్రీకులు ఆయా ప్రాంతాల్లో ఎలా స్థిరపడ్డారు?
ఆ) వ్యవసాయంలో, చేతివృత్తుల్లో, వర్తకంలో ఏ మార్పులు సంభవించాయి?
ఇ) గ్రీకుల సమాజ నిర్వహణలో ఏ మార్పులు సంభవించాయి?
ఈ) ప్రభుత్వంలో ఏ మార్పులు సంభవించాయి?

మీ నోట్‌బుక్కులో "క్రీ.పూ. 11వ శతాబ్దినుంచి 3వ శతాబ్దిదాకా గ్రీసు చరిత్రలో ప్రధాన దశలు" అనే పట్టికను తయారుచెయ్యడం మొదలుపెట్టండి. ఈ పట్టిక నమూనానీ, గ్రీసు చరిత్ర మొదటి దశకి సంబంధించిన చిత్తు నోట్సునీ పేజి 209లో చూడండి. ఈ నమూనా ఆధారంగా క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల్లో గ్రీకుల జీవితం గురించిన సంక్షిప్త వర్ణన యివ్వండి.

ప్రకరణం తొమ్మిది

# గ్రీసులో బానిస వ్యవస్థ అభివృద్ధి, క్రీ.పూ. 5వ శతాబ్దిలో ఏథెన్స్ పురోగతి

## §34. గ్రీకు-పర్షియన్ యుద్ధాలు

(మాప్ 4, పేజి 160లోని మాప్)

క్రీ.పూ. 5వ శతాబ్ది మొదట్లో పర్షియన్ సామ్రాజ్య విస్తీర్ణాన్నీ, జనాభానీ జ్ఞాపకం చేసుకోండి (§ 16; 5, పేజి 77లోని మాప్); ఏథెన్స్‌లో సైన్యం ఎవరెవరితో కూడివుండేది, దాని నిర్మాణ రూపం యేమిటి (§ 30–31; 9)?

**1. మేరథాన్ యుద్ధం.** క్రీ.పూ. 5వ శతాబ్ది మొదట్లో గ్రీసు ప్రజలకు విదేశీ దండయాత్ర ప్రమాదం ఏర్పడింది. శక్తివంతమైన పర్షియన్ సామ్రాజ్యం ఎగేయన్ సముద్రంలోని అత్యధిక సంఖ్యాక దీవులనూ, దాని ఉత్తర తీరాలనూ జయించింది. మొదటి డరియస్ రాజు గ్రీసు దేశమంతట్లోనూ తన పాలన నెలకొల్ప ప్రయత్నించాడు.

క్రీ.పూ. 490లో పర్షియన్ సైన్యం నౌకల్లో ఎగేయన్ సముద్రం దాటి, ఏథెన్స్‌కి కేవలం 42 కిలోమీటర్ల దూరంలో అట్టికాలో వున్న మేరథాన్ మైదానంమీద దిగింది.

ఏథెనియన్ సైన్యం పర్షియన్ సైన్యం కంటె బాగా చిన్నదైనప్పటికీ, అది ధైర్యంగా దేశ రక్షణకి పూనుకొంది. మేరథాన్ మైదానంలో జరిగిన భీషణ పోరాటంలో పర్షియన్లు ఓడింపబడ్డారు. వాళ్లు హడావిడిగా ఓడలెక్కి, గ్రీసును విడిచిపోయారు (ఈ యుద్ధాన్ని గురించిన మరిన్ని వివరాలకోసం పేజి 163నీ, వర్ణ చిత్రం 11నీ చూడండి).

**2. గ్రీసుపై క్సేర్‌క్సెస్ దండయాత్ర.** క్రీ.పూ. 480లో మరొక బ్రహ్మాండమైన సైన్యం, నౌకాదళం పర్షియానుండి గ్రీసువైపు మళ్లీ బయలుదేరాయి. ఈసారి ఆ సైన్యాన్ని నడిపించింది మొదటి డరియస్ మరణించిన తర్వాత సింహాసన మెక్కిన పర్షియా కొత్త రాజు క్సేర్‌క్సెస్. "మాపట్ల నేరం చేసినవాళ్లనూ (నేరం చేయడమంటే పర్షియన్లతో యుద్ధం చేయడం), చేయనివాళ్లనూ అందరినీ బానిసలను చేస్తాము" అని అతను అన్నాడు.

పర్షియన్ రాజులు జయించిన జాతులు దాదాపు అన్నింటికి చెందిన సైనికులూ – అస్సీరియనులూ, ఈజిప్షియన్లూ, బాబిలోనియనులూ, ఆసియా మైనరులో స్థిరపడిన గ్రీకులూ, యింకా అనేక యితర జాతులవాళ్లూ – క్సేర్‌క్సెస్ సైన్యంలో వుండేవాళ్లు. క్సేర్‌క్సెస్ ఫొనీషియన్లచేత సైనిక నౌకలను నిర్మింపజేశాడు. పర్షియన్ రాజుకు గ్రీసును జయించిపెట్టాలని వాళ్లకు ఆసక్తి లేదు.




1. మేరథాన్ యుద్ధం. 2. థర్మోపిలే కనుమలో జరిగిన యుద్ధం




క్సేర్‌క్సెస్ సైన్యాలు తీరం వెంబడి పురోగమించి, యుద్ధం లేకుండానే ఉత్తర గ్రీసును ఆక్రమించాయి. కొన్ని గ్రీకు నగర రాజ్యాలు ఐక్యమై శత్రు దాడిని ప్రతిఘటించాయి. లియోనిడస్ రాజు నాయకత్వం కింద మూడు వందలమంది సైనికులను స్పార్టా పంపింది. లియోనిడస్ ఆధిపత్యం కింద సంయుక్త గ్రీకు సైన్యం థర్మోపిలే కనుమ దగ్గర మధ్య గ్రీసులోకి పోయే మార్గాన్ని అడ్డగించింది.

### 3. థర్మోపిలే యుద్ధం.

క్సేర్‌క్సెస్ థర్మోపిలేని సమీపించాడు. ఆయుధాలను పర్షియన్లకు అప్పగించమని చెప్పడానికి లియోనిడస్ వద్దకు క్సేర్‌క్సెస్ రాయబారులను పంపాడు. "వచ్చి తీసుకపోండి" అని లియోనిడస్ సమాధానం చెప్పాడు. ఒక రాయబారి గ్రీకులను భయపెట్టడానికి పర్షియన్ల సంఖ్యాధిక్యతను వర్ణిస్తూ, "మా బాణాలూ, బల్లేలూ సూర్యుని కప్పేస్తాయి" అని చెప్పాడు. "అయితే మేము నీడలో యుద్ధం చేయవలసివుంటుంది" అని గ్రీకు యోధులు సమాధానం చెప్పారు.

థర్మోపిలే కనుమ
480
థీబ్స్
ప్లటేయా 479
కోరింత్
480 ఏథెన్స్
ద్వీపం
స్పార్టా
యుబోయా
మర్మరా సముద్రం
సార్డిస్
మికలే అగ్రం
మిలెటస్

1



2

క్రీ.పూ. 480 నాటికి పర్షియన్ సామ్రాజ్యం, దాని అధీనంలో వున్న రాజ్యాలు

పర్షియన్లకి వ్యతిరేకంగా జరిగిన యుద్ధంలో పాల్గొన్న గ్రీకు రాజ్యాలు

క్రీ.పూ. 480లో క్సేర్క్సెస్ భూ, నౌకా దండయాత్ర

ముఖ్య యుద్ధాలు జరిగిన స్థానాలు, తేదీలు

65 0 65 130కి.మీ.

1. గ్రీసుపై క్సేర్క్సెస్ సైనికుల దండయాత్ర.
2. సలమిస్ యుద్ధం

చిన్న గ్రీకు దళంమీద పర్షియన్ దాడులు రెండు రోజులపాటు సాగాయి. పర్షియన్ సేనాధిపతులు తమ సైనికులను యుద్ధ రంగంలోకి తోయడానికి కొరడాలు ఉపయోగించారు. దాడులన్నిటినీ గ్రీకులు తిప్పికొట్టారు. అప్పుడొక దేశద్రోహి పర్షియన్లను రాత్రిపూట పర్వతాల గుండా గ్రీకుల వెనుక వైపుకు తీసుకెళ్లాడు. తన సైన్యం శత్రువులచేత చుట్టుముట్టబడడం చూసి, లియోనిడస్ స్పార్టన్లను తప్ప అందరినీ తిరోగమించమని ఆజ్ఞాపించాడు. అసమ యుద్ధంలో లియోనిడస్‌తోబాటు స్పార్టన్లు మరణించారు. కాని పర్షియన్ల పురోగమనాన్ని వాళ్లు కొంత సేపు నిలవరించారు. గ్రీకు సైన్యం తిరోగమించడానికి అవకాశం లభించింది. లియోనిడస్‌తో బాటు మూడు వందలమంది స్పార్టన్లు ఆ అసమ యుద్ధంలో నేలకొరిగారు. కాని వాళ్లు పర్షియన్లను నిలవరించి, మిగిలిన గ్రీకులు తిరోగమించడాన్ని సాధ్యంచేశారు.

పర్షియనులు మధ్య గ్రీసును ఆక్రమించారు. ఏథెనియన్లు తమ నగరం వదలిపెట్టారు. యుద్ధంచెయ్యగల పురుషులందరూ సైన్యంలోనో లేక యుద్ధ నౌకల్లోనో వున్నారు. స్త్రీలనూ, వృద్ధులనూ, పిల్లలనూ, బానిసలనూ నౌకా దళ రక్షణ కింద దగ్గరలో వున్న పెలొపొనేసస్‌కీ, సలమిస్ దీవికీ తరలించారు. క్సేర్‌క్సెస్ ఆజ్ఞల మేరకు కాలిపోతున్న తమ నగరాన్ని ఏథెనియన్లు ఓడలమీదనుండీ, సలమిస్ దీవినుండీ చూశారు.

### 4. సలమిస్ యుద్ధం.

సమీకృత గ్రీకు నౌకా దళం అట్టికా, సలమిస్‌ల మధ్య వున్న జలసంధిలో నిలిచింది. ఏథెనియన్లకి 200 యుద్ధ నౌకలు వున్నాయి. మిగిలిన గ్రీకు నగర రాజ్యాలన్నింటికీ కలిసి ఉన్నవాటి కంటె యివి ఎక్కువ. ఆ నౌకలకి ఒక్కొక్క పక్కన మూడు వరసల తెడ్లు వుంటాయి. అందుకని వాటికి ట్రైరెమ్‌లని పేరు వచ్చింది. ఒక్కొక్క ట్రైరెమ్‌లో 180 మంది తెడ్లు వేసేవాళ్లు, 20–30 మంది నౌకా సైనికులు వుంటారు. మహాసముద్రాల్లో ప్రయాణానికి ఉద్దేశింపబడిన భారీ పర్షియన్ నౌకల కంటె యివి వేగంగా పోతాయి. ఇరుకైన సలమిస్ జలసంధిలో లోతుతక్కువ తావులూ, నీటికింది కొండలూ ఎక్కడెక్కడ వున్నాయో గ్రీకు నావికులకు తెలుసు.

తన నౌకా బలాధిక్యతతో సులభంగా విజయం పొందవచ్చునన్న విశ్వాసంతో, క్సేర్‌క్సెస్ దాడికి ఉత్తరువు యిచ్చాడు. పర్షియన్ నౌకా దళం సలమిస్ జలసంధిలోకి పయనించింది. తన ప్రభువులు పరివేష్టించి వుండగా, క్సేర్‌క్సెస్ యెత్తైన అట్టికా తీరంమీద నిలబడి తన ఓడలు గ్రీకులమీద దాడి చేయడం చూస్తూ వున్నాడు. ఎదుటి తీరంమీద ఏథెనియన్ స్త్రీలూ, వృద్ధులూ యుద్ధం చూస్తూ వున్నారు. గ్రీకులు తప్పనిసరిగా గెలిచి తీరాలి. వాళ్లు వెనక్కిపోతే, వాళ్ల కుటుంబ సభ్యులు బానిసలౌతారు.

పర్షియన్ నౌకా దళం జలసంధిలోని అత్యంత యిరుకు భాగానికి చేరిన వెంటనే గ్రీకు నావికులు తెడ్లు వేయడం ప్రారంభించారు; వాళ్ల నౌకలు పర్షియన్లమీదికి వేగంగా పురోగమించాయి. వేగంగా కదలగల గ్రీకు ట్రైరెమ్‌లు తమ ముందు భాగాలతో శత్రు ఓడల తెడ్లు విరగగొట్టి ఆ ఓడల పార్శ్వాలను కుమ్మాయి. పర్షియన్ నౌకా దళం చెల్లాచెదురైంది; ఓడలు మెరకపట్టాయి, గందరగోళంలో నౌకలు ఒకదాని కొకటి ఢీ కొట్టుకున్నాయి. అనేక నౌకలు నీళ్లలోని కొండ శిలలకు కొట్టుకొని ముక్కలు ముక్కలైనాయి. 200 నౌకలు ముంచబడ్డాయి. తక్కినవి పారిపోయాయి.

### 5. గ్రీకుల సంపూర్ణ విజయం.

యుద్ధ ఫలితాన్ని నిర్ణయించడంలో సలమిస్ విజయానికి అత్యంత ప్రాముఖ్యం వుంది. తాను పర్షియాకు తిరిగి పోకుండా గ్రీకు నౌకా దళం అడ్డగిస్తుందని క్సేర్‌క్సెస్ భయపడ్డాడు. అతను త్వరితంగా వెనుదిరిగి తన సైన్యంలో కొంత భాగంతో పర్షియా చేరాడు.

గ్రీసులో స్థావరంగా వున్న పర్షియన్ సైన్యంమీద సంయుక్త గ్రీకు సైన్యం దాడిచేసింది. ఈ సారి మధ్య గ్రీసులోని ప్లటేయా నగరం దగ్గర క్రీ.పూ. 479లో ప్రధాన యుద్ధం జరిగింది. ఆ యుద్ధం దీర్ఘ కాలంపాటు తీవ్రంగా జరిగింది.





1, 2, 3. గ్రీకు యోధులు (ప్రాచీన గ్రీకు చిత్రాలు). 4, 5. పర్షియన్ యోధులు (ప్రాచీన చిత్రాలు)




గ్రీకులు శత్రువును చిత్తుగా ఓడించి, తమ దేశంనుంచి తరిమేశారు.

పర్షియన్ను తరిమి వేయబడినప్పటికీ, అంతటితో గ్రీకు-పర్షియన్ యుద్ధం ముగియలేదు. అది మరొక 30 యేండ్లు సాగింది.

తీరంమీద వున్న అనేక గ్రీకు నగర రాజ్యాలు ఒక కూటమిగా ఏర్పడ్డాయి. ఆ రాజ్యాల్లోకెల్ల ఏథెన్స్ మిక్కిలి బల మైనది. ఏథెనియన్ల నాయకత్వాన సమైక్య గ్రీకు బలగాలు పర్షియన్ నౌకా దళాన్ని ఓడించాయి. అంతేకాక ఆసియా మైనర్ తీర ప్రాంతాలమీద సైతం సాహసికమైన కొన్ని దాడులు చేశాయి. పర్షియన్ రాజు శాంతి సంధి చేసుకొని, దీవుల్లోని, ఆసియా మైనర్ తీరాల్లోని గ్రీకు నగరాల స్వాతంత్ర్యాన్ని గుర్తించక తప్పలేదు.

## మేరథాన్ పోరాట క్రమం
## (హెరొడోటస్, తదితర ప్రాచీన గ్రంథకర్తల రచనల ఆధారంగా)

మేరథాన్ యుద్ధంలో గ్రీకు వ్యూహకర్తల సైనిక కళాభిజ్ఞతా, గ్రీకు సైనికుల సాహసమూ ఎలా వ్యక్తమయ్యాయి?

పర్షియన్లు మేరథాన్ మైదానంమీద దిగుతున్నారన్న వార్త ఏథెన్స్‌కి చేరింది. ఏథెనియన్ ప్రభువుల్లో కొందరు పర్షియన్ పక్షానికి ఫిరాయించేందుకు సిద్ధంగా ఉన్నారు. పర్షియన్ రాజు తోడ్పాటుతో సామాన్యులమీద తమ పెత్తనాన్ని తిరిగి సంపాదించుకోవచ్చునని వాళ్లు ఆశించారు.

ఏథెనియన్లకి అప్పుడిక వ్యవధి లేదు. వాళ్లు తమ బలగాలను వేగంగా సమీకరించారు. ఏథెనియన్ సైన్యంలో భారీ ఆయుధాలున్న 10,000 మంది పదాతి సైనికులు ఉన్నారు. ప్లటేయా అనే చిన్న నగరం వెయ్యిమంది సైనికుల్ని పంపింది. వ్యూహకర్తల* నాయకత్వాన గ్రీకు సైన్యం శత్రువుమీదకి పురోగమించింది. మేరథాన్ మైదానం చుట్టూవున్న కొండలమీద విడిసిన ఏథెనియన్లు పర్షియన్ సేనా శిబిరాన్నీ, తీరానవున్న పర్షియన్ నౌకలనూ చక్కగా చూడవచ్చు. పర్షియన్ సైన్యం ఏథెనియన్ సైన్యం కంటె చాలా పెద్దది.

ఏథెన్స్‌కి పోయే మార్గాన్ని అడ్డగిస్తూ, పర్షియన్ ఆశ్విక సైనికులు పోరాటం చేసేందుకు అనువుకాని కొండల మీద గ్రీకు సైనికులు తమ స్థావరాలు తీసుకున్నారు. గ్రీకు సైనికులకి అనుభవశాలి అయిన వ్యూహకర్త మిల్‌టియాడెస్ నాయకత్వం వహించాడు.

దాదాపు ఒక వారం రోజులపాటు శత్రుపక్షాలు ఒకదానికి ఎదురుగా మరొకటి మోహరించి నిలిచాయి. చివరకు గ్రీకు సైన్యం ఫలాంక్స్ కింద ఏర్పడి మైదానంమీదకి తరలివెళ్లింది. పర్షియన్ సైన్యపు శ్రేష్ఠమైన దళాలు మధ్యలో ఉన్న సంగతి మిల్‌టియాడెస్‌కి తెలుసు. అందుకని అతను ప్రధానమైన గ్రీకు బలగాలను ఫలాంక్స్ పార్శ్వ భాగాల్లో ఉంచాడు.

ఏథెనియన్ సైనిక దళాలు శత్రువుల శరవర్షాన్ని లెక్కచెయ్యకుండా పర్షియన్లమీద భయంకరమైన దాడి చేశాయి. తమ దేశంకోసమూ, తమ తల్లుల, భార్యల, పిల్లల ప్రాణంకోసమూ, స్వేచ్ఛకోసమూ పోరాడుతున్నామనే భావం వాళ్లకు మరింత ధైర్యమూ, బలమూ యిచ్చింది.

బాహాబాహీ యుద్ధం మొదలైంది. పర్షియన్ శ్రేష్ఠ దళాలు ఏథెనియన్ ఫలాంక్స్‌యొక్క బలహీనమైన మధ్య భాగాన్ని చెదరగొట్టాయి. సులభంగా విజయం పొందుతున్నామని పర్షియన్లు అనుకొన్నారు. కాని సరిగా అదే సమయంలో గ్రీకు పార్శ్వ దాడి దళాలు తమ ఎదుటి పర్షియన్ దళాలను పారదోలి, పర్షియన్ సుశిక్షిత సైన్యంమీద రెండు పక్కల్నుంచీ దాడిచేశాయి. పర్షియన్లు యెదురు నిలవలేక తమ ఓడల వద్దకు తిరోగమించారు. గ్రీకులు 7 పర్షియన్ ఓడల్ని పట్టుకున్నారు. పర్షియన్లు త్వరత్వరగా మిగిలిన ఓడలెక్కి గ్రీసునుండి పారిపోయారు.

---

* వ్యూహకర్త — ఎన్నుకోబడిన సేనా నాయకుడు లేక నౌకా దళ నాయకుడు.

ఈ విజయ వార్తని తన తోటి పౌరులకి సాధ్యమైనంత త్వరగా అందజెయ్యాలన్న ప్రయత్నంలో ఒక ఏథెనియన్ మేరథాన్‌నుంచి 42 కిలోమీటర్లు ఏకబిగిన పరుగెత్తి ఏథెన్స్‌కి చేరుకున్నాడు. నగరం మధ్యకి చేరుకుని ''ఆనందించండి ఏథెన్స్ వాసులారా, మనం గెలిచాం!'' అని కేకవేసి, అతను తుది శ్వాస పీల్చి, కుప్పకూలి పోయాడు. 42 కిలోమీటర్ల మేరథాన్ పరుగు పందాలు జరుగుతున్నది ఈ వీరోచిత కృత్యానికి స్మారకార్థంగానే.

## ఈస్కిలస్ రచించిన ''పర్షియన్లు''నుంచి

సలమిన్ పోరాటంలో స్వయంగా పాల్గొన్న సుప్రసిద్ధ గ్రీకు కవి ఈస్కిలస్ ''పర్షియన్లు'' అన్న తన కావ్యంలో ఆ పోరాటాన్ని యిలా వర్ణించాడు:

ఈ గంభీరగీతం స్ఫురింపజేసేది
పలాయన మంత్రం పఠించమని కాదు
జీవన్మరణ పోరాటంలోకి దూకమని
అపూర్వ ధైర్య సాహసాలు ప్రదర్శించమని....
విజయగీతిక నిస్వనాలు నిలిచిపోగానే
తెడ్లు మార్మోగె ఉవ్వెత్తున లేచే అలలను
సరు సరున ముందుకు నౌకలు వచ్చెను
వ్యూహము తీరియు ఒక్కుమ్మడిగా....
కుడి పార్శ్వాన గల నౌకా దళం
తొల్దొలుత సాగెను ముందునకు
ఆ వెంటనె సాగెను మొత్తము దళం
ప్రమోగెనంతట దిశలెల్లెడ నినాదం:
''గ్రీసుమాత పుత్రులార, మాతృదేశ భక్తులార
పదండి ముందుకు, పదండి త్రోసుకు
దేశమ్ము రక్షించ, సతీసుతుల రక్షించ
దేవళమ్ముల, పూర్వికుల పవిత్ర గోరీల కాపాడ.''
జాగుచేయుటకిది కాదు సమయమ్మంటు.
అటు పర్షియన్లు కూడ నినదించారు బిగ్గరగ
ఇత్తడి తాపడపు ముక్కుల నౌకలు
తక్కున ఒండొంటిని ఢీకొన్నాయి....
తొట్టతొలుత పర్షియన్ నౌకలు
విజృంభించాయి వీరత్వంతో
ఆ పిమ్మట యిరుకగు సముద్ర జలంలో
గుంపులు గుంపులు కూడిన నౌకలు

కదలగ మెదలగ సందు లేక
పరస్పర సహాయ అవకాశం లేక
ఒండొంటి తెడ్లను విరుచుతు ఫళఫళ
నఖానఖి ఢీకొనె నౌకలు నౌకలు.
గ్రీకుల నౌకలు నేర్పుగ అంతట
పర్షియన్ నౌకల చుట్టూ తాకెను ప్రభంజనంలా
పర్షియన్ నౌకలు ఒండొంటిని ఢీకొని
భళ్లున పగిలెను త్రుళ్లుచు మునిగెను
ఎటు చూసిన కనవచ్చెను సముద్ర జలంలో
భగ్న నౌకల అవశేషాలే
శత్రు రక్తరంజిత జలావర్తాలే
శిలలపైన పర్షియన్ సైనిక కళేబరాలే.
మిగిలిన నౌకల కూడదీసుకొని
శత్రుసైనికులు బ్రతుకు జీవుడా అని
జబ్బ సత్తువతో తెడ్లను వేయుచు
పరువుమాలి పలాయనమే చిత్తగించిరి....

? **1.** గ్రీకులకీ, పర్షియన్లకీ మధ్య జరిగిన పోరాటాల పట్టికను తయారుచెయ్యండి:

| పోరాటం ఎక్కడ జరిగింది? | ఎప్పుడు జరిగింది? | ఎవరు గెలిచారు? | యుద్ధ క్రమానికి యీ పోరాటపు ప్రాముఖ్యం ఏమిటి? |
|---|---|---|---|
| | | | |

**2.** పర్షియన్లపై జరిగిన యుద్ధంలో గ్రీకులు ఎందుకు గెలుపొందారు? కనీసం మూడు కారణాలను పేర్కొనండి. అలా చెయ్యలేకపోతే, యీ దిగువ ప్రశ్నలకు జవాబివ్వండి: (అ) పర్షియన్ సైనికుల కంటె గ్రీకు సైనికులు ఎందుకు మరింత బాగా పోరాడారు? (ఆ) గ్రీకు సైన్యాన్నీ, గ్రీకు నౌకా దళాన్నీ బాగా ఆయుధ సజ్జితం చెయ్యడాన్ని సాధ్యంచేసింది యేమిటి? (ఇ) క్సేర్క్సెస్ సైన్యానికీ, నౌకా దళానికీ వ్యతిరేకంగా ఒకే ఒక్క నగరమే పోరాడగలిగిందా? **3.** సొలోన్ సంస్కరణలకీ, మేరథాన్ పోరాటానికీ మధ్య ఎన్నేళ్ల కాల వ్యవధి వుంది? ఆ పోరాటం ఎన్ని సంవత్సరాల క్రితం జరిగింది? క్రీ.పూ. 480 తర్వాతి సంవత్సరం యేమిటి? క్రీ.పూ. 480 ముందరి సంవత్సరం యేమిటి? **4.** క్రీ.పూ. 6వ శతాబ్దిలో ఏథెన్స్‌లో సామాన్యుల విజయం మేరథాన్, సలమిస్ పోరాటాల్లో గ్రీకు విజయానికి ఎలా భూమికను సిద్ధంచేసింది? **5.** థర్మోపిలే లేక సలమిస్ పోరాటాన్ని, దానిలో స్వయంగా పాల్గొన్న ఒక గ్రీకు మాటల్లో వర్ణించండి.

# §35. క్రీ.పూ. 5వ శతాబ్దిలో గ్రీసులో బానిస వ్యవస్థ

(మాప్ 4)

ఏథెన్స్‌లో మనుషుల్ని బానిసలుగా మార్చే ఏ పద్ధతి, ఎందుకు, ఎప్పుడు రద్దుచెయ్యబడిందో జ్ఞాపకం చేసుకోండి (§ 30–31; 8).

1. గ్రీసుకి బానిసల ప్రవాహం. క్రీ.పూ. 5వ శతాబ్దిలో గ్రీసులో బానిసల సంఖ్య గణనీయంగా పెరిగింది. ఈ పెరుగుదలకి గల కారణాల్లో యుద్ధాలు ఒకటి. గ్రీకులు తమకు ఖైదీలుగా చిక్కిన సైనికులనే గాక, శత్రువుల స్త్రీలను, పిల్లలను కూడా బానిసలుగా చేసేవాళ్ళు. ఉదాహరణకు, ఆసియా మైనరు మీద జరిగిన ఒక్క దాడిలోనే గ్రీకులు 20,000 మందికి పైగా ఖైదీలను పట్టుకున్నారు. తరువాత వాళ్ళందరినీ మార్కెట్లలో బానిసలుగా అమ్మారు.

పైరేట్స్ — సముద్రపు దొంగలు — సముద్రపు దొంగలు వడిగల నౌకలలో సముద్రంమీద తిరిగేవాళ్ళు. వాళ్ళు వర్తక నౌకలమీదా, యుద్ధ నౌకలమీదా, తీరంలోని జనావాసాలమీదా దాడిచేసేవాళ్ళు. వాళ్ళు ఈవిధంగా తమకు దొరికిన వాళ్ళను బానిసలుగా అమ్మేవాళ్ళు.

మధ్యధరా, నల్ల సముద్ర తీరాల దేశాలనుంచి బానిసలను తెచ్చి గ్రీసులో తయారైన చేతి తయారీ వస్తువులకీ, తదితర సరుకులకీ మారకంచేసుకునేవాళ్ళు.

ఒక బానిస స్త్రీకి పుట్టిన బిడ్డ ఆ తల్లి యజమాని ఆస్తి. కాని, అలాంటి పిల్లలు అరుదు. గ్రీసులో బానిసల స్థితి యెంత గడ్డుగా వుండేదంటే పిల్లలు సాధారణంగా చిన్నప్పుడే మరణించేవాళ్ళు.

గ్రీసులోని బానిసల్లో అత్యధిక సంఖ్యాకులు విదేశీయులు. అయితే, బానిసల్లో గ్రీకులు కూడా లేకపోలేదు. కొన్ని నగర రాజ్యాల్లో రుణాలు తీర్చనివాళ్ళు బానిసలుగా మార్చబడుతూనే వుండేవాళ్ళు.

2. బానిసల మార్కెట్లు. దాదాపు ప్రతి గ్రీకు నగరంలోనూ బానిస మార్కెట్లు వుండేవి. మార్కెట్లో పురుషులనూ, స్త్రీలనూ, పిల్లలనూ అమ్ముతూ, కొంటూ వుండేవాళ్ళు. ప్రతి బానిసకూ రొమ్మున ఆ బానిస వయసూ, శక్తి సామర్థ్యాలూ ప్రకటిస్తూ ఒక చిన్న బిళ్ళ వుండేది. కొనుగోలుదార్లు "సజీవ సరుకు"ను పరీక్షించి, వాళ్ళ కండరాలు పట్టుకొని చూసి, వాళ్ళను బరువులు యెత్తమనీ, పరుగెత్తమనీ, యెగరమనీ పరీక్షలు పెట్టేవాళ్ళు.

3. బానిస శ్రమ. బానిసల్లో అత్యధిక సంఖ్యాకులు గ్రీసులో రాతి గనులు వున్న, ముడి ఖనిజం తవ్వబడే, చేతిపనులు అభివృద్ధి చెందిన ప్రాంతాల్లో వుండేవాళ్ళు. గ్రీసులోని బానిసలు మిక్కిలి కష్టమైన పనులు చేయవలసివుండేది. బానిసలు మాత్రమే ముడి ఖనిజాన్ని తవ్వేవాళ్ళు, పాలరాతిని పెళ్లగించేవాళ్ళు. స్వతంత్ర గ్రీకులు, యెంత బీదవాళ్ళైనా, గనులలో పనిచేసే వాళ్ళు కాదు. వర్తక నౌకలమీద తెడ్లువేసే బానిసలు విసుగుపుట్టించే ఒకే మాదిరి మురళీ వాయిద్యం వింటూ బరువైన తెడ్లు వేస్తూవుండేవాళ్ళు.

క్రీ.పూ. 5వ శతాబ్దిలో ధనిక గ్రీకులకు పెద్దపెద్ద చేతిపనుల కార్ఖానాలు వుండేవి. వాటిలో కొన్నింట్లో 100 మందిదాకా బానిసలు పనిచేస్తూండేవాళ్ళు. కార్ఖానాల్లో బానిసల కిచ్చే పనులు క్లిష్టమైనవి కాదు గాని, చాలా కష్టమైనవి.

కుమ్మరి కార్ఖానాల్లో బానిసలు నీళ్లూ, మట్టీ, వంటచెరుకూ మోసేవాళ్లు. మట్టిని కలపడం, కుమ్మర సారె తిప్పడం చేసేవాళ్లు. సాధారణంగా స్వతంత్రులు పాత్రలు చేయడం, రంగులు వేయడం చేసేవాళ్లు (వర్ణ చిత్రం 12 చూడండి).

కార్ఖానాలలో కంటె పొలం పనిలో వినియోగింపబడే బానిసలు చాలా తక్కువ. రైతులు చిన్న పొలాలను తామే సాగు చేసేవాళ్లు. భూస్వాముల కున్నట్లే, చాలామంది రైతులకు కూడా బానిసలు వుండేవాళ్లు. ఆ బానిసలు ద్రాక్ష పండ్లనూ, ఆలివ్‌లనూ కాళ్లతో గానీ, గానుగలతో గానీ నలగగొట్టేవాళ్లు, బరువైన గంపలు మార్కెట్‌కు మోసుకపోయేవాళ్లు.




క్రీ.పూ. 5వ శతాబ్దంలో బానిసత్వ మూలాధారాలు: యుద్ధ ఖైదీలు, సముద్రపు బందిపోటు, రుణ దాస్యం, బానిస స్త్రీలకు పుట్టిన పిల్లలు
బానిసలు ప్రధానంగా ఎక్కడెక్కడ వినియోగింపబడేవాళ్లు: గనుల్లో, వర్తకంలో, చేతివృత్తుల్లో, వ్యవసాయంలో, గృహ సేవకులుగా

గ్రీకులు బానిసల్ని గృహసేవకులుగా విస్తృతంగా వాడేవాళ్లు. ధనవంతుల యిళ్లలో ముగ్గురు లేక నలుగురు సేవకులుండేవాళ్లు. బాగా సంపన్నుల యిళ్లలో 50 మందిదాకా బానిసలు వుండేవాళ్లు.

4. బానిసల శిక్ష.

బానిసలు శిక్షకూ, బెదిరింపులకూ భయపడి మాత్రమే పనిచేసేవాళ్లు. వాళ్ల శ్రమ ఫలితంవల్ల వాళ్లకి ప్రయోజనం వుండేది కాదు. బానిసలు ఉత్పత్తి చేసినదంతా యజమానులకి చెందేది. "ఒడిస్సీ"లో యిలా చెప్పబడింది: "బానిస సోమరి. యజమాని వాణ్ణి పనిచెయ్యమని కఠినంగా చేయించకపోతే వాడు తనంతట తను పనికి పూనుకోడు..."

బానిసలమీద నిరంతరం మేస్త్రీల తనిఖీ వుండేది. బానిస నిదానంగా పనిచేస్తూ వుంటే, లేక విశ్రాంతికోసం విరామం తీసుకొంటూ వుంటే, మేస్త్రీ కొరడా అతన్ని మేల్కొల్పేది. ఈ కొరడాలకు తరుచుగా కొసల్లో సీసపు ముక్కలుండేవి. భుజాలమీదా, వీపునా కొరడా గాయాల మచ్చలు లేని బానిస అరుదు.

ప్రాచీన గ్రీసులోని బానిసలను వాళ్ల యజమానులు యెలా హింసించేదీ ఆనాటి ఒక రచయిత యిలా భయంకరంగా వర్ణించాడు: "కొరడాతో కొట్టు, గొంతు పిసుకు, కాలితో తొక్కు, కాల్చు, చర్మం ఒలిచెయ్, కీళ్ల విరిచెయ్, యిక్కుల్లో వినిగర్ పొయ్, కడుపుమీద యిటుకలు పేర్చు — నీకు యిష్టం వచ్చిన పనిచెయ్యి."

5. యజమానులతో బానిసల పోరాటం.

బానిసలు తమ యజమానులమీద పగ తీర్చుకొనేందుకు యజమానులకు వ్యతిరేకంగా తమకు చేతనయిందంతా చేసేవాళ్లు: పనిముట్లు విరగ్గొట్టేవాళ్లు, పశువులకు అంగవైకల్యం కలిగించేవాళ్లు, పని వీలైనంత అధ్వానంగా చేసేవాళ్లు. దొరికితే అమానుషమైన చిత్రహింసలకు గురి ఔతామని స్పష్టంగా తెలిసి కూడా, తరుచుగా పారిపోవడానికి ప్రయత్నించేవాళ్లు. ఒకోసారి మరీ క్రూరులైన యజమానులను చంపేసేవాళ్లు. తరచు తిరుగుబాట్లు చేసేవాళ్లు. అది వర్గపోరాటం. బానిస యజమానులమీద బానిసలు చేసే పోరాటం.

క్రీ.పూ. 5వ శతాబ్ది మధ్యలో వచ్చిన ఒక భయంకరమైన భూకంపం స్పార్టా నగరాన్ని ధ్వంసం చేసింది. అది మంచి తరుణమని హెలట్లు యెంచారు. హఠాత్తుగా బానిస యజమానులమీద పడి వాళ్ల పని పట్టించాలని, వాళ్లు అన్ని దిశలనుండీ వేగంగా స్పార్టా చేరుకొన్నారు. స్పార్టన్లు దాడిని తిప్పి కొట్టగలిగారు గాని, తమ సొంత బలంతో తిరుగుబాటును అణచలేకపోయారు. వాళ్లు యితర నగర రాజ్యాలలోని బానిస యజమానుల సహాయం అర్థించవలసివచ్చింది. హెలట్లపైన



1




2

1. గనిలో పనిచేస్తున్న బానిసలు (ఒక గ్రీకు వాజుమీది చిత్రం). 2. ఏథెన్స్‌లోని ఒక కుమ్మరి కార్ఖానా (ఒక గ్రీకు వాజుమీది చిత్రం)




ఏథెన్స్, పిరేయస్‌ల విహంగావలోకిత దృశ్యం (పునరుద్ధరణ)

పోరాటంలో తోడ్పడడండని స్పార్టా రాయబారులు భయంతో, పాలిపోయిన మొగాలతో, ''దేవుని పేరుమీదుగా'' ప్రాధేయపడ్డారు. కొన్ని నగర రాజ్యాలు స్పార్టాకు తోడ్పడ్డాయి. అయినప్పటికీ కొంతమంది హెలట్లు స్వాతంత్ర్యం పొంది, స్పార్టాను వదిలిపోయారు.

? 1. క్రీ.పూ. 5వ శతాబ్దిలో గ్రీసులో మనుషులు ఎలా బానిసలు అయ్యారు? 2. గ్రీసులో బానిసలు ఏయే పనులు చేశారు? 3. ప్రాచీన తూర్పు రాజ్యాలతో పోలిస్తే గ్రీసులో బానిస యాజమాన్య వ్యవస్థ మరింత అభివృద్ధి అయిందన్న విషయాన్ని ఏమి నిరూపిస్తోంది? 4. బానిస యజమానులతో బానిసలు ఎలా పోరాడారు? వాళ్ల పోరాట పద్ధతుల్లో కనీసం ఆరింటిని పేర్కొనండి. దీన్ని వర్గపోరాటం అని ఎందుకు అంటారు?

## §36. క్రీ.పూ. 5వ శతాబ్ది మధ్య కాలంలో ఏథెన్స్ మహాశ్శక్తి, సంపదలు

(మాప్‌లు 4, 5)

**1. ఏథెనియన్ సముద్ర సమాఖ్య.**

గ్రీసుకూ, పర్షియాకూ శాంతి సంధి కుదిరి, యుద్ధం ముగిసిన తర్వాత కూడా ఏథెనియన్ సముద్ర సమాఖ్య కొనసాగింది. ఆ సమాఖ్యలో 200 గ్రీకు నగర రాజ్యాలు వుండేవి. ఆ సమాఖ్యకి సంయుక్త నౌకా దళం, సైన్యం వుండేవి. సమాఖ్యలోని ప్రతి ఒక్క నగర రాజ్యమూ ఒక నిర్దిష్ట సంఖ్య నౌకలను నిర్మించాలి, లేకపోతే సమాఖ్య ఖజానాకి కొంత సొమ్ము చెల్లించాలి.

ఏథెనియన్ వ్యూహకర్తలు మొత్తం సమాఖ్యకి చెందిన నౌకా దళానికీ, సైన్యానికీ నాయకత్వం వహించేవాళ్లు. ఏథెనియన్లు సమాఖ్య ఖజానాని తమ నగరానికి బదిలీచేసి, సముచితమని తమకి తోచిన రీతిలో ఖర్చుపెట్టేవాళ్లు. చెల్లింపుల పరిమాణాన్ని కూడా వాళ్లే నిర్ణయించేవాళ్లు. ఏథెనియన్లని "సముద్ర స్వాములు" అని పిలవగా యీ సమాఖ్యని "ఏథెనియన్ సముద్ర సమాఖ్య" అని పిలిచేవాళ్లు.

**2. ఏథెనియన్ సముద్ర వ్యాపార అభివృద్ధి.**

సముద్రాలపై ఏథెనియన్ల పెత్తనం మూలంగా వాళ్ల సముద్ర వ్యాపారం కూడా పెంపొందింది. తమ నౌకా దళపు రక్షణలో ఏథెనియన్ వర్తక నౌకలు మధ్యధరా, నల్ల సముద్రాల్లో తిరుగుతూండేవి. ఏథెనియన్లు ఏథెన్స్‌కి ఆరు కిలోమీటర్ల దూరాన లోతైన ప్రశాంతమైన అఖాతపు తీరంమీద లంగర్లు, గిడ్డంగులు, నౌకా నిర్మాణ కేంద్రాలు కలిగిన పిరేయస్ ఓడరేవును నిర్మించారు. పాంటికపేయమ్, సిరియా, ఈజిప్టు, సిసిలీ, మొదలైన చోట్లనుంచి వచ్చే డజన్లకొలది నౌకలనుంచి సరుకులు పిరేయస్ రేవులో దిగుమతి చెయ్యబడుతూండేవి. తర్వాత ఆ రేవులో అట్టికాలోనూ, గ్రీసు దేశపు యితర ప్రాంతాల్లోనూ తయారుచెయ్యబడిన సరుకులు నౌకల్లోకి ఎగుమతి చెయ్యబడేవి (వర్ణ చిత్రం 13 చూడండి). గ్రీసుకి చాలా దూరాన వున్న దేశాల్లో సైతం క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి ఏథెనియన్ చేతిపనుల కార్ఖానాల వర్తకపు గుర్తులు వున్న అనేక పూర్తి గూన జాడీలు, లేక వాటి ముక్కలు పురాతత్వ శాస్త్రజ్ఞులకు లభ్యమయ్యాయి. ఆ ఓడరేవుకి వచ్చిన వర్తకులందరూ తమ సరుకులన్నింటిపైనా ఏథెనియన్ ఖజానాకి సుంకం చెల్లించేవాళ్లు.

వ్యాపారాభివృద్ధి మూలంగా శాంతి కాలంలో సైతం ఏథెన్స్‌కి బానిసల రాక కొనసాగింది. బానిసల మార్కెట్లలో కెల్ల మిక్కిలి పెద్ద మార్కెట్ ఏథెన్స్‌లో వుండేది.

**3. ఏథెనియన్ వెండి గనుల్లో.**

ఏథెన్స్ రాజ్యానికి చెందిన వెండి గనుల్లో వేలకొలది బానిసలు పనిచేసేవాళ్లు. భూమి కింద యెంతో లోతున వాళ్లు వట్టి గునపాలతో, పికాక్సులతో ముడి ఖనిజం తవ్వేవాళ్లు. గనులు యిరుకుగా వుండేవేమో, వాళ్లు మోకాళ్లమీద ఆన్చి మాత్రమే పనిచేయగలిగేవాళ్లు. ముడి ఖనిజం నిండిన గంపలను పడుచువాళ్లు దారి పొడుగునా మోకాళ్లమీద పాకుతూ పైకి ఈడ్చుకపోయేవాళ్లు. గని బయట యితర బానిసలు ముడి ఖనిజాన్ని యినప రోకళ్లతో నలగగొట్టి, గానుగల్లో పొడిచేసేవాళ్లు. గానుగలు తిప్పడానికి గాడిదలనూ, యితర జంతువులనూ వుపయోగించి వుండవచ్చు. కాని బానిసలను వుపయోగించి యజమానులు డబ్బు మిగిలించుకొనేవాళ్లు. బానిసలు గనులనుంచి ముడి ఖనిజాన్ని ఎంతో పెద్ద మొత్తాల్లో

తవ్వి, దాన్ని పొడిచెయ్యవలసివుండేది, దానితో తిండి తినేందుకూ, నిద్రపోయేందుకూ సైతం వాళ్లకి తీరిక చిక్కేది కాదు. బానిసలు ఏథెన్స్ రాజ్యానికి చెందిన ఉప్పు గనుల్లో కూడా పనిచేస్తూండేవాళ్లు.

4. ఏథెన్స్ రాజ్య సంపదనుంచి ఎవరు లబ్ధిపొందారు.

క్రీ.పూ. 5వ శతాబ్దిలో ఏథెన్స్ గ్రీసులోకెల్ల మిక్కిలి ఐశ్వర్యవంతమైన నగర రాజ్యం అయింది.

దీనితో భారీ పౌర భవనాలూ, దృఢమైన నగర దుర్గాలూ నిర్మించడం సాధ్యమైంది. ఏథెనియన్లు తమ నగరం చుట్టూ బురుజులతో కూడిన కోట గోడలు నిర్మించుకున్నారు. వాళ్లు పొడుగాటి గోడలు నిర్మించారు. ఈ గోడలు ఏథెన్స్‌నుంచి పిరేయస్‌కి పోయే మార్గాన్ని కాపాడేవి. దీర్ఘ కాలంపాటు ముట్టడి జరిగితే యీ పొడుగాటి గోడలు ఏథెనియన్లకి సముద్రాన్ని చేరుకునే మార్గంగా వినియోగపడేవి.

ఏథెన్స్ ఆక్రోపొలిస్‌లో నిర్మాణ కృషి ప్రత్యేకించి విస్తృతంగా సాగింది. అక్కడ పర్షియన్లు నాశనంచేసిన నిర్మాణాల స్థానంలో సుందరమైన దేవాలయాలు నిర్మింపబడ్డాయి, విగ్రహాలు నెలకొల్పబడ్డాయి. వాటి నిర్మాణానికి ఏథెన్స్ రాజ్య ఖజానానుండి మాత్రమే కాకుండా, మొత్తం సముద్ర సమాఖ్య ఖజానానుండి కూడా డబ్బు వెచ్చింపబడింది.

ఈ నిర్మాణాల మూలంగా రాతి కట్టడం కార్మికులకూ, చేతిపనులవాళ్లకూ, బండివాళ్లకూ, పడవవాళ్లకూ చేతి నిండా పనీ, స్థిరమైన ఆదాయమూ చేకూరేవి.

"సముద్ర సామ్రాట్టులకి" చాలా బలమైన నౌకా దళం వుంది. నౌకలమీద కొలువుచేసేవాళ్లకి ఏథెన్స్ ఖజానానుంచి డబ్బు చెల్లించడం మొదలైంది. చాలామంది ఏథెనియన్లు — తెడ్లువేసేవాళ్లు, నావికులు — ఆ జీతంమీద బతికేవాళ్లు.

న్యాయ స్థానాల్లో జడ్జీలకీ, యితర ప్రభుత్వోద్యోగులకీ ఖజానానుండి జీతం చెల్లించేవాళ్లు. ఉద్యోగాల్లో అత్యధిక భాగం లాటరీ ద్వారా ఏథెనియన్ పౌరులకి పంచబడేవి. క్రీ.పూ. 5వ శతాబ్దిలో థెటిస్ (స్వతంత్ర శ్రమజీవులు) రాజ్యంలోని దాదాపు అన్ని ఉద్యోగాలకూ యెన్నుకోబడే హక్కు సంపాదించుకున్నారు. చాలామంది బీద ఏథెనియన్లు ఈ జీతాలమీద జీవిస్తూవుండేవాళ్లు. ఆ కాలంలో రాయబడిన ఒక హాస్య గీతం యిలా సాగింది:

నాన్నా, కోర్టులో కూర్చున్నందుకు
జడ్జీలకు జీతం యివ్వక పోతే,
మాకు ప్రొద్దునా, సాయంత్రం
తిండి యెలా తెస్తావు చెప్పు, నాన్నా....

ఏథెనియన్ పౌరులకి మధ్యమధ్య అన్నదానం చెయ్యబడుతూవుండేది. వాళ్లకి పన్నులు ఉండేవి కావు.
సంపన్న ఏథెన్స్ రాజ్య పౌరుడుగా ఉండటం గౌరవమే కాకుండా, చాలా లాభదాయకమైనదిగా కూడా వుండేది.

పిరేయస్‌కి సరుకుల రవాణా

(క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి ఒక రచననుంచి)

ఈ పత్రంలో పేర్కొనబడిన దేశాలనూ, నగరాలనూ మాప్‌లో గుర్తించండి.

ఇక్కడకి ఎన్నెన్ని సరుకులు వస్తాయి! సిరెనే (ఉత్తర ఆఫ్రికా) నుంచి ఎద్దు చర్మాలు; నల్ల సముద్ర ప్రాంతంనుంచి ఉప్పులో ఊరవేసిన చేపలు; ఉత్తర గ్రీసునుంచి ధాన్యం, మాంసం; సిసిలీనుంచి పందులు, జున్ను; ఈజిప్టునుంచి తెరచాపలు, పాపిరస్ కాగితం; సిరియానుంచి ధూప సామగ్రి; క్రీట్ ద్వీపంనుంచి దేవాలయాలకీ, దేవతా విగ్రహాలకీ పనికివచ్చే విలువైన కలప; లిబియా (ఉత్తర ఆఫ్రికా) నుంచి బోలెడు దంతం; దీవులనుంచి పిక్క బలిసిన గొర్రెలు, తేనెలూరే పళ్లు.... ఆసియా మైనర్‌నుంచి బానిసలు, సీమ బాదం; ఫొనీషియానుంచి గోధుమ పిండి, ఖర్జూరాలు; కార్తేజ్ (ఉత్తర ఆఫ్రికా) నుంచి తివాసీలు వస్తున్నాయి.

? **1.** ఏథెనియన్ సముద్ర సమాఖ్య ఎలా ఆవిర్భవించింది? దాని ఉనికివల్ల ఎవరికి ప్రత్యేక ప్రయోజనం వుంది, ఎందుకు? **2.** క్రీ.పూ. 5వ శతాబ్దిలో ఏథెన్స్ రాజ్యపు సంపదకి మూలాధారాలు యేమిటి? **3.** ఏథెన్స్ నగరపు శక్తి, సంపదల పర్యవసానంగా ఆ నగర పౌరులు పొందిన మేళ్లు యేమిటి?

## §37. ఏథెనియన్ బానిస యాజమాన్య ప్రజాస్వామ్యం

(మాప్ 4)

సొలోన్ సంస్కరణల ద్వారా సామాన్యులు సాధించుకున్న హక్కులను జ్ఞాపకం చేసుకోండి (§ 30–31; 8, 9, 10).

1. ఏథెన్స్‌లో ప్రజా సభ. క్రీ.పూ. 5వ శతాబ్దిలో ఏథెన్స్ రాజ్యపు అత్యున్నతాధికారం ప్రజా సభకి చెంది వుండేది. అది నెలకి నాలుగు సార్లు సమావేశపరచబడేది. ప్రజా సభ శాసనాలు చేసేది, యుద్ధం ప్రకటించేది, శాంతి సంధి చేసుకునేది, ఏథెన్స్ ఖజానానూ, సముద్ర సమాఖ్య ఖజానానూ నిర్వహించేది, వ్యూహకర్తలనూ, తదితర అధికారులనూ ఎన్నుకునేది.

అట్టికాలోని అన్ని నగరాలకీ, గ్రామాలకీ చెందిన ఏథెనియన్ పౌరులందరూ ప్రజా సభకి హాజరయ్యే అవకాశం వుండేది. ప్రజా సభకి సాధారణంగా కొన్ని వేలమంది — అత్యధిక భాగం నగర వాసులు — హాజరయ్యేవాళ్లు. ప్రజా సభలో చర్చలు చెలరేగేవి. కొందరు వక్తలు ప్రభువర్గీయుల్ని సమర్థించేవాళ్లు, మరికొందరు సామాన్యుల్ని సమర్థించేవాళ్లు. మెజారిటీ వోట్ల ద్వారా నిర్ణయాలు చెయ్యబడేవి (వర్ణ చిత్రం 14 చూడండి).

2. పెరీక్లెస్ నాయకత్వంలో ఏథెన్స్ రాజ్యం.

క్రీ.పూ. 5వ శతాబ్ది మధ్యకాలంలో ప్రముఖ రాజనీతిజ్ఞుడు పెరీక్లెస్ ఏథెన్స్‌లో ప్రధాన వ్యక్తి.

పెరీక్లెస్ సంపన్న, ప్రభువంశంలో పుట్టినవాడు. అతనికి విస్తారమైన భూమీ, పనిచేయడానికి డజన్ల కొద్దీ బానిసలూ వుండేవాళ్లు. అతను మంచి విద్యావంతుడూ, చాలా ప్రజ్ఞావంతుడూ. గొప్ప వక్తలకు పేరుపొందిన ఏథెన్స్‌లో కూడా పెరీక్లెస్ వాగ్ధార అసాధారణమైందిగా గుర్తింపబడింది. అతను ప్రశాంతంగా, హుందాగా వుండేవాడు, కాని, కోపోద్రేకంతో ఉపన్యసించేటప్పుడు జీయస్ లాగా శత్రువులమీద పిడుగులు ఉమిసేవాడని గ్రీకులు అనేవాళ్లు.

క్రీ.పూ. 443లో ప్రజా సభ పెరీక్లెస్‌ను ప్రధాన వ్యూహకర్త (సేనాధిపతి)గా యెన్నుకుంది. ఏథెన్సు పాలనకీ, సముద్ర సమాఖ్యకీ అతను నాయకత్వం వహించాడు.

యావత్తు గ్రీసునూ ఏథెన్స్ అధికారం కిందికి తేవడానికి పెరీక్లెస్ చేయవలసిందంతా చేశాడు. సముద్ర సమాఖ్యని అతను అన్ని విధాలా పటిష్ఠంచేసి, సమాఖ్యలోకి కొత్త రాజ్యాలను ఆకర్షించాడు. సమాఖ్యలో ఏథెనియన్ పెత్తనంపట్ల అసంతృప్తిచెందిన కొన్ని నగర రాజ్యాలు సమాఖ్యనుంచి బయటకి పోయేందుకు ప్రయత్నించేవి. అలాంటి ప్రయత్నాలను పెరీక్లెస్ ఆయుధ బలంతో కఠినంగా అణచివేసేవాడు. అతను సమాఖ్య రాజ్యాల భాగాల్లో భూముల్లేని ఏథెనియన్ల జనావాసాలను ఏర్పాటుచేసేవాడు.

ప్రజల సౌకర్యం నిమిత్తం కొన్ని భవనాలనూ, కోట గోడలనూ పెరీక్లెస్ నిర్మింపజేశాడు.







1




2

1. ఏథెన్స్‌లో బానిస యాజమాన్య ప్రజాస్వామ్యం (క్రీ.పూ. 5వ శతాబ్ది). 2. పెరీక్లెస్ (ప్రాచీన గ్రీకు బస్టు). ముఖం కనిపించేందుకుగాను శిరస్త్రాణం వెనక్కి నెట్టబడింది. యుద్ధ సమయాల్లో గ్రీకులు తమ ముఖాలను శిరస్త్రాణాలతో కప్పుకునేవాళ్లు



ఏథెన్స్‌లోని అగోరా (ఆధునిక చిత్రం). మధ్య: కొందరు ఏథెనియన్లు లోపలకి వస్తున్నవారితో మాట్లాడుతున్నారు. ఎడమ పక్కన: మట్టి పాత్రల అమ్మకందారు నేలమీద చదికిలబడి కూర్చుని తన సరుకులు అమ్ముతున్నాడు. కుడి పక్కన: తన బానిసలతోబాటు వస్తున్న ఒక సంపన్న ఏథెనియన్. ఒక రైతు గాడిదమీద వేసుకుని తన సరుకును అమ్మకంకోసం తెస్తున్నాడు. వెనక భాగంలో: ఏథెన్స్ నగరపు అక్రోపొలిస్

పెరీక్లెస్ యెప్పుడూ సామాన్యుల ప్రయోజనాల దృష్ట్యా వ్యవహరించేవాడు. అందువలన అతను 15 సంవత్సరాల పాటు, అతని మరణంవరకు, ప్రజా సభచేత మళ్లీ మళ్లీ ప్రధాన సేనాధిపతిగా యెన్నుకోబడుతూవచ్చాడు.

### 3. ఏథెనియన్ ప్రజాస్వామ్యం, దాని బానిస యాజమాన్య స్వభావం.

గ్రీకులు ఏథెన్స్‌లోని పాలనను డెమోక్రసీ (ప్రజాస్వామ్యం) అని పిలిచేవాళ్లు. అంటే డెమోస్ (సామాన్యుల) అధికారం అని అర్థం. సామాన్యులు రాజ్యంలో తమకి వున్న అధికారాన్ని బానిస యాజమాన్య వ్యవస్థనీ, సముద్ర సమాఖ్యలోని యితర సభ్య రాజ్యాలపై ఏథెన్స్ పెత్తనాన్నీ పటిష్ఠంచేసేందుకు వినియోగించారు. అలాంటి పరిస్థితులవల్ల బానిస యజమానులకే కాకుండా, గనుల్లో బానిసల శ్రమ ద్వారా, తత్సంబంధిత చెల్లింపుల ద్వారా లబ్ధి పొందే థెటీస్‌కి కూడా ప్రయోజనం వుంది.

ఏథెనియన్ ప్రజాస్వామ్యం బానిసలపైన బానిస యజమానుల అధికారాన్ని పదిలపరచింది. అది బానిస యాజమాన్య ప్రజాస్వామ్యం.

ఏథెన్స్ నమూనాలో ప్రజాస్వామ్యం చాలా గ్రీకు నగరాల్లో నెలకొల్పబడింది. అది అన్ని చోట్లా బానిసలమీద స్వతంత్ర ప్రజల పాలనగానే వుండేది.

అయితే, క్రీ.పూ. 5వ శతాబ్దిలో ప్రజాస్వామికాభివృద్ధి శిఖర స్థాయిలో ఉన్నప్పుడు సైతం అట్టికా జనాభాలో అల్ప సంఖ్యాకుల చేతుల్లో మాత్రమే అధికారం వుండేది. ఎవరి తల్లితండ్రులు ఏథెన్స్ వాసులో వాళ్ల మాత్రమే పూర్తి హోదా కలిగిన ఏథెన్స్ పౌరులుగా పరిగణించబడేవాళ్లు.

ఇతర ప్రాంతాలనుంచి అట్టికాకి వచ్చినవాళ్ళూ, వాళ్ల సంతానమూ ఏథెనియన్ పౌర హక్కులను కోల్పోయేవాళ్లు. అట్టికాలో నివసించే అనుమతి పొందేందుకు వాళ్లు ప్రత్యేకమైన పన్ను చెల్లించాల్సివుండేది. ఎవరైనా దగాచేసి ఏథెన్స్ పౌరులుగా నటిస్తే, వాళ్లు బానిసలుగా మార్చబడేవాళ్లు. ఏథెనియన్ స్త్రీలు ప్రజా సభల్లో పాల్గొనకపోవడమే కాక, బహు అరుదుగా తప్ప తమ యిళ్లనుంచి బయటకి వచ్చేవాళ్లు కారు. ఇంటి పనులు సక్రమంగా సరిదిద్దుకోవడం, భర్తకి విధేయంగా ఉండటం స్త్రీల విధిగా పరిగణింపబడేది. బానిసలు దుక్కి పశువుల మాదిరిగా చూడబడేవాళ్లు.

**4. ఏథెన్స్‌లో పౌర జీవితం.**

ఏథెన్స్ పౌరసత్వానికి తీవ్రమైన ప్రతిబంధకాలు ఉన్నప్పటికీ, రాజ్య పాలనలోనూ, ప్రజా జీవితంలోనూ ఏథెన్స్‌లో పాల్గొన్నంతమంది ప్రాచీన ప్రపంచంలో మరెక్కడా కూడా పాల్గొనలేదు. అతి కష్టమైన పనులను బానిసలకు అప్పగించిన స్వతంత్ర ఏథెనియన్లు తమ కాలంలో అత్యధిక భాగాన్ని నగర సామాజిక స్థలాల్లో గడిపేవాళ్లు.

ఏథెన్స్‌లోకెల్లా మిక్కిలి జనసమ్మర్దంగా, సందడిగా వుండే తావు అగోరా. పొద్దున్నే పురుషులు గబగబా నగర మధ్యంలోని చౌకుకు వెళ్లేవాళ్లు. ఉదయం వేళ ఏథెనియన్ అగోరా సందడిగా వుండే మార్కెట్. సాయంత్రం మార్కెట్ పాకలు పీకేసేవాళ్లు. అగోరాలో ధనికులూ, చేతిపనివాళ్ళూ, రైతులూ, మార్కెట్‌లో తమ తమ సరుకులు అమ్ముకున్న తర్వాత, తమ రోజువారీ పనులు ముగిసిన తర్వాత గుమికూడేవాళ్లు. ఏథెనియన్ చట్టాలు చెక్కిన శిలా ఫలకాలు అగోరాలో ఒకవైపున నిలిపేవాళ్లు. అవి నోటీసు బోర్డులుగా కూడా వుపయోగింపబడేవి: జరగబోయే ప్రజా సభ సమావేశాల గురించీ, వ్యాజ్యాల గురించీ ప్రకటనలు ఆ రాళ్లమీద ప్రదర్శింపబడేవి. అగోరాలోనే కొత్త వార్తలు ఒకరికొకరు చెప్పుకొనేవాళ్లు. ఈనాడు మనకు వార్తాపత్రికలు చదవడమూ, రేడియో వినడమూ, టి.వి. చూడటమూ యెంత ముఖ్యమో, ప్రాచీన గ్రీకులకు అగోరాకు పోవడం అంత ముఖ్యంగా వుండేది.

మహా ప్రసిద్ధులైన పండితులు ఉపన్యాసాలు యిచ్చేవాళ్లు; వాటికి యువకులూ, వయస్కులూ హాజరయ్యేవాళ్లు. అవి జరిగే హాళ్లని జిమ్నాజియా అనేవారు. అనుభవజ్ఞులైన శిక్షకుల పర్యవేక్షణలో గ్రీకులు అక్కడ శరీర వ్యాయామం కూడా చేస్తూండేవాళ్లు.

ఒక పెద్ద సంగీత కచేరీ భవనం వుండేది. అందులో, పెద్ద శ్రోతృ సమూహాల ముందర, గ్రీసులోని అత్యుత్తమ గాయకులూ, సంగీత విద్వాంసులూ పోటీలలో పాల్గొనేవాళ్లు; శ్రోతలే విజేతలను నిర్ణయించేవాళ్లు.

ఏటా అనేక సార్లు నాటక ప్రదర్శనలు జరిగేవి; అవి కూడా వేలకొలది ప్రజలను ఆకర్షించేవి.

ఏథెన్స్‌లో ప్రజా జీవితం స్వతంత్రుల బౌద్ధిక, శారీరక అభివృద్ధికి విస్తృతమైన బాటలు పరచాయి.

**?** **1.** ఏథెన్స్ పౌరులకి ఏయే హక్కులూ, అవకాశాలూ ఉండేవి? **2.** ఏథెనియన్ బానిస యాజమాన్య రాజ్యాన్ని పటిష్ఠంచెయ్యడం యీకిందివారికి ప్రయోజనకరంగా ఎందుకు ఉండేది: (అ) బడా భూస్వాములు, (ఆ) చేతిపనులవాళ్లు, (ఇ) వర్తకులు, (ఈ) రైతులు, (ఉ) స్వతంత్ర శ్రమజీవులు (థెటీస్)? **3.** సొలోన్ సంస్కరణలకీ, పెరీక్లెస్ పాలన ఆరంభానికీ మధ్య ఎన్నేళ్లు గడిచాయి? ఈ రెండు ఘటనలకీ మధ్య సంబంధం యేమిటి? **4.** ఏథెన్స్‌లోని రాజ్యాన్ని ప్రాచీన ఈజిప్టులోని రాజ్యంతో పోల్చండి. వాటి మధ్య తేడాలు యేమిటి? సామ్యాలు యేమిటి? **5.** సాంస్కృతిక అభివృద్ధికి మీ అభిప్రాయంలో మరింత సానుకూలమైనది యేమిటి: ప్రాచీన తూర్పు దేశాల్లోని రాజుల పాలనా, ప్రభువర్గీయుల పెత్తనమా లేక ప్రజాస్వామ్యమా? మీ వాదనను నిరూపించండి.

ప్రకరణం పది

# క్రీ.పూ. 5వ–4వ శతాబ్దాల్లో గ్రీసు సంస్కృతి వికాసం

## §38. లిఖిత భాష, పాఠశాల. ఒలింపిక్ క్రీడలు
(మాప్ 4)

1. ప్రాచీన గ్రీసులో లిఖిత భాష. క్రీ.పూ. 2వ సహస్రాబ్ది చివర విస్మరింపబడిన తమ ప్రాచీన లిపికి గ్రీకులు తిరిగి ఎన్నడూ పోలేదు. హోమర్ యుగాంతానికి గ్రీకులకి ఫొనీషియన్ లిపితో పరిచయం ఏర్పడింది. గ్రీకులు హల్లులకి అచ్చులు చేర్చి, 24 అక్షరాలతో కూడిన తమ అక్షరమాలని అభివృద్ధిచేశారు. లిఖిత భాష అభివృద్ధిలో యిది ప్రధానమైన ఒక ముందంజ.

గ్రీకులు పాపిరస్‌మీదా, మట్టి పలకలమీదా, పల్చటి మైనం పూత కలిగిన ఫలకాలమీదా రాసేవాళ్ళు. వాళ్ళ మైనం మీద సూది మొన వున్న పరికరంతో రాసేవాళ్లు. మొద్దుగా వుండే అదే పరికరపు రెండవ కొసను రాసినదాన్ని చెరిపేసేందుకు వినియోగించేవాళ్ళు. ఆ రాత పరికరాన్ని గంటం అనేవాళ్లు. తమ దస్తూరీ స్పష్టత, కచ్చితత్వాల విషయంలో గ్రీకులు చాలా నిక్కచ్చిగా వుండేవాళ్ళు. వాళ్ళ యిలా అంటూండేవాళ్లు: ''మీ గంటాన్ని మరింత తరుచుగా తిప్పండి.'' దానికి ''మీరు రాసినదాన్ని సరిదిద్దుకోండి'' అని అర్థం.

2. గ్రీకు పాఠశాలలు. స్వతంత్ర గ్రీకు పౌరుల మగపిల్లలకి ఏడేళ్లకి అక్షరాభ్యాసం జరిగేది, పాఠశాలలకి హాజరవడం మొదలుపెట్టేవాళ్ళు. చేతివృత్తులవాళ్ల, రైతుల పిల్లలు ప్రాథమిక పాఠశాలలకి మాత్రమే హాజరయేవాళ్లు. వాళ్ళ చిన్న వయస్సులోనే తమ తండ్రులకి పనుల్లో తోడ్పడవలసి రావడమే యిందుకు కారణం.

గ్రీకు పాఠశాలల్లో పిల్లలకి తమ భావాలను స్పష్టంగా, పటిష్ఠంగా వ్యక్తంచేయడం నేర్పించేవాళ్ళు. విద్యార్థులు హోమర్, హెసియాడ్, మొదలైన కవుల కావ్యాలను కంఠస్థం చేసేవాళ్ళు. ''ఇలియడ్''నుండీ, ''ఒడిస్సీ''నుండీ వేలకొలది పాదాలు అప్పగించగలవాళ్ళ ఆ రోజుల్లో గ్రీసులో చాలామంది వుండేవాళ్లు. చిత్రలేఖనం, నృత్యం, సంగీతం పాఠశాలల్లో నిర్బంధ పాఠ్యాంశాలు. లైర్‌మీద వాయించడం నేర్పేవాళ్ళు. పాడటం, నాట్యంచెయ్యడం రానివాణ్ణి గ్రీకులు విద్యావంతుడుగా పరిగణించేవాళ్ల కారు. అత్యుత్తమమైన పాఠశాలలు ఏథెన్స్‌లో వుండేవి.

విద్యార్థులకు లాఘవమూ, బలమూ, ధైర్యమూ కలిగించడం గ్రీకు పాఠశాలల్లోని విద్యా విధానపు లక్ష్యం. పాఠశాల దేశాన్ని కాపాడే సైనికులకు శిక్షణ యివ్వాలని తలచబడేది. బాలురు పెరిగేకొద్దీ ఎక్కువసేపు కుస్తీ, చక్రం విసరివేయడం, ఈటె విసరడం, పరుగెత్తడం, దుముకడం నేర్చుకునేవాళ్ళు.

సోమరులనూ, అవిధేయులనూ కొరడాలతోనూ, బెత్తాలతోనూ కొట్టేవాళ్ళు. వీధుల్లో మామూలుగా ధనిక కుటుం



1



2



3

1. ప్రాచీన గ్రీకు లిపికి నమూనా. 2. ఒక చిన్న మైనపు పలక, రాత గంటం. 3. ఏథెన్స్‌లోని ఒక పాఠశాల (ఒక వాజుమీది చిత్రం). లీరా వాయిద్య, పఠన తరగతులు. కుడి పక్కన శిష్యుడి వెంట పాఠశాలకి వచ్చిన బానిస. 4. ఒలింపియా (పునరుద్ధరణ). జీయస్ ప్రధాన దేవాలయం మధ్యలో వుంది. దాని దగ్గర యితర దేవాలయాలూ, క్రీడల్లో విజేతల విగ్రహాలూ ఉన్నాయి. ఇతర చిన్న భవనాలు ఒలింపియాకి కప్పాలు చెల్లించే నగరాల కోశాగారాలు. వ్యాయామ శాలలు, పోటీలు జరిగే చోట్లు ప్రధాన దేవాలయం చుట్టూ వున్నాయి

4

బానికి చెందిన బాలుడి వెంట వృద్ధ బానిస వుండేవాడు; బాలుడు మర్యాదగా ప్రవర్తించేటట్లు, పెద్దవాళ్లకు దారి యిచ్చే టట్లు ఆ బానిస చూసుకునేవాడు.

బానిసల పిల్లలకి విద్యావకాశాలు ఉండేవి కావు. గ్రీసులో ఆడపిల్లలకు పాఠశాలలు లేవు. తల్లులే వాళ్లకు అల్లిక పనీ, కుట్టుపనీ, గృహనిర్వహణా నేర్పించేవాళ్లు.

## 3. ఒలింపియా.

సెలవల్లో, పండుగ రోజుల్లో గ్రీకులు క్రీడల పోటీలు జరిపేవాళ్లు లేక ఆటలు నిర్వహించేవాళ్లు. పెలొపొనేసస్‌లోని ఒలింపియా నగరంలో (ఉత్తర గ్రీసులోని ఒలింపస్ పర్వతంతో దీనికి సంబంధం లేదు) నాలుగేండ్ల కొకసారి ఒలింపిక్ క్రీడలు జరిగేవి. అన్నిటికంటె వీటికి జనాదరణ యెక్కువగా వుండేది.

ఒలింపియా గ్రీకులకు పవిత్ర స్థలం. నగరం మధ్య సమున్నతమైన ఒలింపియన్ జీయస్ దేవాలయం వుంది. ఆ దేవాలయంనుంచే ఆ నగరానికి ఒలింపియా అనే పేరు వచ్చింది. ఆ దేవాలయంలో గ్రీకు మహా శిల్పి ఫిడియస్ చెక్కిన బృహత్తరమైన జీయస్ విగ్రహం వుంది (పేజి 139లో యీ దేవాలయ పునరుద్ధరణ నమూనా చూడవచ్చు). జీయస్ దేవాలయం చుట్టూ ఇతర దేవాలయాలూ, వేలకొలది దేవతా ప్రతిమలూ, వీరుల, క్రీడల్లో విజేతల విగ్రహాలూ వున్నాయి. ఆ దేవాలయాల వెనక వ్యాయామ భవనాలు వున్నాయి.

గ్రీసు దేశం అంతటినుంచీ ఆటలు చూసేందుకు వేలకొలది ప్రేక్షకులు గుమికూడేవాళ్లు. ప్రేక్షకులు బళ్లమీద, గుర్రాలమీద, నౌకలమీద లేక నడిచి అక్కడికి చేరుకునేవాళ్లు. సుదూరమైన వలసలనుంచి సైతం గ్రీకులు అక్కడికి వచ్చే వాళ్లు. ఒలింపియా చుట్టూ గుడారాల నగరం వెలిసేది. స్త్రీలు ఒలింపియాకి రాకూడదన్న నిషేధం వుండేది. ఈ నియమాన్ని ఉల్లంఘించినవాళ్లు మరణ శిక్షకి గురయ్యేవాళ్లు.


1


2


3

1. డిస్కోబాల్ (చక్రం) క్రీడాకారుడు (మైరన్ సృష్టించిన శిల్పం). 2. రథాల పోటీ (ఒక వాజుమీది చిత్రం). 3. ఒలింపిక్ పోటీల ప్రేక్షకులు (ఒక వాజుమీది చిత్రం).

**4. ఒలింపిక్ క్రీడలు.** గ్రీసులోని అత్యుత్తమ క్రీడాకారులు పరుగెత్తడం, దుముకడం, కుస్తీ, చక్రం విసరడం, ఈటె విసరడం, ముష్టి యుద్ధం, మొదలైనవాటిలో పోటీ చేసే వాళ్లు. యువ క్రీడాకారుల మధ్య పోటీకి ఒక రోజు కేటాయింపబడేది.

అత్యంత ప్రమాదకరమైన పోటీ నాలుగు గుర్రాలు పూన్చిన రథాల పోటీ. వేలకొలది ప్రేక్షకులు హర్షధ్వానాలు చేస్తూవుండగా రథాలు హిప్పొడ్రోమ్ (రథాల పోటీలు జరిగే అంగణం) చుట్టూ 12 చుట్లు చుట్టిరావాలి. రథ సారథి రథంమీద నిలబడి గుర్రాలను నడుపుతూ ఉంటాడు. ఈ సారథ్యానికి విశేషమైన నేర్పూ, లాఘవమూ కావాలి. వడిగా పోయే రథాలు మలుపుల్లో తరచుగా స్తంభాలకో, యితర రథాల చక్రాలకో కొట్టుకునేవి. విరిగిన రథాన్ని మిగతా రథాలు ఢీకొనేవి. ఒక్కొక్క పోటీలో పదింట ఎనిమిది రథాలు భగ్నమయ్యేవి (178వ పేజిలో చిత్రం 2, వర్ణ చిత్రం 16 చూడండి).

క్రీడల పోటీల్లో స్వతంత్ర గ్రీకులందరూ పాల్గొనవచ్చునని తలచబడేది. కాని, అనేక సంవత్సరాల శిక్షణ అవసరం గనుక, ధనవంతులైన బానిస యజమానులు మాత్రమే పోటీల్లో పాల్గొనగలిగేవాళ్లు. రైతులూ, చేతిపనివాళ్లూ క్రీడల కొరకు అంత సమయం వినియోగించగలిగేవాళ్లు కారు. రథాల పందేలలో ధనవంతులు మాత్రమే పాల్గొనేవాళ్లు; నాలుగు పందెపు గుర్రాలను కొనే శక్తి యితరుల కెవ్వరికీ వుండేది కాదు. ఒకసారి బాగా ధనికుడైన ఒక ఏథెనియన్ పోటీలకి 7 రథాలు పంపాడు. వాటిలో ఒకదానికి మొదటి స్థానం, మరోదానికి రెండవ స్థానం, ఇంకోదానికి నాల్గవ స్థానం వచ్చాయి. తన ప్రాణాన్ని ప్రమాదంలో పెట్టుకున్న సారథి కాక, ఆ గుర్రాల యజమాని పోటీలో విజేతగా ప్రకటింపబడేవాడు.

క్రీడల పోటీల చివరి రోజున విజేతలకు ఆలివ్ రెమ్మల దండలు బహూకరించేవాళ్లు. వాళ్లు స్వగృహాలకు తిరిగి వచ్చినప్పుడు నగర ప్రజలందరూ వాళ్లకు స్వాగతమిచ్చేవాళ్లు. వాళ్లు తమ విజయాల ద్వారా తమ నగరాలకు కీర్తి తెచ్చారని తెలియజేయడానికి తరుచుగా నగరంలోని చౌకులలో వాళ్ల విగ్రహాలు నెలకొల్పేవాళ్లు.

ఒలింపిక్ క్రీడలు జరిగే నెలని పవిత్రమైనదిగా పరిగణించేవాళ్లు. క్రీడల కాలంలో గ్రీసులో యుద్ధాలను నిలుపు చేసేవాళ్లు. గ్రీకులు ఆ క్రీడలను యెంత ముఖ్యమైనవని భావించారంటే, మొదటి క్రీడలు జరిగినప్పటినుండి సంవత్సరాలను లెక్కపెట్టే కొత్త శకాన్ని ప్రవేశపెట్టారు. మొదటి క్రీడలు క్రీ.పూ. 776లో జరిగినట్లు చెప్తారు.

? **1.** లిపి అవతరణ నాటినుంచి ప్రాచీన గ్రీకుల లిపిదాకా దాని అభివృద్ధిని గురించి వివరించండి. అప్పటి గ్రీకు లిపి ప్రాముఖ్యం యేమిటి? **2.** ఒక క్రీడాకారుడిగా లేక ప్రేక్షకుడిగా ఒలింపిక్ క్రీడల గురించి చెప్పండి.

## § 39. ప్రాచీన గ్రీకు నాటకరంగం

డయోనిసస్ గౌరవార్థం గ్రీకులు జరుపుకున్న ఉత్సవాలను జ్ఞాపకం చేసుకోండి (§ 29; 2).

**1. నాటక రంగస్థలం పుట్టుక.** డయోనిసియన్ ఉత్సవం నాడు రైతులు గ్రామాల్లోనూ, నగరాల్లోనూ వీధుల్లో ఊరేగింపులు జరిపేవాళ్లు. వాళ్లు డయోనిసస్‌ని గురించిన పురాణగాథలను బృంద గానం చేసేవాళ్లు. ఆ గాథల్లోని కొన్ని పూర్తి అంకాలను నటించేవాళ్లు. మేక తోళ్లు కప్పుకొని డయోనిసస్ సహచరులు గణదేవతలైన సెటిర్‌లను అనుకరించేవాళ్లు. వాళ్లు తరచుగా నగరానికి లేక గ్రామానికి చెందిన ప్రముఖ పౌరులను

వ్యంగ్యంగా అనుకరించేవాళ్లు. ప్రేక్షకులు నటుల చుట్టూ గుమికూడేవాళ్లు. ఎక్కువమంది ప్రేక్షకులు చూడగలిగేందుకు అనువుగా ఈ ప్రదర్శనలు కొండ పాదం దగ్గర ఏర్పాటు చెయ్యడం మొదలైంది.

ఏథెన్స్‌లో యీ ప్రదర్శనలు అక్రోపొలిస్ కింద జరుగుతూండేవి. ప్రేక్షకులకి కొండ చరియమీద సీట్లు అమర్చేవాళ్లు. కింద ఒక గుడారం వేసేవారు. గ్రీకు భాషలో దీన్ని స్కేనె అంటారు. నటులు ఆ గుడారంలో వేషాలు వేసుకుని, దాని పక్కన ప్రదర్శన యిచ్చేవాళ్లు. తర్వాత కొంత కాలానికి ఆ గుడారం స్థానంలో ఒక చిన్న భవనం నిర్మించబడేది. ప్రదర్శన కాలంలో దానికి సీనరీలు వేలాడదియ్యబడేవి. దానికి "స్కేనె" అనే పేరు అలాగే ఉండిపోయింది. దాని ముందొక చిన్న జాగా కేటాయింపబడేది. దాన్ని ఆర్కెస్ట్రా అనేవారు. అక్కడనుంచి గాయక బృందం బృందగానం చేసేవారు. కొండ దరిమీద ప్రేక్షకులకోసం మొదట కొయ్య బెంచీలు, దరిమిలా రాతి బెంచీలు అమర్చబడేవి.



1. ప్రాచీన గ్రీకు నాటకశాల (ఫొటో). కుడి పక్కన రంగస్థలం శిథిలాలు. ప్రేక్షకుల సీట్లు ఒక కొండ చరియ వాలు మీదుగా అమర్చబడ్డాయి. మధ్యలో ఆర్కెస్ట్రా వుంది. (ప్రదర్శన సమయంలో గ్రీకు నాటకశాలని వర్ణ చిత్రం 15లో చూడగలరు)









2. దుఃఖాంత నాటకాల్లో వినియోగింపబడే మాస్కు. 3. సుఖాంత నాటకాల్లో వినియోగింపబడే మాస్కు.
4. దుఃఖాంత నాటక నటుడు (ప్రాచీన గ్రీకు బొమ్మ). 5. విదూషకుడు (ప్రాచీన గ్రీకు బొమ్మ)

క్రీ.పూ. 6వ–5వ శతాబ్ది చివర ఆరుబయలు ప్రదర్శనలకోసం ఏథెన్స్‌లో మొట్టమొదటి గ్రీసు థియేటర్ (నాటకశాల) యిలా నిర్మింపబడింది. థియేటర్ అన్నది గ్రీకు పదం. దానికి "దర్శన స్థలం" అని అర్థం. దాదాపు అన్ని గ్రీకు నగరాల్లోనూ, వలసల్లోనూ థియేటర్లు నిర్మింపబడ్డాయి.

## 2. గ్రీకు రంగస్థలంలో నటులు, బృందగానం.

నాటకాలు ఉత్సవ దినాల్లో ప్రదర్శింపబడేవి. అవి వరుసగా కొన్ని రోజులపాటు ఉదయంనుంచి సాయంత్రందాకా జరిగేవి. ప్రతిరోజూ కొన్ని నాటకాలు ప్రదర్శింపబడేవి.

నాటకాల్లో పురుషులు మాత్రమే నటించేవాళ్లు. స్త్రీ పాత్రలు కూడా వాళ్లే ధరించేవాళ్లు. నటులు మాస్కులు ముఖాలకు తగిలించుకునేవాళ్లు. వాళ్లు ధరించే పాత్రలనుబట్టి ఆ మాస్కులు ప్రదర్శించే మనోభావాలు వుంటాయి. అవి కోపమూ, సంతోషమూ, దిగులూ, మొదలైన భావోద్వేగాలను ప్రదర్శించేవి. స్త్రీలకు, పురుషులకు మాస్కులు వేరుగా వుంటాయి. మాస్కులు మార్చేవాళ్లు. బాగా మెరిసే రంగు మాస్కులు వెనుక వరసల్లో కూర్చున్నవాళ్లకు కూడా బాగా కనపడేవి. పొడుగ్గా కనిపించేందుకుగాను నటులు తమ కాళ్లకి చిన్న పీటలు కట్టుకునేవాళ్లు.

నాటక ప్రదర్శనల్లో బృందగానాలకు ప్రముఖ స్థానం వుండేది. నాటకాన్నిబట్టి బృందగాయకులు యువతులను, పర్షియన్ ప్రభువులను లేక కప్పలను, పక్షులను అనుకరించేవాళ్లు.

3. విషాదాంత నాటకాలు.

ప్రాచీన పురాణ కథలనుండి విషాదాంత నాటకాలు ఉద్భవించాయి. వాటిని ట్రాజెడీలు అనేవాళ్లు. ట్రాజెడీ అంటే గ్రీకు భాషలో "మేక పాట" అని అర్థం. డయోనిసస్ విందుల్లో పాల్గొనేవాళ్లు సెటేర్ల లాగా కనిపించడానికి యెప్పుడూ మేక చర్మాలు ధరించేవాళ్లు; ఈ పాత ఆచారంనుండి ట్రాజెడీ అనే మాట పుట్టింది. అత్యధిక విషాదాంత నాటకాల్లోని ముఖ్య పాత్రలు సాధారణంగా పురాణ గాథలలోని దేవుళ్లు, వీరులు. విషాద నాటకాలు సామాన్యంగా ప్రముఖ వ్యక్తుల మధ్య తీవ్ర పోరాటాన్ని, వాళ్ల వీర కృత్యాలను, కష్టాలను, మరణాన్నీ చిత్రిస్తాయి.

తొట్టతొలి ప్రముఖ విషాదాంత నాటకాలకర్త ఏథెనియన్ రచయిత ఈస్కిలస్. (ఈ రచయిత రచన ఒకటి మీకు తెలుసు. దాన్ని జ్ఞాపకం చేసుకోండి.) అతని విషాదాంత నాటకాల్లో ఒకదాని పేరు "శృంఖలాబద్ధుడైన ప్రామీథియస్."

ఆ విషాదాంత నాటకంలో ప్రామీథియస్ బృందగాయకులతో జీయస్ యిచ్ఛకి వ్యతిరేకంగా తను జనానికి వెదురు కర్రలో అగ్ని పట్టుకొచ్చి యిచ్చాననీ, ఇళ్లు కట్టుకోవడం, పశువుల్ని మచ్చిక చేసుకోవడం, లెక్కపెట్టడం, చదవడం నేర్పాననీ, నౌకల నిర్మాణం కనిపెట్టాననీ చెప్తాడు. జీయస్ కోపించి, యీ నేరానికిగాను ప్రామీథియస్‌ని గొలుసులతో ఒక బండకి బంధించమని ఆజ్ఞాపించాడు.

జీయస్ అధికారాన్ని ఎవరు హరించగలరో ప్రామీథియస్‌కి తెలుసు. ప్రామీథియస్ ఆ రహస్యాన్ని బయటపెట్టక పోతే అతన్ని చిత్రహింసలు పెడతానని జీయస్ తరఫున హెర్మెస్ బెదిరిస్తాడు. బృందగాయకులు జీయస్‌ని ఖండిస్తారు, ప్రామీథియస్‌పట్ల సానుభూతి వ్యక్తంచేస్తారు, కాని లొంగిపొమ్మని ప్రామీథియస్‌కి సలహాయిస్తారు. అప్పుడు ప్రామీథియస్ జీయస్ సేవకుడికి వీరోచితంగా యిలా జవాబిస్తాడు:

జీయస్ నన్ను చిత్రహింసలు పెట్టుగాక
మాయోపాయాలు పన్నుగాక
పల్లెత్తు మాట పలికించలేడు నాచేత
ఈ శృంఖలం తొలగింపబడునందాక.
మెరుపులే మెరిపించనీ, పిడుగులే కురిపించనీ
తెలి మంచుజడి వర్షించనీ
భూమి కంపింపజెయ్యనీ
తన అధికార దండం హరించే శక్తి గురించి
పల్లెత్తు మాట పలికించలేడు నాచేత.

ఉరుములు గర్జిస్తూండగా, మెరుపులు మెరుస్తూండగా తను గొలుసులతో బంధింపబడ్డ బండతోబాటు ప్రామీథియస్ పాతాళంలో పడిపోవడంతో యీ విషాదాంత నాటకం ముగుస్తుంది.

మరో గొప్ప గ్రీకు నాటకకర్త సాఫోక్లిస్ రచించిన విషాదాంత నాటకాల్లో "అంటిగొన్" అనే నాటకం అత్యంత ప్రసిద్ధమైనది. అది మొదట ఏథెనియన్ థియేటర్లో ప్రదర్శింపబడింది.

### 4. సుఖాంత నాటకాలు.

వినోదకరంగా, ఉల్లాసకరంగా ఉండే సుఖాంత నాటకాలు (కామెడీలు) ఉత్సవాల్లో వినవచ్చే చతురోక్తులనుంచీ, సన్నివేశాలనుంచీ ఉత్పన్నమయ్యేవి. కామెడీ అన్న పదానికి "వలసల్లో స్థిరపడ్డ ఉల్లాసపరుల గీతం" అని అర్థం.

సుఖాంత నాటకాలు ప్రేక్షకులకి వినోదం కలిగించేవి. దానికితోడు అవి సమకాలిక పౌర సమస్యలను యితివృత్తానికి జోడించేవి. ఉదాహరణకు, యుద్ధం కొనసాగించడమా లేక రాజీ కుదుర్చుకోవడమా అన్నది యిలాంటి సమస్యల్లో ఒకటి. ప్రజా సభలో మొదలైన పోరాటం థియేటర్లో కొనసాగింపబడేది. సుఖాంత నాటకకర్తలు తమ శత్రువులను వ్యంగ్య ధోరణిలో చిత్రించేవాళ్లు. ఆ పాత్రలు తమ సమకాలికుల్లో ఎవరిని ఉద్దేశించి రూపొందించబడ్డాయో ప్రేక్షకులు తేలిగ్గా గుర్తించగలిగేవాళ్లు. ఏథెనియన్ నాటకకర్త అరిస్టోఫనిస్ సుఖాంత నాటకాలు చతురోక్తులకీ, నిశిత వ్యంగ్యానికీ ప్రసిద్ధి చెందాయి.

కొన్ని సుఖాంత నాటకాల పాత్రలు దేవుళ్లకి ప్రాతినిధ్యం వహించేవి. దేవుళ్లని దురాశాపరులైన అబద్ధాలకోర్లుగా చిత్రించడం ద్వారా మనుషుల్లోని లోపాలను నాటకకర్తలు బట్టబయలుచేసేవాళ్లు.

### 5. నాటకశాలలో గ్రీకు ప్రేక్షకులు.

గ్రీకులకి నాటకాలంటే చాలా యిష్టం. ప్రదర్శనలు జరిగే రోజుల్లో తిండీ, పానీయాలూ తీసుకుని నాటకశాలకి తెల్లవారకట్లే వెళ్లేవాళ్లు. ఏథెన్స్‌లో జరిగే ప్రదర్శనలకి యితర నగరాలనుంచి చాలామంది ప్రేక్షకులు వచ్చేవాళ్లు. ఏథెనియన్ థియేటర్లో 17,000 మంది ప్రేక్షకులకి సీట్లుండేవి. ప్రదర్శనల తర్వాత ప్రేక్షకులచేత యెన్నుకోబడిన కమిటీ ఉత్తమ నాటక రచయితలకూ, ఉత్తమ నటులకూ బహుమతులు యిచ్చేది. సురభిళమైన లారెల్ ఆకుల దండలూ, విలువైన బహుమతులూ వాళ్లకు యిచ్చేవాళ్లు. నాటకాలను సవిమర్శకంగా చూసే వేలాది ప్రేక్షకుల అభిరుచులను సంతృప్తి పరచే రచనలు చెయ్యడం తేలిక పని కాదు. అందుకని గ్రీసులో నాటక రచయితలు అసాధారణమైన గౌరవానికి పాత్రులయ్యేవారు. గ్రీకు థియేటర్‌ని తరుచుగా "పెద్దవాళ్ల పాఠశాల" అనేవాళ్లు. ఏథెన్స్‌లో బీద పౌరులు థియేటర్‌కి వెళ్లేందుకు డబ్బు పంచబడేది.

## సోఫోక్లిస్ విషాదాంత నాటకం "అంటిగోన్"

ఈ నాటకం ప్రేక్షకుల్లో ఎలాంటి భావోద్వేగాలనూ, ఆలోచనలనూ రేకెత్తించేది?

ఇద్దరు సోదరులు కలహించుకుని పోరాటంలో ఒకరినొకరు సంహరించుకున్నారు. వాళ్లలో ఒకడిమీద మాతృదేశానికి శత్రువులను తెచ్చాడన్న నేరం మోపి, రాజు ఆ యువకుని మృతదేహాన్ని భూస్థాపనం చేయకూడదనీ, క్రూర మృగాలకు వేయాలనీ ఆజ్ఞాపిస్తాడు. ఆ యువకుని చెల్లెలైన అంటిగోన్ రాజాజ్ఞను ధిక్కరించి, తన సోదరుని దేహాన్ని గ్రీకు ఆచారాల ప్రకారం భూస్థాపన చేస్తుంది. ఆమె అలా చేస్తూండగా పట్టుకున్న రాజభటుడు ఆమెను రాజు ముందు హాజరుపరుస్తాడు. శిక్షగా రాజు ఆమెను సజీవ సమాధి చేయమని ఆజ్ఞాపిస్తాడు. అంటిగోన్‌ని ప్రేమించిన రాజు కొడుకు అలా చెయ్యవద్దని తండ్రిని అర్థిస్తాడు. రాజు వినిపించుకోడు. ఈ శిక్షను అంటిగోన్ నిశ్చల ధైర్యంతో స్వీకరిస్తుంది.

ఈ క్రూరమైన అన్యాయానికి శిక్షగా దేవతలు రాజ కుటుంబాన్ని నాశనం చేస్తారనీ, దేశానికి ఉపద్రవం సంభవిస్తుందనీ ఒక అంధజ్ఞాని రాజుకు హెచ్చరిక చేస్తాడు. ''త్వరలోనే, అతి త్వరలోనే నీ యింట స్త్రీలవీ, పురుషులవీ రోదనలు వినిపిస్తాయి. నగర రాజ్యాలు నీ మీద విరుచుకుపడతాయి'' అని జోస్యం చెప్తాడు. భయ భీతుడై ఆ అమ్మాయిని వదలిపెట్టడానికి రాజు నిర్ణయించుకుంటాడు. కాని అంటిగొన్ మరణించిందనీ, ఆ అమ్మాయిని ప్రేమించిన రాజు కొడుకు ఖడ్గంతో పొడుచుకొని చనిపోయాడనీ వార్తాహరుడు వచ్చి రాజుతో చెప్తాడు. మరో వార్తాహరుడు పుత్ర శోకంతో రాణి ఆత్మహత్య చేసుకున్నదన్న వార్త తెస్తాడు.

బృందగానపు పాటల్లో ఒకటి ఏథెన్స్‌లో బహుజనాదరణ పొందింది:

అనేక అద్భుత శక్తులున్నాయి ప్రపంచంలో
కాని, మానవునికి సమమైనది లేదేదీ యిలలో!
మానవుడు ధైర్యశాలి, అజేయుడు
నట్టనడి సంద్రాన పెను తుపానులు రేగినా
ఆకసమంత ఎత్తున అలలు చెలరేగినా
ఉదధిలో ఊగుతాడు, జలధి లంఘిస్తాడు....
ధీశాలి మానవుడు భాష సృష్టించాడు
వాయు వేగాన చరించు భావానికి కళ్లెంవేశాడు
శాంతి భద్రతల రక్షణకు ప్రభుత నెలకొల్పాడు
శీతాతప వర్షాల బారిపడకుండ గూడు సృష్టించాడు
మృత్యు దేవత చెలులు రోగాలనుంచి
ముక్తికై కనుగొన్నాడు సంజీవనీ ప్రాయ దివ్యౌషధాలు
సాధించ మిగిలిన దొక్కటే మర్త్యునికి
కోరలే పీకాలి మృత్యుదేవతకి.

## అరిస్టోఫనిస్ సుఖాంత నాటకం ''పక్షులు''

చతురుడైన ఒక ఏథెనియన్ సూచన మేరకు పక్షులు ఆకాశానికీ, భూమికీ మధ్య త్రిశంకు స్వర్గం నిర్మించు కున్నాయి. అంతకుముందు జనం హోమాగ్ని గుండంలో వేసే బలి పశువులనుంచి రేగే పొగ పీల్చి దేవతలు బతికే వాళ్లు. ఇప్పుడా పొగని పక్షులు దేవతలదాకా వెళ్లకుండా అడ్డగిస్తున్నాయి. జీయన్‌కి తెలియకుండా ప్రామీథియన్ రహస్యంగా పక్షుల రాజ్యానికి వెళ్లి, బలులు లేక దేవతలు ఆకలితో చచ్చిపోవచ్చునని చెప్పాడు. అటుతర్వాత జీయన్ దూతలైన పొసైడాన్, హెరాక్లిస్‌లు కూడా పక్షుల రాజ్యానికి వెళ్లారు. జీయన్ కూతుర్ని తనకిచ్చి పెళ్లి చెయ్యాలనీ, ప్రపంచాధికారాన్ని పక్షులకి బదిలీచెయ్యాలనీ ఏథెనియన్ డిమాండుచేశాడు. బ్రహ్మాండమైన విందు

యిస్తానని అతను వాగ్దానంచేశాడు. ఈ నాటకంలో హెరాక్లిస్ తిండిపోతుగా, మంచి విందుభోజనం దొరికితే చాలు, దేనికైనా సరే ఒప్పేసుకునేవాడుగా చూపబడగా, పొసైడాన్ అమాయకుడైన బక్కప్రాణిగా చిత్రింపబడ్డాడు. బుద్ధిశాలి అయిన ఏథెనియన్ జీయన్ కూతుర్ని భార్యగా పొందాడు.

? 1. గ్రీసులో నాటకశాల ఎలా పుట్టింది? మీరు ఎవర్ని గ్రీకు నాటకశాల పితగా పరిగణిస్తారు? 2. విషాదాంత నాటకాలకీ, సుఖాంత నాటకాలకీ మూలం యేమిటి? వాటి మధ్య తేడా యేమిటి? 3. ప్రాచీన గ్రీసులో నాటకశాల నిర్మాణ రూపం యేమిటి? ప్లాను గీసి, నాటకశాలలోని ప్రధాన భాగాలను అంకెల సాయంతో సూచించండి. 4. గ్రీసులో నాటకశాలని ''పెద్దవాళ్ల పాఠశాల'' అని ఎందుకు అనేవాళ్లు? అది యేమి నేర్పేది?

## §40. క్రీ.పూ. 5వ శతాబ్దిలో ప్రాచీన గ్రీసులో వాస్తుకళ, శిల్పం, చిత్రకళ

(మాప్ 4)

ఈజిప్టు దేవాలయాల్లోని, అస్సీరియా రాజభవనాల్లోని శిల్పాల్లో ఎవరి కీర్తి, ఎవరి స్మృతి మూర్తీభవింపజెయ్యబడిందో జ్ఞాపకం చేసుకోండి (§ 13; 3; § 17; 2).

1. గ్రీకు వాస్తుకళ. తమ తీరిక సమయంలో అత్యధిక భాగం గడిపే అగోరా, జిమ్నాజియం, థియేటర్ వంటి బహిరంగ స్థలాలు అందంగా వుండాలని ప్రాచీన గ్రీకులకు చాలా శ్రద్ధ వుండేది.

పోర్టికోల నీడలో విశ్రమించడమూ, మాట్లాడుకోవడమూ వాళ్లకు యిష్టం. కొన్ని స్తంభాలు నిలిపి వాటిమీద కప్పు వేస్తే పోర్టికో అయ్యేది. పోర్టికోలు తీక్ష్ణమైన యెండనుండి రక్షణ యిచ్చేవి, చల్లని గాలికి ఆటంకం వుండేది కాదు. మొదట గ్రీకులు పోర్టికోలు కొయ్యతో కట్టేవాళ్లు. తర్వాత రాయీ, తరుచుగా చలవ రాయీ ఉపయోగించేవాళ్లు.

ప్రాచీన గ్రీకు వాస్తుకళ ప్రధాన లక్షణాలు దేవాలయాల నిర్మాణంలో సంపూర్ణంగా వ్యక్తమయ్యాయి. నగర రాజ్యంలో దేవాలయమే ప్రజా జీవితపు ప్రధాన కేంద్రంగా వుండేది. దేవాలయంలో నగరపు ఖజానా వుండేది. ఉత్సవాలు దేవాలయ సమీపంలో జరిగేవి. దేవాలయాన్ని మిగిలిన భవనాల కంటె విశిష్టంగా చూపేందుకుగాను దాన్ని ఎత్తైన పునాదిమీద నిర్మించేవాళ్లు. దేవాలయం దీర్ఘ చతురస్రాకారంలో వుండేది. పైకప్పుకి రెండు ఏటవాలు ఉపరితలాలు వుండేవి. ఆ ఉపరితలాలూ, కార్నిసూ కలిసి ఏర్పడిన త్రికోణాన్ని పెడిమెంట్ లేక త్రికోణిక అనేవాళ్లు.

గ్రీకు దేవాలయాల చుట్టూ సాధారణంగా పోర్టికోలు వుండేవి. దేవాలయం హుందాగా, బ్రహ్మాండంగా కనిపించాలని గ్రీకులు అనుకున్నప్పుడు, పోర్టికోలకు ఆధారంగా వాళ్లు పొడవైన స్తంభాలు నిలిపేవాళ్లు. ఆ స్తంభాలు రాతి నేలలోంచి









1. గ్రీకు దేవాలయపు నమూనా. కింద నమూనాని మధ్యకి కోసి అంతర్భాగాన్ని చూపుతున్న చిత్రం. స్తంభాలూ, గోడలూ ఎక్కడెక్కడ ఉన్నదీ నల్లటి చుక్కలూ, గీతలూ తెలుపుతాయి. 2. స్తంభాల అగ్ర భాగాలు. ఈమాదిరి స్తంభాలను ఏ పేరుతో పిలిచేవారో పాఠంలో చూసి తెలుసుకోండి

మొలిచినట్లు కనిపించేవి. అలాంటి స్తంభాలను డోరిక్ స్తంభాలు అనేవాళ్లు. దేవాలయం మరింత సుందరంగా కనిపించాలంటే సన్నటి అలంకారపూర్ణమైన స్తంభాలు నిలిపేవాళ్లు. వాటిని అయోనిక్ స్తంభాలు అనేవాళ్లు. స్తంభాగ్రాలమీద గొర్రె కొమ్ముల మాదిరిగా మెలితిరిగిన అందమైన వంకీలు వుండేవి (ఈ పేజిలో చిత్రం, కలర్ ఫొటో 10 చూడండి).

## 2. గ్రీకు శిల్పకళ.

దేవాలయాల లోపలా, వెలుపలా అనేక విగ్రహాలూ, ఉబ్బెత్తు శిల్పాలూ వుండేవి. నగరపు చౌకుల్లో, తదితర బహిరంగ స్థలాల్లో కూడా అనేక విగ్రహాలు ఉండేవి. ప్లుటార్కు హాస్యంగా అన్నట్లు ఏథెన్స్‌లో బతికివున్న మనషుల కంటె విగ్రహాలే ఎక్కువ వుండేవి.

పాలరాతి, కంచు, దారు విగ్రహాలు వుండేవి. పాలరాతి విగ్రహాలకు మానవ శరీరపు రంగు వెయ్యబడేది. కంచు విగ్రహాలకి రంగు రాళ్ల కళ్లు అమర్చబడేవి. దారు విగ్రహాలకి దంతపు పైతొడుగు వెయ్యబడేది. దాని మూలంగా అవి మానవ శరీరపు వన్నెలో కనిపించేవి.

గ్రీకులు తమ దేవుళ్లనీ, వీరుల్నీ, సమకాలికుల్నీ చక్కటి అంగసౌష్ఠవం, అందమైన కనుముక్కు తీరూ కలిగిన అందమైన పురుషులుగా, స్త్రీలుగా చిత్రించేవాళ్లు. ఏదో ఒక ప్రత్యేక వ్యక్తిని చిత్రించడం కాక ఒక ఆదర్శ పురుషుడు లేక ఒక ఆదర్శ స్త్రీ ఎలా వుండాలో చిత్రించడం గ్రీకు శిల్పుల లక్ష్యంగా ఉండేది. మానవ శరీర సౌందర్యాన్ని ఆరాధనా భావంతో చూసే ఆ శిల్పులు దాన్ని నగ్నంగా లేక అర్ధనగ్నంగా చూపేవాళ్లు.

క్రీ.పూ. 5వ శతాబ్దిలో గ్రీకు శిల్పులు కదలికలో వున్న మనిషి శరీరాన్ని రూపొందించడం నేర్చుకున్నారు. పరుగె

త్తుతున్న లేక పోరాడుతున్న, చక్రం లేక ఈటె విసురుతున్న మనుషుల విగ్రహాలను ఆ శిల్పులు తయారుచేశారు. మైరన్ చెక్కిన "డిస్కోబాల క్రీడాకారుడి" విగ్రహాన్ని చూసినప్పుడు ఉద్రిక్తంగా వున్న క్రీడాకారుడి శరీరం నిటారుగా నిలబడి, చక్రాన్ని దూరానికి విసిరేస్తుందా అనిపిస్తుంది (పేజి 178లోని చిత్రం 1 చూడండి).

గ్రీకు శిల్పులు తమ శిల్పాల్లో వ్యక్తి శరీర సౌందర్యాన్నే కాకుండా అతని ధైర్యాన్నీ, ప్రశాంతతనీ, ఏదైనా ఒక వీరోచిత కార్యనిర్వహణకు అతని సంసిద్ధతనీ చూపేందుకు ప్రయత్నించారు. హోమర్ కావ్య వీరుల్లో దేశ స్వాతంత్ర్యం కోసం పోరాడిన తమ సమకాలికులను వాళ్లు చిత్రీకరించారు. హుందా అయిన జీయస్, పొసైడాన్‌ల విగ్రహాల్లో గ్రీకు శిల్పులు నగర రాజ్యాల ప్రముఖ పౌరులనూ, పాలకులనూ మూర్తీభవింపజేశారు.

పాలరాతి, కంచు విగ్రహాలు ఖరీదైనవి కనుక వాటిలో చిన్న చిన్న బొమ్మలతోనూ, కాల్చి రంగులు పూసిన మట్టి బొమ్మలతోనూ గ్రీకు పౌరులు యిళ్లను అలంకరించుకునేవాళ్లు (కలర్ ఫొటో 11 చూడండి).

### 3. వాజులమీది వర్ణ చిత్రాలు.

వాజులు రకరకాల అందమైన ఆకారాల్లో వుండేవి. వాజుల్లో చాలామటుకు సిసలైన కళా ఖండాలు. చిత్రకారులు వాజులమీద సమకాలిక జీవితంనుంచీ, పురాణ గాథల నుంచీ దృశ్యాలనూ, హోమర్ కావ్యాల్లోని దృశ్యాలనూ చిత్రించేవాళ్లు. క్రీ.పూ. 6వ శతాబ్దిలో కాల్చిన ఎర్రటి మట్టి వాజులమీద నల్ల లక్క రంగుతో చిత్రాలు వేసేవాళ్లు. వాటిని నల్ల బొమ్మల వాజులు





3. ఈటె పట్టుకున్న మనిషి (శిల్పి: పోలిక్లిటస్). 4. ఏథెనా దేవత శిరస్సు (శిల్పి: ఫిడియస్)




1. ఏథెన్స్‌లోని అక్రోపొలిస్ అవశేషాలు (ఫొటో). 2. క్రీ.పూ. 5వ శతాబ్దిలో ఏథెన్స్‌లోని అక్రోపొలిస్ (పునరుద్ధరణ). పాఠంలో ప్రస్తావింపబడిన అక్రోపొలిస్ సంబంధిత భవనాలను చిత్రంలోనూ, ఫొటోలోనూ గుర్తించండి



ఏథెన్స్‌లోని
అక్రోపొలిస్ దేవాలయపు పోర్టికో



2

అనేవాళ్ళు. క్రీ.పూ. 5వ శతాబ్దిలో వాజులమీది చిత్రాలు పాత్రకి సహజంగా వున్న ఎర్ర రంగులో వుండగా, పూర్వరంగానికి నల్ల పూత వుండేది. అలాంటి వాజులను ఎర్ర బొమ్మల వాజులు అనేవాళ్ళు (కలర్ ఫొటోలు 13, 14 చూడండి).

---

గ్రీకు కళ క్రీ.పూ. 5వ శతాబ్దిలో తన అత్యున్నత శిఖర స్థాయిని అందుకుంది. గ్రీసులోనూ, గ్రీకు వలసల్లో చాలా వాటిలోనూ శిల్ప, వాస్తు, చిత్ర కళాఖండాలు ఎన్నెన్నో సృష్టింపబడ్డాయి.

కళల వికాసానికి ఏథెన్సు ప్రధాన కేంద్రంగా వుండేది. గ్రీసులో కెల్ల అట్టికా వాజులు అత్యుత్తమమైనవి. ప్రముఖ వాస్తుకళాకారులూ, శిల్పులూ ఏథెన్సులో పనిచేస్తూండేవాళ్ళు. ఏథెనియన్ అక్రోపొలిస్ భవన నిర్మాణానికి ఫిడియస్ నాయకత్వం వహించాడు. వివిధ భవనాలతో, విగ్రహాలతో కూడిన అక్రోపొలిస్ గ్రీకు కళకి శిఖరప్రాయమైనదిగా పరిగణింప బడింది.

## ఏథెనియన్ అక్రోపొలిస్
## (క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి అక్రోపొలిస్ వర్ణన)

నగరంలో అక్రోపొలిస్ సమున్నతంగా కనిపిస్తుంది — అది దుర్గంగా ఉన్న నాటి రాతి ప్రాకారం యీనాటికీ దాని చుట్టూ నిలిచివుంది. అక్రోపొలిస్ ప్రవేశ ద్వారానికి ముందు కుడి పక్కన కొండలమీద ఏథెనా-నీకె — విజయాధి దేవత — పేరిట ఒక చిన్న దేవాలయం వుంది. వర్ణ చిత్రాలు పదిలపరచబడిన భవనం ఎడమ తట్టున వుంది. అక్రోపొలిస్ ప్రవేశ మార్గంలో కొన్ని వరుసల పాలరాతి స్తంభాలమీద నిలిచిన భారీ పోర్టికోలు వున్నాయి. అక్రోపొలిస్ ప్రవేశ ద్వారం ఎదుట ఫిడియస్ కంచుతో పోతపోసిన ఏథెనా దేవత బృహత్ విగ్రహం వుంది. నావికులకు పిరేయస్‌ను సమీపించేటప్పుడు ఏథెనా విగ్రహపు బంగారు కిరీటమూ, శూలాగ్రమూ కనిపిస్తాయి. మేరథాన్ యుద్ధంలో లభించిన కొల్ల సొమ్ముతో ఆ విగ్రహం నిర్మింపబడింది. కుడి పక్కన పార్థెనాన్ వుంది. అది నగర అధిష్ఠాన దేవత అయిన ఏథెనా గౌరవార్థం నిర్మించబడిన భారీ దేవాలయం.

పార్థెనాన్ దేవాలయం బంగరువన్నె గల తెల్లని పాలరాతితో నిర్మించబడింది. ఆ దేవాలయపు నాలుగు పక్కలా పోర్టికోలు ఉన్నాయి. ఆ భవనపు బయటి గోడమీద చుట్టూ ఉన్న ఉబ్బెత్తు శిల్పంలో ఉత్సవ ఊరేగింపులోని ఏథెనియన్లు చిత్రింపబడ్డారు. పార్థెనాన్ పశ్చిమ మంటపం పై భాగాన బొమ్మల బృందం చెక్కబడింది. ఒక బృందంలో ఏథెనాకూ, పొసైడాన్‌కూ జరిగిన వివాదానికి సంబంధించిన పురాణ గాథనుండి ఒక రంగం చిత్రింపబడింది. ఆ గాథ ప్రకారం పౌరులకు యెవరు అత్యంత విలువైన బహుమతి యిస్తే ఆ దేవుడు, లేక దేవత నగర రక్షణ కావిస్తుంది. పొసైడాన్ తన త్రిశూలంతో ఒక కొండను భేదించాడు; అక్కడ ఒక సెలయేరు ఉద్భవించింది. ఏథెనా తన బల్లెంతో భూమిని గుచ్చింది, అక్కడ ఒక ఆలివ్ చెట్టు ఉద్భవించింది. ఆమె బహుమతి ముఖ్యమైనదిగా యెంచబడి, ఆమె నగర రక్షకురాలుగా ప్రకటించబడింది. ఏథెన్స్‌కు ఆలివ్ చెట్ల పెంపకం యెంత ముఖ్యమైందీ ఈ గాథ తెలుపుతుంది.

పార్థెనాన్ లోపల రెండు పెద్ద హాళ్లు వున్నాయి. ఒకదానిలో ఫిడియస్ చెక్కిన 11 మీటర్ల యెత్తు ఏథెనా విగ్రహం వుంది. అది కొయ్య విగ్రహం. ముఖానికీ, చేతులకూ, కాళ్లకూ పల్చని దంతపు తొడుగులు వున్నాయి. దేవత దుస్తులు బంగారువి. (ఆ ప్రాచీన విగ్రహం ఎలా వుండేదో యీనాడు లభించే దాని పాలరాతి ప్రతి రూపాలను చూస్తే తెలుస్తుంది. పేజి 134లోని చిత్రం 2 చూడండి.) పార్థెనాన్ మరో హాలులో ఏథెన్స్ రాజ్యానికీ, సముద్ర సమాఖ్యకూ చెందిన ఖజానాలు వుండేవి. తిరణాల రోజుల్లో పార్థెనాన్ దగ్గర దేవుళ్లకి జంతువులు బలి యివ్వబడేవి.

అక్రోపొలిస్ ద్వారానికి ఎడమ పక్కన ఏథెనా, పొసైడాన్‌ల స్మారకార్థం నిర్మింపబడ్డ చిన్న దేవాలయం. ఆ దేవాలయపు ఒక పోర్టికోలో పైకప్పును స్తంభాలకి బదులు యువతుల బొమ్మలు మోస్తూవుంటాయి (పేజి 188లోని చిత్రం చూడండి). ఏథెనా నాటినదని చెప్పబడే ఒక ఆలివ్ చెట్టు ఆ దేవాలయం పక్కన వుండేది.

ఏథెన్స్ గ్రీసు దేశంలోని అత్యంత సుందరమైన నగరమని ప్రాచీన గ్రీకులు భావించారు. ఒక ప్రాచీన గ్రీకు రచయిత అన్న మాటలు యివి: "ఏథెన్స్‌ను చూడనివాడు శుంఠ. చూసి మెచ్చుకోనివాడు గాడిద. బుద్ధిపూర్వకంగా ఏథెన్స్‌ను వదలిపెట్టిపోయేవాడు ఒంటె."

ఏథెనియన్ అక్రోపొలిస్ ఎంతో వినాశానికి గురైంది. వర్ణ చిత్రాలూ, ఫిడియస్, తదితర శిల్పులూ రూపొం

దించిన శిల్పాలూ నాశనమయ్యాయి. పార్థెనాన్, తదితర భవనాలూ దాదాపు పూర్తిగా శిథిలమయ్యాయి. మిగిలిన విగ్రహాలు మ్యూజియంలలో ఉంచబడ్డాయి.

అయినా కూడా, అక్రోపొలిస్ యీనాడు సైతం ప్రేక్షకుల మనసుల్లో చెరగని ముద్ర వేస్తుంది.

? **1.** చిత్రాలూ, పాఠమూ తిరగేసి క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి ఒక దేవాలయం ఎలా వుండేదో వర్ణించండి. **2.** గ్రీసులో ఎవరి విగ్రహాలు ప్రతిష్ఠించబడ్డాయి? శిల్పులు ఎవరిని దృష్టిలో ఉంచుకొని దేవుళ్ల, పురాణ గాథల్లోని వీరుల విగ్రహాలను చెక్కారు? **3.** ప్రేక్షకుల్లో గ్రీకు దేవాలయాలు ఎలాంటి భావోద్వేగాలనూ, ఆలోచనలనూ రేకెత్తించేవని మీ ఉద్దేశం? **4.** వాజులమీది చిత్రాల ద్వారా మనకి యేమి తెలుస్తుంది? కూజాల మీది చిత్రాల్లో క్రీ.పూ. 6వ శతాబ్దికి చెందినవి యేవి, క్రీ.పూ. 5వ శతాబ్దికి చెందినవి యేవి? **5.** క్రీ.పూ. 5వ శతాబ్దిలో ఏథెన్స్‌ను దర్శించిన యాత్రికుడిలో కలిగివుండే భావాలను వర్ణించండి.

## §41. ప్రాచీన గ్రీసులో విజ్ఞానశాస్త్రం

ప్రాచీన తూర్పు దేశాల్లో పెంపొందిన విజ్ఞానశాస్త్రాన్ని జ్ఞాపకం చేసుకోండి.

**1. చరిత్ర రచనా పితామహుడు.** శక్తివంతమైన పర్షియన్ సామ్రాజ్యంమీద విజయాలు గ్రీకుల స్మృతుల్లో గాఢంగా నాటుకుపోయాయి. తమ దేశీయులు ప్రదర్శించిన ధైర్యాన్ని స్మరించుకొని వాళ్లు చాలా గర్వం పొందేవాళ్లు.

క్రీ.పూ. 5వ శతాబ్ది మధ్యలో హెరొడోటస్ అనే గ్రీకు చరిత్రకారుడు "గ్రీసు-పర్షియాల పోరాట చరిత్ర" (ప్లటేయా యుద్ధందాకా జరిగిన గ్రీసు-పర్షియాల యుద్ధాల చరిత్ర) రాశాడు. తన రచనకు సమాచారంకోసం హెరొడోటస్ ఈజిప్టు, బాబిలోన్, ఫొనీషియా, నల్ల సముద్ర తీరమూ, బాల్కన్ ద్వీపకల్పమూ దర్శించాడు. తాను చూసిందీ, యితరుల ద్వారా విన్నదీ, అన్నీ అతను రాసుకొన్నాడు. యుద్ధంలో పాల్గొన్నవారిని గురించే కాక, క్రీ.పూ. 5వ శతాబ్దిలో వారి జీవితాన్ని గురించే కాక ప్రాచీన గ్రీసు చరిత్రకూ, తూర్పు దేశాల చరిత్రకూ, ఆనాడు గ్రీసుకు దక్షిణాన నివసించే ప్రజల చరిత్రకూ సంబంధించిన సమాచారానికి అతని గ్రంథం ఒక విలువైన నిధి.

హెరొడోటస్ చారిత్రక రచనలను ప్రాచీన గ్రీకులు యెంతో విలువైనవిగా మెచ్చుకొని, అతన్ని చరిత్ర రచనా పితామహుడుగా పరిగణించారు. (ఈజిప్టు చరిత్రకి సంబంధించి హెరొడోటస్ రచించిన ఏ ఖండిక మీకు తెలుసు?)

**2. గ్రీసులో శాస్త్రీయ విజ్ఞానాభివృద్ధి.** సుదూర దేశాలకు గ్రీకు వర్తకుల, పండితుల ప్రయాణాలు ప్రకృతిని గురించిన, భూమిపైన ప్రజల జీవితం గురించిన గ్రీకుల జ్ఞానాన్ని విస్తృతంచేశాయి. ఈ ప్రయాణాలు ఆయా ప్రజల మధ్య జ్ఞాన మార్పిడికీ, విజ్ఞానశాస్త్రాభివృద్ధికీ తోడ్పడ్డాయి.

క్రీ.పూ. 6వ శతాబ్దిలో విజ్ఞానశాస్త్ర అభివృద్ధికి మిలెటస్ నగరమూ, ఆసియా మైనర్ పశ్చిమ తీర ప్రాంతమైన

అయోనియాలోని యితర నగరాలూ కేంద్రంగా వుండేవి. అయోనియా పండితులకి ఈజిప్షియన్ల, బాబిలోనియన్ల శాస్త్ర జ్ఞానంతో పరిచయం వుండేది. వాళ్ళు దాన్ని మరింతగా అభివృద్ధిచేశారు. గ్రీకు పండితులు ప్రకృతిని పరిశీలించి కనుగొన్న అంశాలను కేవలం పోగుచెయ్యడంతోనూ, వాటిని వర్ణించడంతోనే సరిపెట్టుకోక, ఆయా విషయాలకు మూలంలో వున్న కారణాలను కనుగొనేందుకూ, ప్రపంచ ఆవిర్భావం గురించి వివరించేందుకూ ప్రయత్నించారు. గ్రీకు పండితుల్లో కొందరు ప్రకృతికి మూలం నీరు అని తలచగా, మరికొందరు భూమి అనీ, యింకొందరు వాయువనీ, వేరొక కొందరు అగ్ని అనీ తలిచారు. (ప్రపంచ ఆవిర్భావం విషయంలో గ్రీకు పండితుల అభిప్రాయాలకీ, మతం చెప్పేదానికీ మధ్య తేడా యేమిటి?)

క్రీ.పూ. 5వ శతాబ్దిలో గ్రీకు విజ్ఞానశాస్త్రానికి ఏథెన్స్ కేంద్రం అయింది. ఏథెనియన్ మహా పండితుడు డెమోక్రిటస్ అనే ఏథెనియన్ పండితుడు ప్రకృతి విజ్ఞానశాస్త్రాల అభివృద్ధికి గొప్ప సేవ చేశాడు. ప్రపంచం చిన్న అణువుల చేత నిర్మింపబడిందనే సాహసోపేతమైన భావాన్ని మొదట ప్రతిపాదించినవాడు అతనే; ఆ కణాలను అతను అణువులన్నాడు.

విజ్ఞానాభివృద్ధి మూలంగా దేవుళ్ళు ఉన్నారన్న భావం తిరస్కరింపబడింది. అతను మానవునిలో ఆత్మ అనే పదార్థం యెక్కడా లేదనే నిర్ణయానికి వచ్చాడు. పురాతన కాలంలో ప్రకృతి బీభత్సాలవలన మానవులలో కలిగిన భయంనుండీ, నిస్సహాయతనుండీ మతం ఉద్భవించిందని రుజువు చేయడానికి అతను ప్రయత్నించాడు.

క్రీ.పూ. 4వ శతాబ్దికి చెందిన సుప్రసిద్ధ గ్రీకు పండితుడు అరిస్టాటిల్ విశేష జ్ఞానసంపన్నుడు. అతను సమకాలిక పండితుల రచనలు అధ్యయనం చేయడమే కాక, విడివిడి జ్ఞాన శకలాలను గుదికూర్చి, "ప్రకృతి" అనే గ్రీకు పదంనుంచి భౌతికశాస్త్రం, "వృక్షం" అన్న పదంనుంచి వృక్షశాస్త్రం, "రాజ్యం" అన్న పదంనుంచి రాజకీయాలు అంటూ ఆయా విజ్ఞానశాస్త్రాలుగా వర్గీకరించాడు. క్రీ.పూ. 4వ శతాబ్ది నాటి యితర ప్రగతిశీల పండితుల మాదిరిగానే అరిస్టాటిల్ భూమి ఒక గోళమనీ, అది మొత్తం విశ్వానికి మధ్యలో వుందనీ, సూర్యుడూ, తదితర నక్షత్రాలూ భూమి చుట్టూ తిరుగుతున్నాయనీ విశ్వసించాడు.







1. హెరొడోటస్. 2. డెమోక్రిటస్ (ప్రాచీన గ్రీకు బస్టులు)







కలర్ ఫొటో 1. లేఖకుడు (క్రీ.పూ. 3వ సహస్రాబ్ది నాటి ఈజిప్షియన్ ఉద్యోగి వర్ణ విగ్రహం). లేఖకుడు తన పై ఉద్యోగి ఆజ్ఞను రాసేందుకు సిద్ధంగా కూర్చున్నాడు

కలర్ ఫొటో 3. ఫారో టుటెన్‌ఖామన్ స్వర్ణ సర్కొఫాగస్ (క్రీ.పూ. 2వ సహస్రాబ్ది). ఆ ఫారో దండాన్నీ, కొరడానీ పట్టుకున్నాడు. నుదుటిమీద సర్పం చెక్కబడింది. ఇవన్నీ ఫారో అధికార సూచక చిహ్నాలు

కలర్ ఫొటో 2. కిరీటధారి అయిన ఈజిప్షియన్ సామ్రాజ్ఞి నెఫెర్తితి (క్రీ.పూ. 2వ సహస్రాబ్దిలో సున్నపురాతితో చెక్కబడి, రంగు పూయబడిన బొమ్మ)



కలర్ ఫొటో 4. ఇద్దరు దేవతలతో ఫారో (క్రీ.పూ. 2వ సహస్రాబ్ది నాటి కుడ్య చిత్రం). ఎడమ పక్క హోరస్, కుడి పక్కన టోత్ వున్నారు



కలర్ ఫొటో 5. అస్సీరియన్ రాజ భవనపు గోడల్లో ఒకటి (కాల్పనిక చిత్రాలతో కూడిన క్రీ.పూ. 2వ సహస్రాబ్ది నాటి ఉబ్బెత్తు మూల చిత్రాల ఆధారంగా పునరుద్ధరింప బడింది)

కలర్ ఫొటో 6. రంగు రాళ్లతో కళ్లు అమర్చబడిన స్త్రీ శిరస్సు (సున్నపు రాయి; దక్షిణ మెసొపొటేమియా, క్రీ.పూ. 3వ సహస్రాబ్ది మధ్యకాలం)







కలర్ ఫొటో 7. కంచుతో తయారు చేసిన రంగు రాళ్లతో కళ్లు అమర్చబడిన ఎద్దు తల (దక్షిణ మెసొపొటేమియా, క్రీ.పూ. 3వ సహస్రాబ్ది)

కలర్ ఫొటో 8. బాబిలోన్‌లోని ఇష్తార్ దేవత ఆలయ ద్వారం (పునరుద్ధరణ; క్రీ.పూ. 6వ శతాబ్దం). గోడలు నీలి, నారింజ రంగు గ్లేజ్డ్ టైల్సుతో తాపడం చెయ్యబడ్డాయి. ఆ గోడలమీద విస్తృతంగా జంతువుల – చాల సందర్భాల్లో కాల్పనిక జంతువుల – చిత్రాలు కనిపిస్తాయి. నగరపు ప్లానులో ఇష్తార్ ద్వారాన్ని గుర్తించండి (పేజి 77)



కలర్ ఫొటో 9. పర్షియన్ సైనికులు (పర్షియన్ చక్రవర్తి భవనపు గోడమీద రంగుల గ్లేజ్డ్ టైల్సుతో తయారు చేసిన చిత్రాలు; క్రీ.పూ. 5వ శతాబ్ది ఆరంభం)

కలర్ ఫొటో 10. డెల్ఫి నగరంలోని ఏథెనియన్ల రాజ్య కోశాగారం. డెల్ఫిలో అపోలో దేవాలయం ఉంది. గ్రీసు దేశమంతటా గ్రీకులందరిచేతా పూజింపబడే దేవుడు అపోలో





కలర్ ఫొటో 11. ఒక గ్రీకు యువతి విగ్రహం (కాల్చి, రంగువేసిన మట్టిబొమ్మ; క్రీ.పూ. 4వ శతాబ్ది). శిల్పి యీ బొమ్మలో ఆ యువతి లాలిత్యాన్నీ, సౌమ్యతనీ మూర్తీభవింపజేసేందుకు ప్రయత్నించాడు



కలర్ ఫొటో 12. స్త్రీ శిరస్సు రూపంలో మలచబడిన బంగారు కూజా (క్రీ.పూ. 4వ శతాబ్ది చివర – 3వ శతాబ్ది మొదట). ఆధునిక బల్గేరియా భూభాగంలో కనుగొనబడింది



కలర్ ఫొటో 14. ఎర్ర రంగు బొమ్మ వున్న వాజు (క్రీ.పూ. 5వ శతాబ్ది). వాజుమీద యుద్ధానికి పోయే ముందు యోధుడు తన కుటుంబ సభ్యులనుంచి వీడ్కోలు తీసుకుంటున్న దృశ్యం చిత్రింపబడింది



కలర్ ఫొటో 13. నల్ల రంగు బొమ్మ వున్న వాజు (క్రీ.పూ. 6వ శతాబ్ది). వాజుమీద మూడు శిరస్సులూ, మూడు శరీరాలూ కలిగిన రాక్షసుడితో యుద్ధం చేస్తున్న హెరాక్లిస్ చిత్రింపబడ్డాడు. హెరాక్లిస్ బాణం దెబ్బతో గాయపడిన రాక్షసుడి అనుచరుడు పడివున్నాడు



కలర్ ఫొటో 17. ఒక రోమన్ స్త్రీ (పాంపేయీలో దొరికిన ఒక కుడ్య చిత్రం)



కలర్ ఫొటో 15. మాసిడోనియన్ సైనికులకీ, పర్షియన్ సైనికులకీ మధ్య జరిగిన యుద్ధం (పాంపేయీ నగరంలో కనుగొనబడిన చిత్ర భాగం). ఎడమ పక్కన అలెగ్జాండర్ ది గ్రేట్, కుడి పక్కన పలాయనం చేసేందుకు సిద్ధంగా వున్న మూడవ డరియస్ ఉన్నారు



కలర్ ఫొటో 16. పాంపేయీ తవ్వకాల్లో లభించిన ఒక ఇంటి లోపలి భాగం. ఆ ఇంట్లో ఈతకొలను, తోట ఉన్నాయి. గోడలమీద కుడ్య చిత్రాలు ఉన్నాయి. పచ్చి గిలాబామీద వేసే వర్ణ చిత్రాలను కుడ్య చిత్రాలు (ఫ్రెస్కోలు) అంటారు. పాంపేయీలోని ఇళ్లలో గిన్నెలు, ఫర్నిచరు, గోడలమీద చిత్రాలు భద్ర పరచబడ్డాయి. ఒక ధనిక వడ్డీ వ్యాపారినుంచి అప్పులు తీసుకున్న మనుషులు రాసి యిచ్చిన 100కి పైగా రశీదులు అతని ట్రంకుపెట్టెలో దొరికాయి. మనుషుల, జంతువుల శరీరాలు దుమ్ముగా మారిపోయాయి. అయితే గట్టిపడిన బూడిదలో ఖాళీ జాగాలు ఏర్పడ్డాయి. ఆ ఖాళీ జాగాలను ప్లాస్టరుతో నింపడం ద్వారా పురాతత్వ శాస్త్రజ్ఞులు ధూళిగా మారిపోయిన శరీరాల, వస్తువుల కచ్చితమైన నమూనాలను సంపాదించారు. పాంపేయీ నగరానికి వెళ్లే యాత్రికుడు మొదటి శతాబ్దికి చెందిన ఆ నగరంనుంచి నగరవాసులు సరిగ్గా యింతకుముందే వెళ్లిపోయారన్న అనుభూతి పొందుతాడు



కలర్ ఫొటో 18. ఒక రోమన్ స్త్రీ (పాంపేయీలో దొరికిన కుడ్య చిత్రం)

కలర్ ఫొటో 19. రోమ్ నగర ఫోరమ్‌లో ఒక భాగం. ఈనాడు చూడగల ఫోరమ్ శిథిలాలు (ఫొటో). ఎడమ పక్క వెనక కనిపించే ఎత్తైన కట్టడం ఆధునిక భవనం



కలర్ ఫొటో 20. పునరుద్ధరింపబడిన ఫోరమ్. ఎడమ పక్కన వెనకగా కాపిటోలియమ్



వర్ణ చిత్రం 1. ఆదిమ మానవుల మంద. ఏ మూలాధారాల ప్రాతిపదికమీద ఆదిమ మానవుడి ఆవిర్భావం పునరుద్ధరింపబడిందో, అతని శ్రమ పనిముట్లు వర్ణింపబడ్డాయో పాఠ్యగ్రంథంలో చూసి తెలుసుకోండి



వర్ణ చిత్రం 2. అడవి గుర్రాల వేట. ఈమాదిరి వేటని గురించి పాఠ్యగ్రంథంలో విస్తారంగా వర్ణింపబడిన స్థలం వెతకండి. వేటగాళ్లు ఒంటరిగా జీవిస్తే ఎందుకు తిండి, గుడ్డల్ని సంపాదించుకోలేరు?



వర్ణ చిత్రం 3. గణ సమాజ సభ్యులు నివసించే ఒక గుహ. గుహ వాసులు ఏమేం చేస్తున్నారు? పురుషులకీ, స్త్రీలకీ మధ్య ఎలాంటి శ్రమ విభజన జరిగింది?

వర్ణ చిత్రం 4. ఆదిమ చిత్రకారుడు. ఈ చిత్రానికీ, వర్ణ చిత్రం 3కీ మధ్య వున్న సంబంధం ఏమిటి?



వర్ణ చిత్రం 5. ప్రాచీన కాలంలో నైల్ నదీ మైదానం. కుడి పక్కన: రైతు కుటుంబాలు తమ భూఖండాలను దున్నుకుంటున్నాయి. కొందరు రైతులు పంటచేలు కోస్తున్నారు. మరికొందరు అదే సంవత్సరం రెండవ పంటకోసం భూమి దున్ని విత్తనాలు జల్లుతున్నారు. చేలకు మోటతో నీళ్ల తోడుతున్నారు. ఎడమ పక్కన బానిస యజమాని ఎస్టేటు వుంది

వర్ణ చిత్రం 6. ప్రాచీన ఈజిప్టులో పన్నుల వసూళ్లు. పాఠ్యగ్రంథంలో యివ్వబడిన ప్రాచీన ఈజిప్షియన్ మూల చిత్రాలనూ, వర్ణనలనూ ఆధారం చేసుకుని యీ చిత్రంలో ఎవరెవరు చిత్రించబడ్డారో నిర్ణయించండి

వర్ణ చిత్రం 7. ప్రాచీన ఈజిప్షియన్ రాతి గనులు. రాతి చట్టుల్లో చిన్న చిన్న గాడులు చేసి, వాటి మధ్య కొయ్య గసికలు దించి, వాటిమీద నీళ్ళు పోసేవాళ్ళు. కొయ్య ఉబ్బి, చట్టునుంచి పెద్ద పెద్ద రాతి బండలు పగిలేవి. రాగి పనిముట్లతో వాటిని జాగ్రత్తగా మలిచేవాళ్ళు. డజన్లకొలది మనుషులు మొలిచిన రాళ్ళకు పగ్గాలు కట్టి భవన నిర్మాణస్థలాలకు రవాణా చేసేందుకుగాను నైలు నది ఒడ్డుకి యీడ్చుకెళ్ళేవాళ్ళు. మిక్కిలి భారమైన పనులు బానిసల, నేరస్థుల పాలబడేవి

వర్ణ చిత్రం 8. అస్సీరియన్ సైనికుల పునరాగమనం. అస్సీరియా చక్రవర్తి కోట గోడలు వెనక కనిపిస్తున్నాయి. ఎడమ పక్కన దేవాలయ గోపురం ఎత్తుగా కనిపిస్తోంది. సైనికులచేత పరివేష్టితుడైన రాజు తన తథంమీద ముందు వస్తున్నాడు. బారులు తీర్చబడిన బానిసలు తీసుకురాబడుతున్నారు. మూపులపై కొల్ల సొమ్ముతో ఒంటెలు, కంచర గాడిదలు రాజభవనం పక్కగా లోలుకు రాబడుతున్నాయి





వర్ణ చిత్రం 9. ఒక వ్యాపార ఓడమీద దాడిచేస్తున్న ఫొనీషియన్ ఓడ. పాఠ్యగ్రంథంలో యీ దాడులు ఎందుకు జరిగేవో ప్రస్తావింపబడిన ఘట్టం తిరిగి చదవండి



వర్ణ చిత్రం 10. చైనాలో "పసుపుపచ్చ తలపాగాల వాళ్ల" తిరుగుబాటు. తిరుగుబాటుదార్లు సైనిక కాపలాదార్ల రక్షణలో బండిపై పోతున్న ఒక ప్రభువుమీద దాడిచేశారు. ముందొక లాగుడు బండి వుంది. దానిమీద హైరోగ్లిఫ్‌లలో రాయబడ్డ మాటలకి "నవ శకం" అని అర్థం. ఈ మాటలు తిరుగుబాటుకి సంకేతాలు. తిరుగుబాటుదారులు లాగుడు బండికీ, చెట్టుకీ మాటున పొంచి వున్నారు. వెనక దూరాన ఒక గ్రామం, కాలిపోతున్న భూస్వామి భవనం

వర్ణ చిత్రం 11. మేరథాన్ యుద్ధం. చిత్రంలో పర్షియన్లలో అత్యధిక సంఖ్యాకులు పలాయనం చేస్తూవుండటం, కొద్దిమంది మాత్రమే ప్రతిఘటనను కొనసాగిస్తూవుండటం కనిపిస్తుంది

వర్ణ చిత్రం 12. క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి పిరేయస్ ఓడరేవు. ఎడమ పక్కన బానిసలు ఏథెన్స్‌లో తయారుచెయ్యబడిన మట్టి పింగాణీ సరుకులను ఓడలకి ఎత్తుతున్నారు. వారి పక్కన మరికొందరు బానిసలు ధాన్యాన్ని దింపుతున్నారు. అంతకి కొంచెం కుడి పక్కన జాలర్లు తాజాగా పట్టిన చేపల్ని తీసుకొస్తున్నారు. బానిసలు మార్కెట్‌లో అమ్మకానికి నడిపించబడుతున్నారు. బానిసల మార్కెట్ ముందు చూపబడింది. అఖాతానికి రెండవ ఒడ్డున పొడవు ఏథెన్స్ గోడల్లో ఒకదాని కొంత భాగం. అఖాతంలో పయనిస్తున్న ఓడల్లో ఏది యుద్ధ నౌక? ఏది వర్తక ఓడ?





వర్ణ చిత్రం 13. ప్రాచీన ఏథెన్స్‌లో కుమ్మరి కార్ఖానా. ఎడమ పక్కన: బానిసలు బంకమట్టిని కాళ్లతో తొక్కుతున్నారు. సారెమీద పాత్రలు మలుస్తున్న కుమ్మరి దగ్గరకి తొక్కి పాకంచేసిన మట్టిని ఒక బానిస తీసుకొస్తున్నాడు. ఒక బానిస సారెను తిప్పుతున్నాడు. కుడి వైపున ఒక చిత్రకారుడు కుండలపైన రంగులు వేస్తున్నాడు. వెనక మట్టి పాత్రలు కాల్చే బట్టీ



వర్ణ చిత్రం 14. ఏథెన్స్ ప్రజా సభ సమావేశం. హాజరైనవాళ్లు ఓటుచేస్తున్నారు. అప్పుడే ప్రసంగించిన వక్త మెట్లు దిగుతున్నాడు. ముందు నుంచున్న కొద్దిమంది ప్రభువులు మెజారిటీ సామాన్యులు ఓటుచేసిన ప్రతిపాదనకి అనుకూలంగా ఓటుచెయ్యడం లేదు. పౌర హక్కులు లేని ఒక వ్యక్తిని కాపలాదారు కొరడా పుచ్చుకొని బయటకి తరిమేస్తున్నాడు

వర్ణ చిత్రం 15. ఒక గ్రీకు నాటకశాల. ఆర్కెస్ట్రా స్థానంలో బృంద గాయకులు, ముందొక మురళీ వాద్యగాడు నిలబడివున్నారు. ఆర్కెస్ట్రా వెనక వున్న రంగస్థలం ముందు యిద్దరు నటులు నటిస్తున్నారు. ప్రేక్షకుల సీట్లు కొండచరియ వాలుమీదుగా అమర్చబడ్డాయి. ఉన్నతాధికారులకు, పురోహితులకు గౌరవ సూచకంగా ముందు వరుసల్లో ఆసనాలు ఏర్పాటుచెయ్యబడ్డాయి. నాటకశాల క్రీ.పూ. 4వ శతాబ్దిలో ఉన్నమాదిరిగా చూపబడింది. నాటకశాలలో సుఖాంత నాటకమా, దుఃఖాంత నాటకమా ఏది ప్రదర్శింపబడుతోందో నిర్ణయించండి

వర్ణ చిత్రం 16. ప్రాచీన గ్రీసులో రథాల పోటీ. ఈ చిత్రం పాఠ్యపుస్తకంలోని ఏ గ్రీకు మూల చిత్రానికి నకలుగా వెయ్యబడిందో గుర్తించండి





వర్ణ చిత్రం 17. రోమ్‌లో విజయోత్సవం. గొలుసులతో బంధింపబడిన ఖైదీ ప్రభువులు ముందు నడుస్తున్నారు. ఖైదీల్లో స్త్రీలు, శిశువులు కూడా వున్నారు. విజేత తెల్ల గుర్రాలు లాగుతున్న రథం మీద నిలిచివున్నాడు. ఒక బానిస విజేత శిరస్సుమీద బంగారు విజయమాల పట్టుకొని నిలబడ్డాడు



వర్ణ చిత్రం 18. ఒక రోమన్ బానిస యజమాని ఎస్టేటు. ఎడమ పక్కన: ద్రాక్ష రసం తీసే యంత్రం. కుడి పక్కన: ముందు పిండి తిరగలి, వెనక: బానిసలు ఉండే బారక్కు. నిగామాను ఒక బానిసని స్తంభానికి కట్టి బాదుతున్నాడు. బానిస యజమాని మధ్య వున్నాడు



వర్ణ చిత్రం 19. ఒక రోమన్ ఆంఫీథియేటర్. ఇప్పుడిప్పుడే యిద్దరు గ్లేడియేటర్ల మధ్య పోరాటం ముగిసింది. ఇద్దరిలో ఒకడు భారీగా సుసజ్జితుడై వుండగా రెండవవాడు కేవలం ఒక వలనూ, శూలాన్నీ మాత్రమే కలిగివున్నాడు. విజేత ప్రేక్షకులనుంచి పరాజితుడి భవితవ్యాన్ని గురించిన నిర్ణయంకోసం నిరీక్షిస్తున్నాడు



వర్ణ చిత్రం 20. స్పార్టకస్ నాయకత్వాన జరిగిన తిరుగుబాటు. ఈ చిత్రంలో తిరుగుబాటుకి సంబంధించిన ఏ ఘట్టం చూపబడింది?



వర్ణ చిత్రం 21. సామ్రాజ్య కాలపు రోమ్ నగరం. చిత్రంలో పలు అంతస్తుల భవనాలు, వాటి మధ్య యిరుకు మసక వీధులు చూపబడ్డాయి. వీధుల్లో మూలలు మలచబడిన బండరాళ్లు పరచబడ్డాయి. వానల సమయాల్లో వీధి దాటేందుకు ప్రత్యేకమైన బండలు పరచబడ్డాయి. నలుగురు బానిసలు ఒక ధనిక రోమన్‌ని డోలీలో మోస్తున్నారు. మధ్యలో బీదవాళ్లకి రొట్టె పంచిపెట్టే దుకాణం. ఒక వ్యక్తి గోడమీద గ్లేడియేటర్ల పోటీలను గురించిన ప్రకటన రాస్తున్నాడు. కుడి వైపున ఒక ధనిక రోమన్ గృహం. గృహ యజమాని యింట్లో ప్రవేశిస్తున్నాడు. అతని వెనక బిచ్చగాళ్లు భిక్షకోసం, యితరులు భోజనానికి ఆహ్వానంకోసం నిరీక్షిస్తున్నారు



వర్ణ చిత్రం 22. రోమ్‌ను కొల్లగొడుతున్న బర్బరులు. బర్బరులు ఏమేమి తీసుకుంటున్నారో, ఏమేమి పారేస్తున్నారో పరీక్షగా చూడండి

**3. ప్రగతిశీల విజ్ఞానశాస్త్రజ్ఞులు వేధింపబడటం.**

దేవుళ్ల అస్తిత్వ నిరాకరణను చాలామంది గ్రీకులు వ్యతిరేకించారు. సూర్యుడు మండే గోళమని వాదించిన పండితుడిపైన అతను నాస్తికుడని ఏథెన్స్ వాసులు నేరారోపణచేశారు. అతని రచనలు తగలపెట్టబడ్డాయి. అతను పెరిక్లెస్ సహాయంతో చావు తప్పించుకొని, అట్టికానుంచి బయటపడగలిగాడు.

దేవతలున్నారనే నమ్మకానికీ, మానవునిలో ఆత్మ వుందనే నమ్మకానికీ వ్యతిరేకంగా డెమొక్రిటస్ చేసిన బోధ అనేక గ్రీకు బానిస యజమానులకు కోపకారణమయింది. అతని ప్రగాఢ శత్రువు ఒకరు అతని రచనలను నాశనం చేయాలనీ, అతని అనుచరులకు ''మరణ శిక్ష, కొరడా దెబ్బలు, జైలు, లేక పౌర హక్కుల రద్దు'' విధించాలనీ వాదించాడు.

**4. గ్రీసులో సాంస్కృతిక వికాసానికి మూల కారణాలు.**

క్రీ.పూ. 5వ–4వ శతాబ్దిలో గ్రీకు సంస్కృతి తన మహోజ్వల శిఖర స్థాయిని అందుకుంది. అది గ్రీకు ప్రజల సృష్టి. ప్రాచీన గ్రీసులో బానిస యాజమాన్య ప్రజాస్వామ్యం యేర్పడిన కారణంగా స్వతంత్ర ప్రజానీకంలో పెద్ద భాగం సంస్కృతి అభివృద్ధి కావడానికి తోడ్పడ్డారు. క్రీ.పూ. 5వ శతాబ్దిలో గ్రీసు కంతటికీ ఏథెన్స్ సాంస్కృతిక కేంద్రం కావడం యాదృచ్ఛికం కాదు. ఇతర నగర రాజ్యాలలో కంటె ముందుగా ఆ నగరంలో బానిస యాజమాన్య ప్రజాస్వామ్యం యేర్పడింది; అందువలన అది అన్నిటికంటె ముందు పూర్ణ వికాసం అందుకుంది. కాని, మిక్కిలి కష్టమైన పనులు చేసిన బానిసలను మహా క్రూరమైన దోపిడికి గురిచేయడం ద్వారానే అది సాధ్యమయింది. కళ, విద్య ప్రజానీకంలో స్వల్ప భాగానికి మాత్రమే అందుబాటులో వుండేవి. బానిసలకు గ్రీసు జైలు లాగా వుండేది; భరించలేనంత కష్టమైన పని, దెబ్బలూ, అవమానమూ తప్ప వాళ్ళు అనుభవించిందేమీ లేదు.

**5. ప్రాచీన గ్రీకు సంస్కృతి ప్రాముఖ్యం.**

అనేక ఆధునిక భాషల అక్షరమాలలకు గ్రీకు అక్షరమాల ఆధారం (మాప్ 12 చూడండి). గ్రీసులో శాస్త్రీయ విజ్ఞానం బాగా పురోగమించింది. అనేక గ్రీకు పదాలు ఆధునిక భాషల్లో కలిశాయి. అనేక పేర్లకు మూలం గ్రీకు భాషలో కనిపిస్తుంది.

థియేటర్‌కి (నాటకరంగ స్థలానికి) గ్రీసు జన్మస్థానం. హోమర్ రచనలూ, అనేక యితర ప్రాచీన గ్రీకు రచయితల, కవుల రచనలూ దాదాపు ప్రతి ఆధునిక భాషలోకీ అనువదింపబడ్డాయి. ప్రాచీన గ్రీకు భవనాలూ, విగ్రహాలూ తరువాతి యుగాల వాస్తుశిల్పులకూ, శిల్పులకూ నమూనాలు అయ్యాయి.

నాలుగేండ్లకొకసారి క్రీడల పోటీలు జరుగుతున్నాయి; వాటిని ఈనాటికీ ఒలింపిక్ క్రీడలు అంటున్నారు. ఆ క్రీడల సమయంలో పెద్ద జ్యోతి వెలుగుతూ వుంటుంది. ఒలింపియాలో సూర్యకిరణాలనుంచి వెలిగింపబడే ఆ జ్యోతి మహాసముద్రాలూ, ఖండాలూ దాటి ఒలింపిక్ క్రీడా స్థలికి చేర్చబడుతుంది.

ప్రపంచ మంతటా సంస్కృతి అభివృద్ధిమీద ప్రాచీన గ్రీకు సంస్కృతి ప్రభావం విశేషంగా వుంది.

? **1.** ప్రాచీన గ్రీసులో సంస్కృతి అభివృద్ధికి దోహదం చేసింది యేమిటి? **2.** గ్రీసులో విజ్ఞానశాస్త్ర రంగంలో ఏ విజయాలు సాధింపబడ్డాయి? విజ్ఞానశాస్త్రాభివృద్ధి దేవుళ్ల అస్తిత్వ నిరాకరణకి ఎందుకు దారితీసింది? **3.** క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి గ్రీసులో సంస్కృతికి ఏథెన్స్ కేంద్రం అన్న విషయాన్ని నిరూపించండి. **4.** మానవ జాతికి ప్రాచీన గ్రీకు సంస్కృతి ప్రాముఖ్యాన్ని సూచించే ఉదాహరణలు పేర్కొనండి. **5.** ప్రాచీన గ్రీకు సంస్కృతి సృజనలో బహుళ ప్రజానీకం ఏవిధంగా పాల్గొన్నారు? ఈ విషయాన్ని నిరూపించే ఉదాహరణలు యివ్వండి.

ప్రకరణం పదకొండు

# తూర్పు మధ్యధరా తీర ప్రాంతంలో గ్రీకు-మాసిడోనియన్ రాజ్యాల ఆవిర్భావం

## §42. క్రీ.పూ. 4వ శతాబ్దంలో గ్రీసు క్షీణించడం, గ్రీసుపై మాసిడోనియా పెత్తనం

(మాప్ 4)

స్పార్టన్ రాజ్యం ఎలా ఆవిర్భవించిందో, అదెక్కడ ఉండేదో జ్ఞాపకం చేసుకోండి (§ 32; 2); సముద్ర సమాఖ్య ఎలా తలెత్తిందో జ్ఞాపకం చేసుకోండి (§ 34; 5; § 36; 1).

**1. గ్రీకు నగర రాజ్యాల మధ్య యుద్ధాలు.** ఏథెన్స్ మొత్తం గ్రీసు అంతటిమీదా పెత్తనం వహించాలని ఉద్దేశించింది. స్పార్టా ఆశ కూడా అదే. పెరిక్లెస్ జీవిత కాలంలో ఏథెన్స్, స్పార్టాల మధ్య వైరం యుద్ధంగా పరిణమించింది. గ్రీసుమీద పెత్తనంకోసం క్రీ.పూ. 431లో ఆ రెండింటి మధ్య యుద్ధం చెలరేగింది. దాదాపు గ్రీకు నగర రాజ్యాలన్నీ, కొన్ని ఏథెన్స్ పక్షానా, కొన్ని స్పార్టా పక్షానా ఆ యుద్ధంలో దిగాయి. యుద్ధం దాదాపు 30 సంవత్సరాలు జరిగింది. ఏథెన్స్ ఓడిపోయింది. సముద్ర సమాఖ్య విచ్ఛిన్న మైంది. పొడవు గోడలు కూల్చివేయబడ్డాయి.

గ్రీకు నగర రాజ్యాల మధ్య యుద్ధాలు క్రీ.పూ. 4వ శతాబ్దిలో కూడా ఆగలేదు. ఒకరి భూభాగాలను ఒకరు వశపరచు కొన్నప్పుడు వాళ్ల అక్కడి ద్రాక్ష తోటలనూ, పండ్లతోటలనూ నరికేసేవాళ్లు; పంటలను తొక్కేసేవాళ్లు; పట్న ణాలనూ, గ్రామాలనూ నేల మట్టం చేసేవాళ్లు. ఖైదీలను బానిసలుగా చేసుకునేవాళ్లు.

యుద్ధాల మూలంగా గ్రీసు నాశనమైంది. ఆలివ్ తోటలలో కాలిన మొద్దులు తప్ప యేమీ మిగలలేదు. పొలాలు కలుపు మొక్కలతో నిండిపోయాయి. పల్లెలు నాశనమయ్యాయి.

**2. రైతులు, చేతిపనివాళ్లు నాశనమవడం.** తరచుగా జరిగే యుద్ధాల మూలంగానే కాకుండా, బానిసల సంఖ్య పెరిగిన మూలంగా కూడా చేతిపనివాళ్లు, రైతులు నాశనమయ్యారు. బానిసల శ్రమ చాలా చౌకగా లభించేది. బానిసలు పనిచేసే కార్ఖానాలూ, ఎస్టేట్లూ తమ సరుకులను రైతులూ, చేతిపనివాళ్లూ అమ్మినదానికన్న చౌకగా అమ్మగలిగేవి: ఈ కారణంగా చేతిపనివాళ్లకీ, రైతులకీ వాళ్ల సరుకులను అమ్ముకోవడం చాలా కష్టం అయ్యేది. దానితో సన్నకారు చేతి పనివాళ్ల సంఖ్య తగ్గిపోయింది, పెద్ద కార్ఖానా సొంతదారుల సంఖ్య పెరిగింది. రైతులు దివాళా తీశారు; వాళ్ల పొలాలను ధనిక రైతులు కొనేశారు.



మాసిడోనియన్ ఫలాంక్స్ (ఆధునిక చిత్రం). సైనికులు 16 వరుసల్లో నిలపబడ్డారు. మొదటి వరుసలోని సైనికుల చేతుల్లో రెండు మీటర్ల పొడవు ఈటెలు వున్నాయి. 6వ వరుసలోని సైనికుల చేతుల్లో సుమారు 6 మీటర్ల పొడవు ఈటెలు వున్నాయి. యుద్ధంలో 6 వరుసల్లోని సైనికులు ఏక కాలంలో తమ ఈటెలు ఉపయోగించగలిగేవాళ్ళు. తేలిక ఆయుధాలు ధరించిన సైనికులు ఫలాంక్సుకి ముందు నడుస్తారు. ఇరు పక్కలా అశ్విక దళాలు వున్నాయి. మాసిడోనియన్ ఫలాంక్స్ మహా శక్తివంతంగా దాడిచేసేది, అయితే అది మైదాన ప్రాంతంలో మాత్రమే పోరాడగలిగేది

దరిద్రులైన రైతులూ, చేతిపనివాళ్ళూ కిరాయి సైనికులుగా మారారు. ఒక సైనికుణ్ణే గాక, మొత్తం ఒక సైనిక దళాన్ని, దాని సేనా నాయకునితో సహా, అద్దెకు తీసుకోడానికి వీలయ్యే ప్రత్యేక మార్కెట్లు ఉద్భవించాయి. పర్షియన్ రాజు సైన్యంలో కూడా చాలామంది గ్రీకు కిరాయి సైనికులు వుండేవాళ్ళు.

3. వర్గపోరాటం తీవ్రమవడం.

అన్నార్తులైన బీదలలో ధనవంతులపట్ల ద్వేషం పెరిగింది. గ్రీసులోని చాలా పెద్ద నగరాలలో ఒకటైన కోరింత్‌లో బీదవాళ్ళు తిరుగుబాటు చేశారు. తిరుగుబాటుదార్లు ఐశ్వర్యవంతులైన పౌరులను వీధుల్లో చంపి, వాళ్ళ యిండ్లు దోచుకున్నారు. ధనికులు దేవాలయాల్లో దాక్కునేందుకు ప్రయత్నించారు, కాని తిరుగుబాటుదార్లు వాళ్లను వెంబడించి, కొన్ని వందలమందిని చంపారు.

ధనికులు కూడా బీదలను ద్వేషించారు. అరిస్టాటిల్ రాసినదాని ప్రకారం, ప్రభు వంశీకులు యిలా శపథం చేసేవాళ్ళు: "సామాన్య ప్రజలకు నేనెప్పుడూ శత్రువుగా వుంటాను, వాళ్లకు నా చేతనైనంత హాని చేస్తాను."

తమ సంపదకీ, బానిసలమీదా, బీదలమీదా తమ పెత్తనాలకీ రక్షణ యివ్వగలిగిన ఏ రాజ్యపు పాలననైనా సరే శిరసావహించేందుకు బానిస యజమానుల్లో చాలామంది సంసిద్ధంగా ఉండేవాళ్ళు. బలం పుంజుకుంటున్న మాసిడోనియన్ రాజ్యంమీద వాళ్ళు తమ ఆశలు నిలుపుకున్నారు.







1. మాసిడోనియా రాజు రెండవ ఫిలిప్ నాణెం. 2. డెమాస్తెనీస్ (క్రీ.పూ. 3వ శతాబ్ది నాటి గ్రీకు విగ్రహం). 3. హెరోనియా యుద్ధ రంగంలో నెలకొల్పబడిన సింహ విగ్రహం

## 4. మాసిడోనియా బలపడడం.

మాసిడోనియా బాల్కన్ ద్వీపకల్పంలో, గ్రీసుకు ఈశాన్య దిశగా వుండేది. దాని జనాభాలో అత్యధిక భాగం రైతులు. అక్కడ ప్రభువులు మాసిడోనియన్ రాజుల అధికారాన్ని గుర్తించేందుకు దాదాపు నిరాకరించి, తమ పెత్తనం నిలుపుకున్నారు.

క్రీ.పూ. 4వ శతాబ్ది మధ్యలో రెండవ ఫిలిప్ రాజు దేశ మంతటిమీదా అధికారం సంపాదించాడు. తద్వారా మాసిడోనియాలో రాజరిక రాజ్యాన్ని* నెలకొల్పాడు.

రెండవ ఫిలిప్ బలమైన సైన్యం కూడగట్టాడు. కాల్బలంలో వున్నది రైతులు. యుద్ధ భూమిలో వాళ్ల ఫలాంక్స్ రూపంలో నిలబడేవాళ్లు. కులీనులు ఆశ్విక దళంలో కొలువు చేసేవాళ్లు.

బలహీనపడిన గ్రీకు నగరాలను ఒకటి తర్వాత ఒకటి ఫిలిప్ వశపరచుకున్నాడు. కొంతమంది ధనిక గ్రీకు బానిస యజమానులు యిష్టపడి అతని ఆధిపత్యం గుర్తించారు. దేశ స్వాతంత్ర్యాన్ని కంటె తమ సంపదనే వాళ్ల ఎక్కువ విలువైనదిగా పరిగణించారు. రెండవ ఫిలిప్ కొందరు నగర వాసులకు లంచం యిచ్చి, తన సైనికులకు నగర ప్రవేశం సంపాదించేవాడు. బంగారు మూటగల గాడిద యే నగరాన్నైనా జయిస్తుందని అతను హాస్యంగా అనేవాడు.

---

* రాజరిక రాజ్యం అంటే ఏక వ్యక్తి పాలన.

**5. గ్రీసుమీద మాసిడోనియా పెత్తనం.**

ఏథెనియన్ సామాన్యులు మాసిడోనియా రాజును పట్టుదలగా ప్రతిఘటించారు. స్వాతంత్ర్యం కొరకు గ్రీకుల పోరాటాన్ని సుప్రసిద్ధ ఏథెనియన్ వక్త డెమాస్తెనీస్ నడిపించాడు. రెండవ ఫిలిప్ దురాక్రమణదారుడని డెమాస్తెనీస్ నిప్పులు గక్కే తన ఉపన్యాసాలలో ఖండించాడు. స్వాతంత్ర్యం కోసం పోరాడండని అతను గ్రీకులకు ప్రబోధించాడు. మాసిడోనియాకు వ్యతిరేకంగా పోరాడడానికి మధ్య గ్రీసులోని కొన్ని నగర రాజ్యాలు ఒక కూటమిగా యేర్పడ్డాయి.

క్రీ.పూ. 338లో, మధ్య గ్రీసులోని హెరోనియా అనే నగరం వద్ద గ్రీకులకూ, మాసిడోనియన్లకూ నిర్ణయాత్మకమైన యుద్ధం జరిగింది. డెమోస్తెనీస్ ఆ యుద్ధంలో సామాన్య ఏథెనియన్ సైనికుల సరసన పోరాడాడు. యుద్ధం దీర్ఘంగా, భీషణంగా జరిగింది. ఏథెనియన్లు మొదట్లో ఫిలిప్ సేనలను వెనక్కి తిప్పికొట్టగలిగారు. కాని, గ్రీకుల కంటె మెరుగైన ఆయుధాలూ, క్రమశిక్షణా గల మాసిడోనియన్ సైన్యం విజయం సాధించింది.

హెరోనియా యుద్ధం తర్వాత దాదాపు గ్రీసు అంతా మాసిడోనియా అధికారం కిందికి వచ్చింది. "యుద్ధంలో మరణించిన వాళ్లతోపాటు గ్రీకు స్వాతంత్ర్యం కూడా హెరోనియాలో సమాధి చేయబడింది" అనేవాళ్లు.

రైతులూ, చేతివృత్తులవాళ్లూ నాశనమవడం, గ్రీసులో వర్గపోరాటాల మూలంగా గ్రీకు నగర రాజ్యాలు బలహీనపడ్డాయి. అంతర్యుద్ధాల మూలంగానూ, గ్రీకు బానిస యజమానుల ద్రోహం మూలంగానూ, గ్రీసు స్వాతంత్ర్యం కోల్పోయింది.

## డెమాస్తెనీస్ జీవిత చరిత్ర
## (ఒక ప్రాచీన రచన సంగ్రహం)

డెమాస్తెనీస్ అనారోగ్యంగా, బలహీనంగా ఉండేవాడు. అనారోగ్యం మూలంగా స్కూలుకి హాజరుకాలేక పోయేవాడు. పెద్దయిన తర్వాత కూడా అతన్ని ఆడంగివాడని అపహాస్యం చేసేవాళ్లు.

అతను గొప్ప వక్త కావాలని కలలు గన్నాడు. అతని ఉచ్చారణలోనే లోపం వుంది. అతనికి ఊపిరి తీసుకోవడం కూడా బరువుగా వుండేది. ఈ రెండు లోపాలనూ, అతని లక్ష్య సాధనకు అడ్డుపడగల యితర లోపాలనూ అతను కఠినమైన అభ్యాసం ద్వారా అధిగమించాడు. అతనికి జంకు యెక్కువ. మొదట, కేకలువేసే జనసమూహాలను చూసి యెంత భయపడేవాడంటే, వెంటనే ఉపన్యాసం ఆపేవాడు. ఈ భయాన్ని అధిగమించడానికి అతను సముద్రం ఒడ్డున, సముద్రం కల్లోలంగా వున్నప్పుడు, తీవ్రమైన గాలి వీచేటప్పుడు, తన ఉపన్యాసాలు సాధన చేసేవాడు. అలల గర్జన అతనికి జనసమూహం చేసే అల్లరిని గుర్తుకు తెచ్చేది. క్రమంగా అతను ఆ ధ్వనికి అలవాటుపడ్డాడు.

దీపం వెలుతురులో రాత్రంతా ఉపన్యాసాలు తయారుచేసుకుంటూ వుండేవాడు. ఉల్లాసంగా, కులాసాగా వుండడానికి, నీళ్లు తప్ప మామూలుగా యేమీ తాగేవాడు కాదు. మాట్లాడేటప్పుడు భుజాలు కుదించే దురలవాటు కూడా అతనికి వుండేది. దీన్ని గుర్తించి అతను యింటికప్పునుండి ఒక ఖడ్గం వ్రేలాడదీసి, ఖడ్గం సరిగా భుజం మీద వుండేటట్లు నిలబడేవాడు. కదిలితే ఖడ్గం పొడుచుకుంటుందనే భయంతో అతను కదలకుండా ఉపన్యాసాలు యివ్వడం సాధన చేశాడు.

? 1. గ్రీసులో చాలామంది రైతులూ, చేతిపనివాళ్లూ ఎందుకు వినాశనానికి గురి అయ్యారు? కనీసం రెండు కారణాలను పేర్కొండి. 2. రాజరిక రాజ్యాన్ని గ్రీకులు ఏమని పిలిచేవాళ్లు? మీకు తెలిసిన ప్రాచీన రాజ్యాల్లో వేటిని రాజరిక రాజ్యాలని అనవచ్చు, వేటిని అనకూడదు? 3. గ్రీసుపై పెత్తనం సంపాదించుకోవడంలో మాసిడోనియా ఎందుకు విజయం పొందింది? 4. హెరోనియా యుద్ధం ఎన్నేళ్ల క్రితం జరిగింది? సలమిన్ యుద్ధం జరిగిన తర్వాత ఎన్నేళ్లు గడిచాక హెరోనియా యుద్ధం జరిగింది? 5. డెమాస్తెనీస్ ఏ విషయంలో ప్రసిద్ధుడు?

## §43. అలెగ్జాండర్ ది గ్రేట్ సామ్రాజ్య వృద్ధి, విచ్ఛిత్తి

(మాప్‌లు 6, 7)

గ్రీసుపై జరిపిన యుద్ధంలో పర్షియన్ రాజ్యం ఎందుకు ఓటమి పాలైందో జ్ఞాపకం చేసుకోండి (§ 34).

1. తూర్పు దండయాత్రకు సన్నాహాలు.

గ్రీసును జయించిన తర్వాత రెండవ ఫిలిప్ పర్షియామీదికి దండెత్తడానికి సన్నాహాలు ప్రారంభించాడు. మాసిడోనియన్, గ్రీసు బానిస యజమానులు పర్షియన్ రాజుల అపారమైన ధనరాసులనూ, సారవంతమైన భూములనూ, అసంఖ్యాకమైన బానిసలనూ పట్టుకోవచ్చునని లెక్కించుకున్నారు. బీద గ్రీకులు కూడా ఫిలిప్ సైన్యంలో చేరారు. తమనూ, తమ కుటుంబాలనూ పోషించుకోడానికి సైనికులుగా లభించే జీతం తప్ప వాళ్లకు మరేమీ లేదు.

దండయాత్రకు సన్నాహాలు జరుగుతుండగా రెండవ ఫిలిప్ కుట్రదారులచేత చంపబడ్డాడు. ఈ కుట్రకు బహుశా పర్షియన్లు ఏర్పాట్లు చేసివుండవచ్చు. అతని 20 యేండ్ల కుమారుడు అలెగ్జాండర్ సింహాసనమెక్కి మాసిడోనియాకు రాజు అయ్యాడు. అలెగ్జాండర్ చాలా చురుకైనవాడు, ధైర్యశాలి; కాని చాలా క్రూరుడూ, కోపిష్ఠి. అతనికి అసాధారణమైన సహజ సామర్థ్యాలు వుండేవి. గొప్ప విద్యాభ్యాసం లభించింది. అతని గురువు అరిస్టాటిల్.

2. మధ్యధరా సముద్ర తూర్పు తీరాన్ని జయించడం.

క్రీ.పూ. 334లో మాసిడోనియా రాజు అలెగ్జాండర్ (లేక అలెగ్జాండర్ ది గ్రేట్) తన సైన్యాన్ని ఆసియా మైనర్‌లోకి నడిపించాడు. రెండు యుద్ధాలు జరిగాయి, పర్షియన్లు పూర్తిగా ఓడిపోయారు, ఆసియా మైనర్ వశమయింది. తరువాత అలెగ్జాండర్ దక్షిణ దిశగా, మధ్యధరా తీరం వెంబడి ముందుకు సాగాడు (ఈ యుద్ధానికి సంబంధించిన ప్రాచీన చిత్రాన్ని కలర్ ఫొటో 15లో చూడగలరు).

తనను ప్రతిఘటించిన ప్రజానీకాన్ని అతను నిర్దాక్షిణ్యంగా తుదముట్టించాడు, లేదా బానిసలుగా అమ్మివేశాడు.

ఉదాహరణకు, టైర్ నగరం పట్టుబడిన తర్వాత 8,000 మందిని చంపమనీ, మరొక 30,000 మందిని బానిసలుగా అమ్మేయమనీ ఆజ్ఞాపించాడు.

తీర నగరాలలో అత్యధిక భాగం పర్షియన్ రాజు పీడననుండి విముక్తి చెందడానికి తహతహలాడుతూ వుండేవి. అవి మనస్ఫూర్తిగా అలెగ్జాండర్ ఆధిపత్యాన్ని గుర్తించాయి. అతను ఒక్క యుద్ధం కూడా లేకుండానే ఈజిప్టును లోబరచుకొని, పూజారులచేత దేవుడుగా ప్రకటింపబడ్డాడు.

## 3. పర్షియన్ సామ్రాజ్య పతనం.

ఈజిప్టునుండి తన సైన్యాన్ని అలెగ్జాండర్ మెసొపొటేమియా వైపు నడిపించాడు. పర్షియన్ రాజైన మూడవ డరియస్ పెద్ద సైన్యాన్ని సమకూర్చుకున్నాడు. అతని సైన్యంలో పెద్ద ఆశ్విక దళమూ, యేనుగులూ, రథాలూ వుండేవి. యుద్ధ సమయంలో శత్రు సైనికులను ఊచకోతకోసే పదునైన కొడవండ్లు ఆ రథచక్రాలకు అమర్చబడ్డాయి. అయితే, మూడవ డరియస్ సైన్యంలో పర్షియన్లచేత ఓడింపబడిన ప్రజలకు చెందిన సైనికులు చాలామంది ఉన్నారు. పర్షియన్ రాజు కోసం యుద్ధం చెయ్యడం వాళ్లకి యిష్టం లేదు.

ఉభయ సైన్యాలూ టైగ్రిస్ నదీ తీరాన వున్న గౌగమెలా అనే చిన్న పట్టణం వద్దవున్న విస్తారమైన మైదానంలో తలపడ్డాయి (ఈ పేజిలో వున్న చిత్రం 2 చూడండి). మూడవ డరియస్ తన రథాలతో దాడిచేయించాడు. ఈ యెత్తుగడ విఫలమైంది. ఎందుకంటే సారథుల్లో అధిక భాగం మాసిడోనియన్ విలుకాండ్ర బాణాలకు కూలిపోయారు. అలెగ్జాండర్ తన సైనికులకు వేగంగా వచ్చే రథాలకు దారి వదలి పక్కన నిలబడాలని ఉత్తరువు ఇచ్చాడు.








1. అలెగ్జాండర్ ది గ్రేట్ శిల్పపు శిరోభాగం. 2. గౌగమెలా యుద్ధం. 3. గ్రీకులకీ, పర్షియన్లకీ మధ్య బాహాబాహీ పోరాటం (ఒక పాల రాతి శవపేటికమీది ఉబ్బెత్తు చిత్రం)

అలెగ్జాండర్ తన ఆశ్విక దళాన్ని పర్షియన్ సైన్యపు మధ్య భాగంలోకి, డరియస్ వున్న చోటుకి నడిపించాడు. అదే సమయంలో ఫలాంక్స్ కూడా తన మార్గంలో వున్న ప్రతిదాన్నీ ధ్వంసం చేస్తూ దాడిచేసింది. మొదట పారిపోయిన వాళ్లలో డరియస్ ఒకడు. అతని సైన్యాలు అతన్ని అనుసరించాయి. తర్వాత త్వరలోనే మూడవ డరియస్‌ను అతని ఆస్థాన ప్రభువులు హత్యచేశారు.

బృహత్తరమైన పర్షియన్ సామ్రాజ్యం పేకమేడలా కూలిపోయింది. శత్రువు కొట్టిన తీవ్రమైన తొలి దెబ్బలకే అది పతనమైంది.

**4. మధ్య ఆసియాలోనూ, భారత దేశంలోనూ జరిగిన యుద్ధాలు.**

వెనక పర్షియన్ సామ్రాజ్యంలో భాగంగా వున్న విడి దేశాలు మాసిడోనియన్లను ప్రతిఘటించడం కొనసాగించాయి. మధ్య ఆసియా ప్రజానీకపు ప్రతిఘటన చాలా తీవ్రంగా సాగింది. మూడు సంవత్సరాల పోరాటం తర్వాత, వేలకొలది ప్రజలను దారుణంగా హతమార్చిన తర్వాత మాత్రమే మాసిడోనియన్లు స్వల్ప భూభాగాన్ని పట్టుకోగలిగారు.

మధ్య ఆసియానుంచి భారత దేశాన్ని జయించడానికి అలెగ్జాండర్ తన సైన్యాలతో పురోగమించాడు. కాని కష్టభూయిష్ఠమైన నిరంతర యుద్ధాలతో అతని సైనికులు అలిసిపోయారు. భారత ప్రజలు ఆక్రమణదారులపైన సాహసిక పోరాటం జరిపారు. యావత్ ప్రపంచాన్నీ జయించాలని అలెగ్జాండర్ కలలు గన్నాడు. కాని, దండయాత్రను కొనసాగించడానికి అతని సకల ప్రయత్నాలూ వ్యర్థమయ్యాయి. సైనికులు యుద్ధం చేయడానికి నిరాకరించారు. క్రీ.పూ. 325లో యింకా దేశాలు జయించాలన్న తన పథకాలను అలెగ్జాండర్ విరమించుకొని, తిరిగిపోవలసివచ్చింది.

**5. అలెగ్జాండర్ సామ్రాజ్యం. దాని విచ్ఛిత్తి.**

మాసిడోనియన్ దండయాత్రల ఫలితంగా బాల్కన్ ద్వీపకల్పంనుంచి సింధు నదిదాకా వ్యాపించిన బ్రహ్మాండమైన సామ్రాజ్యం యేర్పడింది. అలెగ్జాండర్ మాసిడోనియాకు తిరిగి రాకుండా, బాబిలోన్‌లో ఉండిపోయి, దాన్నే తన రాజధానిని చేసుకున్నాడు. పర్షియన్ రాజులను అనుకరిస్తూ అతను స్వర్గతుల్యమైన విలాసాలలో మునిగిపోయాడు. ప్రభువులు తన యెదుట సాష్టాంగపడాలని ఆజ్ఞాపించాడు.

క్రీ.పూ. 323లో అలెగ్జాండర్‌కు జ్వరం తగిలి హఠాత్తుగా మరణించాడు. అతని మృత దేహాన్ని పూడ్చిపెట్టీ పూడ్చిపెట్టక ముందే అతని సేనానులు అధికారం కొరకు పోరాడడం ప్రారంభించారు. బ్రహ్మాండమైన సామ్రాజ్యం అనేక చిన్న రాజ్యాలుగా విచ్ఛిన్నమైంది. మాసిడోనియా, ఈజిప్టు, సిరియా ఈ మూడూ అత్యంత ముఖ్యమైన రాజ్యాలు. అలెగ్జాండర్ సేనాధిపతులు రాజులయ్యారు.

పశ్చిమాసియా ప్రజలు మాసిడోనియన్, గ్రీకు బానిస యజమానుల పెత్తనం కింద పడిపోయారు.

## అలెగ్జాండర్ జీవిత చరిత్రలో కొంత భాగం

అలెగ్జాండర్‌ను గురించి అనేక కథలు మనకు వినవస్తున్నాయి. ఈ కథల్లో అత్యధిక భాగాన్ని గ్రీకు చరిత్రకారుడు ప్లుటార్క్ సంకలనం చేసి ఒక పెద్ద జీవిత చరిత్ర తయారుచేశాడు.

రెండవ ఫిలిప్ విజయాలను గురించి విన్న యువ అలెగ్జాండర్‌కి ఈర్ష్య కలిగింది. "నాన్న అన్ని దేశాలూ

ఆక్రమించేస్తాడు. నేను సాధించేందుకు ఘనమైనదీ, ఉజ్వలమైనదీ యింకేమీ మిగలదు'' అని అతను వాపోయాడు.

ఆసియా మైనరులోని గార్డియమ్ అనే నగరంలో ఒక రథానికి ఒక చిక్కు ముడి కట్టబడింది. ఆ ముడి విప్పినవాడు ఆసియా కంతటికీ ప్రభువౌతాడని ప్రజలు అనేవాళ్ళు. దాన్ని విప్పడానికి చాలామంది ప్రయత్నించి, విఫలం చెందారు. ఆ ముడి ''గార్డియన్ ముడి'' అని ప్రసిద్ధి కెక్కింది. దాన్ని విప్పడానికి అలెగ్జాండర్ కూడా ప్రయత్నించి విఫలుడయ్యాడు. అప్పుడతను తన ఖడ్గం బయటికి లాగి, దాన్ని కోసివేశాడు. ''గార్డియన్ ముడిని ఖండించడం'' అనే నుడికారం ఈవిధంగా పుట్టింది. ఏదైనా చిక్కు సమస్యను పరిష్కరించడం అని దాని అర్థం.

మాసిడోనియన్ సైనికులు ఒక యెడారిని దాటేటప్పుడు నీళ్ల కొరకు చాలా బాధపడ్డారు. గుక్కెడు నీళ్ళు వుంటే అవి రాజుకు యిచ్చారు. తన సహచరులు దప్పికతో ఆ నీళ్ల వైపు చూస్తూ వుండడం గమనించి అలెగ్జాండర్ వాటిని తాగడానికి నిరాకరించి ''నేను ఒక్కణ్ణే తాగితే, నా సహచరులు శక్తి కోల్పోతారు'' అన్నాడు.

పర్షియాలో కొల్లగొట్టిన వస్తువుల్లో విలువైన చిన్న పెట్టె ఒకటి వుంది. అలెగ్జాండర్ దగ్గర వున్న మిక్కిలి విలువైన వస్తువును అందులో పదిలపరచుకొమ్మని అతని మిత్రులు సూచించారు. అలెగ్జాండర్ ''ఇలియడ్'' మహా కావ్యాన్ని అందులో పెడతానని చెప్పాడు.

తన సన్నిహిత సహచరులలో యిద్దరి రాజ భక్తిని గురించి అలెగ్జాండర్‌కి సందేహం కలిగింది. వాళ్లలో ఒకడిని అలెగ్జాండర్ మహా దారుణమైన చిత్రహింసలకు గురిచేయించి, తరువాత చంపించాడు. చిత్రహింసలు తాను స్వయంగా చూస్తూ కూర్చున్నాడు. రెండవ అనుమానితుడిని, ఆ ముసలివాడు రెండవ ఫిలిప్‌కు యెంతో విశ్వసనీయమైన సేవకుడుగా, మిత్రుడుగా వుండేవాడని స్పష్టంగా తెలిసి కూడా, చంపించాడు.

? **1.** మాసిడోనియా రాజు అలెగ్జాండర్ పర్షియాపై జరిపిన దండయాత్రల్లో గ్రీకులు ఎందుకు పాల్గొన్నారు? **2.** మాసిడోనియన్ సైన్యాలు ఏ దేశాల గుండా పురోగమించాయో వాటిని మాప్ 6లో చూపించండి. **3.** పర్షియా రాజ్యం మాసిడోనియన్ దాడిని ఎందుకు తిప్పికొట్టలేకపోయింది? **4.** తూర్పు మధ్యధరా తీర ప్రాంతంలో క్రీ.పూ. 4–3 శతాబ్దాల్లో ఏ రాజ్యాలు తలెత్తాయి? క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి గ్రీకు రాజ్యాలకీ, వాటికీ మధ్య వున్న తేడా యేమిటి? **5.** మాసిడోనియన్ సైన్యపు దండయాత్ర ఎన్ని సంవత్సరాలు సాగింది? హెరోనియా యుద్ధం తర్వాత ఎన్ని సంవత్సరాలకు మాసిడోనియన్ సైన్యపు తూర్పు దండయాత్ర మొదలైంది? **6.** అలెగ్జాండర్ ది గ్రేట్ స్వభావాన్ని గురించి వివరించండి.

# § 44. క్రీ.పూ. 4వ–2వ శతాబ్దాల చివర తూర్పు మధ్యధరా తీర ప్రాంతపు ఆర్థిక వ్యవస్థ, సంస్కృతి

(మాప్ 7)

క్రీ.పూ. 5వ–4వ శతాబ్దాల్లో విజ్ఞానశాస్త్ర అభివృద్ధికి గ్రీకు పండితులు చేసిన సేవను జ్ఞాపకం చేసుకోండి (§ 41; 1, 2).

1. మాసిడోనియన్ దండయాత్రల అనంతరం ఆసియా మైనర్, ఈజిప్టులలో బానిస యాజమాన్య వ్యవస్థ అభివృద్ధి.

మాసిడోనియన్, గ్రీకు సైనికులు తూర్పు దేశాల్లోని సారవంతమైన భూములను ఆక్రమించుకొని, రైతులనూ, బానిసలనూ దోచుకున్నారు. గ్రీకు, మాసిడోనియన్ చేతివృత్తులవాళ్లూ, వర్తకులూ సైన్యం వెంట ఆసియా మైనర్‌కీ, ఈజిప్టుకీ వెళ్లారు. వాళ్లు అక్కడ వర్తకాన్ని చేజిక్కించుకొని, భారీ కార్ఖానాలనూ, నౌకా నిర్మాణ కేంద్రాలనూ నెలకొల్పారు.

తూర్పు దేశాల్లో పాత నగరాలు మరింత పెరిగాయి, మరెన్నో కొత్త నగరాలు తలెత్తాయి. సముద్ర మార్గాల, ఖండపు వెనుకతట్టు ప్రాంతాలనుంచి వచ్చే బిడారి మార్గాల కూడలి స్థానాల్లో నెలకొన్న నగరాలు ప్రత్యేకించి మరింతగా




1. ఈజిప్టులోని అలెగ్జాండ్రియా నగరపు ప్లాను







2. అలెగ్జాండ్రియాలోని లైట్‌హౌస్ (పునరుద్ధరణ). ఇది ప్రపంచపు వింతల్లో ఒకటిగా పరిగణింపబడింది. దాని కాంతి 100 కిలోమీటర్లకి పైగా దూరంవరకు కనిపించేది. ఆ లైట్‌హౌస్ ఒక భూకంపంలో నాశనమైంది. ఈ చిత్రం ప్రాచీన చిత్రాల ఆధారంగా పునరుద్ధరింపబడింది. 3. అలెగ్జాండ్రియాలో తయారుచెయ్యబడిన క్రీ.పూ. 3వ శతాబ్ది నాటి ఒక మాప్. మాప్‌మీద బూడిద రంగులో చూపబడిన ప్రాంతం గ్రీకుల ఊహలో ఆయా ఖండాల రేఖా చిత్రం. నల్ల గీతలు కచ్చితమైన తీరాలను తెలియజేస్తాయి. 4. కోరింతియన్ స్తంభాల అగ్రభాగం. అది పెద్ద ఆకులతో కూడిన పొదని పోలివుంది. దీన్ని డోరిక్, అయోనిక్ స్తంభాలతో సరిపోల్చండి (పేజి 186 లోని 2వ చిత్రం చూడండి)

పెరిగాయి. ప్రాచీన గ్రీకులు మహాసముద్రాల్లో ప్రయాణం చేస్తూ, వందలాది టన్నుల సరుకును రవాణాచేసే భారీ నౌకలను నిర్మించారు. ఆ నౌకలను కొన్ని వందలమంది బానిసలు తెడ్లువేసి నడిపేవారు.

దాదాపు ప్రతి నగరంలోనూ బానిస మార్కెట్లు వుండేవి. తూర్పు మధ్యధరా సముద్ర తీర ప్రాంతంలో బానిసల

సంఖ్య గణనీయంగా పెరిగింది. బానిస యజమానుల వర్గం అత్యధిక భాగం గ్రీకులతోనూ, మాసిడోనియన్లతోనూ కూడి వుండేది. స్థానిక జనాభాలోని బానిస యజమానులు గ్రీకులను అనుకరిస్తూ, వారి భాషనీ, ఆచారాలనీ అలవరచుకున్నారు. హెలెనీజ్ అనే గ్రీకు పదానికి అక్కడ బానిస యజమాని అన్న అర్థం రూఢమైంది.

**2. ఈజిప్షియన్ అలెగ్జాండ్రియా.**

నైలు నది డెల్టాలో అలెగ్జాండర్ ది గ్రేట్‌చేత నిర్మింపబడిన అలెగ్జాండ్రియా ప్రపంచంలో కెల్ల మిక్కిలి పెద్ద నగరమూ, క్రీ.పూ. 3వ శతాబ్దిలో ఈజిప్షియన్ రాజ్యపు రాజధానీ అయింది. నైలుమీదుగా ఈజిప్టునుంచి ధాన్యమూ, రాతకు ఉపయోగించే పాపిరస్, నూబియానుంచి బంగారమూ, దంతమూ ఎగుమతి అయ్యేవి. నైలుకీ, ఎర్ర సముద్రానికీ మధ్య ఒక కాలువ తవ్వబడింది. అలెగ్జాండ్రియానుంచి పర్షియన్ సింధుశాఖకీ, ఆపైన భారత దేశానికీ బిడారి మార్గాలు వుండేవి. సందడిగా వుండే అలెగ్జాండ్రియా మార్కెట్లలో డజన్లకొలది భాషలు వినిపించేవి.

నగరానికి యెదురుగా వున్న ద్వీపంలో 120 మీటర్ల యెత్తువున్న లైట్ హౌస్ (దీపస్తంభం) నిర్మింపబడింది. అది రాత్రిపూట ఓడలకు దారి చూపేది. అలెగ్జాండ్రియాలో వీధులు సరళ రేఖల్లా వుండేవి. వీధులకు బండ పరుపు వేయబడింది. అనేక పార్కులూ, నాటకశాలలూ, రాజసౌధాలూ, ఒక ప్రసిద్ధమైన మ్యూజియం వుండేవి. మ్యూజియం అంటే కళాధిదేవతల గుడి. (గ్రీసులో మ్యూజెస్ అని ఎవరెవరిని అనేవారో జ్ఞాపకం చేసుకోండి; §29; 2.) గ్రహ నక్షత్రాలను గమనించడానికి ఒక ఖగోళ పరిశోధనాలయమూ, పెద్ద గ్రంథాలయమూ మ్యూజియంలో వుండేవి.

**3. క్రీ.పూ. 3వ–2వ శతాబ్దాల్లో విజ్ఞానశాస్త్ర అభివృద్ధి.**

అలెగ్జాండ్రియాలోనూ, తూర్పు మధ్యధరా తీరంలోని యితర ముఖ్య నగరాల్లోని గ్రంథాలయాల్లో గ్రీకు పండితులూ, ప్రాచ్య పండితులూ రాసిన గ్రంథాలు వుండేవి. అలెగ్జాండ్రియా గ్రంథాలయంలో పార్చ్‌మెంటుతోనూ, పాపిరస్‌తోనూ తయారుచేసిన 700 రాతప్రతులు వుండేవి. పార్చ్‌మెంట్ అంటే జాగ్రత్తగా తయారుచెయ్యబడిన లేగదూడల, గొర్రె పిల్లల చర్మంతో చేసిన పత్రం. ఆసియా మైనర్‌లోని పెర్గమమ్ యీ చర్మ పత్రాల తయారీకి కేంద్రం. చర్మ పత్రం రాతకి అనువైనది, ఎక్కువ కాలం మన్నుతుంది, కాని చాలా ఖరీదు. ఒక పెద్ద గ్రంథానికి చర్మ పత్రాలు తయారుచెయ్యాలంటే ఓ పెద్ద మంద లేగదూడలు అవసరమయ్యేవి.

గ్రంథాలయంలో ప్రశాంతంగా కూర్చుని పలువురు పండితులు రాతప్రతులను అధ్యయనంచేసేవాళ్ళు. తూర్పు, పశ్చిమ దేశాల శాస్త్రీయ విజ్ఞాన సమ్మేళనం విజ్ఞానశాస్త్ర, ప్రత్యేకించి గణితశాస్త్ర, ప్రకృతి విజ్ఞానశాస్త్ర, ఖగోళ శాస్త్రాల యితోధికాభివృద్ధికి దోహదంచేసింది. క్రీ.పూ. 3వ–2వ శతాబ్ది నాటి ప్రాచీన ప్రపంచంలో తూర్పు మధ్యధరా సముద్ర తీర దేశాల విజ్ఞానశాస్త్రాభివృద్ధి శిఖర స్థాయిని చేరుకుంది.

క్రీ.పూ. 3వ శతాబ్దిలో యూక్లిడ్ అనే సుప్రసిద్ధ గణితశాస్త్రజ్ఞుడు అలెగ్జాండ్రియాలో పనిచేసేవాడు. రేఖా గణితానికి అతను యెంతో గొప్ప సేవ చేశాడు. దాని ప్రాముఖ్యం యీనాటికీ తగ్గలేదు.

అలెగ్జాండ్రియాకి చెందిన ఖగోళశాస్త్రజ్ఞులు మన భూమండలపు పరిమాణాన్ని యెంతో ఖచ్చితంగా నిర్ణయించారు. ఒక గ్రీకు ఖగోళశాస్త్రజ్ఞునికి ఒక అద్భుతమైన భావం తోచింది. భూమి తన యిరుసు చుట్టూ, సూర్యుని చుట్టూ తిరుగుతున్నదని అతను అన్నాడు. కాని అతను దాన్ని రుజువుచేయలేకపోయాడు. ఇతర పండితులకు అతను అవహేళన పాత్రుడయాడు. అతని గొప్ప ఆవిష్కరణ తిరస్కరింపబడి, చాలా కాలంపాటు పూర్తిగా విస్మరింపబడింది.



1



2

1. నికే దేవత విగ్రహం (క్రీ.పూ. 3వ శతాబ్ది). 2. ఒక వృద్ధుడు (క్రీ.పూ. 1వ శతాబ్ది). 3. దేవతలకీ, రాక్షసులకీ మధ్య జరిగిన యుద్ధాన్ని తెలియచేసే ఒక ఉబ్బెత్తు చిత్రం. ఇది పెర్గమమ్‌లో దొరికింది. శిల్పంలో రాక్షసులపై జీయస్ విజయం చిత్రించబడింది



3

4. క్రీ.పూ. 3వ–2వ శతాబ్దాల్లో గ్రీసులోనూ, తూర్పు మధ్యధరా తీర దేశాల్లోనూ కళలు.

ఆసియా మైనర్, ఈజిప్టులమీద మాసిడోనియన్ దండయాత్ర దరిమిలా గ్రీకు వాస్తుశిల్పులు అక్కడ ఒలింపియన్ దేవుళ్లకి దేవాలయాలు, థియేటర్లు, భవనాలు నిర్మించనారంభించారు. దివ్యమైన రాజ భవనాల నిర్మాణానికి సరళమైన డోరిక్ స్తంభాలు అప్పుడిక యెంతమాత్రం అనువుగా కనిపించలేదు. కాగా క్రీ.పూ. 4వ–3వ శతాబ్దాల్లో కోరింథియన్ స్తంభాలు అనబడేవి విస్తృత వ్యాప్తిలోకి వచ్చాయి (203వ పేజిలో చిత్రం 4 చూడండి).

క్రీ.పూ. 3వ–2వ శతాబ్దాల్లో గ్రీకు శిల్పులు అనేక ప్రఖ్యాత కళాఖండాలు సృష్టించారు. వాటిలో విజయాధిదేవత నీకె విగ్రహం ఒకటి. గాలిలో రెక్కల దేవత నీకె విసురైన కదలికనీ, ఆమె దుస్తులు రెపరెపలాడటాన్నీ రూపొందించడంలో ఆ శిల్పి సఫలీకృతుడయ్యాడు.

క్రీ.పూ. 3వ–1వ శతాబ్దాల శిల్పులు మానవ అనుభూతులను చిత్రించడానికీ, మనుషుల ఆకారాన్ని సజీవంగా చూపించడానికీ ప్రయత్నించారు. ఏథెనియన్ దేశభక్తుడైన డెమాస్తెనీస్ విగ్రహం ఆ మహా వక్త నిజ రూపం. అందులో ఆయన బక్కగావున్న ఒక వృద్ధుడుగా చిత్రింపబడ్డాడు. తన మాతృ నగర భవిష్యత్తును గురించి ఆయన తీవ్ర ఆందోళనను ఆ విగ్రహం వ్యక్తంచేస్తుంది (పేజి 196 చూడండి).

గ్రీకు కళ అభివృద్ధి చెందిన కొత్త కేంద్రాల్లో పెర్గమమ్ ఒకటి. ఒలింపియన్ దేవతలకీ, రాక్షసులకీ మధ్య జరిగిన యుద్ధం సుప్రసిద్ధమైన ఉబ్బెత్తు కుడ్య శిల్పాల్లో చిత్రింపబడినది అక్కడే. ఆ ఉబ్బెత్తు కుడ్య శిల్పం పొడవు సుమారు 130 మీటర్లు. విగ్రహాలు 3 మీటర్ల ఎత్తు వున్నాయి. ఆ మహా శిల్పం బాగా శిథిలమైనప్పటికీ భీషణమైన ఆ దేవ దానవ యుద్ధాన్ని – పోరాడుతున్న ప్రత్యర్థుల దృఢ కాయాలనూ, ఓడింపబడ్డ శత్రువుల వికల ముఖ భంగిమలనూ – యెంతో భావోద్విగ్నంగా వ్యక్తంచేస్తోంది.

తూర్పు దేశాల్లో మాసిడోనియన్ దండయాత్రలు తూర్పు మధ్యధరా తీర ప్రాంతంలో ఆర్థిక వ్యవస్థ, సంస్కృతుల అభివృద్ధికి దోహదంచేశాయి. కానైతే, స్థానిక ప్రజల దృష్టిలో మాత్రం మాసిడోనియన్, గ్రీకు విజేతలు ద్వేషింపదగ్గ శత్రువులు. ఆ దండయాత్రల ఫలితంగా యేర్పడ్డ రాజ్యాలు అస్థిరంగా వుండేవి. వాటి మధ్య తరచుగా జరిగే యుద్ధాల మూలంగా అవి మరింత బలహీనపడ్డాయి. అందుకే ఆ రాజ్యాలు శక్తివంతులైన విజేతలను – పశ్చిమంనుంచి వాళ్లపై దాడిచేసిన రోమన్లను – ప్రతిఘటించలేకపోయాయి.

? **1.** మాసిడోనియన్ దండయాత్రల ఫలితంగా తూర్పు మధ్యధరా తీర ప్రాంతపు ఆర్థిక వ్యవస్థలో ఎలాంటి మార్పులు సంభవించాయి? **2.** పాఠాన్నీ, నగరపు ప్లానునీ, పాఠ్యగ్రంథంలోని చిత్రాలనూ తిరగేసి, అలెగ్జాండ్రియా నగరాన్ని వర్ణించండి. గ్రీకు నగరాలతో, ప్రాచీన తూర్పు రాజ్యాల నగరాలతో అలెగ్జాండ్రియాకి వున్న సామ్యం యేమిటి? దాని కొత్త లక్షణాలు యేమిటి? **3.** ప్రాచీన తూర్పుకి చెందిన ఏ ప్రసిద్ధ గ్రంథాలయం గురించి మీకు తెలుసు? దాన్ని అలెగ్జాండ్రియా గ్రంథాలయంతో సరిపోల్చండి (§ 17; 3). ఈ తులనాత్మక పరిశీలన ద్వారా సంస్కృతి అభివృద్ధిని గురించి చెయ్యగల నిర్ధారణలు యేమిటి? **4.** క్రీ.పూ. 3వ–2వ శతాబ్ది నాటి గ్రీకు కళకీ, క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి గ్రీకు కళకీ మధ్య వున్న భేదం యేమిటి? ఆ రెండింటిలో మీకు యేది యెక్కువ నచ్చుతుంది? ఎందుకు?

# ప్రాచీన గ్రీసు చరిత్రను గురించిన మీ పరిజ్ఞానాన్ని సరిచూసుకోండి

| | |
|---|---|
| గ్రీసులో అత్యంత ప్రాచీన కాలంలో సైతం జనం నివసిస్తూండేవారు. క్రీ.పూ. 2వ సహస్రాబ్ది చివర గ్రీకులు పెద్ద యెత్తున ఒక చోటునుంచి మరో చోటుకి తరలివెళ్లారు. | క్రీ.పూ. 2వ సహస్రాబ్ది చివర గ్రీకు తెగలు తమ నివాస స్థానాన్ని ఎలా మార్చుకున్నారు? క్రీ.పూ. 1వ సహస్రాబ్ది మొదట్లో గ్రీకులు ఎక్కడ నివసిస్తూవుండేవారో మాప్ 5లో చూపండి. ఆ కాలంలో గ్రీకు నాగరికత క్షీణించడానికి గల కారణాలు యేమిటి? ఈ క్షీణత ఎలా వ్యక్తమైంది? |
| ఆదిమ సమష్టి వ్యవస్థనుండి బానిస యాజమాన్య వ్యవస్థకు పరివర్తన గ్రీసులో క్రీ.పూ. 11వ–9వ శతాబ్దాల్లో సంభవించింది. | హోమర్ యుగం నాటి గ్రీసులో ఆదిమ సమష్టి వ్యవస్థకు సంబంధించినవి యేమి మిగిలాయి? బానిస యాజమాన్య వ్యవస్థ ఆవిర్భావాన్ని సూచించే అంశాలు యేమిటి? మీ వాదనను నిరూపించేందుకు ఉదాహరణలు యివ్వండి. బానిస యాజమాన్య వ్యవస్థలోకి గ్రీకుల పరివర్తనకి గల ప్రధాన కారణం యేమిటి? ఈ పరివర్తన ఈజిప్టు, మెసపొటేమియాల్లో కంటె గ్రీసులో ఎందుకు ఆలస్యంగా జరిగింది? |
| గ్రీసులో బానిస యాజమాన్య వ్యవస్థ స్థాపనా, రాజ్య ఆవిర్భావమూ క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల్లో జరిగాయి. | క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల్లో గ్రీసులో ఏ రాజ్యాలు ఉద్భవించాయి? మాప్‌లో వాటి భూ ప్రాంతాన్ని చూపించండి. అవి ఎందుకు తలెత్తాయి? క్రీ.పూ. 6వ శతాబ్దిలో ప్రభువర్గానికి (అరిస్టోక్రాట్స్) వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో సామాన్యులు (డెమోస్) ఏ విజయాలు సాధించారు? |
| క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల్లో చాలామంది గ్రీకులు తమ దేశాన్ని వదిలి, కొత్త ప్రాంతాల్లో స్థిరపడ్డారు. | క్రీ.పూ. 8వ–6వ శతాబ్దాల్లో గ్రీకు వలసలు ఎందుకు ఏర్పడ్డాయో వివరించి, అవి ఎక్కడ ఏర్పడ్డాయో మాప్‌లో చూపించండి. వలసల స్థాపనకి కనీసం మూడు కారణాలు పేర్కొనండి. గ్రీసుకీ, ఏ దేశాల్లో వలసలు నెలకొల్పబడ్డాయో ఆ దేశాలకీ గ్రీసు వలసల స్థాపన ప్రాముఖ్యం యేమిటి? |
| క్రీ.పూ. 5వ శతాబ్దిలో బానిస యాజమాన్య వ్యవస్థ గ్రీసులో మరింతగా అభివృద్ధి చెందింది. | క్రీ.పూ. 5వ శతాబ్దిలో గ్రీసులో బానిస యాజమాన్య వ్యవస్థ ఎలా అభివృద్ధి చెందింది? బానిస యాజమాన్య వ్యవస్థ అభివృద్ధికి గ్రీకు-పర్షియన్ యుద్ధ ప్రాముఖ్యం యేమిటి? బానిస యజమానులకి వ్యతిరేకంగా బానిసలు ఎలా పోరాడారు? |
| క్రీ.పూ. 5వ శతాబ్దిలో బానిస యాజమాన్య ప్రజాస్వామ్యం తన శిఖర స్థాయిని అందుకుంది. | ఏథెన్స్‌లో సామాన్యులు అధికారం ఎలా సంపాదించుకున్నారు? ప్రాచీన గ్రీసులో ప్రజాస్వామ్యాన్ని బానిస యాజమాన్య ప్రజాస్వామ్యం అని ఎందుకు అంటారు? |

| | |
|---|---|
| క్రీ.పూ. 5వ శతాబ్ది హెలెనీజ్ (గ్రీకు) సంస్కృతి వికాస యుగం. | క్రీ.పూ. 5వ శతాబ్దిలో గ్రీకు కళా వికాసాన్ని సూచించే మూడు నాలుగు చిత్రాలు ఎంపికచెయ్యండి. విజ్ఞానశాస్త్రంలో గ్రీకులు ప్రవేశపెట్టిన కొత్త అంశాలు యేమిటి? గ్రీకు సంస్కృతి అభివృద్ధి బానిస యాజమాన్యంతోనూ, బానిస యాజమాన్య ప్రజాస్వామ్యంతోనూ ఏవిధంగా ముడిపడి వుండేది? క్రీ.పూ. 5వ శతాబ్దిలో గ్రీకు సంస్కృతికి ఏథెన్స్ ఎందుకు కేంద్రం అయింది? |
| క్రీ.పూ. 4వ శతాబ్దిలో గ్రీకు నగర రాజ్యాల క్షీణ దశ మొదలై, అవి తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోయాయి. | క్రీ.పూ. 5వ శతాబ్ది అంతంలో – 4వ శతాబ్దిలో గ్రీసు బలహీనపడేందుకు కారణాలు యేమిటి? గ్రీకులు పర్షియన్లపైన ఎందుకు విజయం సాధించారు, మాసిడోనియన్లమీద ఎందుకు ఓడిపోయారు? మీ వాదాన్ని నిరూపించండి. |
| మాసిడోనియన్ దండయాత్రల పర్యవసానంగా తూర్పు మధ్యధరా సముద్ర తీర ప్రాంతంలో క్రీ.పూ. 4వ శతాబ్ది అంతంలో గ్రీకు-మాసిడోనియన్ రాజరిక రాజ్యాలు ఏర్పడ్డాయి. | పుస్తకంలో క్రీ.పూ. 4వ శతాబ్దిలో జరిగిన ఏ రెండు యుద్ధాలు వర్ణింపబడ్డాయి? వాటిలో ఒక్కొక్కదాని ప్రాముఖ్యం యేమిటి? క్రీ.పూ. 4వ శతాబ్ది చివర – 3వ శతాబ్ది మొదట ఏర్పడిన మిక్కిలి పెద్ద గ్రీకు-మాసిడోనియన్ రాజ్యాలను మాపులో చూపండి. అవెలా ఏర్పడ్డాయో వర్ణించండి. |
| గ్రీకు సంస్కృతి సుదూర ప్రాచ్యానికి విస్తరించింది. గ్రీకు సంస్కృతీ, ఈజిప్టు, ఆసియా మైనర్‌ల సంస్కృతీ సన్నిహితమవడం విజ్ఞానశాస్త్ర యితోధికాభివృద్ధికీ, కళ నూతన వికాసానికీ దోహదంచేసింది | క్రీ.పూ. 3వ–2వ శతాబ్దాల్లో తూర్పు మధ్యధరా తీర ప్రాంతంలో ఉన్న సంస్కృతీ కేంద్రాల్లో మీకు తెలిసినవాటిని చూపండి. క్రీ.పూ. 3వ–2వ శతాబ్దాల్లో విజ్ఞాన శాస్త్రం ఎలా అభివృద్ధి చెందింది? క్రీ.పూ. 3వ–2వ శతాబ్దాల నాటి తూర్పు మధ్యధరా సముద్ర తీర ప్రాంతపు కళకీ, క్రీ.పూ. 5వ–4వ శతాబ్దాల నాటి గ్రీకు కళకీ మధ్య భేదం యేమిటి? సామ్యాలు యేమిటి? ఆ రెండింటిలో మీకేది యెక్కువ నచ్చుతుంది? ఎందుకు? |

చెప్పండి: ఆదిమ సమష్టి వ్యవస్థనుంచి బానిస యాజమాన్య వ్యవస్థకి పరివర్తన ఒక ముందంజా? ముందంజ అయితే ఎందుకో, కాకపోతే ఎందుకో నిరూపించండి.

“క్రీ.పూ. 11వ–2వ శతాబ్దాల్లో గ్రీసు చరిత్ర ముఖ్య దశలు” పట్టికను పూరించండి.

క్రీ.పూ. 11వ–2వ శతాబ్దాల్లో గ్రీసు చరిత్ర ముఖ్య దశలు

| గ్రీసు చరిత్రలో దశలు (శతాబ్దాలు) | ఆ దశలో గ్రీకుల నివాస స్థలంలో వచ్చిన మార్పులు ఏమిటి? | గ్రీకుల సామాజిక వ్యవస్థలో వచ్చిన మార్పులు యేమిటి? | గ్రీకు పరిపాలనలో వచ్చిన మార్పులు యేమిటి? |
|---|---|---|---|
| క్రీ. పూ. 11వ – 9వ శతాబ్దాలు | బాల్కన్ ద్వీపకల్పంలో డోరియన్ల చొరబాటు, ద్వీపాల్లోనూ, ఏగేయన్ సముద్రపు తూర్పు తీరంలోనూ గ్రీకులు స్థిరపడటం | ఆదిమ సమష్టి వ్యవస్థనుంచి బానిస యాజమాన్య వ్యవస్థకి క్రమ పరివర్తన | తెగలమీద సేనానుల, తదితర కులీనుల అధికారపు పెరుగుదల |

ప్రాచీన గ్రీసు చరిత్రలో ఎవరిని మీరు అత్యంత ప్రముఖ వ్యక్తిగా పరిగణిస్తారు? అందుకు కారణాలు ఏమిటి?

## గ్రీసు చరిత్రలో ప్రధాన దశల కాలక్రమ పట్టిక

## క్రీ.పూ. 13నుంచి 2వ శతాబ్దివరకు

| గ్రీసు చరిత్రలో ప్రధాన దశలు | క్రీ.పూ. శతాబ్ది | ప్రధాన ఘటనలు, తేదీలు |
|---|---|---|
| | 13 | |
| | | సుమారు క్రీ.పూ. 1200. ట్రాయన్ యుద్ధం |
| | 12 | |
| గణాల విచ్ఛిత్తి, వర్గాల ఆవిర్భావం | 11 | క్రీ.పూ. 2వ సహస్రాబ్ది అంతం. గ్రీసుపై డోరియన్ తెగల చొరబాటు |
| | 10 | |
| | 9 | |
| బానిస యాజమాన్య వ్యవస్థ స్థాపన, నగర రాజ్యాల ఆవిర్భావం | 8 | క్రీ.పూ. 776. ఒలింపిక్ క్రీడల ఆరంభం |
| | 7 | |
| | 6 | క్రీ.పూ. 594. ఏథెన్స్‌లో సొలోన్ సంస్కరణలు |
| గ్రీకు-పర్షియన్ యుద్ధాలు, ఏథెన్స్ పెత్తనపు శిఖర స్థితి | 5 | క్రీ.పూ. 490. మేరథాన్ యుద్ధం<br>క్రీ.పూ. 480. క్సేర్క్సెస్ చొరబాటు<br>క్రీ.పూ. 443. పెరిక్లెస్ పాలన ఆరంభం |
| నగర రాజ్యాల పతనం, గ్రీకు-మాసిడోనియన్ రాజరిక రాజ్యాల అవతరణ | 4 | క్రీ.పూ. 338. హెరోనియా యుద్ధం<br>క్రీ.పూ. 334–325. మాసిడోనియన్ సైన్యపు తూర్పు దండయాత్రలు |
| | 3 | |
| | 2 | క్రీ.పూ. 2వ శతాబ్ది మధ్య. మాసిడోనియా, గ్రీసులపై రోమ్ విజయం |
| | 1 | |

ప్రకరణం పన్నెండు

# రోమన్ రిపబ్లిక్ అవతరణ, అది ఇటలీని ఆక్రమించుకోవడం

## §45. పురాతన కాలపు రోమ్, రోమ్‌లో రిపబ్లిక్ స్థాపన

(మాప్ 8)

గ్రీసుకి పశ్చిమాన గ్రీకు వలసలు ఎక్కడెక్కడ ఏర్పడ్డాయో, ఎప్పుడు ఏర్పడ్డాయో జ్ఞాపకం చేసుకోండి (§33, మాప్ 5).

**1. అపెనైన్ ద్వీపకల్పం ప్రకృతి.** అపెనైన్ ద్వీపకల్పం అనే మరో పెద్ద ద్వీపకల్పం బాల్కన్ ద్వీపకల్పానికి పశ్చిమాన ఉంది.

అపెనైన్ పర్వతశ్రేణి ద్వీపకల్పం అంతటా విస్తరించివుంది. ఈ పర్వతాలు గ్రీసులోని శిలామయమైన పర్వతాలంత ఎత్తైనవి కావు. కొండలకూ, సముద్రానికీ మధ్య విస్తారమైన పల్లపు తీరాలు ఉన్నాయి.

ఎత్తైన ఆల్ప్స్ పర్వతాలు ద్వీపకల్పాన్ని ఉత్తరపు చలి గాలులనుండి రక్షిస్తాయి. కనుక వాతావరణం వెచ్చగా వుంటుంది. గ్రీసులో కంటె వర్షం యెక్కువ; తీరం వెంబడీ, పర్వతాల లోయలలోనూ భూమి చాలా సారవంతమైనది. అపెనైన్ పర్వత దరులలో యెత్తుగా, దట్టంగా గడ్డి పెరిగే మంచి పచ్చిక బీళ్లు వున్నాయి. తమ దేశంలోని నాసిరకపు పచ్చిక మైదానాలకు అలవాటుపడిన ప్రాచీన గ్రీకులు అపెనైన్ ద్వీపకల్పంలోని దట్టమైన మొక్కలనీ, పశు సంపదనీ చూసి అబ్బురపడ్డారు. ఆ ద్వీపకల్పపు దక్షిణ ప్రాంతానికి వాళ్లు "లేగల దేశం" – ఇటలీ – అని పేరు పెట్టారు. దరిమిలా అదే పేరు మొత్తం ద్వీపకల్పం అంతటికీ విస్తరింపజెయ్యబడింది.

ఆ ద్వీపకల్పపు పశ్చిమ, దక్షిణ తీరాల్లో ఓడలకు లంగరు వేసుకొనేందుకు అనువైన అఖాతాలు ఉన్నాయి.

అపెనైన్ ద్వీపకల్పపు దక్షిణ కొసని దాదాపు ఆనుకొని వున్న సిసిలీ ద్వీపంలో వాతావరణం ఆ ద్వీపకల్పంలో కంటె మరింత వెచ్చగా వుంటుంది; అక్కడ వృక్షతతి కూడా దట్టంగా వుంటుంది.

**2. రోమ్ నగర ఆవిర్భావం. ప్యాట్రీషియన్లు.** టైబర్ నది అపెనైన్ ద్వీపకల్పం మధ్య వుంది. అది పర్వతాల్లో పుట్టి, మైదానంలో ప్రవహించి, సముద్రంలో కలుస్తుంది. మైదానంలో అక్కడక్కడ దిబ్బలు వున్నాయి. ప్రాచీన కాలంలో మైదానం చిత్తడిగా ఉండేది. దిబ్బలు ఆకుల చెట్లతో నిండివుండేవి.

మైదానంలో లాటిన్లు నివసిస్తూండేవాళ్లు. టైబర్ నదీ ముఖ ద్వారానికి 25 కిలోమీటర్ల దూరంలో, నది ఎడమ

ప్రాచీన రోమ్ నగరపు విహంగావలోకిత దృశ్యం (పునరుద్ధరణ). ఈ చిత్రాన్ని రంగు మాప్ 8తో పోల్చి, ప్లానులో చూపబడిన, 214–216 పేజీల్లో వర్ణింపబడిన ప్రాంతాలను యీ చిత్రంలో గుర్తించండి



ఒడ్డు మీది దిబ్బలపైన రోమ్ అనే ఒక చిన్న జనావాసం వెలిసింది. జన శృతినిబట్టి అది క్రీ.పూ. 8వ శతాబ్దిలో నెల కొల్పబడింది.

మొట్టమొదట రోమ్ పౌరులుగా వుండిన వాళ్ల వంశీకులు ప్యాట్రీషియన్లుగా* చలామణి అయారు. ఆ కుటుంబాలలో ప్రతిదానికీ సమష్టి పొలంలో సొంత భాగాలు వున్నాయి. పశువులను సమష్టి పచ్చిక బీళ్లలో మేపుకునేవాళ్లు.

ప్యాట్రీషియన్లు తమ యిండ్లలో బానిస శ్రమను వినియోగించేవాళ్లు. కాని బానిసల సంఖ్య యెక్కువగా లేదు. మామూలుగా యజమానులు కూడా పొలంలోనూ, యింట్లోనూ బానిసలతో కలిసి పనిచేసేవాళ్లు. యజమానులూ, బానిసలూ సాధారణంగా కలిసి భోంచేసేవాళ్లు. బానిసలను కుటుంబంలోని సభ్యులుగా యెంచేవాళ్లు.

ప్యాట్రీషియన్ల గృహాలు చాలా సాదాగా, నిరాడంబరంగా వుండేవి. గృహానికి ఒక్క గది మాత్రమే వుండేది. మధ్యలో ఒక చిన్న నీళ్ల తొట్టి, తొట్టిపైన కప్పుకు ఒక చౌకపు రంధ్రమూ వుండేవి. వర్షం వచ్చినప్పుడు కప్పుమీద పడిన నీళ్లు తొట్టిలోకి ప్రవహించేవి. రంధ్రం ద్వారా వెలుతురు కూడా వచ్చేది.

ప్యాట్రీషియన్లలో అందరికంటే పెద్ద వాళ్లతో "పెద్దల సభ" యేర్పడేది. లాటిన్ భాషలో దాన్ని సెనేట్ అనే వాళ్లు. రోమ్ రాజుచేతా, సెనేట్‌చేతా పాలింపబడేది.

---

* ఈ పదం "పాటెర్" అనే లాటిన్ పదంనుండి ఉత్పన్నమైంది. పాటెర్ అంటే తండ్రి. నగరం తమ తండ్రుల చేత నిర్మింపబడిందని ప్యాట్రీషియన్లు యెంతో గర్వించేవాళ్లు.

**3. నెలకొల్పబడిన తొలి శతాబ్దాల్లో రోమ్ పెరుగుదల. ప్లెబియన్లు.**

రోమ్ మంచి అనువైన చోట నిర్మింపబడింది. నగరం చుట్టూ సారవంతమైన పొలాలు వున్నాయి. టైబర్ నదీ ముఖద్వారంలో సౌకర్యవంతమైన ఓడ రేవు వుంది. అక్కడినుంచి రోమ్ గుండా ఇటలీ లోపలకి పోయే ఒక రోడ్డు వుంది. వర్తకులూ, చేతిపనివాళ్లూ రోమ్‌లో స్థిరపడసాగారు. రోమనులు పరిసర పట్ట ణాలను జయించి, ఆ ప్రజలలో కొందరిని రోమ్‌లో స్థిరపడండని బలవంతం చేసేవాళ్లు. రోమ్ జనసంఖ్య త్వరగా పెరుగుతూ వచ్చింది.

రోమ్ ఏడు దిబ్బలమీద నిర్మింపబడింది. వాటిలో మిక్కిలి ఎత్తైన కాపిటోలియా దిబ్బపైన కోట నిర్మింపబడింది. శత్రువులు దాడిచేసినప్పుడు పరిసర జనం ఆ కోటలో శరణుపొందేవాళ్లు. రోమన్లు దిబ్బల మధ్య ఉన్న చిత్తడి నేలను ఎండగట్టి, అక్కడ చౌకును తయారుచేశారు. లాటిన్‌లో దాన్ని ఫోరుమ్ (ఫోరం) అంటారు. ఆ ఫోరంనుంచి భిన్న దిశల్లో రాళ్ళ పరవని వంకరటింకర కచ్చా రోడ్లు ఉండేవి. వాటికి రెండు వైపులా పచ్చి యిటుకలతో, కొయ్యతో నిర్మింపబడి, పూరిగడ్డితో, పెంకులతో కప్పబడిన యిళ్లు వుండేవి. కమ్మర్లూ, చెప్పులు కుట్టేవాళ్లూ, తదితర చేతిపనివాళ్లూ ఫోరం లోనూ, వీధుల్లోనూ పనిచేస్తూండేవాళ్లు.

రోమ్‌కి కొత్తగా చేరినవాళ్లనూ, వాళ్ల సంతానాన్నీ ప్లెబియన్లు అనేవాళ్లు. వాళ్లలో అత్యధిక భాగం పేదలు. కొంత మంది ధనవంతులు కూడా వున్నారు. ప్లెబియన్లు పన్నులు చెల్లించేవాళ్లు, సైన్యంలో కొలువు చేసేవాళ్లు. కాని సమష్టి పొలంలో వాళ్లకు భాగం లేదు; సకాలంలో రుణాలు చెల్లించకపోతే క్రమంగా వాళ్లను బానిసలుగా చేసేవాళ్లు.

**4. రిపబ్లిక్ స్థాపన.**

ఒక ప్రాచీన కథ ప్రకారం, క్రీ.పూ. 6వ శతాబ్ది అంతంలో రోమ్‌ను చాలా క్రూరుడైన రాజు పాలిస్తూ వుండేవాడు. క్రీ.పూ. 509లో రోమన్లు అతన్ని దేశంనుండి బహిష్కరించి, రాజ్యాధికారాన్ని రద్దు చేశారు.

రాజు బహిష్కరణ తర్వాత, రోమ్‌లో పరిపాలన యెన్నికలమీద ఆధారపడింది. ప్రతి సంవత్సరమూ ప్రజా సభచేత యిద్దరు పాట్రీషియన్లు కాన్సళ్లుగా యెన్నుకోబడేవాళ్లు. కాన్సళ్లు కోర్టు తీర్పులు చెప్పేవాళ్లు. యుద్ధ కాలంలో సైన్యాలకు నాయకత్వం వహించేవాళ్లు. వాళ్లు ఒక ఏడాదిపాటు పదవిలో ఉండేవాళ్లు. పాట్రీషియన్లనుండి సంవత్సర కాలానికి ప్రజా సభచేతనే ఎన్నుకోబడే యితర ఉద్యోగులు వారికి తోడ్పడేవాళ్లు. ఏడాది ముగిశాక వారిలో అత్యున్నత ఉద్యోగులు సెనేట్ సభ్యులు లేక సెనేటర్లు అయ్యేవారు.

సెనేట్‌కు పెద్ద అధికారాలు వుండేవి. శాంతి కాలంలో కాన్సళ్లు ప్రతి విషయమూ సెనేట్‌లో చర్చించవలసివుం డేది. ఖజానా దాని అదుపులో వుండేది. యుద్ధం ప్రకటించేదీ, శాంతి చేసుకొనేదీ అదే. అది ప్రజా సభలను సమావేశపరిచి, అంతకుముందే చేయబడిన నిర్ణయాలను సభ ముందు పెట్టేది. ఆ నిర్ణయాలు సాధారణంగా ఆమోదింపబడేవి.

పాట్రీషియన్లు తమ ప్రభుత్వ వ్యవస్థను "ప్రజా ఆశయం" — లాటిన్ భాషలో "రిపబ్లికా" — అనేవాళ్లు. దానినుండి రిపబ్లిక్ అనే మాట పుట్టింది. రిపబ్లిక్ అంటే ఒక నిర్ణీత కాలానికి యెన్నుకోబడినవాళ్లచేత పరిపాలింపబడే రాజ్యం. అయితే, రిపబ్లిక్ నెలకొన్న తర్వాత కూడా ప్లెబియన్లకి హక్కులు లేకపోయాయి. వాళ్లు తమ స్థితిలో మెరుగుదల కోసం డిమాండుచేశారు.









1. రోమన్ గుడిసె (మరణించినవాని చితాభస్మాన్ని ఉంచేందుకు వినియోగింపబడిన నమూనా). 2. ఫోరమ్‌లో నిర్మింపబడిన ఒక దేవాలయం. 3. రోమ్‌లోని ఒక ప్రాచీన దేవాలయం (ఫొటో). 4. కపిటోలియామీది ఆడ తోడేలు విగ్రహం (క్రీ.పూ. 6వ శతాబ్ది నాటిది)

## రోమ్ పుట్టుకను గురించిన కథ

పురాణ కథ ప్రకారం, ఒక లాటిన్ పట్టణపు రాజు తన మేనకోడలికి పుట్టిన కవల కొడుకులను — రోములస్, రెమస్ — అనేవాళ్లను టైబర్ నదిలో వేయమని ఆజ్ఞాపించాడు. వాళ్లు పెద్ద అయిన తర్వాత తన అధికారం గుంజుకుంటారని అతని భయం. టైబర్ నది వరదల్లో వుంది. లాటిన్ రాజు పిల్లవాళ్లను ఒక బుట్టలో వుంచి నదిలో పారేయించాడు. ఆ బుట్ట చెట్టు కొమ్మలకు చిక్కుకొని తేలిన మూలంగా వాళ్లు సజీవంగా వున్నారు. ఒక ఆడ తోడేలు వాళ్లకు పాలు యిచ్చింది. తరువాత వాళ్లను ఒక గొల్లవాడు తీసుకొనిపోయి తన యింట్లో సాకాడు. ఆ సోదరులు పెరిగి పెద్దవాళ్లై, బలవంతులూ, సాహసికులైన యోధులూ అయ్యారు. వాళ్లు రాజుకి వ్యతిరే

కంగా తిరుగుబాటు లేవదీసి, అతన్ని చంపేశారు. రోములస్, రెమస్‌లు ఒక నగరాన్ని స్థాపించాలని నిర్ణయించుకున్నారు. అయితే, ఆ నగరాన్ని ఎక్కడ నిర్మించాలి, దాన్ని ఎవరు పాలించాలన్న విషయంలో వాళ్ల మధ్య పేచీ వచ్చింది. కొట్లాటలో రోములస్ రెమస్‌ను చంపాడు. తరువాత రోములస్ గొల్లవానికి తాము దొరికిన చోట ఒక నగరం నిర్మించి, దానికి రోమ్ అని పేరు పెట్టాడు.

రోమన్లు తమ నగర నిర్మాణం జరిగిన నాటినుండి, అనగా క్రీ.పూ. 753నుండి, కాలాన్ని లెక్కించడానికి కూడా నిర్ణయించారు. ఆడ తోడేలుకు కాపిటోలియా దిబ్బమీద ఒక విగ్రహం కూడా ప్రతిష్ఠించబడింది. ఇప్పుడది ఒక మ్యూజియంలో భద్రం చెయ్యబడివుంది.

## రోమ్‌ను గాల్‌లు ఆక్రమించుకోవడం (ఒక రోమన్ చరిత్రకారుడి కథనం)

క్రీ.పూ. 4వ శతాబ్ది మొదట్లో ఇటలీలో స్థిరపడిన గాల్‌లలోని సైనిక తెగలు రోమ్‌పై దాడిచేశాయి. పొడుగ్గా, రుప్ప లాంటి పొడవైన జుట్టు కలిగి, పొడవాటి ఖడ్గాలనూ, పెద్ద డాలులనూ ధరించిన గాల్‌లను చూస్తేనే జనం భయభీతులయ్యేవాళ్లు. గాల్‌లు మెరుపు దాడిచేసి, రోమన్ సైనికులను చెల్లాచెదురుచేశారు. రోమును ఆక్రమించిన గాల్‌లు దాన్ని కొల్లగొట్టి, తగులబెట్టారు.

రోమన్లలో కొంతమంది కాపిటోలియా దిబ్బమీది దుర్భేద్యమైన కోటలో దాక్కొని, గాల్‌లు చేసిన ఒక దాడిని తిప్పికొట్టారు. అయితే గాఢ నిశ్శబ్దం అలుముకున్న అర్ధరాత్రివేళ గాల్‌లు కాపిటోలియా దిబ్బపైకి ఎక్కారు. పహరావాళ్లు గాని, కావలి కుక్కలు గాని వాళ్లని గమనించలేదు. కాపిటోలియా దిబ్బమీది బాతులు మాత్రమే శత్రువుల జాడను పసిగట్టి, బిగ్గరగా అరిచి, రోమన్ సైనికులను నిద్రనుంచి లేపాయి. రోమన్లు సకాలంలో తమ బలాన్ని కూడదీసుకొని, శత్రువులను తరిమేశారు. ఈ వృత్తాంతమే "రోమ్‌ని బాతులు కాపాడాయి" అన్న నానుడికి మూలాధారం.

గాల్‌లు 300 చిల్లర కిలోగ్రాముల బంగారం చెల్లిస్తే నగరం విడిచిపోతామని మాట యిచ్చారు. బంగారం తూకం వేసేటప్పుడు గాల్ సేనాని బరువైన తన ఖడ్గాన్ని త్రాసులో ఉంచాడు. రోమన్లు అందుకు అభ్యంతరం తెలియజేసినప్పుడు అతను "ఓడిపోయినవాళ్ల గతి యింతే!" అని దబాయించాడు.

రోమన్లు త్వరలోనే తమ నగరాన్ని పునర్నిర్మించుకొని, దాని చుట్టూ గోడ కూడా కట్టారు. ఆ గోడ అవశేషాలు యీనాటికీ మనకి కనిపిస్తాయి.

? **1.** ఇటలీ ప్రకృతికీ, గ్రీసు ప్రకృతికీ మధ్య తేడా యేమిటి? ప్రాచీన కాలంలో ఇటలీ ప్రాకృతిక పరిస్థితులు ఏ వృత్తులకు అనుకూలంగా వున్నాయి? **2.** రోమన్లలో పాట్రీషియన్లు, ప్లెబియన్లు అన్న విభజన ఎలా సంభవించింది? ప్లెబియన్ల స్థితికీ, పాట్రీషియన్ల స్థితికీ మధ్య తేడా యేమిటి? **3.** ఎలాంటి రాజ్యాన్ని రిపబ్లిక్ అంటారు? రిపబ్లిక్కీ, రాజరికానికీ మధ్య తేడా యేమిటి? ప్రాచీన రాజ్యాల్లో మీకు తెలిసిన మరొక

రిపబ్లిక్ యేమిటి? మీ వాదనని నిరూపించండి. **4.** రోమ్‌లో రిపబ్లిక్ ఏ శతాబ్దంలో (యే అర్ధశతాబ్దంలో), ఏ సంవత్సరం స్థాపింపబడింది? రోమ్‌లో రిపబ్లిక్ స్థాపన ముందు జరిగిందా లేక గ్రీసులో సొలోన్ సంస్కరణలు ముందు జరిగాయా? వీటి రెండింటికీ మధ్య వ్యవధి ఎంత? **5.** పాఠాల, చిత్రాల ఆధారంగా రోమ్ నగరం తన ఉనికి తొలి శతాబ్దాల్లో ఎలా వుండేదో వర్ణించండి.

# §46. క్రీ.పూ. 3వ శతాబ్ది మధ్య రోమన్ ప్రభువర్గ రిపబ్లిక్

(మాప్ 8)

గ్రీసులో ఎవరు ప్రభువర్గీయులుగా ఉండేవారో జ్ఞాపకం చేసుకోండి (§ 30–31; 5).

1. పాట్రీషియన్లతో ప్లెబియన్ల పోరాటం.

క్రీ.పూ. 5వ శతాబ్దిలో ప్లెబియన్లకు తమ సొంత ప్రతినిధులను యెన్నుకొనే హక్కు లభించింది. ఆ ప్రతినిధులను ప్రజా ట్రిబ్యూన్‌లు అనేవాళ్లు. కాన్సళ్లూ, సెనేటూ చేసిన యే నిర్ణయమైనా ప్లెబియన్లకు సంబంధించినదైతే, దాన్ని ట్రిబ్యూన్ నిషేధించవచ్చు. అలాంటి సందర్భాల్లో ట్రిబ్యూన్ "వీటో" అనే ఒక్క మాట చెప్తే చాలు. లాటిన్ భాషలో "వీటో" అంటే "నేను నిషేధిస్తున్నాను" అని అర్థం. ప్లెబియన్ యెవడైనా యే సమయంలోనైనా తన రక్షణ పొందడానికి వీలుగా ట్రిబ్యూన్ యింటి తలుపులు రేయింబగళ్లు తెరచి వుంచబడేవి. ట్రిబ్యూన్‌ను హత్యచేయడం ఘోరమైన నేరంగా యెంచబడేది.

ప్లెబియన్లు తమ పరిస్థితిని మెరుగుపరచుకునేందుకు జరిపిన తదుపరి పోరాటంలో వాళ్లకి ప్రజా ట్రిబ్యూన్లు నాయకత్వం వహించేవాళ్లు. ట్రిబ్యూన్లు ప్లెబియన్లకి సానుకూలమైన చట్టాలు ప్రతిపాదించేవాళ్లు. పాట్రీషియన్లచేత యీ చట్టాలను ఆమోదింపజేసేందుకుగాను ప్లెబియన్లు సైన్యంలో పనిచేసేందుకూ, పన్నులు చెల్లించేందుకూ నిరాకరించేవాళ్లు. అసలు రోమ్ వదిలిపెట్టి పోతామని బెదిరించేవాళ్లు. సాయుధ ఘర్షణలు సైతం జరిగేవి. సైన్యం బలహీనపడుతుందనీ, రోమన్ ఖజానా ఖాళీ అవుతుందనీ, జనం తిరగబడతారనీ భయపడి ప్లెబియన్లకి వరుసగా పాట్రీషియన్లు కొన్ని రాయితీలు యివ్వక గత్యంతరంలేని పరిస్థితిలో పడేవాళ్లు. కాన్సల్ పదవినీ, తదితర అధికార పదవులనీ పొందే హక్కును ప్లెబియన్లు సాధించుకున్నారు. సమష్టి పొలంలో భాగం పొందారు. రుణాలు చెల్లించలేకపోతే బానిసలుగా మార్చడం నిషేధించబడింది. పాట్రీషియన్లమీద ప్లెబియన్ల పోరాటం సుమారు 200 సంవత్సరాలు సాగి, పరిపూర్ణ విజయంతో అంతమైంది. క్రీ.పూ. 3వ శతాబ్ది ప్రారంభం నాటికే ప్లెబియన్లు పూర్తి సమానత్వం కలిగిన రోమన్ పౌరులయ్యారు.





1. తన పూర్వీకుల బస్టులను పట్టుకొని నిలబడ్డ ఒక రోమన్. ఆ రోమన్ టోగాను (రోమన్ల పండగ దుస్తు) ధరించాడు. 2. యుద్ధంలో రోమన్ లీజియన్ (సైన్య) వ్యూహం (ఆధునిక చిత్రకారుడు గీసిన చిత్రం)

## 2. రోమ్‌లో ప్రభువర్గీయులు అధికారంలోకి రావడం.

ప్లెబియన్ల విజయం తర్వాత, యే రోమన్ పౌరుడైనా ఏ ప్రభుత్వ పదవికైనా యెన్నిక కావచ్చుననీ, సెనేటర్ కావచ్చుననీ పరిగణించబడింది. సివిల్ ఉద్యోగానికి జీతం లేదు. అందువలన, ప్రొద్దుటినుండి రాత్రి పొద్దు పోయిందాకా పొలంలోనో, కార్ఖానాలోనో పనిచేసుకునే బీదవాళ్లు యెన్నిక అయ్యే అవకాశం లేదు.

భూములూ, బానిసలూ వున్న పాట్రీషియన్లూ, ప్లెబియన్లూ మాత్రమే కాన్సళ్లుగానూ, యితర ముఖ్య పదవులకీ యెన్నికయ్యేవాళ్లు. క్రీ.పూ. 3వ శతాబ్దిలో ధనవంతులైన రోమన్లు తమ పొలంలో పనిచేసేవాళ్లు కారు. వాళ్ల భూమిని రోజు కూలీలూ లేక యితర దేశాలనుండి తెచ్చిన బానిసలూ సాగుచేసేవాళ్లు.

క్రీ.పూ. 3వ శతాబ్ది నాటికి అత్యంత సంపన్నమైన పాట్రీషియన్, ప్లెబియన్ కుటుంబాల చిన్న బృందం ఒకటి తేలసాగింది. ఏటేటా ఆ కుటుంబాల సభ్యులే ప్రభుత్వ పదవులకి ఎన్నుకోబడేవాళ్లు. సెనేట్‌లో కూడా వాళ్లే వుండేవాళ్లు.

ఈవిధంగా, రోమ్‌లో ప్రభువర్గం ఉత్పన్నమైంది. ఆ వర్గానికి భూములూ, బానిసలూ వుండేవాళ్ళు. అదే రాజ్య పరిపాలన చేసేది. కాన్సళ్ళుగానూ, సెనేటర్లుగానూ యెన్నిక కావడం యితర రోమన్లకు దాదాపు అసంభవమైంది. రోమ్ బానిస యాజమాన్య, ప్రభువర్గ పాలిత రిపబ్లిక్‌గా పరిణమించింది.

## క్రీ.పూ. 3వ శతాబ్దిలో రోమన్ రిపబ్లిక్‌లో పరిపాలన

| ప్రజా సభ | కాన్సళ్ళు | సెనేట్ |
|---|---|---|
| రోమన్ పౌరులు. ఒక ఏడాది వ్యవధికి కాన్సళ్ళను ఎన్నుకొంటుంది.*. సెనేట్ ప్రతిపాదనలను ఆమోదిస్తుంది లేక తిరస్కరిస్తుంది | ప్రభువర్గానికి చెందినవాళ్ళు. సైన్యానికి నాయకత్వం వహిస్తారు, న్యాయాధిపతులుగా వ్యవహరిస్తారు | మాజీ కాన్సళ్ళు.* రాజ్య వ్యవహారాలు నిర్వహిస్తుంది |

* కాన్సళ్ళు, తదితర ఉన్నతాధికారులు.

3. క్రీ.పూ. 3వ శతాబ్దిలో రోమన్ సైన్యం. రోమన్ రిపబ్లిక్కుకి బలమైన, సుసంఘటితమైన, సుశిక్షితమైన సైన్యం ఉండేది. రోమన్ సైన్యంలో ప్రధానంగా సొంత భూమి వున్న రైతులు ఉండేవాళ్ళు. వాళ్ళే సైనిక కొలువులో చేర్చుకోబడేవాళ్ళు.

రోమన్ సైన్యం లీజియన్లుగా విభజింపబడింది. ఒక లీజియన్‌లో 4,500 మంది సైనికులు వుంటారు. లీజియన్లు చిన్న దళాలుగా విభజింపబడ్డాయి. ఆ దళాలు అడవుల్లో, కొండల్లో, నగర వీధుల్లో కూడా పోరాడగలవు.

తేలిక ఆయుధాలు ధరించిన సైనికులు యుద్ధం ప్రారంభించేవాళ్ళు. శత్రు సైన్యంమీద బాణాలు వేస్తూ, రాళ్ళూ, ఈటెలూ వర్షిస్తూ, శత్రువులలో గందరగోళం కలిగించడానికి వాళ్ళు శాయశక్తులా కృషిచేసేవాళ్ళు. గందరగోళం కలిగించిన వెంటనే వాళ్ళు వెనక్కి పరుగెత్తి, బరువైన ఆయుధాలు ధరించిన సైనికులకు దారి యిచ్చేవాళ్ళు. బరువైన ఆయుధాలు ధరించిన కాల్బలము లీజియన్ల దాడి సైన్యం. శత్రువులమీద ఈటెలు వర్షించిన తర్వాత ఆ సైనికులు విచ్చు కత్తులతో హఠాత్తుగా ముందుకురికి దాడిచేసేవాళ్ళు. వాళ్ల ఖడ్గాలు పొట్టివి, ద్వంద్వ యుద్ధంలో అమోఘమైనవి. కాల్బలానికి యిరువైపులా ఆశ్విక సైన్యం రక్షణగా వుండేది. జయం కల్గినప్పుడు, ఆశ్విక సైన్యం తిరోగమించే శత్రువులను వెంటబడి తరిమేది.

రోమన్ సైన్యంలో కఠినమైన క్రమశిక్షణ అమల్లో వుండేది. తమ ఆయుధాలను పోగొట్టుకున్నవాళ్ళు లేక కొలువు సమయంలో నిద్రపోయినవాళ్ళు మరణ శిక్షకి గురయ్యేవాళ్ళు. సైన్యాధిపతుల ఆజ్ఞలు విధిగా పాటింపబడేవి.

4. రోమ్ ఇటలీని జయించడం.

రోమన్లకి యిరుగుపొరుగు రాజ్యాల భూములమీద కళ్లు పడ్డాయి. దానితో రోమన్లు ఆ రాజ్యాలమీద తరుచు యుద్ధాలు సాగించారు. అపెనైన్ ద్వీపకల్పంలో కనీసం 12 భిన్న జాతులవాళ్లు నివసిస్తూండేవారు. వాళ్లు తమలో తాము పోరాడుకొంటూ వుండేవాళ్లు. రోమ్ 200 యేళ్లకి పైగా యుద్ధాలు సాగించింది. రోమన్ లీజియన్ సైనికులు ఆయుధాల్లో, సైనిక శిక్షణలో, క్రమశిక్షణలో తమ శత్రువుల కంటె ఉన్నతులు. ఇరుగుపొరుగు తెగల అసంఘటిత సైనిక బృందాలు రోమన్ల దాడులను తట్టుకోలేకపోయేవి. రోమన్లు ఇటలీలో ఒక తెగ తర్వాత మరొక తెగని లోబరచుకున్నారు. ఓడిపోయిన తెగల సాగుభూముల్లోనూ, పచ్చిక బీళ్లలోనూ మూడింట రెండు వంతులను రోమన్లు వశంచేసుకున్నారు. ఆ భూమిలో అధిక భాగాన్ని ప్రభువులే ఆక్రమించుకున్నారు. సెనేట్ భూమి తక్కువగా వున్న రైతులతో ఆ ప్రాంతాల్లో వలసలను ఏర్పాటుచేసింది. ఆ వలసలు ఆక్రమిత ప్రాంతాల్లో రోమన్ అధికారానికి దుర్గాలుగా ఉపయోగపడేవి. ఆక్రమిత తెగలు రోమ్‌కి వ్యతిరేకంగా ఐక్యం కాకుండా చూసేందుకు వాటి మధ్య సెనేట్ పొరపొచ్చాలు కల్పించేది. సెనేట్ అందుకు "విభజించి పాలించు" అన్న సూత్రాన్ని అనుసరించేది.

క్రీ.పూ. 3వ శతాబ్ది మొదటి అర్ధభాగంలో రోమన్లు ఇటలీ దక్షిణ ప్రాంతంలోని గ్రీకు నగరాలనూ, ఇటలీనీ ఆక్రమించుకున్నారు. రోమ్ ఆక్రమించుకున్న ప్రాంతాలు సిసిలీదాకా విస్తరించాయి. కానైతే అక్కడ మరొక శక్తివంతమైన విజేత — కార్తేజ్ — రోమ్‌కి ఎదురైంది.

"పిర్రిక్ విజయం"

(ప్లూటార్క్ గ్రంథంనుంచి)

పిర్రస్‌పై జరిగిన యుద్ధంలో రోమ్ విజయానికి మూల కారణం యేమిటి?

రోముకీ, ఇటలీ దక్షిణాన వున్న గ్రీకు నగరాలకీ మధ్య యుద్ధం జరిగేటప్పుడు, బాల్కన్ ద్వీపకల్పంలో ఒక చిన్న రాజ్యపు రాజైన పిర్రస్ గ్రీకులకి సహాయంగా వెళ్లాడు. అతనికి 22,000 మంది పదాతి సైనికులు, 3,000 మంది ఆశ్వికులు ఉన్నారు, 20 ఏనుగులు ఉన్నాయి.

యుద్ధ క్రమంలో ఆ ఏనుగులు రోమన్ సైనికులమీద పడి, వాళ్లని తమ కాళ్ల కింద మట్టేవి. ఏనుగుల మీద వున్న సైనికులు శత్రు సైనికులమీద అమ్ముల, ఈటెల వర్షం కురిపించేవారు. పిర్రస్ సేనలు కొన్ని విజయాలు సాధించాయి, కానైతే వాటికి పెద్ద నష్టాలు కలిగాయి. ఆ నష్టాలను చూసిన పిర్రస్ విస్తుపోయి, యిలా అన్నాడు: "ఇలాంటి విజయం యింకొక్కటి వస్తే, నా సైన్యం తుడిచిపెట్టుకుపోయినట్లే!" ఆనాటినుంచి ఓటమితో సమానమైన గెలుపుకి "పిర్రిక్ విజయం" అన్న నానుడి వచ్చింది.

రోమన్లు కొత్త సైనికులను కొలువులోకి చేర్చుకోవడం ద్వారా, నష్టపోయిన తమ సైన్యాన్ని భర్తీచేసుకోవడమే కాకుండా, దాన్నింకా పెంచుకున్నారు కూడా. అందుకే రోమ్‌ని ఒక తల నరికితే దాని స్థానంలో రెండు తలలు మొలిచే హైడ్రాతో (మహా సర్పంతో) పోల్చుతూండేవాళ్లు.

తుది నిర్ణయాత్మక పోరాటంలో రోమన్లు మేకులు దిగకొట్టిన బల్ల చెక్కలను ఏనుగుల కాళ్ల కింద వేసి, కొరకంచులతోనూ, బాణాలతోనూ బెదరగొట్టి, వెనక్కి తరిమారు. పరుగు లంకించుకున్న ఏనుగులు తమ కాళ్ల కింద తమ సైనికులనే మట్టుతూపోయాయి. పిర్రస్ సైన్యం నిర్మూలింపబడింది. కొన్ని గ్రీకు నగరాలు ప్రతిఘటించకుండానే రోమన్లకి లొంగిపోగా, మరికొన్ని ముట్టడి ఫలితంగా ఆక్రమించుకోబడ్డాయి.

? 1. క్రీ.పూ. 6వ శతాబ్దికీ, క్రీ.పూ. 3వ శతాబ్దికీ మధ్య రోమన్ రిపబ్లిక్ పరిపాలనలో ఏమి మార్పులు సంభవించాయి? **2.** క్రీ.పూ. 3వ శతాబ్ది నాటి రోమ్ పరిపాలనకీ, క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి ఏథెన్స్ పరిపాలనకీ మధ్య సామ్యాలు యేమిటి? భేదాలు యేమిటి? ప్రభువర్గ రిపబ్లిక్ అంటే యేమిటో వివరించండి. **3.** క్రీ.పూ. 6వ శతాబ్దిలోనూ, క్రీ.పూ. 3వ శతాబ్ది మధ్యలోనూ రోమన్ రాజ్యపు సరిహద్దులను మాప్‌లో చూపించండి. రోమన్ దండయాత్రలు విజయవంతమవడానికి గల కారణాలు యేమిటి? **4.** ఇటలీలో తాము జయించిన తెగల ప్రజలపైన రోమన్లు తమ అధికారాన్ని ఎలా నిలుపుకున్నారు?





1. యుద్ధ ఏనుగు (ప్రాచీన ఉబ్బెత్తు చిత్రం). ఏనుగుమీద సైనికులు కూర్చునేందుకు అంబారీ వుంది. మావటివాడు ఏనుగు మెడమీద కూర్చుంటాడు. 2. పిర్రస్ రాజు (ప్రాచీన బస్టు శిల్పం)

ప్రకరణం పదమూడు

# రోమన్ రిపబ్లిక్ మధ్యధరా ప్రాంతంలో అత్యంత శక్తివంతమైన బానిస యాజమాన్య సామ్రాజ్యం కావడం

## §47. పశ్చిమ మధ్యధరా ప్రాంతంలో ఆధిపత్యం కోసం రోమ్‌కీ, కార్తేజ్‌కీ మధ్య జరిగిన పోరాటం

(మాప్ 9. పేజి 224లోని మాప్)

గ్రీకు నగరాలకు తోడు మధ్యధరా సముద్ర తీరంలో విస్తృతంగా వ్యాపారంచేసిన యితర నగరాలను జ్ఞాపకం చేసుకోండి (§16; 3).

**1. కార్తేజ్ నగరమూ, దాని భూభాగాలు.**

కార్తేజ్ నగరం ఫొనీషియన్లచేత, ఆఫ్రికా ఉత్తర తీరంలో సముద్రంలోకి చాలా దూరం చొరుచుకుని వచ్చిన శిలామయమైన అగ్రంమీద నిర్మింపబడింది.

కార్తేజ్ చురుకుగా సముద్ర వ్యాపారం సాగించేది. లోతుగా, సౌకర్యంగా వున్న దాని రేవులో సదా ఓడల ఎగుమతులూ, దిగుమతులూ జరుగుతూండేవి. ఒడ్డు వెంబడి సరుకులు నిండిన పెద్ద గొడౌన్లు వుండేవి. నౌకలకు తెడ్లువేయడానికీ, బరువైన బస్తాలూ, బేళ్లూ, మొదలైనవి ఓడల కెత్తడానికీ బానిసలు వినియోగింపబడేవాళ్ళు.

కార్తేజ్ నగర శివార్లలోని సారవంతమైన భూములు ధనిక బానిస యజమానులకు చెందివుండేవి. చిన్న చిన్న బృందాలుగా కలిసి గొలుసులతో బంధింపబడిన బానిసలు పొలాలలోనూ, ద్రాక్ష తోటలలోనూ పనిచేసేవాళ్ళు.

కార్తేజ్‌కి బలమైన నౌకా దళమూ, పెద్ద సైన్యమూ ఉండేవి. అవి అత్యధిక భాగం కిరాయి సైనికులతో కూడి వుండేవి. బురుజులు గల బలమైన రాతిగోడలు నగరాన్ని రక్షించేవి. మధ్యధరా తీరంలోనూ, దీవులలోనూ విస్తారమైన భూభాగాలు ఆక్రమించుకొన్న కార్తేజియన్లు పశ్చిమ మధ్యధరా తీరమంతటినీ తమ పెత్తనంలోకి తెచ్చుకునేందుకు ప్రయత్నించారు.

**2. యుద్ధ ప్రారంభం.**

సిసిలీని ఆక్రమించుకోవాలన్న రోమ్, కార్తేజ్‌ల కాంక్ష క్రీ.పూ. 264లో వాటి మధ్య యుద్ధానికి దారితీసింది. కార్తేజియన్లను లాటిన్‌లో ప్యూనీలు అనేవాళ్ళు. అందుకని ఆ యుద్ధానికి ప్యూనిక్ యుద్ధమని పేరు వచ్చింది. మొదటి ప్యూనిక్ యుద్ధంలో రోమ్ గెలిచింది. అది 20 యేండ్లకు పైగా సాగింది. సిసిలీ, సార్డీనియా, కార్సికాలను రోమ్ పట్టుకుంది.

ప్రాచీన కాలంలో కార్తేజ్ నగరం యీ అగ్రంమీద వుంది



కానీ కార్తేజ్ శక్తి ఛిన్నాభిన్నం కాలేదు. ఉభయులూ పశ్చిమ మధ్యధరా సముద్ర తీరంపై పెత్తనంకోసం మరొక యుద్ధానికి సన్నాహాలు ప్రారంభించారు.

కార్తేజియన్లు స్పెయిన్‌లో విస్తారమైన ప్రాంతాలను వశపరచుకున్నారు. అక్కడ వాళ్ల సైన్యానికి హన్నిబల్ అనే యువ సేనాధిపతి నాయకత్వం వహించాడు. సేనాధిపతిగా హన్నిబల్ శక్తిసామర్థ్యాలనూ, అసాధారణ ధైర్యసాహసాలనూ అతని శత్రువులు సైతం గుర్తించారు.

3. ఇటలీపై హన్నిబల్ దండయాత్ర. క్రీ.పూ. 218లో రోమన్లు కార్తేజ్‌మీద యుద్ధం ప్రకటించారు. స్పెయిన్‌లో కార్తేజ్ ఆక్రమణలు రోమ్‌తో మరొక యుద్ధానికి దారితీశాయి. రెండవ ప్యూనిక్ యుద్ధం ప్రారంభమైంది. రోమన్లు ఊహించని విధంగా హన్నిబల్ తన సైన్యాలను ఆల్ప్స్ పర్వతాల మంచుదారుల గుండా ఇటలీలోకి నడిపాడు. ఆల్ప్స్‌ను దాటడంలో సైన్యం సగమైంది. బతికినవాళ్లు ఉత్తర యిటలీలోని సారవంతమైన పో నదీ మైదానంలోకి దిగారు. అక్కడ గాల్‌లు హన్నిబల్‌తో కలిశారు; తరిగిపోయిన హన్నిబల్ సైన్యానికి కొత్త బలం చేకూరింది.

అధిక రక్తపాతంతో కూడిన కొన్ని భీషణమైన యుద్ధాలు జరిగాయి. చివరకు కార్తేజియన్లకు పూర్తి విజయం లభించింది. రోమన్లు చిత్తుగా ఓడిపోయారు.

హన్నిబల్ తన సైన్యాలను ఉత్తరంనుంచి దక్షిణ కొనదాకా ఇటలీ అంతటా నడిపిస్తూ, రోమన్లు ఆక్రమించుకున్న ప్రజలను తన పక్షానికి తిప్పుకునేందుకు ప్రయత్నించాడు.

రెండవ ప్యూనిక్ యుద్ధం

## 4. కాన్నే యుద్ధం.

రోమన్ సైన్యమూ, కార్తేజ్ సైన్యమూ మళ్లీ క్రీ.పూ. 216లో కాన్నే అనే గ్రామం వద్ద ముఖాముఖీగా నిలిచాయి. రోమన్లకు 80,000 మంది పదాతి సైనికులూ, 6,000 మంది ఆశ్విక సైనికులూ వున్నారు. కార్తేజ్‌కి 40,000 పదాతి సైన్యం, 10,000 ఆశ్విక సైన్యం వుంది.

పదాతి సైన్యంతో శీఘ్రమైన దాడిచేసి శత్రువులను నలిపివేయాలని రోమన్ కాన్సల్ల ఉద్దేశం. పదాతి సైన్యం బ్రహ్మాండమైన చౌకంగా నిలబెట్టబడింది. ఇరువైపులా రక్షణగా ఆశ్విక సైన్యం నిలబడింది. (మాప్ 9 చూడండి).

రోమన్ దాడిని తన సైన్యం ఎక్కువ కాలం తట్టుకొని నిలవలేదని హాన్నిబల్‌కి తెలుసు. కాని రోమన్ సైన్యం తన రెండు పక్కలనూ, వెనుకవైపునూ కూడా రక్షించుకోవలసివస్తే, అది త్వరగా తన వ్యూహాన్ని మార్చుకోలేదని కూడా హాన్నిబల్‌కు తెలుసు. అతనొక సాహసిక పథకం ఆలోచించాడు; శత్రు సైన్యాన్ని చుట్టుముట్టడానికి నిర్ణయించాడు. కార్తేజ్ సైన్యం నెలవంక రూపంలో నిలబడింది. సైన్యపు మధ్య భాగం శత్రు సైన్యానికి ఎదురుబదురుగా నిలిచింది. కాల్బలంలోనూ, గుర్రపు బలంలోనూ అత్యుత్తమ దళాలు ఆవైపునా, ఈవైపునా వుంచబడ్డాయి.

రోమన్ పదాతి సైన్యం ముందుకు పురోగమించింది. అది కార్తేజియన్ల బారులలోకి లోతుగా చొరుచుకు వెళ్లింది.

దాని పక్కలు అరక్షితంగా వున్నాయి. వెంటనే కార్తేజ్ దాడి దళాలు దాడిచేశాయి. కార్తేజ్ అశ్విక సైన్యం రోమన్ అశ్విక సైన్యాన్ని చెదరగొట్టి, రోమన్ పదాతి సైన్యంమీద వెనుకనుండి దాడిచేసింది. రోమన్ సైనిక శ్రేణులు ఛిన్నాభిన్నమయాయి. క్రమబద్ధమైన సైన్యం క్రమం దప్పి శత్రువలయంలో చిక్కిన గంద్రగోళపు మూక అయింది. కార్తేజియన్లు వాళ్లని ఊచకోత కొయ్యనారంభించారు. కార్తేజియన్ల చేతిలో చచ్చినవాళ్లూ, ఖైదీలుగా చిక్కినవాళ్లూ 70 వేలమంది.

## 5. రోమన్లను నిశ్శక్తులను చేసిన యుద్ధం.

కాన్నే వద్ద కార్తేజ్ విజయం తర్వాత అనేక ఇటాలియన్ పట్టణాలు వాళ్ల పక్షానికి తిరిగాయి. రోమన్ల పరిస్థితి చాలా కష్టంగా తయారైంది. కాని, రోమన్ సెనేట్ హన్నిబల్ శాంతి ప్రతిపాదనను వినేందుకు సైతం నిరాకరించింది.

ఈలోగా కార్తేజ్ సైన్యం రోమ్ నగర ద్వారాలను సమీపించింది. ఎత్తైన గట్టి గోడలచే చుట్టబడిన రోమ్ నగరాన్ని ముట్టడించడానికి తగిన బలం హన్నిబల్ సైన్యానికి లేదు. అతను తిరిగి దక్షిణ ఇటలీలోకి ఉపసంహరించుకున్నాడు.

దేహ దార్ఢ్యం గలవాళ్ల నందరినీ సమీకరించగా రోమ్‌కి దాదాపు 2,50,000 సైన్యం మళ్లీ తయారైంది. రోమన్లు పెద్ద యుద్ధాలకు దిగలేదు. చిన్నచిన్న శత్రు దళాలమీద దాడిచేశారు. కార్తేజ్ పక్షం వహించిన నగరాలను ముట్టడించారు. ఇలాంటి పోరాటం హన్నిబల్‌కు చాలా హానికరంగా పరిణమించింది. అతనికి కార్తేజ్‌నుండి అదనపు బలాలేమీ రాలేదు. రోమన్ సైన్యాలు పెరుగుతూండగా కార్తేజియన్ సైన్యాలు తరిగాయి.

## 6. యుద్ధ సమాప్తి.

కాన్నే యుద్ధం తర్వాత పండ్రెండేండ్లకు రోమన్లు చాలా బలవంతులై ఆఫ్రికాలో ప్రవేశించడానికి నిర్ణయించుకున్నారు. ఆ సైన్యానికి అనుభవశాలీ, ధైర్యశాలీ అయిన సిపియో నాయకత్వం వహించాడు. హన్నిబల్ తన సైన్యాన్ని ఇటలీనుండి ఉపసంహరించుకొని, కార్తేజ్ నగర రక్షణ కోసం పరిగెత్తవలసివచ్చింది.



1



2



3

1. హన్నిబల్. 2. సిపియో (ప్రాచీన బస్టులు). 3. రోమన్ యుద్ధ ఓడ (ఉబ్బెత్తు చిత్రం). ఓడ అగ్రభాగాన ఓడనుంచి దిగేందుకూ, ఓడమీదకి ఎక్కేందుకూ అనువైన ఒక ప్లాట్‌ఫార్మ్ వుంది. దాని చివర బరువైన, వాడియైన "ముక్కు" అమర్చబడివుంటుంది. అలాంటి వంతెనని "కాకి" అనేవాళ్లు. రోమన్లు శత్రు ఓడలని సమీపించినప్పుడు వాళ్లు "కాకి"తో కూడిన తాత్కాలిక వంతెనని శత్రువుల ఓడపైకి విసిరేవాళ్లు. అది ఎదుటి ఓడకి తగులుకునేది. ఈ ఉబ్బెత్తు చిత్రంలో శత్రు నౌకమీదకి దిగి, బాహాబాహీ యుద్ధం సాగించేందుకు సిద్ధంగా వున్న రోమన్ సైనికులను చూడవచ్చు

జామా దగ్గర క్రీ.పూ. 202లో నిర్ణయాత్మకమైన యుద్ధం జరిగింది. ఈసారి రోమన్ అశ్విక సైన్యం కార్తేజ్ అశ్విక సైన్యం కంటె బలంగా వుంది. ఉభయ పదాతి సైన్యాలూ ఒకదానితో ఒకటి పోరాడుతుండగా, కార్తేజ్ సైన్యం వెనుక భాగాన రోమన్ అశ్విక సైన్యం దాడిచేసింది. హన్నిబల్ సైన్యం నేలమట్టమయింది.

క్రీ.పూ. 201లో రెండవ ప్యూనిక్ యుద్ధం ముగిసింది. కార్తేజ్ తన నౌకా దళాన్ని రోమ్‌కి అప్పగించి, పెద్ద మొత్తంలో ధనం చెల్లించి, దాదాపు తన భూభాగాలన్నిటినీ వదులుకోవలసివచ్చింది.

హన్నిబల్ కార్తేజ్‌ని వదిలిపెట్టి ఆసియా మైనర్‌లో శరణాగతి పొందవలసివచ్చింది. సెనేట్ హన్నిబల్‌ని తనకి అప్పగించాలని డిమాండుచేసింది. తన యింటిని చుట్టుముట్టిన సైనికుల చేతుల్లో పడకుండా వుండేందుకుగాను హన్ని బల్ విషం మింగి చచ్చిపోయాడు.

కార్తేజ్‌మీద రోమ్ విజయంలో నిర్ణయాత్మకమైన పాత్ర వహించింది ఇటాలియన్ రైతులు. సైనికుల్లో అత్యధిక భాగం రైతులే. వాళ్లు శత్రువులతో ధైర్యంగా పోరాడారు.

## ఒక ప్రాచీన రోమన్ చరిత్రకారుని దృష్టిలో హన్నిబల్

హన్నిబల్ అసాధారణ ధైర్యవంతుడు. ప్రమాదానికి వెరవక ముందుకు దూకేవాడు. కాని ప్రమాదం యెదురైనప్పుడు యెంతో అప్రమత్తుడు. అలసట ఎరుగనివాడు. గుండె దిటవు ఎన్నడూ కోల్పోనివాడు. అమితమైన వేడినీ, అమిత చలినీ అతను సమానమైన ఓర్పుతో భరించేవాడు. అతను తన మిలిటరీ కోటు చుట్టుకొని కాపలా సైనికుల మధ్య నిద్రించేవాడు. దాడి చేసేటప్పుడు మొదటివాడుగానూ, యుద్ధం అయిపోయిన తర్వాత యుద్ధ రంగం వదలిపెట్టేటప్పుడు చివరివాడుగానూ వుండేవాడు. ఇతర సేనా నాయకు లెవ్వరూ తమ సైనికులలో అంత విశ్వాసమూ, అంత ధైర్యమూ కలిగించలేదు.

?

**1.** రెండు ప్యూనిక్ యుద్ధాలకీ కారణాలు యేమిటి? రెండవ ప్యూనిక్ యుద్ధానికి సాకుగా ఉపయోగపడింది యేమిటి? **2.** కార్తేజ్‌మీద రోమ్ విజయానికి కారణాలు ఏమిటి? **3.** మాప్‌లో రెండవ ప్యూనిక్ యుద్ధ పోరాటాలు జరిగిన స్థలాలను, ఆ యుద్ధ పర్యవసానంగా రోమ్ ఆక్రమించుకున్న భూప్రాంతాలనూ చూపించండి. **4.** రెండవ ప్యూనిక్ యుద్ధం ఎన్నేళ్ల క్రితం ప్రారంభమై, ఎన్నేళ్ల క్రితం ముగిసింది? రెండవ ప్యూనిక్ యుద్ధం, ఆసియాపై మాసిడోనియన్ రాజు అలెగ్జాండర్ దండయాత్ర — ఈ రెండింటిలో ఏది ముందు ప్రారంభమైంది? ఎన్నేళ్లు ముందు జరిగింది? **5.** సేనా నాయకుడుగా హన్నిబల్‌కి అసాధారణ సామర్థ్యాలు ఉన్నాయన్న విషయాన్ని తెలియజేసే అంశాలు యేమిటి?

## §48. క్రీ.పూ. 2వ శతాబ్దిలో రోమన్ దండయాత్రలు

(మాప్ 9)

మాసిడోనియన్ రాజు అలెగ్జాండర్ రాజరిక రాజ్య విచ్ఛిత్తి ఫలితంగా ఏయే రాజ్యాలు ఏర్పడ్డాయో జ్ఞాపకం చేసుకోండి (§43; 5, మాప్ 7).

రోమ్ తనకి అత్యంత ప్రమాదకారి అయిన ప్రత్యర్థిని రెండవ ప్యూనిక్ యుద్ధంలో ఓడించింది. ఆ విజయం రోమ్ మధ్యధరా తీర ప్రాంతంలో కొత్త దండయాత్రలకి పూనుకునేందుకు మార్గాన్ని సుగమంచేసింది.

1. కార్తేజ్ వినాశం.

రెండవ ప్యూనిక్ యుద్ధం తర్వాత నౌకా దళమూ, సైన్యమూ కోల్పోయిన కార్తేజ్ రోమ్‌కి యిక యెంతమాత్రమూ ప్రమాదకారిగా లేదు. కాని కార్తేజ్ సముద్రంమీద భారీ యెత్తున వాణిజ్యం సాగిస్తూ, మరల సంపన్నం కాసాగింది. రోమన్ ప్రభువులూ, వర్తకులూ ద్వేషపాత్రమైన ఆ నగరాన్ని ధ్వంసంచేసి, దాని సిరిసంపదలను దోచుకోవాలని అనుకున్నారు. కార్తేజ్‌కి బద్ధ శత్రువైన, బాగా పలుకుబడి కలిగిన ఒక రోమన్ సెనేటర్ తన ప్రతి ప్రసంగాన్నీ "కార్తేజ్‌ని నాశనం చెయ్యాలి!" అన్న మాటలతో ముగించేవాడు.

క్రీ.పూ. 2వ శతాబ్ది మధ్యలో రోమన్ సైన్యం మళ్లీ ఆఫ్రికాకి వెళ్లి, కార్తేజ్‌ని ముట్టడించింది. దానితో మూడవ ప్యూనిక్ యుద్ధం మొదలైంది. రోమన్ సైన్యం కంటె తమ బలాలు యెంతో దుర్బలమైనవి అయినప్పటికీ, కార్తేజ్ ప్రజలు తమ నగరాన్ని రక్షించుకోడానికి నిశ్చయించుకున్నారు.

రోమన్ ముట్టడి మూడేండ్లు సాగింది. కార్తేజ్ వాసులు నగరంలో ఆయుధాలు తయారుచేసుకున్నారు, కోట గోడలు మరమ్మతు చేసుకున్నారు. ఆయుధాలు, బండలు విసిరివేసే యంత్రాలకోసం స్త్రీలు తమ పొడుగాటి వెంట్రుకలు కత్తిరించి మోకులుగా పేనారు.

ముట్టడికి లోనైనవాళ్లు ఆకలితోనూ, రోగాలతోనూ బాగా బలహీనపడిన తర్వాతనే రోమన్లు కార్తేజ్‌లో ప్రవేశించ గలిగారు. వాళ్లు నగరానికి అగ్గి పెట్టారు. దట్టంగా పొగ వున్నప్పటికీ, యిండ్ల కప్పులమీదా, వీధుల్లోనూ పోరాటం సాగింది. దాదాపు ఒక వారం పొడవునా యుద్ధం జరిగింది. రాత్రిపూట కూడా, కన్నులు చెదిరే మంటల వెలుతురులో యుద్ధం కొనసాగింది (పేజి 229లోని చిత్రం చూడండి). కార్తేజ్ నగరాన్ని భూమిమీదనుండి తుడిచివెయ్యాలని రోమన్ సెనేటు నిర్ణయించింది. విజేతలు యుద్ధం తర్వాత యింకా నిలిచిన భవనాలను ధ్వంసంచేశారు, 50,000 మంది కార్తేజ్ పౌరులను బానిసలుగా అమ్మారు.

2. సిరియన్ రాజ్య వినాశం.

పశ్చిమ మధ్యధరా సముద్ర తీరంలోని తమ ఆధిపత్యంతో తృప్తిలేక రోమన్లు బాల్కన్ ద్వీపకల్పంమీదా, ఆసియా మైనరుమీదా దండయాత్ర చేశారు. తమ తూర్పు పురోగమనంలో రోమన్లు తూర్పు మధ్యధరా ప్రాంతంలో అన్నిటికంటె పెద్ద రాజ్యమైన సిరియాను చేరారు. సిరియా రాజుకు పెద్ద సైన్యం, ఏనుగులు, కొడవళ్లు అమర్చిన రథాలు, ఒంటెల బలగం వున్నాయి. అతని సైన్యం విదేశ భూభాగాలలో సమకూర్చబడింది. ఆ సైన్యంలో వున్నది వివిధ



శత్రువుల కోటమీద రోమన్ల ముట్టడి (ఆధునిక చిత్రకారుడు గీసిన చిత్రం). ముందు రాతిబండలను విసిరేసే యంత్రం వుంది. కొంచెం దూరంలో గోడని భేదించే దుంగ, కొయ్యతో చేసిన దాడి శిఖరం వుంది. దాని చక్రాల చుట్టూ యినుప పట్టాలు వున్నాయి. రథాన్ని కోటగోడ దగ్గరకి తీసుకురాగానే సైనికులు ఒక చెక్క వంతెనని గోడమీదకి విసిరి, దాని మీదుగా బిలబిలా కోటలోకి ప్రవేశించేవాళ్లు. సైనికులు నిచ్చెనలను ఉపయోగించి కూడా కోటగోడలపైకి ఎక్కుతున్నారు

భాషలు మాట్లాడుతూ, క్రమశిక్షణ లేని వివిధ ఆక్రమిత జాతులకు చెందిన వట్టి మూక. వాళ్ల ఆసియా మైనరులో రోమన్లతో పోరాడి, త్వరలోనే పూర్తిగా ఓడింపబడ్డారు. రాజు పూర్తిగా రోమ్‌మీద ఆధారపడే స్థితికి వచ్చాడు. త్వరలోనే అతని రాజ్యం అనేక చిన్న రాజ్యాలుగా ముక్కలైంది.

### 3. మాసిడోనియా, గ్రీసులను రోమన్లు ఆక్రమించుకోవడం.

బాల్కన్ ద్వీపకల్పంలో రోమన్లు "విభజించి పాలించు" అన్న తమ సూత్రాన్ని నేర్పుగా వినియోగించారు. మాసిడోనియన్లకు వ్యతిరేకంగా తాము జరిపిన పోరాటంలో రోమన్లు గ్రీకుల స్వాతంత్ర్యాన్ని మన్నిస్తామని వాగ్దానంచెయ్యడం ద్వారా వాళ్లని తమ పక్షానికి తిప్పుకున్నారు. రోమన్ లీజియన్లకూ, మాసిడోనియన్ ఫలాంక్సుకూ నిర్ణయాత్మకమైన యుద్ధం జరిగింది. డాళ్లు ధరించి, ఈటెలు ముందుకు చాపి స్పార్టన్ సైనికుల ఫలాంక్స్ ముందుకు చొరుచుకు వస్తూంటే దుర్భేద్యమైన, భయావహమైన ఒక గోడ విరుచుకు పడుతున్నట్లు కనిపించేది. తిప్పికొట్టి, తిరుగు దాడి చేసి, ఫలాంక్స్ రోమన్ లీజియన్లను వెనక్కి నెట్టింది. కాని దాడి జరిగేటప్పుడు సైనికుల క్రమం విచ్ఛిన్నమైంది. వెంటనే వాళ్ల బారుల మధ్యకు వేగంగా కదిలే రోమను సైనిక దళాలు దూరాయి. తమ పొడుగాటి యీటె





1. కార్తేజ్ యుద్ధం (ఆధునిక చిత్రకారుడు గీసిన చిత్రం). కార్తేజ్ సైనికులు ఒక భవనంలోకి శత్రు సైనికులు ప్రవేశించకుండా పోరాడుతున్నారు. వెనక రోమన్లు ఒక పైకప్పుమీదనుంచి మరో పైకప్పు మీదకి ఒక దూలంమీదుగా పరుగెత్తుతున్నారు. అగ్ని జ్వాలలు సమీపిస్తున్నప్పటికీ భవన రక్షకులు పోరాటం కొనసాగిస్తున్నారు. 2. కోరింత్ శిధిలాలు (ఫొటో). కోరింత్‌ని రోమన్లు ధ్వంసంచేశాక, వెనకటి యీ అపోలో దేవాలయ శిథిలాలు తప్ప కోరింత్‌లో మరే యితర స్మారక చిహ్నమూ మిగలలేదు

లతో మాసిడోనియన్లు యేమీ చేయలేకపోయారు. ఫలాంక్స్ ధ్వంసంచేయబడింది. రోమన్లు మాసిడోనియాను ఆక్రమించు కున్నారు.

మాసిడోనియన్ రాజ్య పతనానంతరం గ్రీకులు తమ స్వాతంత్ర్యాన్ని తిరిగి సంపాదించుకునేందుకు ప్రయత్నించారు. వాళ్ల ప్రతిఘటనను రోమన్లు త్వరలో అధిగమించి, క్రీ.పూ. 146లో గ్రీసులో తమ పాలనను నెలకొల్పారు. ప్రతి ఘటనకి దండనగా గ్రీకు సాంస్కృతిక కేంద్రాల్లో ఒకటైన కోరింత్‌ను పూర్తిగా నేలమట్టంచేశారు. కోరింత్ వాసులు యావన్మందీ బానిసలుగా మార్చబడ్డారు.

**4. రోమన్లు గెలిచిన దేశాలను కొల్లగొట్టడం.**

తమ ఆధిపత్యం కిందికి వచ్చిన దేశాల నన్నిటినీ రోమన్లు నిర్దాక్షిణ్యంగా కొల్లగొట్టేవాళ్లు. వాళ్ల ఖైదీలను బానిసలుగా అమ్మేవాళ్లు. సైన్యాల వెంట బానిస వర్తకులు వుండేవాళ్లు. వాళ్లు బానిసలను కొని, తరువాత బానిస మార్కెట్లలో అమ్మేవాళ్లు. ఉదాహరణకు, ఒక దండయాత్ర తర్వాత 1,50,000 ఖైదీలు అమ్మబడ్డారు.

ఒక నగరం పట్టుబడినప్పుడు మామూలుగా సైన్యాధిపతులు దాన్ని కొల్లగొట్టడానికి తమ సైనికులకు అనుమతి యిచ్చేవాళ్లు. కొల్ల వస్తువుల్లో కొంత భాగం రోమన్ ఖజానాకు పంపబడేవి. తక్కినవాటిని సైన్యాధిపతులూ, సైనికులూ పంచుకునేవాళ్లు. సైన్యాధిపతులు యుద్ధం ముగిసి యిళ్లకు తిరిగి వెళ్లేనాటికి ధనికులయ్యేవాళ్లు.

విజయం సాధించిన సేనాధిపతులు విజయోత్సాహంతో నగర ప్రవేశం చేసేవాళ్లు. విజేత నాలుగు తెల్ల గుర్రాలు పూన్చిన రథంమీద కూర్చునేవాడు. రథం ముందు మిక్కిలి విలువైన కొల్ల వస్తువులు పట్టుకొని పోయేవాళ్లు. ముఖ్యమైన ఖైదీలు స్త్రీలతో, పిల్లలతో సహా, గొలుసులతో నడిచేవాళ్లు (వర్ణ చిత్రం 17 చూడండి).

**5. రోమన్ రాష్ట్రాల్లో పరిస్థితి.**

రోమన్లు ఆక్రమించుకున్న దేశాలను రాష్ట్రాలు (provinces) అనేవాళ్లు. రాష్ట్రాలలోని గనులూ, ఉప్పు గనులూ, నౌకా నిర్మాణ శాలలూ, అడవులూ, అత్యంత సారవంతమైన భూములూ రోమన్లు వశపరుచుకునేవాళ్లు. ప్రజానీకం విపరీతమైన పన్నుల భారంతో క్రుంగిపోయేది. పన్నులు చెల్లించలేనివాళ్లను సకుటుంబంగా బానిసలుగా అమ్మేవాళ్లు.

రాష్ట్రాలను సెనేట్ నియమించిన గవర్నర్లు పాలించేవాళ్లు. గవర్నర్లకి హద్దులేని అధికారం వుండేది. మూడు నాలుగేళ్ల రాష్ట్ర పాలన కాలంలో వాళ్లు బోలెడు సంపద కూడబెట్టుకునేవాళ్లు. ఒక గవర్నరును గురించి జనం యిలా చెప్పుకున్నారు: "అతను ధనిక రాష్ట్రానికి బీదవాడుగా వచ్చాడు. అతను పేద రాష్ట్రాన్ని విడిచి ధనికుడుగా తిరిగివెళ్లాడు."

పెద్దపెద్ద ప్రాంతాలు నిర్మానుష్యమయ్యాయి. ఆసియా మైనర్‌లోని ఒక చిన్న దేశపు రోమన్ సామంత రాజు తన దేశంలోని వయోజనులందరూ బానిసత్వంలోకి నెట్టివెయ్యబడ్డారంటూ నివేదిక పంపాడు.

క్రీ.పూ. 2వ శతాబ్దిలో కొల్లదారీ యుద్ధాల పర్యవసానంగా రోమ్ ఒక మహా సామ్రాజ్యం అయింది. మధ్యధరా సముద్ర తీరపు అనేక దేశాల ప్రజలు రోమన్ పాలన కిందకి పోయారు.

## మాసిడోనియాను జయించిన తర్వాత జరిగిన రోమ్ విజయోత్సవం గురించి గ్రీకు చరిత్రకారుడైన ప్లూటార్క్ వర్ణన

ఈ పత్రం ఆధారంగా రోమ్ యుద్ధాల స్వభావం గురించి ఏమి నిర్ధారణలు చెయ్యవచ్చు?

ఊరేగింపు నడిచే వీధులన్నీ జనంతో నిండిపోయాయి. మొదటి రోజున, యుద్ధంలో పట్టుబడిన విగ్రహాలూ, చిత్రపటాలూ 250 రథాలమీద ఉదయంనుండి సాయంత్రందాకా ఊరేగింపబడ్డాయి.

మరు దినం, అత్యుత్తమమైన, అత్యంత విలువైన మాసిడోనియన్ ఆయుధాలు నిండిన బండ్లు అసంఖ్యాకంగా వీధుల్లో తిరిగాయి. పాలిష్ చేయబడిన రాగీ, యినుమూ బంగారంలా తళతళ మెరిశాయి: ఆయుధాల కుప్పలలో ఖడ్గాలూ, ఈటెలూ నిక్కపొడుచుకొని వున్నాయి. ఆయుధాల బండ్ల వెనుక, సైనికులు 750 పాత్రలలో వెండి నాణాలు మోసుకొచ్చారు. ఒకొక్క పాత్రని నలుగురు మనుషులు దారి వెంట లాగవలసివచ్చింది. ఆ తర్వాత బరువైన వెండి గిన్నెలూ, పాత్రలూ వచ్చాయి.

మూడవ రోజున, బంగారు పూత కొమ్ములు గల 120 బలిసిన యెడ్లను తోలారు. ఆ యెడ్లు బలి యివ్వడానికి ఉద్దేశించబడినవి. ఆ తరువాత ముందు రోజు లాంటివే 77 పాత్రల నిండా బంగారు నాణాలు. ఆ వెనుక మేలి బంగారుతో చేసిన, రత్నఖచితమైన పెద్ద పాత్ర ఒకటీ, మాసిడోనియన్ రాజుకు చెందిన బంగారు తట్టలూ, గిన్నెలూ కొంతమంది మనుషులు పైకెత్తి పట్టుకున్నారు. ఆ తర్వాత మాసిడోనియన్ రాజు రథం, అతని సొంత ఆయుధాలతో సహా వచ్చింది. ఆయుధాలమీద అతని కిరీటం వుంది.

రాజు సంతానం – యిద్దరు కొడుకులూ, ఒక కూతురూ – రథం వెనుకనే నడుస్తూ వున్నారు. వాళ్ళు మరీ పసివాళ్ళైనందున తమకు సంభవించిన దురవస్థను పూర్తిగా గ్రహించలేదు. పిల్లల వెనుక నల్లని దుస్తులలో రాజు నడుస్తున్నాడు. అపారమైన దుఃఖంతో అతను పిచ్చివాడిలా వున్నాడు.

బంగారు జరీ ఎర్ర దుస్తులు ధరించిన సర్వ సేనాధిపతి మహా వైభవోపేతమైన రథంలో కూర్చున్నాడు. అతని సైనికులందరూ, చేతుల్లో లారెల్ రెమ్మలు పట్టుకొని, పాటలు పాడుతూ అతనివెనుక నడిచారు.

? **1.** మొదటి రెండు ప్యూనిక్ యుద్ధాలకీ, మూడవ ప్యూనిక్ యుద్ధానికీ మధ్య ప్రధానమైన భేదం యేమిటి? **2.** క్రీ.పూ. 74 నాటికి రోమ్ ఆక్రమించుకున్న భూప్రాంతాలను మాప్‌లో చూపించండి. **3.** రాష్ట్రం అంటే యేమిటి? రాష్ట్రాల్లోని పరిస్థితిని వివరించండి. **4.** అలెగ్జాండర్ ది గ్రేట్ సామ్రాజ్యం విచ్ఛిన్నమయ్యాక ఏర్పడిన యే రాష్ట్రాలు క్రీ.పూ. 2వ శతాబ్దిలో రోమ్‌కి వ్యతిరేకంగా పోరాడాయి? వాటి గతి యేమైంది? **5.** ఫలాంక్స్, లీజియన్ వ్యూహాలను పోల్చి చూడండి. ఏ వ్యూహం మెరుగైనది? ఎందుకని?

## §49. క్రీ.పూ. 2వ–1వ శతాబ్దాల్లో రోమ్‌లో బానిస యాజమాన్యం

ప్రాచీన గ్రీసులో మనుషులు ఎలా బానిసలయ్యారో జ్ఞాపకం చేసుకోండి (§ 35; 1); గ్రీసులో బానిసలు ఏయే పనులు చేసేవాళ్లు (§ 35; 3)?

**1. రోమ్‌లో బానిసల సంఖ్య పెరుగుదల.** రోమ్ చేసిన యుద్ధాల్లో చిక్కిన లక్షలకొలది ఖైదీలు బానిసలుగా మార్చబడేవాళ్లు. రాష్ట్రాలు క్రూరంగా దోచుకోబడేవి. దానితో రోమ్‌లో బానిసల సంఖ్య ముందెన్నడూ లేనంతగా పెరిగింది. ఓడ దొంగలు చాలామందిని పట్టుకొని, వాళ్లని ఖైదీలుగా అమ్ముతూండేవాళ్లు.

రోమ్ ఆక్రమించుకున్న ప్రాంతాల్లో వందలకొలది బానిస మార్కెట్లు వుండేవి. అలాంటి మార్కెట్లలో ప్రధానమైనది ఏగేయన్ సముద్రంలోని డెలోస్ ద్వీపంలో వుండేది. అక్కడ రోజుకి 10,000 మందిదాకా బానిసలు విక్రయింపబడేవాళ్లు. ప్రత్యేకించి చాలామంది బానిసలు ఇటలీకి తరలించబడ్డారు.







1, 2, 3, 4. రోమ్‌లో శ్రమచేస్తున్న బానిసలు: చేతి గానుగ తిప్పుతున్న బానిస; బరువైన నిర్మాణ సామగ్రిని పైకి లేపే చక్రాన్ని తిప్పుతున్న బానిసలు; నాగలితో దున్నుతున్న బానిస; ఉన్ని వస్త్రాలు నేస్తున్న బానిస (ప్రాచీన రోమన్ చిత్రాలు). 5. చిత్రహింసలు పెట్టబడుతున్న బానిస (ప్రాచీన రోమన్ బొమ్మ)



1

1. ఆధునిక ఫ్రాన్సు దక్షిణ ప్రాంతంలోని ఒక రోమన్ ఆంఫిథియేటర్ (ఫొటో). 2. గ్లేడియేటర్ల యుద్ధం (ప్రాచీన రోమన్ చిత్రం). ఒక గ్లేడియేటర్ తన ప్రత్యర్థి మీదకి వల విసిరి, శూలంతో అతన్ని పొడిచేందుకు ప్రయత్నిస్తున్నాడు. కుడిపక్కన ఆ మల్లులను పోరాడవలసిందిగా పురిగొల్పుతున్న వ్యక్తి. 3. బానిస మెడ కడియం




2



3

**2. బానిస శ్రమ వినియోగం.** ప్రాచీన తూర్పు దేశాలకీ, గ్రీసుకీ భిన్నంగా, ఇటలీలో చాలామంది బానిసలు వ్యవసాయంలో వినియోగింపబడేవాళ్లు. రోమన్ ప్రభువర్గీయులు ఉమ్మడి భూమి నుంచి పెద్దపెద్ద ఖండాలను భుక్తంచేసుకోవడమే కాకుండా, రైతులనుంచి కూడా పొలాలు కొనేవాళ్లు. పెద్ద ఎస్టేట్ల సంఖ్య వేగంగా పెరిగింది. అక్కడ బానిసలు బరువైన నాగళ్లతో పొలం దున్నేవాళ్లు; కొయ్య నాగళ్లతోనూ, పారలతోనూ నేలను కెళ్లగించేవాళ్లు; ధాన్యం రాలగొట్టేవాళ్లు; ద్రాక్షనుండి రసమూ, ఆలివ్ గింజలనుండి నూనె తీసేవాళ్లు. పశువుల మందల్ని మేపేవాళ్లు (పేజి 236, వర్ణ చిత్రం 18 చూడండి).

వెండి గనుల్లో సుమారు 50,000 మంది బానిసలు పనిచేసేవాళ్లు. పెద్ద నౌకలకి 150–200 మంది తెడ్లు వేసేవాళ్లు ఉండేవాళ్లు. ఒక పెద్ద తెడ్డు 5–6గురు మనుషులు వేసేవాళ్లు. బానిసలు రోడ్లు వేసేవాళ్లు, భవనాలు నిర్మించేవాళ్లు. ఒక కార్ఖానాలో లేక నౌకా నిర్మాణశాలలో కొన్ని డజన్లమంది లేక కొన్ని వందల మందిదాకా సైతం బానిసలు ఉండేవాళ్లు.

**3. బానిసల పని పరిస్థితులు.** రోమన్ బానిస యజమానులు బానిసలను మనుషులుగా లెక్కించలేదు. వాళ్ల దృష్టిలో పనిముట్లు అనేక రకాలు: మూగ పనిముట్లు, అరిచే పనిముట్లు, మాట్లాడే పనిముట్లు. బండ్లూ, నాగళ్లూ మొదటి రకం. యెద్దులు రెండవ రకం. బానిసలు మూడవ రకం. బానిస తన సొంత పేరు కోల్పోయేవాడు. అతనికి యేదో ఒక మారుపేరు, తరుచు అవహేళనకరమైంది, పెట్టబడేది. లేకపోతే, పూరక ''పర్షియన్'' అనీ, ''ఈజిప్షియన్'' అనీ పిలిచేవాళ్లు.

బానిస యజమానులు బానిసలపట్ల దయాదాక్షిణ్యాలు చూపించక, వాళ్లచేత గొడ్డు చాకిరీ చేయించేవాళ్లు. నాట్లు, కుప్ప నూర్పుల సమయాల్లో బానిసలచేత రోజుకి 18 గంటలదాకా పనిచేయించేవాళ్లు. ధాన్యం విసిరే బానిసల మెడల్లో కొయ్య చక్రాలు తగిలించి, ఆకలిగొన్న బానిస గుప్పెడు పిండి నోట పెట్టగలిగే అవకాశం లేకుండా చేసేవాళ్లు. యజమాని బానిసకి ఏడాదికి ఒక్క చొక్కా యిచ్చేవాడు. ఏడాది గడిచే సరికి అది పీలికలు అయ్యేది. అయితే ఆ గుడ్డ పీలికలు సైతం బానిసకి చెందివుండేవి కావు. గుడ్డ పీలికలతో బొంతలు తయారుచెయ్యబడేవి.

బలిష్ఠుడైన యువక బానిస కొద్ది సంవత్సరాల్లో వికలాంగుడయ్యేవాడు. కృశించి, యిక యెంతమాత్రమూ పని చేయలేని స్థితిలో వున్న బానిసలను ఒక నిర్జనమైన దీవికి తీసుకుపోయి, అక్కడ వదలిపెట్టేవాళ్లు. వాళ్లు ఆకలి దప్పులతో మరణించేవాళ్లు. వాళ్ల స్థానంలో యజమాని బలమైన కొత్త బానిసలను కొనేవాడు.

### 4. గ్లాడియేటర్లు.

అత్యంత లాఘవం కలిగి, మిక్కిలి బలశాలురైన బానిసలకు రోమన్లు ఆయుధ శిక్షణ యిచ్చి, వాళ్లు ఒకరితో ఒకరు పోరాడేటట్లు చేసి వినోదించేవాళ్లు. అలాంటి బానిసలను గ్లాడియేటర్లు అనేవాళ్లు. వాళ్లకు ఆయుధాలు వాడడం నేర్పించి, జైళ్లలో వుంచేవాళ్లు.

గ్లాడియేటర్ల పోరాటాలు ఆంఫిథియేటర్లలో జరిగేవి. అవి ఆధునిక సర్కస్‌లవలె వుండేవి. అవి ప్రత్యేకంగా ఆ పోరాటాలకోసం నిర్మించబడినవి. దాని కేంద్రంలో యిసుక కప్పిన రంగస్థలం వుండేది. దాని చుట్టూ ప్రేక్షకుల ఆసనాల గేలరీలు వుండేవి. అలాంటి ఆంఫిథియేటర్లు ఇటలీలోని దాదాపు అన్ని పెద్ద నగరాల్లోనూ, రాష్ట్రాల్లోనూ నిర్మింపబడ్డాయి. గ్లాడియేటర్లు రోమన్ పండగల రోజుల్లో పోరాడేవాళ్లు. వాళ్లు జతలు జతలుగా పోరాటం చేసేవాళ్లు. కాని ఒకోసారి పెద్ద బృందాల మధ్య పోరాటాలు యేర్పాటుచేసేవాళ్లు. (గ్లాడియేటర్లు సాధారణంగా ఎలాంటి ఆయుధాలతో పోరాడేవాళ్లు? చిత్రం 2 చూసి వర్ణించండి.)

తగినంత సాహసం ప్రదర్శించని వాళ్లను కొరడాలతోనూ, పదునైన ఈటెలతోనూ అదిలించేవాళ్లు.

ఓడిపోయిన గ్లాడియేటర్ యింకా సజీవంగా వుంటే, అతని అదృష్టాన్ని ప్రేక్షకులు నిర్ణయించేవాళ్లు. ప్రేక్షకులు తమ చేతులు పైకెత్తితే, అతన్ని ప్రాణంతో వదిలేవాళ్లు; ప్రేక్షకులు తమ బొటనవ్రేళ్ల కిందికి వంచితే, అతన్ని గెలిచిన గ్లాడియేటరు పొడిచేసేవాడు. మృతదేహాలను సేవకులు కొక్కాలతో యీడ్చుకపోయేవాళ్లు (వర్ణ చిత్రం 19 చూడండి). గ్లాడియేటర్లచేత సింహాలు, పులులు, మొదలైన క్రూర జంతువులతో కూడా పోరాడించేవాళ్లు.

### 5. బానిస యజమానులు బానిసలను అణచివుంచిన తీరు.

బానిసలు పారిపోకుండా నివారించేందుకుగాను రాత్రిపూట బానిసలను ఊచలున్న చిన్న కిటికీలు గల కొట్లలో పెట్టి తాళం వేసేవాళ్లు. వాళ్లలో చాలామందికి పనిచేసేటప్పుడూ, నిద్రపోయేటప్పుడూ బరువైన యినప గొలుసులు వుండేవి. వాళ్ల శరీరాల నిండా పచ్చి గాయాలు వుండేవి. తర్వాత బానిసల మెడల్లో కాలర్లు తగిలించేవాళ్లు. కాలర్‌మీద "పారిపోకుండా నన్ను పట్టుకో" అని చెక్కబడివుండేది. తరుచు బానిసల ముఖాలమీద యజమానులు తమ ప్రత్యేక గుర్తులు వాతలుగా వేయించేవాళ్లు.

మేస్త్రీలు బానిసల్ని వెయ్యి కళ్లతో కాపలా కాసేవాళ్లు. బానిసలు కుట్ర చేస్తారేమో అన్న భయంతో బానిస యాజమానులు వాళ్లు ఒకరితో ఒకరు మాట్లాడుకోవడాన్ని నిషేధించేవాళ్లు — బానిస పనిచెయ్యాలి లేదా నిద్రపోవాలి, అంతమాత్రమే. యజమానులు ఒకరి భాష మరొకరికి తెలియని బానిసల్ని విభిన్న దేశాలనుంచి కొనేందుకు ప్రయత్నించేవాళ్లు. రోమన్ బానిస యజమానుల అభిప్రాయం ప్రకారం "భయం ద్వారా తప్ప యీ చిల్లర మూకని అదుపుచెయ్యడం సాధ్యం కాదు." బానిసలను నిరంతరం భయంలో వుంచడానికి రోమన్ బానిస యజమానులు అవిధేయులను కొరడాలతో కొట్టడం,

దేహాన్ని కాల్చడం, కీళ్ళు విరవడం వంటి దారుణమైన చిత్రహింసలు పెట్టేవాళ్ళు. మరణశిక్ష విధింపబడిన బానిసని సాధారణంగా క్రాస్ మాదిరిగా అడ్డ కొయ్య వున్న నిలువు స్తంభానికి కాళ్ళూ చేతులూ విరిచి కట్టేవాళ్ళు. అలాంటి వ్యక్తి ఎండలో మలమల మాడి నెమ్మది నెమ్మదిగా భయంకరమైన చావు చచ్చేవాడు.

తమ పీడకులను ద్వేషించే బానిసలు, వాళ్ళకి వ్యతిరేకంగా భీషణమైన పోరాటం జరిపారు.

బానిసలను రోమ్ దోచుకున్నంత క్రూరంగా ప్రాచీన ప్రపంచంలో మరే దేశమూ దోచుకోలేదు. ఎక్కడా అంతమంది బానిసలు లేరు.

బానిస వ్యవస్థ రోమ్‌లో దాని శిఖర స్థాయికి చేరింది.

? 1. ప్రాచీన కాలంలో ఆర్థిక వ్యవస్థ వివిధ రంగాల్లో బానిస శ్రమ విస్తృతంగా వినియోగింపబడిందని మీరెలా వివరించగలరు? ఈ ప్రశ్నకి మీరు జవాబు చెప్పలేకపోతే మామూలుగా బానిసలు ఏ పనులు చేసేవాళ్ళో జ్ఞాపకం చేసుకోండి. 2. బానిస యాజమాన్య వ్యవస్థ తూర్పు రాజ్యాల్లో, గ్రీసులో కంటె రోమ్‌లో మరింత ఎక్కువగా అభివృద్ధి చెందిందన్న విషయం నిరూపించండి. దానికి కారణం యేమిటి? 3. ప్రాచీన ప్రపంచంలో బానిసత్వానికి మూలాధారాలు యేమిటి? లేక మనుషులు బానిసలుగా ఎలా మార్చబడేవాళ్ళు? 4. ఒక బానిస తన స్వీయ కథ చెప్పివుండేలా బానిస జీవితాన్ని వర్ణించండి.

## § 50. ఇటలీలో రైతుల వినాశం, భూమికోసం వాళ్ళ పోరాటం

(మాప్ 8)

ప్రజా ట్రిబ్యూన్ల వహించిన పాత్రను జ్ఞాపకం చేసుకోండి (§ 46; 1); క్రీ.పూ. 4వ శతాబ్దిలో గ్రీసులో రైతులూ, చేతివృత్తులవాళ్ళూ ఎందుకు దివాళాతీశారో జ్ఞాపకం చేసుకోండి (§ 42; 2).

1. ఇటలీలోకి అపారమైన బానిసల దిగుమతి వలనా, రోమన్లు రాష్ట్రాలను కొల్లగొట్టడం వలనా బానిస యజమానులు ధనవంతులయారు, కాని, ఇటాలియన్ రైతులు నాశనమయారు.

బానిస శ్రమతో భూమిని సాగుచేయడం చౌకగా వుండేది. అంతేగాక, రాష్ట్రాలనుండి చౌక ధాన్యం విస్తారంగా ఇటలీలోకి దిగుమతి అయింది. ధాన్యం ధరలు పడిపోయాయి. ధాన్యం పండించేవాళ్ళు దివాళాతీసి, తమ భూములను బానిస యజమానులకు కారుచౌకగా అమ్మేవాళ్ళు. ఆ కాలపువారి వర్ణనల ప్రకారం పెద్ద పెద్ద ప్రాంతాలు నిర్మానుష్యమయ్యాయి. అంతకు కొంచెం ముందుదాకా గ్రామాలూ, రైతుల చేలూ ఉన్న చోట్ల బానిసలు భూమి దున్నుతున్నారు, పశువులను మేపుతున్నారు. దివాళాతీసిన రైతులు, యేదో ఒక జీవనోపాధి సంపాదించుకోవచ్చుననే ఆశతో, రోమ్‌కూ, యితర



ఇటలీలోని ఒక ఎస్టేటు (క్రీ.పూ. 2–1 శతాబ్దాలు). వెనక బానిస యజమాని భవనం. ముందు ఎడమ పక్కన బానిసల బారకాసు. వాళ్లు దానిలో నిర్బంధింపబడేవారు. బానిసలు చేనులో నిగామాను పర్యవేక్షణకింద శ్రమచేస్తూండేవారు. చేను చుట్టూ ద్రాక్ష, ఆలివ్ తోటలు

నగరాలకూ పోయారు. ఉద్యోగమూ, ఉండడానికి యిల్లూ లేనివాళ్లు వేలకొలది నగరాల్లో గుమికూడేవాళ్లు. దాదాపు అన్ని పనులూ బానిసలే చేస్తూవుండటంతో, అక్కడా వాళ్లకు పని దొరకలేదు.

రైతులు భూములు కోల్పోవడంతో సైన్యంలో కొలువు చేసేవాళ్ల సంఖ్య తగ్గింది. రోమన్ సైన్యం అంతకంతకు బలహీనపడుతూవచ్చింది. క్రీ.పూ. 138లో సిసిలీలో జరిగిన బానిసల తిరుగుబాటును సైన్యం కష్టంమీద అణచివేసింది. ఆ తిరుగుబాటుతో ఇటలీ అంతటా బానిస యజమానులకు బాగా భయం పట్టుకుంది.

**2.** రైతుల వినాశం, తమ పీడకులను ద్వేషించే బానిసలను పెద్ద సంఖ్యలో పోగుచెయ్యడం రాజ్యానికి ఎంత ప్రమాదకరమో కొందరు బానిస యజమానులు గుర్తించారు. ఒక ప్లెబియన్ కుటుంబానికి చెందిన టిబెరియస్ గ్రాఖ్, గైయస్ గ్రాఖ్‌లు ఈ విషయాన్ని బాగా అర్థంచేసుకున్నారు.

ఆ సోదరులలో పెద్దవాడైన టిబెరియస్ గ్రాఖ్ సునిశిత మేధస్సు, నిజాయితీ, అసాధారణ సాహసం మూలంగా యెంతో ప్రజాభిమానం చూరగొన్నవాడు. క్రీ.పూ. 133లో అతన్ని ప్రజా సభ ట్రిబ్యూన్‌గా యెన్నుకుంది.

సమష్టి భూమిలో యే పౌరునికీ 125 హెక్టార్లకు మించి వుండకూడదనీ, ధనిక బానిస యజమానులు చట్ట వ్యతిరేకంగా అంతకంటె యెక్కువ వశపరచుకున్న అదనపు భూమిని వాపస్ తీసుకోవాలనీ, ఆ భూమిని బీదలకు, అమ్ముకునే హక్కు లేకుండా, పంచి యివ్వాలనీ పేర్కొనే ఒక ముసాయిదా బిల్లును టిబెరియస్ ప్రతిపాదించాడు. టిబెరియస్ తన యీ ప్రతిపాదనను గురించి ప్రజల ముందు ఉపన్యసించాడు. టిబెరియస్ తీవ్ర వాగ్ధాటితో తన బిల్లును ఫోరమ్‌లో పెద్ద గుంపుల ముందు సమర్థించుకున్నాడు. ప్రజానీకం అతన్ని సమర్థించారు. ఇండ్ల గోడలమీదా, స్తంభాలమీదా, సమాధి రాళ్లమీద కూడా సందేశాలు కనిపించాయి. బీదలు తమ సహాయం వాగ్దానంచేస్తూ, దీక్షతో పనిచేయాలని తమ

ట్రిబ్యూన్‌కు విజ్ఞప్తులు చేశారు. టిబెరియన్ సమావేశపరచిన ఒక పెద్ద ప్రజా సభలో భూసంస్కరణ చట్టం ఆమోదింపబడింది.

ధనిక భూస్వాములతో కూడిన సెనేట్ యీ కొత్త చట్టానికి ప్రతికూలం. కాని ప్రజల తిరుగుబాటుకు భయపడి సెనేట్ ప్రజాభీష్టాన్ని బహిరంగంగా వ్యతిరేకించలేకపోయింది. టిబెరియన్ నాయకత్వాన ఒక కమిషన్ అదనపు భూములు వశపరచుకొని, బీదలకు అప్పగించడం మొదలుపెట్టింది.

**3.** మరుసటి సంవత్సరానికి ట్రిబ్యూన్లను ఎన్నుకునేందుకు సమావేశమైన ప్రజా సభలో టిబెరియన్ రాజు కావడానికి పథకం వేస్తున్నాడని అతని శత్రువులు ఒక అబద్ధం సృష్టించి ప్రచారం చేశారు. అతను ఒక్క మాట కూడా మాట్లాడ కుండా వాళ్ళు విపరీతమైన అల్లరిచేశారు.

ఫోరమ్‌కి అనతి దూరంలో సెనేటు సమావేశంలో వుంది. తాము సృష్టించిన అబద్ధం ద్వారా టిబెరియన్‌ను తొలగించు కోడానికి మంచి అవకాశం లభించిందని సెనేటర్లు గుర్తించారు. "రిపబ్లిక్‌ను కాపాడండి" అని సెనేటర్లకు వాళ్ల నాయకుడు పిలుపు ఇచ్చాడు. అందరూ చౌకులోకి పరుగెత్తారు. మామూలు ప్రకారం ప్రజలు వాళ్లకు దారి యిచ్చారు. సెనేటర్లు బెంచీలు పగలగొట్టి, ఆ పలకలతో నిరాయుధుడైన టిబెరియన్‌నూ, అతని సహచరులు 300 మందినీ చంపారు. మృతదేహాలను టైబర్ నదిలో వేశారు; నేరస్తుల దేహాలు మాత్రమే అలా వేసేవాళ్లు. దానితో భూమి పంపిణీ నిలిచి పోయింది.

**4.** తన అన్న పనిని కొనసాగించడానికి గైయస్ గ్రాఖ్ అనేక ప్రయత్నాలు చేశాడు. క్రీ.పూ. 123లో అతను ప్రజల ట్రిబ్యూన్‌గా యెన్నికై, భూమి పంపిణీని తిరిగి మొదలుపెట్టాడు. గ్రాఖ్ సోదరుల కార్యకలాపాల మూలంగా సుమారు 80,000 మంది బీదవాళ్లకు భూమి లభించింది.

పిడికెడుమంది సంపన్న ప్రభువర్గీయులు రోమ్‌ను పాలించడం న్యాయం కాదన్న విషయాన్ని గైయస్ గ్రాఖ్ గ్రహించాడు. సెనేట్ అధికారాలను కుదింపజేసి, బీదవాళ్ల పాలనకి మార్గాన్ని సుగమంచేసేందుకు అతను ప్రయత్నించాడు.



రోమ్‌లోని వ్యావసాయిక పనిముట్లు: కొడవలి, పండ్లకోల, తోట కత్తి, తవ్వు గొడ్డలి

సెనేట్‌తో పోరాడేందుకుగాను రోమ్, ఇటలీల్లోని స్వతంత్ర పౌరులందర్నీ సమైక్యంచేసేందుకు గైయస్ ప్రయత్నించాడు. కాని, జనాభాలో కొంత భాగం మాత్రమే అతన్ని బలపరిచారు. గైయస్ అధికారాన్ని చేజిక్కించుకునేందుకు ప్రయత్ని స్తున్నాడని సెనేట్ ఆరోపించింది. గైయస్ ట్రిబ్యూన్ పదవీకాలం ముగియగానే గ్రాఖ్‌మీదా, అతన్ని బలపరిచేవాళ్ల మీదా సైనికులూ, సాయుధ బానిస యజమానులూ దాడిచేశారు. గైయస్ తల నరికినవానికి ఆ తల యెత్తు బంగారు వాగ్దా నం చేయబడింది. రోమ్ నగర వీధుల్లో పోరాటం చెలరేగింది. పోరాటంలో గైయస్ గ్రాఖ్, సెనేట్‌కి వ్యతిరేకంగా అతను జరిపిన పోరాటంలో అతన్ని సమర్థించిన 3,000 మంది దారుణంగా చిత్రవధ చేయబడ్డారు.

భూముల పంపిణీ తిరిగి ఆగిపోయింది. సమష్టి భూమిలోని పొలాల అమ్మకాన్ని అనుమతిస్తూ త్వరలోనే ఒక కొత్త చట్టం చేయబడింది. గతంలో లాగే మళ్లీ రైతుల వినాశం, వాళ్ల పొలాలు ధనవంతుల చేతుల్లోకి పోవడం కొనసాగాయి.

**5.** సైన్యానికి అదనపు బలాలు సంపాదించడానికి గతంలో సైనికులు కావడానికి యెన్నడూ అంగీకరింపబడని బీద ప్రజలను సేనాధిపతులు సమకూర్చుకోవలసివచ్చింది. తిండికి లేక పస్తులుండేవాళ్లు చాలామంది జీతం కోసం సైన్యంలో చేరేం దుకు సిద్ధపడ్డారు.

క్రీ.పూ. 2వ శతాబ్ది అంతంలోనూ, మొదటి శతాబ్ది తొలి దశలోనూ రోమన్ సైన్యం మళ్లీ బలపడింది. కాని, దాని సాంఘిక సంపుటిలో మార్పు వచ్చింది. ఇప్పుడు అందులో వున్నది ప్రధానంగా యెవరు యెక్కువ డబ్బు యిస్తే వాళ్ల సేవ చేయడానికి సిద్ధంగా వుండే కిరాయి సైనికులు.

## ఒక గ్రీకు చరిత్రకారుడు రాసిన గ్రంథంనుంచి

రైతులకి భూమి యివ్వాలని టిబెరియస్ గ్రాఖ్ డిమాండు చెయ్యడానికి మూల కారణం యేమిటి?

సైనిక సేవకు అనర్హులూ, తమ యజమానులపట్ల యెప్పుడూ విశ్వాసం లేనివాళ్లూ అయిన బానిసలను గురించి గ్రాఖ్ ఆగ్రహంతో మాట్లాడాడు. కొద్ది కాలం క్రితమే సిసిలీలో బానిసల మూలంగా బానిస యజ మానులెలా బాధపడిందీ, ఆ బానిసలతో యుద్ధం చేయడం రోమ్‌కు యెంత కష్టమైందీ, ఆ పోరాటం యెన్నాళ్లు సాగిందీ, అది యెంత ప్రమాదకరంగా వుండిందీ అతను జ్ఞాపకంచేశాడు.

## ప్లుటార్క్ రాసిన టిబెరియస్ గ్రాఖ్ జీవిత చరిత్రనుంచి

టిబెరియస్ బీదవాళ్లను సమర్థిస్తూ వేదిక చుట్టూ వున్నవాళ్లతో మాట్లాడినప్పుడు అతను ఖండితంగా అప్రతిహతంగా తయారయ్యేవాడు. అతను యిలా చెప్పేవాడు: "ఇటలీలో తిరిగే అడవి జంతువులకు కూడా నిద్రపోడానికి తమతమ బొరియలూ, గుహలూ వున్నాయి; కాని ఇటలీ కొరకు పోరాడి, ప్రాణాలర్పించేవాళ్లకు గాలీ, వెలుతురూ మాత్రమే వున్నాయి. వాళ్లకు శాశ్వతమైన నివాస గృహాలు లేవు; తమ భార్యా బిడ్డలతో నిలకడ లేకుండా తిరుగుతూంటారు. ప్రపంచ పరిపాలకులనబడే సైనికులు యితర్ల ఐశ్వర్యంకోసమూ, వైభవంకోసమూ పోరాడి ప్రాణాలర్పిస్తున్నారు. వాళ్లని విశ్వ విజేతలు అంటున్నారు కాని, వాళ్లకు బెత్తెడు భూమి కూడా లేదు."

? 1. రోమ్ యుద్ధాలు దాని సైన్యం బలహీనపడేందుకు ఎందుకు దారితీశాయి? 2. సెనేట్ ప్రతిఘటించినప్పటికీ భూసంస్కరణ చట్టం ఎందుకు ఆమోదింపబడింది? గ్రాఖ్‌లకు వ్యతిరేకంగా సెనేట్ వినియోగించిన సాధనాలు యేమిటి? 3. గ్రీకు, రోమన్ చరిత్ర ఆధారంగా, రైతుల, చేతిపనివాళ్ల స్థితిమీద బానిస యాజమాన్య వ్యవస్థ ప్రభావాన్ని నిర్ధారణ చేసి, మీ వాదాన్ని నిరూపించండి. 4. క్రీ.పూ. 2వ శతాబ్ది చివర రోమన్ సైన్యపు సంపుటిలో ఏమి మార్పులు సంభవించాయి? ఈ మార్పులకి కారణం యేమిటి? 5. §50లోని పేరాలకి శీర్షికలు సూచించండి. 6. రెండవ ప్యూనిక్ యుద్ధాంతానికీ, టిబెరియస్ గ్రాఖ్ భూసంస్కరణ చట్టం ఆమోదింపబడే నాటికీ మధ్య ఎన్ని సంవత్సరాల వ్యవధి వుంది?

## § 51. స్పార్టకస్ నాయకత్వంలో బానిసల తిరుగుబాటు

(మాప్ 9అ)

ప్రాచీన ప్రపంచంలో దోపిడికి గురైనవాళ్ల తిరుగుబాట్లను జ్ఞాపకం చేసుకోండి.

1. తిరుగుబాటు ప్రారంభం. క్రీ.పూ. మొదటి శతాబ్దిలో ఇటలీలో బానిసల సంఖ్య పెరుగుతూ వచ్చింది. వాళ్ల జీవితం దుర్భరంగానే కొనసాగింది. అందువల్ల బానిస యజమానులకి వ్యతిరేకంగా బానిసల కొత్త తిరుగుబాట్లు జరిగాయి.

కాపువా నగరంలో గ్లేడియేటర్ల పెద్ద స్కూలు ఒకటి వుండేది. క్రీ.పూ. 74లో దానిలో ఒక కుట్ర జరిగింది. గ్లేడియేటర్లు తిరుగుబాటుకి రహస్య సన్నాహాలు మొదలుపెట్టారు. గ్లేడియేటర్లు వుండే స్కూలు కాపలాదార్లకి యీ రహస్యం తెలిసిపోయింది. కుట్రదారుల్లో కొన్ని డజన్లమంది తప్పించుకు పారిపోగలిగారు. వాళ్లు వెసూవియస్ పర్వతపు శిలామయమైన అగ్రంమీద దాక్కున్నారు.

వాళ్లు స్పార్టకస్‌ను నాయకునిగా యెన్నుకున్నారు. అతను ఉత్తర బాల్కన్ ద్వీపకల్పం వాడు. రోమన్లకు ఖైదీగా చిక్కినవాడు. నిర్బంధంనుండి తప్పించుకుపోడానికి ప్రయత్నించినందుకు శిక్షగా అతన్ని గ్లేడియేటరుగా చేశారు.

మొదట గ్లేడియేటర్లకు సూదిగా చెక్కిన కర్రలూ, చాకులూ తప్ప యే ఆయుధాలూ లేవు. ద్రాక్ష తీగలతో డాళ్లు అల్లుకున్నారు. సాహసికులు బానిస యజమానుల ఎస్టేట్లమీదా, బండ్ల సమూహాలమీదా దాడిచేసి, ఆయుధాలు సంపాదించారు. స్థానిక ఎస్టేట్ల బానిసలు వాళ్లతో కలియనారంభించారు.

బానిసల పర్వతావాసాన్ని 3,000 మందితో కూడిన రోమన్ సైనిక దళం చుట్టుముట్టింది. కిందికి వచ్చే ఒకే దారిని సైనికులు అడ్డగించారు. ఆకలికి తట్టుకోలేక బానిసలు లొంగుతారని రోమన్లు ఆశించారు. కాని, బానిసలు ద్రాక్ష తీగలతో పొడుగాటి నిచ్చెనలు తయారుచేసి అర్ధరాత్రిపూట నిటారుగా వున్న కొండ చరియ దిగారు. అక్కడ మనుషులు దిగడం అసంభవమని రోమన్లు అనుకొన్నారు, అందువలన అక్కడ కావలి పెట్టలేదు. తిరుగుబాటుదార్లు హఠాత్తుగా రోమన్ సైనిక దళంమీద దాడిచేసి, దాన్ని నాశనం చేశారు (వర్ణ చిత్రం 20 చూడండి).



డాలును సాగకొడుతున్న కమ్మర్లు (ప్రాచీన ఉబ్బెత్తు చిత్రం)

## 2. స్వేచ్ఛకోసం యాత్ర.

తిరుగుబాట్ల విజయాలను గురించిన వార్త మెరుపులాగా దేశమంతటా వ్యాపించింది. యావత్తు ఇటలీనుండీ బానిసలు తమ యజమానులనుంచి పారిపోయి స్పార్టకస్ దళంలో చేరుతూ వచ్చారు. వాళ్లు తమ కర్మకి లొంగివుండడానికి నిరాకరించారు.

క్రీ.పూ. 73 శరదృతువు నాటికి స్పార్టకస్ సైన్యంలో కొన్ని పదుల వేల బానిసలు వున్నారు. వాళ్లలో గాల్‌లూ, సిరియన్లూ, మాసిడోనియన్లూ, యింకా అనేక జాతులవాళ్లూ వున్నారు. భిన్న భాషలు మాట్లాడుతూ, తరుచు ఒకరి మాట ఒకరికి అర్థంకాని సైనికుల్లో స్పార్టకస్ కఠిన క్రమశిక్షణ అమలులో పెట్టాడు. ఈ బానిసల సమూహంనుండి స్పార్టకస్ కాల్బలం, ఆశ్విక దళం, రికాన్నిజాన్స్ దళాలతో కూడిన రోమన్ సైన్యం లాంటి సైన్యం ఒకదాన్ని సంఘటితం చేశాడు. సైనిక శిబిరంలో కమ్మరివాళ్లు రేయింబగళ్లు ఆయుధాలు తయారుచేస్తూ వుండేవాళ్లు.

స్పార్టకస్ తన సైనికులను ఉత్తరానికి నడిపించాడు. వాళ్లని ఇటలీ వెలుపలికి నడిపించాలని స్పార్టకస్ అనుకున్నాడు. అందరూ తమ తమ స్వదేశాలకు పోవచ్చునని అతని ఉద్దేశం.



క్షతగాత్రుడైన స్పార్టకస్ (పాంపేయీ నగరపు గోడమీది ఒక చిత్రానికి నకలు)

తిరుగుబాటు సైన్యం ఎంత ప్రమాదకారియో సెనేట్ గ్రహించింది. తిరుగుబాటుదార్లతో పోరాడడానికి సెనేటు యిద్దరు కాన్సల్లనూ, సైన్యాలనూ పంపింది. కాన్సల్లు స్పార్టకస్‌ని విడిచివెళ్లిన బానిసలను హతమార్చారు. తిరుగుబాటు దార్లను చుట్టుముట్టి ప్రధాన శక్తులను యుద్ధంలో తుడిచివెయ్యాలని కాన్సల్లు అనుకున్నారు. కాని స్పార్టకస్ వాళ్ల ఎత్తుగడలు ముందుగా ఊహించి వాళ్ల సైన్యాలు కలవడానికి వ్యవధి యివ్వకుండా వాళ్లను విడివిడిగా ఓడించాడు.

తిరుగుబాటుదార్లు ఇటలీలో దక్షిణంనుండి ఉత్తరానికి పోరాడుతూ పోయి, పో నదీ మైదానం చేరారు. ఇక స్వాతంత్ర్యం పొందడానికి ఆల్ప్స్ పర్వతాలు మాత్రమే అడ్డం వున్నాయి. చాలామంది బనిసలు ఇటలీనుండి పోవడానికి యిష్టపడలేదు. స్పార్టకస్ వెనుదిరిగాడు.

3. గుంటలో చిక్కిన తిరుగుబాటుదార్లు.

స్పార్టకస్ తన సైన్యంతో వెనక్కి వస్తున్నాడనే వార్త తెలిసి బానిస యజమానులు చాలా భయపడ్డారు. వాళ్లు తొందర తొందరగా ఒక పెద్ద సైన్యం సమీకరించారు. బానిస యజమానులే చాలామంది స్వయంగా బానిసలతో పోరాడడానికి బయలుదేరారు. మార్కస్ లిసినియస్ క్రాసస్ అనే గొప్ప ధనవంతుడు వాళ్ల సైన్యానికి నాయకత్వం వహించాడు. స్పెయిన్‌నుండీ, బాల్కన్ ద్వీపకల్పంనుండీ సెనేట్ కొన్ని సైన్యాలను రప్పించింది.

రోమ్‌ను ముట్టడించడానికి తగిన బలం తన సైన్యానికి లేదని స్పార్టకస్‌కి తెలుసు. కనుక అతను తన సైన్యాన్ని దక్షిణ ఇటలీకి నడిపించాడు. క్రాసస్ సైన్యాలు దారికి అడ్డుపడ్డాయి. ఆ లీజియన్లను స్పార్టకస్ సైన్యాలు తుడిచివేశాయి. తిరుగుబాటుదారుల సైన్యం అంటే రోమన్లకు యెంత విపరీతమైన భయం అంటే, అనేక సార్లు స్పార్టకస్ దళాలు సమీపించడమే తడవు మహా కీర్తి వహించిన సైన్యాలు భయంతో పలాయనం చేశాయి. సైనికుల్లో క్రమశిక్షణను పునరుద్ధరించేందుకుగాను తిరుగుబాటుదారుల ముందు పలాయనం చేసిన తన సైనిక దళాల్లో ప్రతి పదిమందిలో ఒకడికి చొప్పున క్రాసస్ మరణ శిక్ష విధించాడు.

స్పార్టకస్ సైన్యం అపెనైన్ ద్వీపకల్పంలోని నైరుతి అగ్రం చేరింది. అతని ఉద్దేశం అక్కడనుండి సిసిలీకి దాటి, అక్కడ బానిసల తిరుగుబాటు లేవదీయాలని. వాళ్లను సిసిలీకి చేరవేస్తామని సముద్రపు దొంగలు వాగ్దానంచేసి, పెద్ద మొత్తం డబ్బు తీసుకుని మోసం చేశారు. బానిసలు తెప్పలు నిర్మించుకొన్నారు కాని, అవి ఒక తుపానులో ముక్కచెక్కలైనాయి. సిసిలీ అంత దగ్గరగా వుండి కూడా తిరుగుబాటుదార్లకు చేరరానిదయింది.

స్పార్టకస్ సైన్యంమీద బాహాటంగా దాడిచేసే ధైర్యం లేదు క్రాసస్‌కు. అగ్రాన్ని యితర ఇటలీ భూభాగంతో కలిపే భూ సంధిని అతను ఆక్రమించుకొన్నాడు. రోమన్లు ఒక లోతైన కందకం తవ్వి, భూ సంధికి అడ్డంగా ఒక మట్టికట్ట కట్టారు. బానిసలు దిగ్బంధంలో యిరుక్కున్నారు. వాళ్లు ఆకలి బాధకి గురైయ్యారు.

4. "ఆకలితో కంటె ఖడ్గంతో చావడం మేలు."

స్పార్టకస్ తన సైనికులతో మాట్లాడాడు. ఆకలితో చావడం కంటె ఖడ్గంతో చావడం మేలని అతను చెప్పాడు. అతను తన అనుచరులలో సమర దీక్ష రేకెత్తించాడు. చలికాలంలో ఒక తుపాను రాత్రి అతను క్రాసస్ రక్షణలమీద దాడిచేశాడు. కందకంలో కొంత భాగాన్ని వాళ్లు మట్టితో పూడ్చి, మట్టికట్టను వశపరచుకొని, గుంటనుండి బయటపడ్డారు. బానిసల్లో కొందరు మళ్లీ స్పార్టకస్ సైన్యాన్ని విడిచి వెళ్లిపోయారు. క్రాసస్ హఠాత్తుగా చేసిన దాడిలో వాళ్లందరూ మరణించారు.

ఆ సమయానికి బాల్కన్ ద్వీపకల్పంనుండి ఉపసంహరింపబడిన సైనిక దళాలు వచ్చి ఇటలీలో దిగుతున్నాయి. స్పెయిన్ నుండి మరికొన్ని సేనలు పాంపేయ్ నాయకత్వాన వస్తూ వున్నాయి. రోమన్ సైన్యాలు ఒకదానితో ఒకటి కలవకుండా, స్పార్టకస్ ముందుగానే క్రాసస్‌మీద దాడిచేశాడు.



తిరుగుబాటుచేసిన బానిసలను శిలువ నెక్కించి చంపడం (ఆధునిక చిత్రకారుడు గీసిన చిత్రం)

### 1. ఆఖరి యుద్ధం.

స్పార్టకస్‌కూ, రోమన్లకూ మధ్య క్రీ.పూ. 71లో ఆఖరి యుద్ధం జరిగింది. క్రాసస్‌ను సమీపించి అతన్ని చంపాలనీ, రోమన్లను నాయకుడు లేని వాళ్లనుగా చేయాలనీ స్పార్టకస్ ప్రయత్నించాడు. అతని బలమైన ఖడ్గ ప్రహారాలకు యిద్దరు రోమన్ సేనాధిపతులు నేలకొరిగారు. అప్పుడొక రోమన్ సైనికుడు యెదురుగా వచ్చే సాహసం లేనివాడు, వెనుకనుండి స్పార్టకస్‌ను ఈటెతో పొడిచాడు. కవచ రక్షితంగాని తొడలో ఈటె దిగబడింది. అయినా స్పార్టకస్ వెనుకడుగు వేయలేదు. ఒంటి మోకాలిమీదనే అతను పోరాటం సాగించాడు. రోమన్లు అతన్ని సజీవంగా పట్టుకోలేకపోయారు. పోరాటంలో స్పార్టకస్ శరీరం ఛిద్రమై పోవడంతో యుద్ధరంగంలో అతని శరీరం దొరకలేదు.

తిరుగుబాటుదారులు తుది పోరాటంలో అత్యంత ధైర్య సాహసాలతో పోరాడారని రోమ్‌లో చెప్పకునేవాళ్లు. కాని, శత్రువులకి సంఖ్యాధిక్యత వుంది. బానిస సైన్యం ఓడిపోయి, చెదిరిపోయింది.

ఆ సమయానికి అక్కడికి చేరిన పాంపేయ్ సైన్యాలు యుద్ధానంతరం హతశేషులైన బానిసలను తుదముట్టించారు. ఖైదీలుగా చిక్కినవాళ్లను శిలువవేశారు. కాపువానుండి రోమ్‌కు పోయే దారి పొడుగునా బానిసలను శిలువవేసిన 6,000 గుంజలు బారులు తీరివున్నాయి.

రోమన్ బానిస యాజమాన్య రాజ్యం కష్టంమీదనే అయినప్పటికీ, బానిసల తిరుగుబాటును అణచివేసే తన ప్రధాన కర్తవ్యాన్ని పూర్తిచేసింది. అప్పటికీ దాని వశంలో పెద్ద సైనిక బలగాలు వున్నాయి.

---

బానిసలూ, బానిస యజమానులూ అనే రెండు వర్గాల మధ్య సమన్వయం సాధ్యం కాని పోరాటం ప్రాచీన ప్రపంచమంతటా జరుగుతూవచ్చింది. బానిస యాజమాన్యం అత్యున్నత స్థాయిలో వున్న రోమ్‌లో బానిసల పోరాటం ప్రచండమైన స్థాయిని అందుకుంది; మరీ ద్వేషంతో, పట్టుదలతో సాగింది.

? **1.** తిరుగుబాటుదారులు ఎక్కడికి పురోగమించారో, పోరాటాలు జరిగిన ప్రాంతాలు యేమిటో మాప్‌మీద చూపించండి. **2.** తిరుగుబాటుదారుల సాహసాన్నీ, తిరుగుబాటు నాయకుడుగా స్పార్టకస్ అపార సామర్థ్యాలనీ తెలిపే సందర్భాలను పేర్కొనండి. **3.** § 48, 51లను ఆధారంచేసుకుని బానిస యాజమాన్య రాజ్యపు రెండు ప్రధాన కర్తవ్యాలు యేమిటో పేర్కొనండి. **4.** స్పార్టకస్ నాయకత్వాన జరిగిన బానిసల తిరుగుబాటు ఎన్నేళ్లు కొనసాగింది? స్పార్టకస్ తిరుగుబాటా లేక చైనాలో పసుపుపచ్చ తలపాగాల తిరుగుబాటా – వీటిలో ఏది ముందు జరిగింది, ఎన్నేళ్లు ముందు జరిగింది? **5.** ఈకింది ఘటనల్లో యేదో ఒకదాన్ని, దానిలో మీరొక భాగస్వామి అన్నట్లు వర్ణించండి: (అ) కాపువాలో గ్లేడియేటర్ల కుట్ర, వాళ్ల పరారీ; (ఆ) వెసూవియస్ అగ్రంనుంచి కిందికి దిగడం, రోమన్లకి వ్యతిరేకంగా పోరాటం; (ఇ) తిరుగుబాటుదారులు క్రాసస్ రక్షణ స్థావరాల గుండా చీల్చుకొని వెళ్లడం.

---

క్రీ.పూ. 3వ శతాబ్దికీ, క్రీ.పూ. 1వ శతాబ్ది అరంభానికీ మధ్య రోమ్‌లో సంభవించిన మార్పులు యేమిటి?

అ) రోమన్ రిపబ్లిక్ భూప్రాంతం ఎలా మారింది? ప్యూనిక్ యుద్ధాల ఆరంభం నాటికి దాని భూప్రాంతం ఎంతో, క్రీ.పూ. 74లో దాని భూప్రాంతం ఎంతో చూపించండి.

ఆ) ఇటలీలో విభిన్న వర్గాల స్థానం ఎలా మారింది? ఈ మార్పులకి కారణాలు యేమిటి?

ఇ) రోమన్ సైన్యం ఎలా మారింది? ఎందుకు మారింది?

ప్రకరణం పద్నాలుగు

# రోమ్‌లో రిపబ్లిక్ పతనం. రోమన్ సామ్రాజ్య మహాశ్శక్తి

## § 52. రోమ్‌లో సీజర్ అధికారాన్ని వశంచేసుకోవడం

(మాప్ 9)

రోమన్ రిపబ్లిక్‌లో ఎవరు అధికారం చలాయించారో జ్ఞాపకం చేసుకోండి (§ 46; 2).

1. రోమ్‌లో సేనాధిపతుల అధికారం బలపడడం.

రోమ్ ఆక్రమణ యుద్ధాలు, సైన్యం కిరాయి సైనిక శక్తిగా మారడం సేనాధిపతుల అధికారం బలపడేందుకు దారితీసింది. యుద్ధాలు సాగించేందుకు సైనికులను సైన్యంలో చేర్చుకొనే బాధ్యతని సెనేట్ అనుభవశాలురైన సేనా నాయకులకి అప్పగించింది. సైనికులకు వారినుంచి జీతమూ, కొల్ల సొమ్ములో కొంత భాగమూ ముట్టేవి. లీజియన్లలోని సైనికులు తమ సేనా నాయకుల ఆజ్ఞల్ని మాత్రమే పాటించేవాళ్లు, వాళ్లు ఎవరిమీదంటే వాళ్లమీద పోరాడేందుకు సంసిద్ధంగా ఉండేవాళ్లు.

రోమును యెవరో ఒక్క బలమైన సేనాధిపతి పాలించాలని బానిస యజమానులు చాలామంది అనుకున్నారు. కాన్సుళ్ల కంటె, సెనేట్ కంటె, ఉత్సాహపరుడైన సేనాధిపతి పీడితులమీద, బీదవాళ్లమీద తమ అధికారాన్ని బాగా పదిలపరచగలడని వాళ్లు ఆశించారు. వాళ్లు రోమ్‌లో అలాంటి వ్యక్తి అధికారం స్థాపించాలని తలిచారు. క్రీ.పూ. 71లో బానిసలను నిర్దాక్షిణ్యంగా అణచివేసిన పాంపేయ్ అందుకు తగిన వ్యక్తిగా కనిపించాడు.

జూలియస్ సీజర్ కూడా అధికారం అపేక్షించాడు. అతను పాట్రీషియన్ కులీన వంశానికి చెందినవాడు. అధికారమూ, కీర్తి సంపాదించాలని అతను చిన్నప్పటినుండి కలలు గన్నాడు. అచ్చం ప్రభు వంశీకుడైన సీజర్‌కు బీద రోమన్లంటే అసహ్యం. కాని అతను వాళ్లను తన స్వప్రయోజనాలకు వాడుకోవాలని అనుకున్నాడు. బీదవాళ్ల సానుభూతి సంపాదించడానికి అతను వాళ్లకు ప్రభుత్వం ఉచితంగా బ్రెడ్డు యివ్వాలని పట్టుబట్టాడు. వాళ్ల వినోదం కొరకు గ్లేడియేటర్ల పోరాటాలు పెట్టించాడు. క్రీ.పూ. 58లో సీజర్ కాన్సుల్‌గా యెన్నికయ్యాడు. ఒక యేడాది తర్వాత గాల్లియాకు గవర్నర్‌గా నియమింపబడ్డాడు.


1


2


3

1. సీజర్. 2. పాంపేయ్ (ప్రాచీన రోమన్ బస్టులు). 3. మరణోన్ముఖుడైన గాల్ (ప్రాచీన విగ్రహం)

## 2. గాల్లియా ఆక్రమణ.

గాల్‌లు పో నదీ మైదానంలో, యిప్పుడు ఫ్రాన్సు అనబడే ప్రాంతంలో నివసించేవాళ్లు. వాళ్లు అనేక తెగలుగా చీలివుండి, పరస్పరం పోరాడుతూండేవాళ్లు. సీజర్ నియామకం నాటికి పో నదీ మైదానం, దానిలో మధ్యధరా సముద్ర తీర భాగం మాత్రమే రోమ్‌కు వశమై వుండేవి. గాల్లియా దేశమంతటినీ జయించాలన్న ఉద్దేశంతో సీజర్ గాల్‌లమీద యుద్ధం ప్రారంభించాడు.

గాల్లియాలో యుద్ధాలు 8 ఏళ్లపాటు కొనసాగాయి. సీజర్ తనని తానొక అవిశ్రాంత యోధుడిగా, ప్రతిభావంతుడైన సేనా నాయకుడుగా నిరూపించుకున్నాడు. గాల్లియా ప్రభువుల్లో కొందర్ని అతను తన పక్షానికి తిప్పుకున్నాడు. వాళ్లు తమ దేశంలోని అటవీ, ఊబి ప్రాంతాల్లో సీజరుకి స్కౌట్లుగా, మార్గదర్శకులుగా పనిచేశారు. గాల్‌లు తమ స్వాతంత్ర్య రక్షణకోసం ధైర్యంగా పోరాడారు. కాని వాళ్ల అసంఘటిత మూకలు యుద్ధాల్లో కాకలుతీరిన రోమన్ లీజియన్ల తాకిడిని తట్టుకొని ఎదురునిలవలేకపోయాయి.

రోమన్లు యావత్తు గాల్లియానూ జయించారు. లక్షలకొలది ప్రజలను ఖైదీలుగా పట్టుకొని బానిసలను చేశారు. దేవాలయాల్లో దేవతలకు కానుకలుగా వచ్చిన బంగారమంతా కొల్లగొట్టారు. ఆ కొల్ల ధనంతో సీజరు తన సైనికుల జీతం పెంచగలిగాడు. సైనికులకు అతను భూమి యిస్తానని కూడా వాగ్దానం చేశాడు. రోమ్‌లో పేదలకు అతని పేరిట వినోదాలు ఏర్పాటుచెయ్యబడేవి, ఆహారం పంచబడేది.

## 3. రోమ్‌లో అధికారంకోసం యుద్ధాలు.

గాల్లియాను జయించిన తర్వాత సీజర్‌కు బలమైన, విశ్వసనీయమైన సైన్యం, గొప్ప సేనా నాయకుడనే ప్రతిష్ఠ, గొప్ప ఐశ్వర్యమూ వుండేవి. క్రీ.పూ. 49లో అతను తన సైన్యాన్ని రోమ్‌మీదికి నడిపించాడు. సెనేట్‌కి సీజర్ కంటె చాలా ఎక్కువ సేనలే వున్నాయి. అయితే, అవి రాష్ట్రాల్లో చెదిరివున్నాయి. రోమన్ రిపబ్లిక్ సైన్యాలకు పాంపేయ్ సేనాధిపతి చేయబడ్డాడు. సీజర్ మహా వేగంగా దాడిచేశాడేమో, పాంపేయ్ రోమ్ నగర రక్షణను సంఘటితంచెయ్యలేక, హడావిడిగా బాల్కన్ ద్వీపకల్పానికి తిరోగమించాడు. కొందరు బానిస యజమానులూ, బీదలూ సీజరు పక్షాన చేరారు. రోమన్ బీదలు సీజర్ తమ జీవితాలను మెరుగుపరుస్తాడనే ఆశతో అతని పక్షాన చేరారు. రెండు నెలల్లో, ప్రతిఘటన అనేది దాదాపు లేకుండా, సీజరు సేనలు రోమ్‌నూ, మొత్తం ఇటలీనీ ఆక్రమించాయి.



రోమన్ సైనిక శిబిరం. మధ్య: సేనా నాయకుడి పెద్ద గుడారం, యితర సేనా నాయకుల గుడారాలు, బలివేదిక వున్నాయి. శిబిరం చుట్టూ కందకం, ప్రహరీ, కంచె వున్నాయి

పాంపేయ్ బాల్కన్ ద్వీపకల్పంలో ఒక పెద్ద సైన్యం సమీకరించుకోగలిగాడు. అనేక యుద్ధాలలో ఆరితేరిన సీజర్ సైన్యాలు తొందరతొందరగా సమీకరించుకున్న పాంపేయ్ సైన్యాలను ఘోరంగా ఓడించాయి. మిగిలిన సేనలు లొంగిపోయాయి. పాంపేయ్ తప్పించుకుపోయాడు, కాని తరువాత త్వరలోనే చంపబడ్డాడు. సీజర్‌కు యింకా యితర శత్రువులు కూడా వున్నందున యుద్ధం ఆసియా, ఆఫ్రికా, స్పెయిన్లలో మరొక మూడేళ్లు సాగింది.

సీజర్ అనుచరులకీ, పాంపేయ్ సమర్థకులకీ మధ్య జరిగిన యుద్ధాలు రోమన్ పౌరుల మధ్య ఒక సాయుధ పోరాటం. వాటిని రోమ్‌లో అంతర్యుద్ధం అంటారు.

## 4. రోమ్ పాలకుడు సీజర్.

తన ప్రత్యర్థులనూ, వ్యతిరేకులనూ అందరినీ ఓడించి సీజరు రోమ్‌కు తిరిగి వచ్చాడు. అతని అధికారం పరిమితి లేనిది. మహా బలవంతుడైన సేనానాయకుని ఉత్తరువులన్నింటినీ సెనేటూ, కాన్సల్సూ విధేయతతో శిరసా వహించారు. సీజరు ఎంపరర్ (చక్రవర్తి) అని పేరు పెట్టుకున్నాడు. లాటిన్ భాషలో ఆ మాటకు "పాలకుడు" అని అర్థం. ఆ కాలంలో రోమ్‌లో యుద్ధ కాలంలో యీ మాట సేనాధిపతులకు మాత్రమే ఉపయోగించబడేది. యుద్ధ కాలంలోనే గాక, శాశ్వతంగా యీ బిరుదును సీజరు ధరించాడు.

సర్వశక్తివంతుడైన ఎంపరర్ రాజు లాగ గౌరవింపబడ్డాడు. అతని బొమ్మ నాణాలమీద ముద్రించబడింది. అతని విగ్రహాలు దేవతల విగ్రహాల సరసన నిలపబడ్డాయి. సెనేట్‌లో సీజరు దంతంతో, బంగారంతో చేసిన సింహాసనం మాదిరి కుర్చీమీద కూర్చునేవాడు. సీజరు తన సైనికులకి ప్రతిఫలం పుష్కలంగా ముట్టచెప్పాడు, కాని బీదల ఆశలను వమ్ము చేశాడు. రోమ్‌లో బీదలకి ఉచితంగా పంచే ఆహార పరిమాణాన్ని సగానికి తగ్గించాడు.

5. సీజర్ మరణం.

సీజర్ నిరంకుశ పాలనపట్ల కొంతమంది సెనేటర్లకు అసంతృప్తి కలిగింది. రోమ్‌లో ప్రభువర్గీయ రిపబ్లిక్‌ని పునరుద్ధరించి, అధికారాన్ని తమ చేతుల్లో నిలుపుకోవాలని వాళ్లు ప్రయత్నించారు. వాళ్లు సీజర్‌కి వ్యతిరేకంగా కుట్ర చేశారు. రోమ్‌లోని ఒక ధనిక ప్రభు వంశీకుడైన బ్రూటస్ అనే బానిస యజమాని కుట్రకు నాయకత్వం వహించాడు. అతను సీజరు మిత్రుడని ప్రతీతి.

క్రీ.పూ. 44లో, ఒకసారి సెనేట్ సమావేశం జరిగేటప్పుడు, కుట్రదారులు సీజర్‌ను చుట్టుముట్టారు. వాళ్లు తమ అంగవస్త్రాలలో దాచిపెట్టుకున్న ఖడ్గాలు దూసి, అతన్ని 23 పోట్లు పొడిచారు. సీజర్ అక్కడికక్కడ మరణించాడు.

రోమ్‌లో శాశ్వత నిరంకుశ పాలన నెలకొల్పాలన్న సీజర్ ప్రయత్నం విఫలమైంది. కాని, అది రోమ్‌లో రిపబ్లిక్ ఎంత బలహీనమైనదో చూపింది.

## ప్లుటార్క్ సంకలితంచేసిన సీజర్ జీవిత చరిత్ర

సీజర్ చేసిన దండయాత్రలో క్రీ.పూ. 49లో అతను రూబికన్ అనే చిన్న నదిని దాటవలసివచ్చింది. గాల్లియాకూ, రోమన్ రిపబ్లిక్‌కూ సరిహద్దులో అది ప్రవహిస్తూ వుండేది. రిపబ్లిక్ సరిహద్దు సైనిక బలంతో దాటడం బహిరంగ యుద్ధ ప్రకటనతో సమానం. సీజర్ రోమ్‌మీద అధికారం సంపాదించుకోవచ్చు లేదా ఘోరా వమానకరమైన చావుకి గురికావచ్చు. రథాన్ని ఆపమని చెప్పి, ఏ నిర్ణయం తీసుకోడానికీ వెనుక ముందాడుతూ, సీజర్ చాలా సేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు. తరువాత అతను సందేహాలన్నీ వదలి, భవిష్యత్తును ధైర్యంగా యెదుర్కోడానికి సిద్ధపడినవానిలా "పాచిక విసరబడింది" అని, నదిని దాటడానికి తన సైన్యాలకు ఉత్తరువు యిచ్చాడు.

"రూబికన్‌ను దాటడం" అనే మాటకు అర్థం వెనక్కి రావడానికి వీలులేని విధంగా ప్రమాదభరితమైన పనికి సాహసించడం.

ఆసియా మైనర్‌లో తన ప్రత్యర్థులలో ఒకరిమీద శీఘ్రంగా, సులభంగా విజయం పొందిన తర్వాత, సీజర్ మూడు లాటిన్ మాటలు మాత్రమే గల సందేశం పంపాడు: "Veni, vidi, vici" – "వచ్చాను, చూశాను, జయించాను."

**1.** రోమ్‌లో సీజరు అధికారాన్ని వశంచేసుకోగలిగేందుకు వీలుగా, క్రీ.పూ. 2వ శతాబ్ది అంతానికీ, క్రీ.పూ. 1వ శతాబ్ది ఆరంభానికీ మధ్య రోమన్ సైన్యంలో సంభవించిన మార్పులు యేమిటి? మీ వాదనని నిరూపించండి. **2.** రోమ్‌లో సీజర్ అధికారాన్ని హస్తగతం చేసుకునే విషయంలో గాల్లియాలో జరిగిన యుద్ధానికి వున్న ప్రాముఖ్యం యేమిటి? **3.** బీదలపట్ల సీజర్ వైఖరికీ, గ్రాఖ్ సోదరుల వైఖరికీ మధ్య భేదం యేమిటి? **4.** తన శత్రువులపై విజయానంతరం సీజరు పాలనకీ, ఒక కాన్సల్ అధికారాలకీ మధ్య వున్న తేడా యేమిటి? కనీసం మూడు తేడాలను పేర్కొనండి. **5.** స్పార్టకస్ తిరుగుబాటు అంతానికీ, రోమ్‌లో సీజరు అధికారాన్ని వశంచేసుకునేందుకూ మధ్య ఎన్నేళ్ల కాలవ్యవధి వుంది?

# § 53. ఆక్టేవియన్ ఆగస్టస్, అతని వారసుల పాలనలో రోమన్ సామ్రాజ్యం

(మాప్ 9)

ఎలాంటి రాజ్యాన్ని రిపబ్లిక్ అంటారో (§45; 4), రాజరిక రాజ్యం అంటే యేమిటో (§42; 4) జ్ఞాపకం చేసుకోండి.

**1. రిపబ్లికన్ల ఓటమి.** సీజర్‌ను చంపిన కుట్రదారులకు రోమ్ ప్రజల అండదండలు లేవు. కొద్ది ప్రభు కుటుంబాలచేత పరిపాలించబడే రిపబ్లిక్‌ను సమర్థించడానికి చాలామంది ప్రజలు యిష్టపడలేదు. సీజర్ సైనికులు కుట్రదారులను చంపాలని అనుకున్నారు. కాని వాళ్లు తూర్పుకు పారిపోయారు. మాసిడోనియాలో వాళ్లు ఒక సైన్యాన్ని సమీకరించుకోగలిగారు. ఇటలీమీదికి నడవడానికి సన్నాహాలు చేసుకున్నారు. అంతర్యుద్ధం తిరిగి ప్రారంభమైంది.

సీజర్ సైనికులకు కొత్త నాయకులు లభించారు. వాళ్లలో మార్క్ ఆంటోనీ అనే మహా అనుభవశాలి అయిన వీరుడు ఒకడు; అతను గొప్ప బలం గల మహాకాయుడు. మరొకడు సీజర్‌కు బంధువైన ఆక్టేవియన్ అనే యువకుడు. ఆక్టేవియన్ జబ్బుగా, బలహీనంగా వుండేవాడు. అతను సమర్థుడైన సేనాధిపతి అయ్యే రకం కాదు. కాని అతను యుక్తిపరుడు, నిత్య జాగరూకి, ప్రజ్ఞావంతులైన సహచరులను యెన్నుకోవడం తెలిసినవాడు.

ఆంటోనీ, ఆక్టేవియన్ ఒకరి నొకరు ద్వేషించుకునేవాళ్లు, కాని రిపబ్లికన్లతో పోరాడడానికి యిద్దరూ కలిశారు. వాళ్లు తమ సైన్యాలను రోమ్‌లోకి నడిపించారు. వాళ్ల ఆజ్ఞ ప్రకారం కొన్ని వేలమంది సంహరింపబడ్డారు. వాళ్ల ఆస్తులు వశంచేసుకోబడ్డాయి. ఆంటోనీ, ఆక్టేవియన్ల సైన్యాలు నౌకల్లో మాసిడోనియాకు పోయాయి. ఫిలిప్పీ నగరం దగ్గర గొప్ప యుద్ధం జరిగింది. రిపబ్లికన్ల సైన్యం ఓడిపోయింది. బ్రూటస్ తన ఖడ్గంమీద పడి ఆత్మహత్య చేసుకున్నాడు.

**2. అధికారంకోసం ఆంటోనీ, ఆక్టేవియన్ల పోరాటం.** ఆంటోనీ, ఆక్టేవియన్‌లు యిద్దరూ రోమన్ రాజ్యానికి సహపాలకులైనారు. ఆంటోనీ తూర్పు రాజ్యాలను పరిపాలించాడు. అతను అలెగ్జాండ్రియాలో రాజ వైభవంతో బతికేవాడు. ఆక్టేవియన్ రోమ్‌లో వుండేవాడు. పశ్చిమ రాజ్య భాగాన్ని అతను పాలించాడు.

ఆంటోనీ రాజు కావాలని కలలు గన్నాడు. ఆక్టేవియన్ రోమ్‌లో తన ఆధిపత్యం నెలకొల్పాలని కోరాడు. వాళ్లు ఒకరితో ఒకరు యుద్ధానికి సన్నద్ధమయారు. క్రీ.పూ. 31లో, బాల్కన్ ద్వీపకల్ప పశ్చిమ తీరంలో, ఆక్టియం అగ్రం వద్ద ఆంటోనీ ఒక సైన్యాన్ని కేంద్రీకరించాడు. అతని నౌకా దళం కూడా అక్కడికి తరలివెళ్లింది. సముద్ర యుద్ధంలో ఆక్టేవియన్ విజయం పొందాడు. ఆంటోనీ తన సైన్యాన్ని వదిలి, ఓడ యెక్కి అలెగ్జాండ్రియాకు పోయాడు. నాయకుడు లేక అతని సైన్యం లొంగిపోయింది.

క్రీ.పూ. 30లో దాదాపు యే ప్రతిఘటనా యెదుర్కోకుండానే ఆక్టేవియన్ సైన్యాలు ఈజిప్టును వశపరచుకున్నాయి. ఆంటోనీ ఖడ్గంతో పొడుచుకొని ఆత్మహత్య చేసుకున్నాడు. ఈజిప్టు రోమన్ రాష్ట్రమయింది. చిట్టచివరి గ్రీకు-మాసిడోనియన్ రాజ్యం పతనమైంది.

ఆంటోనీమీద విజయానంతరం సైన్యంమీద ఆధిపత్యాన్నీ, ఎంపరర్ (చక్రవర్తి) బిరుదునీ ఆక్టేవియన్ నిలుపుకున్నాడు. రోమన్ రాజ్యం రిపబ్లిక్ అనే పిలవబడుతూవచ్చింది. రోమ్‌లో సెనేట్ సమావేశపరచబడుతూనే వుంది. ప్రజా సభ కాన్సళ్లనూ, తదితర అధికారులనూ ఏటా ఎన్నుకొంటూనేవుంది. అయితే, సైన్యాన్ని ఆధారంచేసుకుని ఆక్టేవియన్ వాటినన్నింటినీ తన యిచ్ఛాధీనమైన పరికరాలను చేసుకున్నాడు.

### 3. ఆక్టేవియన్ పాలన.

ప్రజా సభ అత్యున్నత పదవులకు ఆక్టేవియన్‌నో లేక అతని మనుషుల్నో ఎన్నుకునేది. కాన్సళ్ళూ, ప్రజా ట్రిబ్యూన్లూ బదులుచెప్పకుండా అతని ఆజ్ఞలను శిరసావహించేవాళ్ళు. ఆక్టేవియన్ యిచ్ఛకు వ్యతిరేకంగా కాన్సల్ పదవికి నామినేట్ చెయ్యబడిన ఒక రోమన్ పౌరుడు జైల్లో నిర్బంధింపబడి, అక్కడే మరణించాడు. తనకి వ్యతిరేకులైన సెనేటర్లనందరినీ తరిమేసి, వాళ్ల స్థానాల్లో ఆక్టేవియన్ తన అనుచరులను నియమించాడు. సెనేట్‌లో మొదట వోటుచేసేది అతనే; తక్కిన వాళ్లందరూ వినయంగా అతని నిర్ణయాలను అంగీకరించేవాళ్ళు. సెనేట్ అతనికి ఆగస్టస్ అనే గౌరవ బిరుదు కూడా





1. ఆగస్టస్ గౌరవార్థం చెక్కబడిన ఉబ్బెత్తు శిలా ఫలకం. పై భాగం: దేవతలతోనూ, బంధువులతోనూ పరివేష్టితుడైన ఆగస్టస్. ఒక దేవత ఆగస్టస్ తలపై విజయమాలికను అలంకరిస్తోంది. కిందిభాగం: యుద్ధ ఖైదీలను పట్టుకుంటున్న రోమన్ సైనికులు. 2. ఒక రోమన్ చక్రవర్తి గౌరవార్థం నిర్మింపబడిన విజయ స్మారక కమాను (ఫొటో)

యిచ్చింది. ''పవిత్రుడు'' అని దాని అర్థం. ఆక్టేవియన్ రోమన్ రాజ్యాన్ని క్రీ.పూ. 30నుంచి, క్రీ.శ. 14లో తను మరణించేదాకా పాలించాడు.

రోమ్‌లో బలప్రయోగ పద్ధతుల్లో తన అధికారాన్ని నెలకొల్పుకున్న ఆక్టేవియన్ తను బతికినన్నాళ్లూ తనకి వ్యతిరేకంగా కుట్రలు జరుగుతాయేమోనని భయపడుతూండేవాడు. సెనేట్‌లో ఎప్పుడూ తన విధేయుల మధ్యలో ఉండేవాడు. తన దుస్తుల కింద కవచం ధరించేవాడు.

### 4. రోములో సామ్రాజ్యం; దాని బానిస యాజమాన్య స్వభావం.

ఆగస్టస్ నెలకొల్పిన పరిపాలనా వ్యవస్థ అతని మరణానంతరం కూడా అనుసరింపబడింది. రోమ్‌ను ఒక ఎంపరర్ (చక్రవర్తి) తర్వాత మరొక ఎంపరర్ పాలించాడు. అధికారం కొడుకులకు సంక్రమించేది, లేదా సైనిక బలంతో వశపరచుకునేవాళ్లు. ''ఎంపరర్'' అన్న పదం కొత్త అర్థం సంతరించుకుంది. రోమన్ రాజ్య పాలకులు అప్పటికి ఎంపరర్లు అని పిలవబడుతూవచ్చారు.

రోమ్‌లో రిపబ్లికన్ పదవులు నిలిచివున్నప్పటికీ, వాస్తవంలో రిపబ్లిక్ అంతరించింది. దాని స్థానంలో రాజరికం వచ్చింది. రోమన్ రాజరిక రాజ్యాన్ని ఎంపైర్ (సామ్రాజ్యం) అనేవారు.

సామ్రాజ్య స్థాపన మూలంగా రోమ్‌లోనూ, రాష్ట్రాల్లోనూ బానిస యజమానుల పెత్తనం బలపడింది. పారిపోయిన 30,000 మంది బానిసలను పట్టుకొని బానిస యజమానులకు అప్పగించానని ఆక్టేవియన్ సగర్వంగా రాసుకున్నాడు. ఎవడైనా ఒక బానిస తన యజమానిని చంపితే, చట్టం ప్రకారం యింట్లోని బానిసలందరిమీదా మరణశిక్ష అమలుజరపబడేది. అలాంటి ఒక సందర్భంలో 400 మంది బానిసలు ఒక్కుమ్మడిగా చంపెయ్యబడ్డారు. తన అధికారంలో పెద్ద సైన్యాలున్న చక్రవర్తి పీడితుల తిరుగుబాట్లను అణిచేసేవాడు. రోమ్‌లోని బానిస యజమానులే కాకుండా, రాష్ట్రాల్లోని బానిస యజమానులు కూడా చక్రవర్తి అధికారాన్ని బలపరిచేవాళ్లు.

ఆక్టేవియన్ పాలన కింద రోమన్ సామ్రాజ్య పరిపాలన వ్యవస్థ




| ప్రజా సభ | కాన్సళ్లు | సెనేట్ |
|---|---|---|
| రోమన్ పౌరులు. చక్రవర్తి పేర్కొన్నవాళ్లను కాన్సళ్లుగా ఎన్నుకుంటారు | బానిస యజమానులు. చక్రవర్తి ఆజ్ఞలు అమలుజరుపుతారు | సెనేట్ సభ్యులు. చక్రవర్తిచేత నియమింపబడతారు. చక్రవర్తికి యిష్టమైన నిర్ణయాలు ఆమోదిస్తారు |

**5. రోమన్ సామ్రాజ్యపు చివరి ఆక్రమణలు.**

115–116లో* అనుభవశాలీ, శక్తిశాలీ అయిన నాయకుడు ట్రాయన్ చక్రవర్తి సైన్యాలు మెసపొటేమియాను వశపరుచుకొన్నాయి. గతంలో యెప్పుడూ రోమన్ సైన్యాలు తూర్పున అంత దూరం పోలేదు. కాని, ఓడిపోయిన ప్రజలు రాష్ట్రాల్లో తిరుగుబాటు చేశారు. కొత్త దేశాలను జయించాలనే భావం ట్రాయన్ వదులుకొని, తన సేనలను తిరుగుబాటుదారులపైకి పంపక తప్పలేదు.

ట్రాయన్ చేసిన యీ దండయాత్రలే చిట్టచివరి రోమన్ దురాక్రమణపర దండయాత్రలు. తిరుగుబాట్లను అణచివేసేందుకూ, తన సరిహద్దులను రక్షించుకొనేందుకూ సామ్రాజ్యానికి చాలామంది సైనికులు అవసరమయ్యారు. ఆసియాలో అతను వశపరచుకొన్న భూభాగాలు దాదాపు అన్నీ అతని తర్వాత వచ్చిన చక్రవర్తి పోగొట్టుకోవలసివచ్చింది. వాటిని తన కింద నిలుపుకునే బలం అతనికి లేకపోయింది. 2వ శతాబ్ది ఆరంభం నాటికి రోమన్ సామ్రాజ్యం దండయాత్రలకి స్వస్తిచెప్పి, విస్తారంగా వ్యాపించివున్న తన భూభాగాలను కాపాడుకోవలసిన స్థితిలో పడింది.

## "దేవాంశ సంభూతుడైన ఆగస్టస్ మహత్కార్యాలు"
## (ఒక శిలా శాసనంనుండి)

ఈ శిలా శాసనంలోని సమాచార ప్రాతిపదికమీద ఒకటవ శతాబ్దంలో రోమ్ జనాభాని గురించి మీకు యేమి తెలుస్తోంది? ఆగస్టస్ సంపదలను గురించీ, రోమన్ రాజ్యంలో అతని స్థానం గురించీ మీ అంచనా యేమిటి?

"...మరొక సారి, నేను 10వ దఫా కాన్సల్‌ను అయినప్పుడు, రోమ్‌లోని ప్రతి బీద వ్యక్తికీ నా సొంత ఖజానా నుండి 400 సెస్టర్సుల (రోమన్ వెండి నాణేలు) వంతున యిచ్చాను. 11వ దఫా నేను కాన్సల్‌ను అయినప్పుడు, నా సొంత డబ్బుతో 12 సార్లు బ్రెడ్డు పంచిపెట్టాను. మళ్లీ 12వ దఫా నేను ట్రిబ్యూన్‌ను అయినప్పుడు, 3వ సారి తలా 400 సెస్టర్సుల వంతున పంపకం చేశాను. ఈ దానాలు యే సందర్భంలో కూడా 2,50,000 మందికి తక్కువగా అందలేదు. నేను 18వ సారి ట్రిబ్యూన్‌గానూ, 12వ సారి కాన్సల్‌గానూ యెన్నికైనప్పుడు నగరంలోని 3,20,000 మంది బీద ప్రజలకు తలా 240 సెస్టర్సుల వంతున యిచ్చాను. నా సైనికులకు ప్రతి ఒక్కరికీ నా యుద్ధ సంపాదననుండి తలా 1,000 సెస్టర్సులు యిచ్చాను. ఈ దానం 1,20,000 మందికి అందింది. నేను 13వ దఫా కాన్సల్‌ను అయినప్పుడు 2 లక్షల మందికి తలా 240 సెస్టర్సులు యిచ్చాను.

"నేను సైనికుల కిచ్చిన భూమి నా డబ్బుపెట్టి కొన్నది. ఇది 86 కోట్ల సెస్టర్సుల ఖరీదు అయింది."

---

* శకం నిర్దేశింపబడకపోతే క్రీ.శ. అని అర్థం.





1. దిగువ డాన్యూబ్ ఒడ్డున తన విజయ సూచకంగా ట్రాయన్ చక్రవర్తి నిర్మించిన విజయ స్తంభం (ఫొటో).
2. ట్రాయన్ విజయ స్తంభంమీది చక్రవర్తి విగ్రహం

## ఆగస్టస్ సమకాలికుడైన వర్జిల్ రచించిన ''ఏనియడ్''నుంచి

వర్జిల్ చేసిన యీకింది వర్ణనను ఈస్కిలస్ రచించిన సలమిస్ యుద్ధ వర్ణనతో (పేజి 164) పోల్చిచూడండి. గ్రీకు కవి ఎవరిని కీర్తించాడు, రోమన్ కవి ఎవరిని కీర్తించాడు?

ఇటు బయల్వెడలాడు తన నౌకా దళంతో
నురుగులు కక్కే కడలి తరగలపైన
సెనేటర్లతో పరివేష్టితుడైన ఆగస్టస్
జనసామాన్యమూ, రోమ్ నగరాధిదేవతలూ
హర్షామోద వీక్షణాలు బరపుతూండగా....
అటు వస్తున్నాడు ఆంటోనీ
పార్థియా, మధ్యధరా తీరాల విజేత
బర్బర, కిరాయి మూకల అధినేత....

పోరు మొదలైంది యిరు బలగాల మధ్య
ఓడలు ముఖాముఖీ ఢీకొంటున్నాయి.
మోగుతున్నాయి ధనుష్టంకారాలు
సరుసర్రున ఎగురుతున్నాయి బాణాలు
రివురివ్వున ఎగుస్తున్నాయి శూలాలు
ఎర్రెర్రగ మెరుస్తున్నాయి అగ్నిగోళాలు...

చూడండి నగరాన విజయోత్సవాలు
మున్నారు దేవళాల్లో ధూపదీపారాధనలు
తెగుతున్నాయి బలివితర్దులపైన
కోడె దూడలు వందలు వేలు
వినవస్తున్నాయి పూజారిణుల మంత్రోచ్చాటనలు
జనసమూహాల జయజయ ధ్వానాలు.
...కదలి వస్తున్నాయి వెనువెనక బందీలబారులు
కనవస్తున్నాయి వారి రకరకాల ఆయుధాలు, దుస్తులు
వినవస్తున్నాయి వారి వేర్వేరు బాసల ఊసులు.

? **1.** "ఎంపరర్" అన్న పదానికి ఆదిలో వున్న అర్థం యేమిటి? ఆగస్టస్ కాలంలో అది సంతరించుకున్న అర్థం యేమిటి? **2.** ఆక్టేవియన్ పాలనలో నెలకొన్నది రాజరిక రాజ్యమన్న విషయాన్ని నిరూపించండి. దానికీ, ప్రాచీన తూర్పు రాజ్యాల రాజరికానికీ మధ్య భేదం యేమిటి? **3.** రోమ్‌లో సామ్రాజ్యం ఏ వర్గపు ప్రయోజనాన్ని కాపాడింది? మీ వాదనను నిరూపించండి. **4.** సామ్రాజ్య కాలంలో రోమ్ ఆక్రమించుకున్న ప్రాంతాన్ని మావ్‌లో చూపించండి. రోమన్ రాజ్య ప్రాంతం అత్యధిక విస్తృత ప్రమాణాన్ని ఎప్పుడు అందుకుంది? రోమన్ సామ్రాజ్యం ఆత్మరక్షణ దశకి మారేందుకు గల కారణాలు యేమిటి? ఇటలీ వెలుపల రోమ్ ఆక్రమణపర యుద్ధాలు ఎన్నేళ్లు కొనసాగాయి? **5.** రోమ్‌ను ఆక్టేవియన్ ఆగస్టస్ నిరంకుశంగా ఎంత కాలం పాలించాడు? అతని పాలన ఎన్నేళ్ల క్రితం మొదలైంది, ఎన్నేళ్ల క్రితం ముగిసింది?

# ప్రకరణం పదిహేను

# రిపబ్లిక్ అంతంలో, సామ్రాజ్య ఆరంభంలో రోమ్‌లో సంస్కృతి, రోజువారీ జీవిత విధానం

## § 54. ప్రాచీన రోమ్‌లో కళలు

రెండు ప్రసిద్ధ ప్రాచీన గ్రీకు కావ్యాలను జ్ఞాపకం చేసుకోండి; క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి గ్రీకు శిల్పులు ఎవరి విగ్రహాలు చెక్కారు (§38; 4; §40; 2)?

**1. రోమ్‌పై గ్రీకు సంస్కృతి ప్రభావం.**

రోమన్ సంస్కృతిమీద మహోన్నతిని అందుకున్న గ్రీకు సంస్కృతి ప్రభావం చాలా యెక్కువగా వుండేది.

ఇటలీకి దక్షిణాన వుండిన గ్రీకు వలసలనుండి రోమన్లకు గ్రీకుల భాషతోనూ, విజ్ఞానశాస్త్రంతోనూ, కళలతోనూ పరిచయం కలిగింది. గ్రీకు అక్షరమాలను ఆధారంగా తీసుకొని రోమన్లు లాటిన్ అక్షరమాలను సృష్టించుకొన్నారు.

క్రీ.పూ. 2వ శతాబ్దిలో గ్రీసును రోమ్ వశపరచుకున్న తర్వాత గ్రీకు ప్రభావం మరీ బలీయమైంది. "పరాజిత గ్రీసు కళలను అనాగరిక విజేత లాటియమ్ మెచ్చుకుంది, తెచ్చుకుంది" అని రాశాడు ఒక రోమన్ కవి. రోమనులు అసంఖ్యాకంగా విగ్రహాలూ, వర్ణ చిత్రాలూ, యితర ఉత్తమ కళాఖండాలూ గ్రీసునుండి తెచ్చుకున్నారు. గ్రీకు వాస్తుశిల్పులూ, శిల్పులూ, చిత్రకారులూ ధనిక రోమన్ల కొరకు కళాఖండాలు తయారుచేశారు. ఇటాలియన్ నగరాల్లో గ్రీకు నమూనాలో థియేటర్లు నిర్మింపబడ్డాయి. రోమన్ కులీన యువకులు గ్రీసులోని ప్రసిద్ధమైన పాఠశాలల్లో చదువుకోడానికి పోయేవాళ్ళు. రోమన్లు పేర్లను మాత్రం మార్చి, ఒలింపియన్ దేవతలను ఆరాధించారు. ఉదాహరణకు, జీయస్ పేరును వాళ్ళు జూపిటర్‌గా మార్చుకున్నారు. (ఏ దేవతని వోల్కానో అని పిలిచారని మీ ఉద్దేశం? చూడండి §29; 2.)

అయితే, రోమన్ సంస్కృతి గ్రీకు సంస్కృతికి కేవలం అనుకరణ మాత్రమే కాదు. గ్రీకులనుంచి నేర్చుకున్న రోమన్లు స్వయంగా అనేక నూతన అంశాలను సృష్టించారు.

**2. రోమన్ సాహిత్యం:**
**అ) "ప్రకృతి రహస్యం."**

రోమన్ సాహితీ గ్రంథాలు చాలా వున్నాయి. వాటిలో "ప్రకృతి రహస్యం" అనే కావ్యానికి ప్రముఖ స్థానం వుంది. దీన్ని క్రీ.పూ. 1వ శతాబ్దికి చెందిన పండిత కవి లుక్రేషియస్ రచించాడు. దానిలో ప్రకృతిని గురించీ, మానవ జాతి చరిత్రను గురించీ ఆ కాలానికి ప్రగతిశీలమైన అభిప్రాయాలను ప్రతిపాదించాడు.

ఆ పండితుడి దృష్టిలో ప్రకృతి పరమాణువులతో కూడివుంది. అవి కలవడం మూలంగా నక్షత్రాలు, భూమి, ప్రాణులు, చివరకు మనుషుల ఆత్మలు ఏర్పడ్డాయి. ఆత్మ అవినాశమైనది అనడాన్నీ, పునర్జన్మ ఉందనడాన్నీ అతను

1. చరిత్ర, కవిత్వ అధిష్ఠాన దేవతలచేత పరివేష్ఠితుడైన వర్జిల్ (రోమన్ మొజాయిక్ చిత్రం). 2. ఆధునిక ఫ్రాన్సు దక్షిణ ప్రాంతంలోని కమానులతో కూడిన రోమన్ వంతెన (ఫొటో). వంతెనమీదుగా నీటి గొట్టాలు అమర్చబడ్డాయి. ఆ వంతెన నదికి సుమారు 50 మీటర్ల ఎత్తున వుంది. 3. ఒక రోమన్ దేవాలయం (ఫొటో). గ్రీకు, రోమన్ భవనాలను పోల్చిచూడండి. గ్రీకుల వాస్తుకళనుంచి రోమన్లు ఏమి అరువుతెచ్చుకున్నారు? 4. సుప్రసిద్ధ రోమన్ వక్త, గ్రంథకర్త సిసెరో బస్టు. 5. పాంపేయీకి చెందిన ఒక వడ్డీవ్యాపారి బస్టు


1


2


4


3


5

తిరస్కరించాడు. భగవంతుడి యిచ్చు వల్ల కాక, తాము స్వయంగా చేసే శ్రమ వల్లనే అగ్నిని ఉపయోగించుకోవడం, భూమిని దున్నడం, ఇనుముతో పనిముట్లు చేసుకోవడం మనుషులు నేర్చుకున్నారని అతను చెప్పాడు.

లుక్రేషియస్ మతాన్ని మానవుడి ఆలోచనకు ప్రతిబంధకాలు కలిగించే కళ్లెంతో పోల్చాడు. అజ్ఞానాన్నీ, ప్రకృతి శక్తులపట్ల భయాన్నీ మతావిర్భావానికి కారణాలుగా అతను పరిగణించాడు. ఉరుములకీ, భూకంపాలకీ, మనిషి నిద్రకీ శాస్త్రీయమైన వివరణలు యిచ్చేందుకు అతను ప్రయత్నించాడు. లుక్రేషియస్ కావ్య రూపంలో తన రచన చేశాడు.

### ఆ) రోమన్ కవిత్వపు స్వర్ణ యుగం. ''ఏనియడ్.''

ప్రాచీన రోముకి చెందిన అత్యంత ప్రతిభావంతులైన కవులు క్రీ.పూ. 1వ శతాబ్ది అంతంలో, క్రీ.శ. 1వ శతాబ్దిలో ఉండేవారు. ఆ కాలాన్ని రోమన్ కవిత్వపు స్వర్ణ యుగం అంటారు.

కవులను తన పక్షానికి తిప్పుకునేందుకు ఆగస్టస్ ప్రయత్నించాడు. కవులూ, రచయితలూ ఆగస్టస్ మిత్రుడైన మేసెనస్ అనే ధనిక బానిస యజమాని యింట్లో కూడేవాళ్లు. మేసెనస్ కవులకు ధారాళంగా బహుమతులు యిచ్చేవాడు. తర్వాత కాలంలో మేసెనస్ అంటే ''కళా పోషకుడు'' అనే అర్థం వాడుకలోకి వచ్చింది.

ప్రసిద్ధ రోమన్ కవి వర్జిల్. అతను ''ఏనియడ్'' కావ్యం రచించాడు. అతను ఆ కావ్య రచనకు సుమారు పదేళ్లు వెచ్చించాడు. ట్రాయ్ నగర రక్షణకు పోరాడినవాడూ, దేవతా పుత్రుడూ ఐన ఏనియస్ అనే పురాణ వీరుని సాహసాలను ఆ కావ్యంలో కవి వర్ణించాడు. ట్రాయ్ పతనమైనప్పుడు అతను చావు తప్పించుకున్నాడు. మండిపోతున్న రోమ్ నగరంనుంచి అతను వృద్ధుడైన తన తండ్రిని కాపాడి, భుజాలమీద మోసుకొని తీసుకెళ్లాడు. చాలాకాలం సంచారంచేసి, అసాధారణమైన కొన్ని సాహస కార్యాల తరువాత ఇటలీ చేరాడు. ఏనియస్ మృత జీవులు వుండే పాతాళానికి వెళ్లాడు. అక్కడ మరణించిన అతని తండ్రి ఆత్మ భవిష్యత్తులో రోమ్ మహాశక్తివంతంగా వుంటుందని జోస్యం చెప్పింది. రోమన్లు ప్రపంచ ప్రజలందర్నీ పాలిస్తారనీ, పరాజితులపట్ల దయ చూపుతారనీ, పొగరుబోతులను అణచివేస్తారనీ చెప్పింది. ఏనియస్ తండ్రి ఆత్మ ఏనియస్‌కి అతని వంశీకుల్ని చూపించింది. వారిలో లాటియమ్‌కి శాంతిని చేకూర్చి, సుదూర దేశాల ప్రజలను సైతం రోమ్ ముందు గజగజ వణికింపజేసే దైవాంశ సంభూతుడైన ఆగస్టస్ కూడా వుంటాడు (పేజిలు 252–253 చూడండి).

''ఏనియడ్'' హోమర్ కావ్యాల కొనసాగింపులా వుంటుంది. అది కూడా వాటిలాగే గంభీరమైన, సమాస భూయిష్ఠమైన కవిత. వర్జిల్ ధైర్యాన్నీ, పెద్దలపట్ల వినయ విధేయతలనీ, గౌరవాన్నీ కీర్తించాడు. రోమన్ సామ్రాజ్యాన్నీ, ఆగస్టస్‌నీ కీర్తించేందుకుగాను మత విశ్వాసాలనూ, గ్రీకు, రోమన్ చారిత్రక గాథలనూ వర్జిల్ కవి నేర్పుగా వినియోగించుకున్నాడు.

### 3. రోమన్ వాస్తుశిల్ప కళ.

దివ్యమూ, వైభవోపేతమూ అయిన రోమన్ నిర్మాణాలు యావత్ప్రపంచానికీ రోమన్ సామ్రాజ్యపు శక్తి సంపదలను నిరూపించేందుకు ఉద్దేశింపబడ్డాయి.

రోమన్లు భవన నిర్మాణంలో గ్రీకు వాస్తుశిల్పుల అనుభవాన్ని వినియోగించుకొని, నూతన ఆవిష్కరణలతో ఆ కళను మరెంతగానో సుసంపన్నం చేశారు. రాళ్లనూ, యిటుకలనూ దృఢంగా యేకం చేసే కాంక్రీట్ అనే సమ్మేళనాన్ని రోమన్లు సృష్టించారు. అత్యంత ఘనత్వం గల రాతి కమాన్లు (ఆర్చీలు) కట్టడానికి వాళ్లు దాన్ని ఉపయోగించారు.

కమాన్లు యెక్కుపెట్టిన విల్లు లాగా వుండేవి. లాటిన్ భాషలో ''ఆర్కస్'' అంటే విల్లు. దానినుండి పుట్టిందే ఆర్చ్ అనే పదం. చక్రవర్తులు తమ విజయాల స్మృతి చిహ్నాలుగా విజయ కమాన్లు నిర్మించారు. విజయోత్సవాలలో వాళ్లు వాటిగుండా ఊరేగేవాళ్లు. రోమ్‌లో నీటి గొట్టాల నిర్మాణంలోనూ, యిండ్ల నిర్మాణంలోనూ, నదులమీద వంతెనల నిర్మాణంలో కూడా కమాన్లను విరివిగా ఉపయోగించారు. రోమన్లు పర్వతాలలోని సెలయేళ్లనుంచి నీటిని తీసుకెళ్లే

పాంథియన్ (నమూనా). పాంథియన్ బాహ్య రూపాన్నీ, ఆంతరిక రూపాన్నీ చూపేందుకు వీలుగా దాని క్రాస్ సెక్షన్ నమూనాలో చూపబడింది. నేలమీది గీతలు గోడలు, స్తంభాలు ఎక్కడెక్కడ వుండేవో సూచిస్తాయి. గోపురంలోని రంధ్రం ద్వారా యీ దేవాలయంలోకి వెలుతురు ప్రసరిస్తుంది




అక్విడక్టులను నిర్మించారు. పల్లపు ప్రాంతాల్లో గొట్టాలతో కూడిన కమాను వంతెనలు నిర్మింపబడేవి. వాటిగుండా నీరు దిగువకి ప్రవహించేది (పేజి 255 చూడండి). రోమ్‌కి వరద నీరు పది అక్విడక్టుల ద్వారా తీసుకురాబడేది.

రోమన్లకు క్యుపోలాలు నిర్మించడం కూడా తెలుసు. ''క్యుపోలా'' అంటే బోర్లగించిన పెద్ద గిన్నె లాగా (అర్ధ గోళాకారంలో) వుండే యింటి కప్పు. రోమ్‌లోని పాంథియన్ గుడి (సకల దేవతల గడి)కి గల కప్పు అచ్చమైన క్యుపోలాకు ఉదాహరణ.

## 4. రోమన్ శిల్పకళ.

నిలువెత్తు, బస్టు విగ్రహాల నిర్మాణం రోమన్ శిల్పకళ సాధించిన అత్యున్నత విజయం. శిల్పులు వ్యక్తి కవళికలను యధాతథంగా రూపొందించడంతోబాటు అతని స్వభావాన్ని కూడా వ్యక్తం చేసేవాళ్లు. వడ్డీ వ్యాపారస్తుని శిల్పంలో జీవితమంతా లాభతృష్ణతో గడిపిన మనిషి దురాశనూ, ముష్కరత్వాన్నీ వ్యక్తంచేయడంలో శిల్పి సంపూర్ణంగా కృతార్థుడయ్యాడు. ఒక శిల్పి పాంపేయ్ విగ్రహాన్ని తెలివితక్కువవాడిగా, ఆత్మతృప్తిగలిగినవాడిగా చెక్కాడు. ప్రసిద్ధ రోమన్ వక్త, రచయిత అయిన సిసెరో విగ్రహంలో నిశిత బుద్ధి కనిపిస్తుంది. బిగించిన పెదవుల్లో జనంపట్ల అతని ఏవగింపు కనిపిస్తుంది (పేజీలు 245,255 చూడండి).

రోమ్‌లో సామ్రాజ్య స్థాపనానంతరం శిల్పులు చక్రవర్తులను కీర్తించి, మహోన్నతులుగా చిత్రించవలసివుండేది. దేవుళ్ల గానో, భీమకాయులు గానో లేక పురాణ పురుషులు గానో శిల్పులు వాళ్లను చిత్రించేవాళ్లు. దుర్బలంగా వుండే ఆగస్టస్ చేతిలో విజయ దేవతను పట్టుకున్న మహోన్నతుడైన జూపిటర్‌గా రూపొందించబడ్డాడు. చక్రవర్తి విజయాలూ, రోమన్ విజయాలూ ఆర్చీలకీ, భవనాలకీ అలంకారప్రాయంగా పాలరాతి ఉబ్బెత్తు శిల్పాల్లో చెక్కబడేవి.

? **1.** లుక్రేషియస్ ఏ గ్రీకు పండితుల అభిప్రాయాలను మరింతగా అభివృద్ధిచేశాడు? మీ జవాబును నిరూపించండి. **2.** వర్జిల్ తన పాఠకులకి అందజెయ్యదలుచుకున్న ఆలోచనలూ, భావోద్వేగాలూ యేమిటి? "ఏనియడ్"నుంచి ఉదాహరణలను పేర్కొనండి. లుక్రేషియస్ అభిప్రాయాలకీ, వర్జిల్ అభిప్రాయాలకీ మధ్య మౌలిక భేదాలు యేమిటి? **3.** రోములో చక్రవర్తి అధికారాన్ని పటిష్ఠంచేసేందుకు మతమూ, కళలూ ఎలా వినియోగింపబడ్డాయి? **4.** క్రీ.పూ. 5వ శతాబ్ది నాటి గ్రీకు శిల్పానికీ, రోమన్ శిల్పానికీ మధ్య తేడాలు యేమిటి? ఆ తేడాలకి కారణం యేమిటో వివరించండి.

## §55. సామ్రాజ్య కాలపు రోమ్ నగరం

బీదవాళ్లు రోమ్ నగరానికి తరలివెళ్లడానికి గల కారణాలను జ్ఞాపకం చేసుకోండి (§50; 1).

**1. సామ్రాజ్య కాలపు రోమ్‌లో ఫోరమ్, పలటీనె.**

క్రిస్టియన్ శకం మొదట్లో రోమ్ మధ్యధరా సముద్ర తీరమంతట్లోనూ మిక్కిలి పెద్ద నగరంగా తయారైంది. అప్పట్లో రోమ్ జనాభా సుమారు 10,00,000. ఆ నగరం టైబర్ నది ఒడ్డులు రెండింటిమీదా విస్తృతంగా వ్యాపించింది. నగరంలో రాళ్లుపరచిన ముఖ్య వీధులన్నీ ఫోరమ్ దగ్గర కలిసేవి. రోమన్ చక్రవర్తుల్లో దాదాపు అందరూ అద్భుతమైన భవనాలు నిర్మింపజేశారు. తమ కీర్తిని శాశ్వతం చేసుకునేందుకుగాను ఫోరమ్‌లో తమ విగ్రహాలు ప్రతిష్ఠించుకున్నారు.



2

2వ శతాబ్ది నాటి ఒక చక్రవర్తి విగ్రహం. ఈ చక్రవర్తి ఏ గ్రీకు వీరుడి ప్రతిబింబం?

తన విజయాలకు స్మృతి చిహ్నంగా ట్రాయన్ చక్రవర్తి సుమారు 40 మీటర్ల ఎత్తు గల విజయ స్తంభాన్ని నిర్మింప జేశాడు. దానిమీద చుట్టూ కిందినుంచి పైదాకా ఒక రిబ్బను చుట్టినట్లు పాలరాతి ఉబ్బెత్తు శిల్పం చెక్కించాడు. ఆ శిల్పంలో యుద్ధాలు, నదులు దాటడం, శత్రువులను ఖైదీలుగా పట్టుకోవడం, శత్రువుల గ్రామాలను నేలమట్టం చెయ్యడం, తదితర యుద్ధ దృశ్యాలూ చెక్కబడ్డాయి. చక్రవర్తి విగ్రహం ఆ స్తంభాగ్రంమీద నిలపబడింది (పేజి 252 చూడండి.)

ఫోరమ్ సామాన్యమైన బజారు స్థలంనుంచి బ్రహ్మాండమైన ఒక ఆరుబయలు మ్యూజియంగా తయారైంది.

ఫోరమ్ పక్కనే పలటీనె దిబ్బ వుంది. పాలరాతితో నిర్మింపబడి, బంగారంతో అలంకరింపబడి మిలమిల మెరిసే రాజ భవనాలు ఆ దిబ్బమీద వున్నాయి (పేజి 260 చూడండి).

## 2. బానిస యజమానుల నిత్య జీవితం.

రోమన్ ప్రభువర్గీయుల భవనాలు రాజభవనాల చుట్టూ వుండేవి. ఉద్యానవనాల మధ్య ధనిక బానిస యజమానుల గృహాలు వుండేవి. గది గోడలు కుడ్య చిత్రాలతో అలంకరింపబడి వుండేవి. నేలకు రంగు రంగుల రాళ్లతో మొజాయిక్ చప్టా వేసేవాళ్లు. పెద్ద హాలులో మధ్యలో ఒక జలయంత్రం వుండేది. ఫర్నిచరుకి బంగారు, వెండి రేకులూ, దంతమూ తాపడం చెయ్యబడేవి. గ్రీసునుంచి తెచ్చిన, రోమ్‌లో చేసిన విగ్రహాలతో భవనాలూ, ఉద్యానవనాలూ అలంకరింపబడేవి.

ఒక్కొక్క ధనిక రోమన్‌కు వందలకొలది బానిసలు సేవలు చేసేవాళ్లు. బానిసలలో వైద్యులూ, సంగీత విద్వాంసులూ,







సామ్రాజ్య కాలంలో రోమ్ నగర దృశ్యం (పునరుద్ధరణ, ప్లాను).
ప్లానులో చూపబడిన స్మారక నిర్మాణాలను చిత్రంలో గుర్తించండి



2

సామ్రాజ్య కాలంలో రోమన్ ఫోరమ్, పలటీనెలు (పునరుద్ధరణ)

కళాకారులూ వుండేవాళ్లు. గ్రీసునుండి తెచ్చిన బానిసలు చాలామంది వుండేవాళ్లు; తరుచుగా వాళ్లు తమ యజమానుల కంటె విద్యావంతులు. బానిసలు వీధుల్లో అతని పల్లకి మోసేవాళ్లు. కుక్కకు బదులు బానిస వాకిట్లో కూర్చొని వుండే వాడు; అతని మెడలోని గొలుసు గోడకు బిగించబడివుండేది. బానిస యజమానుల విందులకోసం బతికివున్న చేపలూ, అపురూపమైన అడవి కోళ్లూ, పళ్లూ, ద్రాక్ష సారాయీ సామ్రాజ్యపు నలుమూలల్నుంచీ తీసుకురాబడేవి.

### 3. ''ఆహారం, వినోదం కావాలి!''

రోమ్‌లో కన్నులు మిరుమిట్లు కొలిపే భోగాలూ, భయంకరమైన దారిద్ర్యమూ పక్కపక్కనే వుండేవి.

కొన్ని గూడేలు ఐదు ఆరు అంతస్తుల ఇళ్లతో క్రిక్కిరిసి వుండేవి. (పేజి 262లోని చిత్రం 1 చూడండి.) బీద ప్రజలు చిన్నచిన్న కొట్టు గదుల్లో, నేల మాళిగల్లో, అటకల్లో బతికేవాళ్లు. వీధులు చాలా యిరుకుగా వుండేవి; సూర్య రశ్మి వాటిలో యెప్పుడోగాని ప్రసరించదు. అనేక అంతస్తుల యిళ్ల నిర్మాణం సరిగా లేనందున కూలిపోతూ వుండేవి. అగ్ని ప్రమాదాలు తరచు సంభవిస్తూ వుండేవి. కూలిన యిండ్లకింద, మంటల లోనూ చాలామంది హతమయ్యేవాళ్లు. ఎంతోమంది బీద ప్రజలకు తల దాచుకోడానికి కొంపలు వుండేవి కావు. వాళ్లు వీధుల్లోనూ, నగర చౌకుల్లోనూ నిద్రించేవాళ్లు. (21వ వర్ణ చిత్రంలో ఒక రోమన్ వీధి ఎలా వుండేదో చూడండి.)

బీదవాళ్లలో గలాటాలు జరగకుండా, చక్రవర్తులు వాళ్లకు ఆహారమూ, చిల్లర నాణాలూ పంచిపెట్టేవాళ్లు. వినోదాలు

రోమ్‌లోని స్నానాగారాలు (పునరుద్ధరణ). స్నానాగారాల్లో వేడి నీటి, చన్నీటి ఈత కొలనులు, వ్యాయామ శాలలు, గ్రంథాలయాలు సైతం వున్నాయి. గోడలు, విలువంపైన సరంబీలు, స్తంభాలు పాల రాతితో అలంకరింపబడ్డాయి. నేల మొజాయిక్‌తో చెయ్యబడింది



ఏర్పాట్లు చేసేవాళ్ళు. రోమ్‌లో 2 లక్షలమందికి పైగా ఉచిత ఆహారం పుచ్చుకునేవాళ్ళు. ధనిక బానిస యజమానుల ద్వారాల వద్ద, యేదైనా దానం లభిస్తుందనే ఆశతో, వందలకొద్దీ బీదవాళ్ళు గుమికూడి వుండేవాళ్ళు. రాజ స్నానాగారాలు స్వతంత్ర పౌరులకు అందుబాటులో వుండేవి (పై చిత్రం చూడండి).

గత్యంతరంలేని సోమరితనంతోనూ, దాన ధర్మాలతోనూ పాడుచేయబడిన రోమన్ బీద ప్రజలకు పనిచెయ్యాలని వుండేది కాదు. పనిచెయ్యడం బానిసల వంతు అనీ, అది స్వతంత్ర పౌరుల గౌరవానికి లోటు అనీ, బానిస యాజమానులే కాదు, బీద ప్రజలు కూడా అనుకునేవాళ్ళు. వాళ్ళు చక్రవర్తినుంచి ఉచిత "ఆహారాన్నీ, వినోదాన్నీ" డిమాండు చేసేవాళ్ళు.

## 4. రోమ్‌లో వినోదాలు.

రోమన్ బానిస యజమానులకీ, బీదావాళ్లకీ అభిమాన వినోదాలు గ్లేడియేటర్ల పోరాటాలు. రిపబ్లిక్ కాలంలో కంటె సామ్రాజ్య కాలంలో గ్లేడియేటర్ల పోరాటాలు యింకా వైభవంగా వుండేవి.

ఆగస్టస్ ఆజ్ఞ మేరకు రోమ్ శివార్లలో ఒక సరస్సు నిర్మింపబడింది. 30 పెద్ద పడవలూ, అనేక చిన్న పడవలూ అక్కడ చేర్చేవాళ్ళు. సరస్సులో సముద్ర పోరాటాలు జరిగేవి; వాటిలో 30 పెద్ద, చాలా చిన్న పడవలమీద సుమారు 3,000 మంది పోటీలో పాల్గొనేవాళ్ళు.

క్రీ.శ. మొదటి శతాబ్ది ఉత్తరార్ధంలో చక్రవర్తి ఉత్తరువు ప్రకారం గ్లేడియేటర్ల పోరాటంకోసం రోమ్‌లో కొలీసియం అనే బ్రహ్మాండమైన ఆంఫిథియేటర్ నిర్మింపబడింది. కొలీసియంలో అనేక వేలమందివరకు ప్రేక్షకులు కూర్చోవచ్చు.

ట్రాయన్ జరిపిన ఉత్సవాల్లో 10,000 మంది గ్లేడియేటర్లు తమలో తాము, క్రూర జంతువులతోనూ పోరాడారు. రోమన్లకు అభిమాన వినోదాల్లో రథాల పోటీలు మరొకటి.

## 5. రోమన్ సంస్కృతి ప్రాముఖ్యం.

రోమన్ సంస్కృతి ఇటలీలోనే గాక, విస్తృత సామ్రాజ్యం అంతటా వ్యాప్తిలో వుండేది. రోమన్లు తాము వెళ్లిన అన్ని చోట్లా ఆర్చీలు, అక్విడక్టులు, ఆంఫిథియేటర్లు, రోడ్లు నిర్మించారు. లాటిన్ భాష ఇటలీలోనే గాక, రోమ్‌కి చాలా దూరాన గల దేశాల్లో సైతం వాడుకలో వుండేది. గ్రీకులూ, ప్రాచ్య రచయితలూ రాసిన అనేక గ్రంథాలు లాటిన్ భాషలోకి అనువదింపబడ్డాయి. చాలా కాలంవరకు అది పశ్చిమ యూరప్‌లోని విద్యావంతులందరూ రాసే భాషగా, మాట్లాడే భాషగా వుండేది. ఇప్పటికీ అది విజ్ఞానశాస్త్రాలలో ఖనిజాలకూ, మొక్కలకూ, జంతువులకూ పేర్లు పెట్టడానికి ఉపయోగించబడుతోంది. ఆ పదాలు ప్రపంచ మంతటా శాస్త్రజ్ఞులకు అర్థమౌతాయి. డాక్టర్లు తమ ప్రిస్క్రిప్షన్లు లాటిన్ భాషలో రాస్తారు. చాలా దేశాలు లాటిన్ అక్షరమాలను వాడుతున్నాయి. ఆధునిక భాషల్లో లాటిన్ పదాలు చాలా వున్నాయి.







1. రోమ్‌లోని పలు అంతస్తుల భవనపు సగం శిథిలమైన ప్రాచీన నమూనా. 2. రోమన్ శస్త్రచికిత్సా పరికరాలు. పేజి 59లో చూపబడిన ఈజిప్షియన్ శస్త్రచికిత్సా పరికరాలతో వీటిని పోల్చిచూడండి. 3. ఈ చిత్రాన్ని యింతకుముందు మీరే పేజిలో చూశారో వెతకండి

మనం యిప్పటికీ రోమన్ కాలెండర్ యే మార్పూ లేకుండా వాడుతున్నాం. నెలల పేర్లు కూడా లాటిన్‌నుండి వచ్చినవే. ''జూలై'' అనేది జూలియస్ సీజర్ పేరునుండి ఉత్పన్నమైంది. తరువాత నెల ''ఆగస్టు'' ఆగస్టస్ పేరునుండి వచ్చింది. ''సెప్టెంబర్'' అనగా ఏడవది. ''అక్టోబర్'' అనగా ఎనిమిదవది. (ప్రాచీన రోమ్‌లో మార్చితో సంవత్సరం మొదలయ్యేది.)

లుక్రేషియస్, వర్జిల్, తదితర రోమన్ కవుల, రచయితల రచనలు యూరపియన్ సాహిత్యాన్ని విశేషంగా ప్రభావితం చేశాయి. అవి మన కాలంలో కూడా ప్రచురింపబడుతున్నాయి.

## పాంపేయీ నగర శిథిలాల త్రవ్వకాలు

పాంపేయీ నగరం వెసూవియస్ అనే అగ్ని పర్వతం దగ్గర వుండేది. క్రీ.శ. మొదటి శతాబ్ది ఉత్తరార్ధంలో అది హఠాత్తుగా బ్రద్దలైంది. దాని శిఖరంనుండి ఉడుకు బూడిద బ్రహ్మాండమైన ప్రవాహంలా కిందికి వచ్చి, చుట్టూ వున్న సమస్తాన్నీ పూడ్చివేసింది. దాదాపు 10 మీటర్ల మందం వున్న పొర కింద నగరం పూడిపోయింది. ప్రజలలో అత్యధిక భాగం తప్పించుకోగలిగారు. మిగిలినవాళ్లు హతమయారు. నేలమాళిగల్లో బంధింపబడిన బానిసలు కూడా హతమయారు.

పాంపేయీలో త్రవ్వకాలు 18వ శతాబ్దిలో ప్రారంభమయ్యాయి. ఇప్పుడు నగరంలో అత్యధిక భాగం నుండి అగ్ని పర్వతపు బూడిద తొలగించబడింది. వీధులూ, నివాస గృహాలూ, ఫోరమ్, ఆంఫిథియేటర్, స్నానాగారాలూ, దేవాలయాలూ బయటపడ్డాయి (కలర్ ఫోటోలు 16–18 చూడండి).

? **1.** పాఠమూ, చిత్రాలూ తిరగేసి ఒక ధనిక రోమన్ జీవితాన్ని వర్ణించండి. **2.** ''ఆహారం, వినోదం కావాలి!'' అన్న పదబంధం ఎలా, ఎందుకు వాడుకలోకి వచ్చింది? గ్రాఖ్ సోదరుల కాలంలో బీద ప్రజలు ఏమి కావాలని డిమాండు చేశారు? **3.** రోమన్లు అన్నింట్లోకీ ఎక్కువగా దేన్ని చూడాలని కోరుకునేవాళ్లు? **4.** సామ్రాజ్య కాలపు రోమ్‌ను రిపబ్లిక్ ఆరంభం నాటి రోమ్‌తో సరిపోల్చి చూడండి. పాఠమూ, చిత్రాలూ తిరగెయ్యండి.

# ప్రకరణం పదహారు

# రోమన్ సామ్రాజ్య పతనం, వినాశం

## §56. క్రీ.శ. 2వ శతాబ్ది చివర–3వ శతాబ్దిలో రోమన్ బానిస యాజమాన్య ఆర్థిక వ్యవస్థ క్షీణించడం ప్రారంభం

(మాప్ 10)

రోమ్‌లో బానిసలకు కేటాయింపబడిన పని యేమిటో (§49); బానిస యజమానులతో బానిసలు ఎలా పోరాడారో (§35; 5) జ్ఞాపకం చేసుకోండి.

**1. బానిసల పని తీరు.** బానిసలమీద యజమానులకు పెద్దగా ఖర్చు కాదు. కాని వాళ్ళు చాలా అధ్వానంగా పనిచేసేవాళ్ళు. బానిస శ్రమ ఉత్పాదకత తక్కువ. వాళ్ళు చేసే సరుకుల నాణ్యత మరీ అధ్వానం. పొలం దున్నేవాళ్ళకు పంట బాగా పండుతోందా, లేదా అనే దానిమీద బొత్తిగా శ్రద్ధ లేదు. వాళ్ళు యెంత పండించినా, వాళ్ళకు భోజనంలోకి లభించేది తుర్రు జావా, కట్టుకోడానికి కొద్ది పాత పేలికలూ మాత్రమే. అందువలన వాళ్ళు పని సాధ్యమైనంత తక్కువగా, సాధ్యమైనంత అధ్వానంగా చేసేవాళ్ళు. వాళ్ళు తమ యజమానులను ద్వేషించేవాళ్ళు, వాళ్ళ పనిముట్లను విరగ్గొట్టేవాళ్ళు, పశువులను గాయపరచేవాళ్ళు.

మొదటి శతాబ్దిలో ఒక రోమన్ బానిస యజమాని బానిస శ్రమను ఈవిధంగా వర్ణించాడు: "బానిసలు పొలాలకు చాలా పెద్ద హాని కలిగిస్తారు. వాళ్ళు యెద్దులనూ యితర పశువులనూ అశ్రద్ధగా మేపుతారు. వాళ్ళు అధ్వానంగా పొలం దున్నుతారు. నేలమీద చల్లే విత్తనాలు బాగా మొలకెత్తుతాయా లేదా అనే విషయంమీద వాళ్ళకు బొత్తిగా శ్రద్ధ లేదు. వాళ్ళే ధాన్యం దొంగిలిస్తారు. ఇతర దొంగలనుండి కాపాడరు."

**2. బానిసత్వం: ఆర్థికాభివృద్ధికి అడ్డంకి.** బానిసత్వం సాంకేతిక అభివృద్ధిని కుంటుపరచింది. రైతులు భూమిని దున్నేందుకు అనువైన ఒక మేలి రకం నాగలినీ, ఎడ్లు లాగే కుప్ప నూర్పిడి పనిముట్టునూ కనిపెట్టారు. అయితే, యీ ఖరీదైన మేలి రకం వ్యవసాయపు పనిముట్లను బానిసలకు యిచ్చేవాళ్లు కారు. వాళ్లకి పాత నాగళ్లనూ, కొడవళ్లనూ మాత్రమే యిచ్చేవాళ్లు. నాసి రకం వ్యవసాయం మూలంగా భూమి నిస్సారమైంది. రైతులు సాగుచేసినంత కాలమూ సారవంతంగా వున్న చేలు బానిసలు సాగుచేసినప్పుడు నిస్సారమయ్యాయి. చేతిపనుల కార్ఖానాల్లో, గనుల్లో, తదితర వృత్తుల్లో బానిసలకు

1. రోమన్ పంట కోత యంత్రం (ప్రాచీన చిత్రాల ఆధారంగా పునరుద్ధరింపబడిన చిత్రం). 2. మూడవ శతాబ్ది నాటి ఇటలీలో ఒక ఎస్టేటు. పేజి 213లోని చిత్రంతో దీన్ని పోల్చి చూడండి. ఎస్టేటులో వచ్చిన మార్పులను సూచించండి





పగులగొట్ట సాధ్యంకాని సరళమైన మోటు పనిముట్లు మాత్రమే యివ్వబడేవి. దానితో సరుకుల నాణ్యత తగ్గి, వర్తకం క్షీణించిపోయింది.

వ్యవసాయంలో, పశువుల పెంపకంలో, చేతివృత్తుల్లో బానిసలే ప్రధానంగా పనిచెయ్యనారంభించడంతో ఆర్థిక వ్యవస్థ క్షీణించనారంభించింది. బానిసలు ఇటలీలో అత్యధిక సంఖ్యలో సాంద్రీకరింపబడి వుండేవాళ్లు. కనుక ఆర్థిక క్షీణత్వం మరీ యెక్కువగా సంభవించింది ఆ దేశంలోనే.

బానిస శ్రమ బానిస యజమానులకు లాభదాయకం కాకుండా పోయింది. దీనికితోడు, చాలామంది బానిసలు వుండటం ప్రమాదకరం. "ఎంత యెక్కువమంది బానిసలైతే — అంత యెక్కువమంది శత్రువులు" అని బానిస యజమానులు అనేవాళ్లు.

**3. కొలోన్‌లు.**

క్రీ.శ. 2వ శతాబ్దంలో, చాలామంది బానిస యజమానులు తమ ఎస్టేట్లను చిన్న చిన్న పొలాలుగా విభజించి, వాటిని బీద స్వతంత్ర పౌరులకు కౌలుకివ్వడం ప్రారంభించారు. అలాంటి సన్నకారు కౌలుదార్లను రోమ్‌లో కొలోన్‌లు అనేవారు. కౌలుదారు మాసూలులో కొంత భాగం యజమానుల కిచ్చి, మిగిలిన దానితో తృప్తిపడవలసివుండేది. అందువల్ల వాళ్లు భూమిని బానిసల కంటె బాగా సాగుచేయడానికి శ్రద్ధ వహించేవాళ్లు. పశువులనూ, పనిముట్లనూ బాగా చూసుకునేవాళ్లు.

బీద కొలోన్లు పనిముట్లూ, పశువులూ, విత్తనాలూ అరువు తీసుకునేవాళ్లు. వాళ్లు రుణంలో పడితే ఎస్టేటును వదలిపెట్టిపోవడానికి వీలు లేదు. ఈ పరిస్థితిని అవకాశంగా తీసుకొని యజమానులు కౌలు మొత్తం పెంచేవాళ్లు.

**4. "గుడిసెలు వున్న బానిసలు."**

కొంతమంది బానిస యజమానులు తమ బానిసలకి చిన్న పొలాలనూ, పనిముట్లనూ, విత్తనాలనూ యిచ్చి, వాళ్లు వివాహం చేసుకొని కుటుంబాలు నెలకొల్పుకోడానికి అనుమతి యిచ్చారు. అలాంటి బానిసలు బాగా పనిచేస్తారనీ, పారిపోరనీ, యజమానులకు హాని చేయరనీ వాళ్లు ఆశించారు. ఈ రకం బానిసలను "గుడిసెలు వున్న బానిసలు" అనేవాళ్లు. నగరాల్లో బానిస యజమానులు బానిసలు చిన్న చిన్న కార్ఖానాలూ, చిల్లర దుకాణాలూ పెట్టుకోడాన్ని అనుమతించారు. ఆ బానిసలు తమ ఆదాయంలో గణనీయమైన భాగాన్ని తమ యజమానులకు యివ్వాల్సివుండేది.

బానిసల్లో కొద్దిమంది పరిస్థితి కొంత మెరుగైనప్పటికీ వాళ్ల జీవితం బాగా కష్టభూయిష్టంగానే వుండిపోయింది. వెనకటి మాదిరిగానే తమ యజమాని దయాదాక్షిణ్యాల్లోనే వున్న బానిసలు బానిస యజమానులతో తమ పోరాటం కొనసాగించారు. ఆ పోరాటంలో కొలోన్లు కూడా పాల్గొన్నారు.

**5. సామ్రాజ్యంలో తిరుగుబాట్లు.**

సామ్రాజ్యంలో వివిధ భాగాల్లో తిరుగుబాట్లు జరిగాయి. 3వ శతాబ్ది మధ్య తిరుగుబాట్లు ప్రత్యేకించి ముమ్మరంగా జరిగాయి.

మొత్తం గాల్లియా అంతా తిరుగుబాటు చేసింది. తిరుగుబాటుదార్లు తమని "బగవ్వూద్‌లు" అని పిలుచుకునేవాళ్లు, అనగా యోధులు అని అర్థం. మంద కాపరులు అశ్విక దళాలను, వ్యవసాయదారులు పదాతి దళాలను ఏర్పాటుచేసుకున్నారు. బగవ్వూద్‌లు బానిస యజమానుల భవనాలను తగులబెట్టి, తాము పట్టుకున్న సామాన్లను తమ మధ్య పంచుకున్నారు. ఉత్తర ఆఫ్రికాలో ఒక పెద్ద తిరుగుబాటు మొదలైంది. తిరుగుబాటుదారులు కొన్ని నగరాలను ఆక్రమించుకోగలిగారు.

రోమ్‌లో చేతిపనివాళ్లూ, బానిసలూ ఆయుధాలతో తిరుగుబాటు చేశారు. వాళ్లు నగరంలోని ఒక దిబ్బమీద తిష్ఠవేశారు. వీధుల్లో భీషణమైన ఘర్షణలు జరిగాయి. సైనికులు ఆ దిబ్బని చుట్టుముట్టి, దాడిచేసి పట్టుకున్నారు కాని, చాలా నష్టాలు పొందారు.

ఆ తిరుగుబాట్లు జరిగిన కాలంలోనే సామ్రాజ్యపు సరిహద్దుల్లో తీవ్రమైన పోరాటం సాగింది.

2వ శతాబ్ది నాటికింకా రోమన్ సామ్రాజ్యం చాలా శక్తివంతంగానే వుంది. అయితేనేం, బానిసత్వం ఆర్థిక వ్యవస్థని క్షీణింపజేసింది, సామ్రాజ్యాన్ని బలహీనపరచింది.

? **1.** బానిసత్వం సాంకేతిక అభివృద్ధిని ఎందుకు కుంటుపరచి, 2వ–3వ శతాబ్దాల్లో రోమ్ ఆర్థిక వ్యవస్థ క్షీణించేందుకు దారితీసింది? **2.** ఏ అనివార్య పరిస్థితుల మూలంగా ఎస్టేట్ యజమానులు తమ భూములను బీదవాళ్లకి కౌలుకిచ్చారు? బానిసలు సొంత గుడిసెలు కలిగివుండేందుకు ఎందుకు అనుమతించారు? **3.** కొలోన్ల పరిస్థితికీ, బానిసల పరిస్థితికీ మధ్య తేడా యేమిటి? **4.** 3వ శతాబ్ది తిరుగుబాట్లలో ఎవరు పాల్గొన్నారు?

## § 57. 3వ శతాబ్దిలో సామ్రాజ్యం బలహీనపడటం, డియోక్లెటియన్ చక్రవర్తి పాలనలో అది బలపడటం

(మాప్ 10)

**1. సామ్రాజ్యపు సరిహద్దులపైన బర్బరుల దాడి.** క్రీస్తు శకారంభంలో, అంటే యిప్పటికి సుమారు రెండు వేల ఏళ్ల క్రితం ఎల్బ్ నది తూర్పు తీర భూముల్లో స్లావ్‌లూ, రైన్‌కీ, ఎల్బ్‌కీ మధ్య జర్మన్‌లు అనే తెగలవాళ్లూ నివసిస్తూండేవాళ్లు.

జర్మనీ దట్టమైన అడవులతో, బురద నేలలతో నిండివుండేది. జర్మన్‌ల గణాల జనావాసాలు అడవుల మధ్యా, బురద నేలల మధ్యా ఉండేవి. గణ సభ్యులు అడవిలో కొంత భూమిని తుప్పలూ, చెట్లూ కొట్టి బాగుచేసుకునేవాళ్లు. గణ పెద్దలు గణ సభ్యులకు భూఖండాలు పంచేవాళ్లు. జర్మన్‌లు బార్లీ, రై ధాన్యాలు పండించేవాళ్లు. రెండు మూడేండ్ల తర్వాత ఆ భూమి నిస్సారమయ్యేది.

జర్మన్‌లు మరొక భూమిని చెట్లు కొట్టి సాగుకి లాయకు చేసుకోవలసివచ్చేది. జర్మన్‌లు అడవిలో పశువుల్ని మేపుకునేవాళ్లు. వాళ్లు ద్రాక్ష తోటలూ, పండ్ల తోటలూ పెంచలేదు.

ఇతర బర్బరుల* మాదిరిగానే, జర్మన్‌లు సారవంతమైన మైదానాలపట్లా, సామ్రాజ్యపు సంపదపట్లా ఆకర్షితులయారు. జర్మన్‌ల గణాలకి గణాలు రోమన్ సామ్రాజ్య ప్రాంతాలమీద దాడిచెయ్యనారంభించాయి. సాయుధులైన పురుషులు ముందు వెళ్లేవాళ్లు — సాధారణ సైనికులు పాదచారులై నడిచేవాళ్లు, తెగ నాయకులూ, వాళ్ల రక్షక భటులూ గుర్రాలమీద అధిరోహించి వెళ్లేవాళ్లు. పురుషుల వెనుక పెద్ద పెద్ద ఎడ్లబళ్లు వెళ్లేవి. వాటిలో స్త్రీలు, పిల్లలు ఉండేవాళ్లు. పశువుల కాపరులు పశువుల్ని తోలుకుంటూ వెళ్లేవాళ్లు.

సామ్రాజ్యం శక్తివంతంగా వున్నప్పుడు బర్బరుల దాడులను తిప్పికొట్టేది. రోమన్లు చాలామంది బర్బరులను బందీలుగా పట్టుకొని, వాళ్లని బానిసలుగా మార్చారు.

**2. సామ్రాజ్యం బలహీనపడటం.** చక్రవర్తుల అధికారం 3వ శతాబ్దంలో బాగా బలహీనపడిపోయింది. శక్తివంతులైన సేనాధిపతులు తమకి యిష్టమొచ్చినవాళ్లని గద్దెమీద ఎక్కించేవాళ్లు, ఇష్టం లేకపోతే దింపేసేవాళ్లు, ఎవళ్లు తమకి ఎక్కువ జీతమిస్తామని ఆశ చూపితే వాళ్లని గద్దెమీద కూర్చోపెట్టేవాళ్లు. చక్రవర్తులు రెండు మూడేళ్లకి ఒకరు చొప్పున మార్చబడేవాళ్లు. ఒక్కొక్కసారి కొద్ది నెలల్లోపలే యీ మార్పు జరిగేది. వాళ్లలో దాదాపు ఏ ఒక్కరూ సహజ మరణం పొందేవాళ్లు కారు. కొన్ని సందర్భాల్లో సామ్రాజ్యంలో ఏక కాలంలో పెక్కుమంది చక్రవర్తులు అధికారంలో ఉండి, పరస్పరం పోరాడుతూ వుండేవాళ్లు.

సైనికుల్లో తిరుగుబాట్లు, చక్రవర్తుల మధ్య యుద్ధాలు సామ్రాజ్యాన్ని బలహీనపరచాయి. 3వ శతాబ్ది మధ్యలో

---

* గ్రీకులూ, రోమన్లూ ఎవరి భాష తమకి అర్థం కాదో వారిని బర్బరులు అని పిలిచేవారు. కాని కాలక్రమంలో యీ మాటకి అనాగరికులు, క్రూరులు అనే అర్థం ఏర్పడింది.

గాల్లియా, స్పెయిన్, ఈజిప్టులు, ఆసియాలోని, దిగువ డాన్యూబ్ తీరంలోని దాదాపు అన్ని రాష్ట్రాలూ రోమ్‌నుంచి వేరుపడిపోయాయి.

బలహీనపడిన సామ్రాజ్యం తన సరిహద్దులను కాపాడుకోలేకపోయింది. జర్మన్‌ల, తదితర బర్బరుల మూకలు రోమన్ సామ్రాజ్య ప్రాంతాల్లోకి చొచ్చుకువెళ్ళి, తమ దోవలో తమకి దొరికినవాటన్నింటినీ దోచుకొని, మిగిలినవాటిని ధ్వంసంచేశాయి.

### 3. డియోక్లెటియన్ చక్రవర్తి పాలన.

ఇటలీలోని, రాష్ట్రాల్లోని బానిస యజమానులకి సామ్రాజ్యాన్ని నిలబెట్టుకోవడం ప్రయోజనకరం. అందుకే వాళ్ళు చక్రవర్తి అధికారాన్ని పట్టుదలగా, శక్తివంతంగా, సుదృఢంచేసిన డియోక్లెటియన్ చక్రవర్తికి తోడ్పడ్డారు.

సామాన్య సైనికుడుగా జీవితం ప్రారంభించిన డియోక్లెటియన్ సైనిక కొలువులో చకచకా మెట్లెక్కి చక్రవర్తి రక్షక భటుల దళానికి నాయకుడయ్యాడు. 284లో సైన్యం అతన్ని చక్రవర్తిగా ప్రకటించింది. డియోక్లెటియన్ సామ్రాజ్యాన్ని 21 సంవత్సరాలు పాలించాడు.

సామ్రాజ్యంలో అప్పటికింకా వున్న రిపబ్లికన్ పదవులను డియోక్లెటియన్ రద్దుచేశాడు. తను నియమించిన అధికారుల ద్వారా అతను పాలించాడు. చక్రవర్తి మాటే శాసనం. అసంతృప్త ప్రజల ఆనుపానులు, కార్యకలాపాలు తెలుసుకునేందుకు ''చార చక్షువులు'' అనబడే పలువురు ఏజెంట్లను అతను నియమించాడు. డియోక్లెటియన్ తనని తాను జూపి



1



2

1. రోమన్ కోటమీద బర్బరుల ముట్టడి (రోమన్ ఉబ్బెత్తు చిత్రం). బర్బరుల, రోమన్ల ఆయుధాలను పోల్చిచూడండి.
2. రోమన్ సరిహద్దు కావలి స్థావరం: కాపలావాళ్ల బురుజు, ప్రాకారం, కందకం (ప్రాచీన రోమన్ చిత్రం ఆధారంగా గీసిన చిత్రం)

టర్ పుత్రుడుగా ప్రకటించుకున్నాడు. దేవాలయాల్లో అతని విగ్రహాలు నెలకొల్పబడ్డాయి. ప్రభువులు సైతం అతని పాదాల ముందు ప్రణమిల్లవలసివుండేది. మెహర్బానీ చూపుతున్నట్లు తన పాదాన్నో, బంగారు జరీ వస్త్రాల అంచునో చుంబించనిచ్చేవాడు.

తన సైన్యాన్ని పెంచుకునేందుకూ, తిరుగుబాటుదార్లపైన నమ్మకంగా పోరాడేందుకూగాను అతను పెద్ద పెద్ద బర్బర తెగలను తన సైనిక కొలువులో కుదుర్చుకున్నాడు. సైన్య పోషణకోసం అతను జనాభానుంచి వసూలు చేసే పన్నులు పెంచాడు. తిరుగుబాటుదార్లను నిర్దాక్షిణ్యంగా సంహరింపజెయ్యడం ద్వారా సైనికుల్లో అతను క్రమశిక్షణను కట్టుదిట్టం చేశాడు.

4. తిరుగుబాట్ల అణచివేత.

డియోక్లెటియన్ తన బృహత్ సైన్యంతో గాల్లియాపై దండయాత్ర చేసి, అక్కడి జనావాసాలను భస్మీభూతంచేసి, జనాన్ని హతమార్చాడు. బగవూద్‌లు యుద్ధంలో ఓడిపోయారు. తిరుగుబాటుదారుల్లో మిగిలినవాళ్లు ఒక కోటలో తలదాచుకున్నారు. డియోక్లెటియన్ సైన్యం కోటని ముట్టడించింది. చివరకి ఆకలి బాధకి తట్టుకోలేక బగవూద్‌లు లొంగిపోయారు. ఖైదీల్లో, కొందరు సంహరించబడగా, మిగిలినవాళ్లు భార్యా బిడ్డలతో సహా బానిసలుగా మార్చబడ్డారు. గాల్లియాలోని బానిస యజమానులు చక్రవర్తిని దైవసమానుడుగా ప్రస్తుతించారు.

స్థానిక బానిస యజమానుల సహాయంతో రోమన్ సేనలు ఉత్తర ఆఫ్రికాలోని తిరుగుబాటును కూడా అణచివేశాయి.

5. సామ్రాజ్యపు రక్షణ ఏర్పాట్లు.

బర్బరులనుంచి రక్షణకోసం సామ్రాజ్యపు సరిహద్దుల్లో బురుజులతో కూడిన కోటలు నిర్మించబడ్డాయి. రోమన్లు కోటల చుట్టూ కందకాలు తవ్వారు, మట్టి గోడలూ, చివర్లు సూదిగా చెక్కిన కొయ్య దుంగల దడులూ కట్టారు. కోట గోడలపైన బురుజులు ఉండేవి. వాటిమీదనుంచి పహరా సైనికులు చుట్టుపక్కల ప్రాంతాన్ని పరిశీలిస్తూ వుండేవాళ్లు. రోమన్ సైనికులూ, సైనిక కొలువులో చేర్చుకోబడ్డ బర్బరులూ యితర బర్బరులనుంచి సరిహద్దును రక్షిస్తూండేవాళ్లు.

రోమన్ రాజ్యయంత్రం సామ్రాజ్యంలో పీడితుల ప్రతిఘటనను అణచివెయ్యడంలోనూ, తన సరిహద్దుల్లో దాడులను తిప్పికొట్టడంలోనూ మరోసారి సఫలమైంది.

? 1. బర్బరులు రోమన్ సామ్రాజ్యంమీద ఎందుకు దాడిచేశారు? 2. 3వ శతాబ్దిలో రోమన్ సామ్రాజ్యం బలహీనపడానికి సూచనలు యేమిటి? 3. సామ్రాజ్యాన్ని తిరిగి పటిష్ఠంచేసేందుకు డియోక్లెటియన్ అనుసరించిన పద్ధతులు యేమిటి? సామ్రాజ్యం ఎక్కువ కాలం దృఢపడిందా? 4. డియోక్లెటియన్ పాలనకీ, ఆగస్టస్ పాలనకీ మధ్య తేడా యేమిటి? డియోక్లెటియన్ పాలన ఏ రాజుల పాలనను పోలివుంది? ఏవిధంగా పోలివుంది? 5. ఆగస్టస్ పాలన ఆరంభానికీ, డియోక్లెటియన్ పాలన ఆరంభానికీ మధ్య ఎన్నేళ్ల కాలవ్యవధి వుంది?

## § 58. క్రైస్తవ మత ఆవిర్భావం

(మాప్ 10)

మరణానంతర జీవితం అని దేన్ని అంటారో జ్ఞాపకం చేసుకోండి. మరణించి పునర్జీవితుడైన ఏ దేవతని గురించిన ఈజిప్షియన్ పురాణ కథ మీకు తెలుసు; అది ఎందుకు పుట్టింది (§11; 2, 3)?

**1. కొత్త మతం యెందుకు పుట్టింది?**

రోమన్ సామ్రాజ్యంలో బానిసల తిరుగుబాట్లూ, కొలోన్‌ల తిరుగుబాట్లూ, రోమన్ల ఆక్రమణలోని ప్రజల తిరుగుబాట్లూ ఓడిపోతూ వచ్చాయి. సామ్రాజ్యం అజేయంగా కనపడింది. పీడితులకి పీడకులకు వ్యతిరేకంగా తాము జరిపే పోరాటం ద్వారా విముక్తి లభిస్తుందన్న ఆశపోయింది. బానిసలకూ, కొలోన్లకూ దుర్భరమైన పనినుండీ, అవమానాలనుండీ, దెబ్బలనుండీ విముక్తి యివ్వగలిగింది మరణం మాత్రమే. క్రమంగా వాళ్ళ తమ ప్రతిస్థితిని మెరుగుపరచడానికి యేమీ చేయని దేవతల తమ పాత దేవతల శక్తిమీద విశ్వాసం కోల్పోతూవచ్చారు.

పీడితుల్లో మరొక విశ్వాసం వ్యాపించనారంభించింది. తమను పీడననుండి విముక్తి చేసే సర్వశక్తిపరుడైన ఒక దేవునిమీద విశ్వాసం అది. ఈ ''దయగల దేవుని'' రాకకోసం వాళ్ళ ఆతురతతో యెదరుచూస్తూ వచ్చారు.

**2. యేసు క్రీస్తును గురించిన పురాణ గాథ.**

పాలెస్తీనాలో ఒక దేవుడు మామూలు మనిషిలాగా జీవిస్తున్నాడనే వదంతులు మొదటి శతాబ్దిలో విరివిగా వ్యాపించాయి. బానిసలనూ, బీదలనూ ఉద్ధరించడానికి ఆ దేవుడు భూమిమీద అవతరించాడని ప్రజలు అనుకునేవాళ్ళు. అతని పేరు యేసు క్రీస్తు. అతన్ని ఒక రోమన్ గవర్నర్ సిలువవేశాడనీ, అతను మరణించిన తర్వాత పునరుత్థానం పొంది స్వర్గానికి పోయాడనీ అనుకునేవాళ్ళు. అతను త్వరగా తిరిగివచ్చి, మానవుల ఆత్మలను విచారణ చేస్తానని చెప్పాడట. తన్ను దేవునిగా గుర్తించినవాళ్ళకూ, ఈ భూమిమీద బాధపడుతున్నవాళ్ళకూ శాశ్వత సౌఖ్యం యిస్తాననీ, యితరులకు అనంతమైన హింసలు కలిగిస్తాననీ అతను చెప్పాడట. అలాంటి వ్యక్తి యెప్పుడూ లేడని యిప్పుడు చారిత్రక శాస్త్రం రుజువు చేసింది. ఓసిరిస్, మొదలైన దేవతలు పునరుత్థానం చెందినట్లు చెప్పే పురాతనమైన పురాణ గాథల ఆధారంతో యేసు క్రీస్తును గురించిన పురాణ గాథలు ఉత్పన్నమయాయి.

ఈ పురాణ గాథలన్నీ క్రీ.శ. 1వ శతాబ్ది చివర, 2వ శతాబ్దిలో గ్రంథస్థం చేయబడ్డాయి. ఈ రచనలకు ''గాస్పెల్స్'' అని పేరు — అనగా ''సువార్తలు.'' యేసు క్రీస్తు జీవిత చరిత్రను గురించి విభిన్న సువార్తలు విభిన్న రకాంగా చెప్పాయి. అయితే సరిగ్గా ఇలాంటి వార్తకోసమే పీడితులు ఆతురతతో కాచుకొని వున్నారు.

**3. క్రైస్తవ మత వ్యాప్తి ప్రారంభం.**

ఎంతో ఊరట కలిగించే ఆ సువార్తలను పీడితులు బుద్ధిపూర్వకంగా నమ్మారు. వాళ్ల బాధలకు పారితోషికమూ, వాళ్లను బాధించిన వాళ్లకు శిక్షా వాగ్దానం చేశాయి ఆ కథలు. యేసు క్రీస్తును గురించిన పురాణ గాథలను నమ్మినవాళ్ళ తాము క్రైస్తవులం అని చెప్పుకున్నారు. యేసు క్రీస్తును నమ్మేవాళ్ల మతం క్రైస్తవ మతం అయింది.

క్రైస్తవ బోధకులు దేశంనుంచి దేశానికీ, నగరంనుంచి నగరానికీ పర్యటించారు. క్రైస్తవ మతం రోమన్ సామ్రాజ్యం అంతటా వ్యాపించనారంభించింది. ఆదిలో బీదవాళ్ళూ, బానిసలూ క్రైస్తవులు అయారు. వాళ్లలో యూదులు, గ్రీకులు, రోమన్లు, ఈజిప్షియన్లు, గాల్‌లు, యింకా యితరులూ వుండేవాళ్లు.

క్రైస్తవులు ఒక్క దేవుణ్ణి మాత్రమే గుర్తించి, చక్రవర్తులను దేవతలుగా పూజించడానికి నిరాకరించారు. దీనికి వాళ్లను చక్రవర్తులు వేధించేవాళ్లు.

క్రైస్తవులు రహస్య సంఘాలు నెలకొల్పుకున్నారు. సంఘ సభ్యులు పరస్పరం సహాయంచేసుకునేవాళ్లు. కలిసి భోజనాలు చేసేవాళ్లు. తరచు నేలమాళిగల్లోనూ, విసర్జింపబడిన రాతి గనుల్లోనూ కలుసుకునేవాళ్లు (పేజి 273 చూడండి). అక్కడ వాళ్లు ప్రార్థనలు చేసి, కొత్త సువార్తను బిగ్గరగా చదవగా వినేవాళ్లు.

**4. ధనికులు క్రైస్తవులు అవడం.**

ధనికులు క్రైస్తవ మతాన్ని తమ ప్రయోజనాలకోసం వినియోగించుకొన ప్రయత్నించారు. క్రైస్తవ మతం ఓర్పునూ, విధేయతనూ బోధించి తద్వారా బానిసలనూ, బీదవాళ్లనూ బానిస యజమానులకు వ్యతిరేకంగా పోరాటంలో పాల్గొనకుండా పక్కదోవ పట్టించింది. ''క్రైస్తవ మతం చెడ్డ బానిసను మంచి బానిసను చేస్తుంది'' అని రాశాడు ఒక క్రైస్తవ మత బోధకుడు. దీనికితోడు, 3వ శతాబ్దిలో రోమన్ సామ్రాజ్యంలో జీవితం అశాంతిగానూ, ప్రమాదకరంగానూ వుండేది. బానిసల్లోనూ, సైనికుల్లోనూ తిరుగుబాట్లు జరిగినప్పుడు, జనం తరుచుగా ఆస్తులే కాక, ప్రాణాలు కూడా కోల్పోయే వాళ్లు. సామ్రాజ్యంలోని భూభాగాలను పొరుగున వుండే ఆటవిక జాతులవాళ్లు దాడిచేసి నిర్దాక్షిణ్యంగా ధ్వంసం చేసే వాళ్లు. ధనవంతులు కూడా తమ భవిష్యత్తులో విశ్వాసం కోల్పోతూవచ్చారు. మరునాటికి తమ ఆస్తి భద్రంగా వుంటుందో లేదో, తాము సజీవంగా వుంటారో లేదో సందేహాస్పదమైంది. రోజులు నిరంతర భీతితో నిండాయి. మరణానంతరం ''శాశ్వత సౌఖ్యం'' తమకోసం కాచుకొని వుందని బీదవాళ్ల లాగే ధనికులు తమ్మును తాము ఊరడించుకొన్నారు. క్రైస్తవ మతం బీదవాళ్లకూ, బానిసలకూ ఓర్పూ, అణకువా బోధిస్తున్నదనీ, ఈవిధంగా అది వాళ్లను బానిస యజమానులమీది పోరాటంనుండి పక్కదారి పట్టిస్తున్నదనీ అదే సమయంలో ధనికులు గుర్తించారు. అందువల్లనే కొంతమంది ధనికులు కూడా క్రైస్తవ సంఘాల్లో చేరనారంభించారు.

తరచుగా జరిగే యుద్ధాలు, సామ్రాజ్యం నాశనం కావడం విద్యా, విజ్ఞానశాస్త్రాల్లో పతనానికి కారణభూతమయ్యాయి. విద్యావంతుల సంఖ్యే కాకుండా అక్షరాస్యుల సంఖ్య కూడా తగ్గిపోయింది. ఈ పరిస్థితి జనాభాలో మత విశ్వాసాల వ్యాప్తికి దోహదం చేసింది.

**5. క్రైస్తవ చర్చి.**

క్రైస్తవులలో ధనవంతులు క్రైస్తవ సంఘాల అవసరాలకోసం ధనం విరాళంగా యిచ్చేవాళ్లు. ధనవంతుల నుండే ప్రీస్టులు యేరుకోబడేవాళ్లు. అలాగే బిషప్పులు కూడా యేరుకోబడేవాళ్లు. ప్రీస్టు అంటే ''సంఘ నాయకుడు'' అనీ, బిషప్ అంటే గ్రీకు భాషలో ''తనిఖీ చేసేవాడు'' అనీ అర్థం. ఒక ప్రాంతంలో వుండే క్రైస్తవులందరూ మారుమాట లేకుండా వాళ్లకి లోబడివుండాలి.

3వ శతాబ్ది అంతం నాటికి క్రైస్తవ మతం రోమన్ సామ్రాజ్య మంతటా విస్తృతంగా వ్యాపించింది. వేరు వేరు నగరాల్లోని క్రైస్తవులు ఒకరితో ఒకరు సంబంధాలు పెట్టుకొని వుండేవాళ్లు. వాళ్లు ఒక రహస్య సంస్థ నెలకొల్పుకున్నారు. ఆ రహస్య సంస్థలో వందలాది క్రైస్తవ సంఘాలూ డజన్ల కొద్దీ బిషప్పులూ, వేలకొద్దీ ప్రీస్టులూ, లక్షలమంది అనుచరులూ వుండేవాళ్లు. క్రైస్తవుల సంస్థ పేరు చర్చి. క్రైస్తవ చర్చికి సామ్రాజ్యపు జనాభామీద విశేషమైన ప్రభావం వుండేది.

? 1. సర్వశక్తివంతుడైన దేవుడి రాక గురించిన నమ్మకం ఎలా ఉత్పన్నమైంది, ఎలా వ్యాపించింది? 2. ఏసు క్రీస్తును గురించిన పురాణ గాథకీ, ఒసిరిస్‌ని గురించిన పురాణ గాథకీ మధ్య సామ్యం యేమిటి? మరణానంతర స్వర్గ రాజ్యం గురించిన కథ ఈజిప్టులో కాక మరెక్కడ ప్రాచుర్యంలో వుంది? 3. ఆదిలో క్రైస్తవులు ఎవరు? ఎందుచేత? దరిమిలా వాళ్లు ఎందుకు మారారు? 4. క్రైస్తవ చర్చి అంటే ఏమిటి?

## § 59. 4వ శతాబ్దిలో సామ్రాజ్య పరిస్థితి మరింతగా క్షీణించడం

(మ్యాప్ 10)

ప్రాచీన తూర్పులోనూ, ప్రాచీన గ్రీసులోనూ మతం ఎవరి ప్రయోజనాలను కాపాడిందో జ్ఞాపకం చేసుకోండి.

**1. 4వ శతాబ్దిలో ప్రజా బాహుళ్యపు పీడన.**

డియోక్లెటియన్ పాలన అనంతరం అధికారంకోసం పోరాటం ద్విగుణీకృత శక్తితో పెల్లుబికింది. కాన్‌స్టాంటిన్ అనే సేనా నాయకుడు ఆ పోరాటంలో విజయం సాధించాడు. అధికారం సాధించుకునేందుకూ, దాన్ని నిలుపుకునేందుకూ చేసే పోరాటంలో అతను దేనికీ వెనుకాడలేదు. చేసిన ప్రమాణాలను ఉల్లంఘించాడు, తన పొత్తుదారుని చంపాడు. తనని పదవీ భ్రష్టుని చేసి గద్దెనెక్కకోరుతున్నాడన్న అనుమానంతో తన కన్న కొడుకునే అతను చంపించాడు.

శ్రమజీవులపట్ల కాన్‌స్టాంటిన్ చక్రవర్తి యింకా ముష్కరంగా వ్యవహరించాడు. భూస్వాములకు శ్రమజీవులను అందించడానికిగాను, అతను కొలోన్‌లు యెస్టేట్లను వదలిపెట్టిపోకూడదని చట్టం చేశాడు. కొలోన్ యెవడైనా తప్పించుకోడానికి ప్రయత్నిస్తే, వాణ్ణి తిరిగి తీసుకొచ్చి గొలుసులతో బంధించేవాళ్లు. బానిస యజమాని తన బానిసను కొట్టి చంపితే, బానిసను దురలవాట్లనుండి విముక్తి చేసి, మేలు చేసినట్లు భావించబడేది. ప్రభుత్వ కార్ఖానాలలో కార్మికులకు బానిసలకు వేసినట్లు వాతలతో గుర్తులు వేసేవాళ్లు.

చక్రవర్తి, ప్రభువుల విలాస జీవితానికీ, పెద్ద సైన్యానికీ, బోలెడుమంది అధికారులకీ, ఏజెంట్లకీ చాలా ధనం అవసరమయేది. పన్నులు మరింత పెరిగాయి. పన్నులు కట్టలేనివాళ్లను కొరడాలతో కొట్టేవాళ్లు. వర్తకులూ, చేతిపనివాళ్లూ పన్నులు యెగ గొట్టకుండా, వాళ్లు ఒక నగరంనుండి మరొక నగరానికి పోవడమూ, వృత్తులు మార్చుకోవడమూ నిషేధింపబడ్డాయి. తండ్రులు చేసిన పనులే పిల్లలు చేయాలి.

**2. క్రైస్తవ మతం ప్రబల మతం అయింది.**

జనాన్ని లొంగదియ్యడానికి కొరడా దెబ్బలు, గొలుసులతో బంధించడం, చంపడమే సరిపోవన్న విషయాన్ని కాన్‌స్టాంటిన్ గ్రహించాడు. తన అధికారాన్ని బలపరచుకోడానికి కాన్‌స్టాంటిన్ క్రైస్తవ చర్చిని వినియోగించుకున్నాడు. బానిసలనూ, పేదవాళ్లనూ అణకువగా వుంచడానికి యితర మతాలలో లేని సౌకర్యాలు దీనిలో అతను గుర్తించాడు. దీనికి బదులుగా, గురువులూ, బిషప్పులూ బానిసలకూ, బీదవాళ్లకూ వాళ్లు మారుమాట లేకుండా చక్రవర్తికీ, బానిస యజమానులకూ లోబడి వుండాలని బోధచేశారు. ''క్రీస్తు దేవుడు శిలువమీద బాధలు

1. క్రైస్తవ మతపు ఆరంభ దినాల్లో క్రైస్తవులు యిలాంటి గుహల్లో రహస్యంగా సమావేశమవుతూ వుండేవాళ్లు. 2. రోమ్‌లోని ఒక క్రైస్తవ దేవాలయం (5వ శతాబ్దం). పై గుహని కింది దేవాలయంతో పోల్చి చూడండి



1



2

పడ్డాడు, అలాగే మిమ్మల్ని కూడా బాధపడమని ఆదేశించాడు. ఇందుకు ప్రతిఫలంగా పరలోకంలో మీకు స్వర్గసుఖాలు లభిస్తాయి.'' ''స్వయంగా దేవుడే చక్రవర్తికి అధికారం యిచ్చాడు'' అని చర్చిలలో బోధించేవాళ్లు. ''బానిసలారా, ప్రతి విషయంలోనూ మీ యజమానులకు లోబడివుండండి'' అని కూడా చర్చిలలో బోధించేవాళ్లు.

క్రైస్తవులు బహిరంగంగా చర్చిలు (ప్రార్థన మందిరాలు) కట్టుకోడానికీ, వాటిలో సమావేశం కావడానికీ 313లో

కాన్‌స్టాంటిన్ అనుమతి యిచ్చాడు. చక్రవర్తీ, బానిస యజమానులూ క్రైస్తవ చర్చికి భూములు, డబ్బు, విలువైన వస్తువులూ ధారాళంగా దానంచేశారు. చర్చి అపారమైన ఐశ్వర్యం సంపాయించింది; చాలా గొప్ప భూస్వాముల్లో ఒక భూస్వామిగానూ, చాలా పెద్ద వడ్డీ వ్యాపారుల్లో ఒక వడ్డీ వ్యాపారిగానూ తయారైంది. అయితే చర్చికి వున్న యీ సంపద క్రైస్తవ జన సముదాయమంతటికీ వినియోగపడలేదు, అత్యధిక భాగం బిషప్పులకీ, ప్రీస్టులకీ వినియోగపడింది.

కాన్‌స్టాంటిన్ యెన్ని దారుణమైన క్రూర కర్మలు చేసినా, క్రైస్తవులు అతన్ని పవిత్ర పురుషుడని ప్రకటించారు.

3. రాజధాని మారింది.

బాస్పరస్ జలసంధి తీరంలో, బైజాంటియమ్ అనే గ్రీకు వలస వున్న చోట కాన్‌స్టాంటిన్ ఒక నగరం నిర్మింపజేశాడు.

తరువాత యేండ్లలో ఆ నగరానికి కాన్‌స్టాంటినోపుల్ అని పేరు పెట్టారు — అనగా కాన్‌స్టాంటిన్ నగరం. సామ్రాజ్యపు తూర్పు అర్ధభాగపు భూమార్గమూ, సముద్ర మార్గమూ కలిసే చోట అది వుంది. సామ్రాజ్యపు ఖజానా ఖాళీగా వున్నప్పటికీ నగరంలో క్రైస్తవ చర్చిలతోబాటు అద్భుతమైన అంతఃపురాలూ, దేవళాలూ నిర్మింపబడ్డాయి.

330లో సామ్రాజ్యపు రాజధాని కాన్‌స్టాంటినోపుల్‌కి మార్చబడింది.

4. క్రైస్తవులచేత కళాత్మక స్మారక చిహ్నాల వినాశం, విజ్ఞానశాస్త్రజ్ఞులపై వేధింపు చర్యలు.

చక్రవర్తుల అండ చూసుకుని, క్రైస్తవులు యితర మతాలకు చెందినవాళ్లను వేధించనారంభించారు. ప్రాచీన దేవళాలనూ, యితర దేవతల విగ్రహాలనూ ధ్వంసం చేశారు లేక వాటిని చర్చీలుగా మార్చారు. ఈవిధంగా అనేక అద్భుతమైన కళాఖండాలు నాశనమయాయి. 4వ శతాబ్ది చివర చక్రవర్తి జీయస్ పేరిట జరిగే ఒలింపిక్ క్రీడలను నిషేధించాడు.

మరొక వైపున క్రైస్తవులు విజ్ఞానశాస్త్రంమీద భీషణమైన పోరాటం ప్రారంభించారు. విజ్ఞానశాస్త్రం సువార్తలోని పురాణ గాథలను ఖండించడమే యిందుకు కారణం. వాళ్లు అలెగ్జాంద్రియాలోని ప్రసిద్ధమైన గ్రంథాలయంలోని చాలా రాతప్రతులను కాల్చివేశారు. ఇతర నగరాల్లోని అనేక వైజ్ఞానిక గ్రంథాలను కూడా ధ్వంసం చేశారు. అలెగ్జాంద్రియాలోని ఒక వీధిలో ఇపాతియా అనే విద్వాంసురాలిని క్రైస్తవుల గుంపు చిత్రవధ చేసింది. క్రైస్తవులచేత హత్య చేయబడిన మొదటి వైజ్ఞానిక మృత వీరుల్లో ఒకతె ఇపాతియా.

5. 4వ శతాబ్దిలో వర్గపోరాటం.

క్రైస్తవ మతం బీదవారిలోనూ, బానిసల్లోనూ కొంతమందిని దోపిడిదారులకి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో చేరకుండా ఆపగలిగినప్పటికీ మతం గాని, క్రౌర్యం గాని పీడితుల ప్రతిఘటనని పూర్తిగా అణచివెయ్యలేకపోయింది. బానిసలూ, కొలోన్‌లూ యాతిబాధలూ, శిక్షలూ దుర్భరమైనందున అడవుల్లో తలదాచుకున్నారు. నగర వాసులు కూడా కొరడాలు చేతబూని పన్నుల వసూలుదార్లు రాకముందే పారిపోయారు. వాళ్లు దళాలుగా ఏర్పడి, అధికారులమీదా, బానిస యజమానుల ఎస్టేట్లమీదా, చివరకు నగరాలమీద సైతం దాడులు చేశారు. ఒక బిషప్ మండిపడుతూ యిలా రాశాడు: ''...తమ పాలకుల పట్ల గ్రామీణ పేదల పొగరుబోతుతనం పెచ్చరిల్లింది. తప్పించుకు పారిపోయిన బానిసలు క్రైస్తవ బోధనకి విరుద్ధంగా తమ యజమానులను విడిచిపెట్టి పోవడమే కాకుండా, వాళ్లమీద క్రూరమైన దాడులు కూడా చేస్తున్నారు.''

సామ్రాజ్యపు ఆర్థిక వ్యవస్థ పూర్తి అస్తవ్యస్తంగా తయారైంది. వర్తకం దాదాపు స్తంభించిపోయింది. చాలా నగరాలూ, ప్రాంతాలూ — ప్రత్యేకించి సామ్రాజ్యపు పశ్చిమ భాగంలో — నిర్మానుష్యమయ్యాయి.

## కొలోన్‌లను గురించి రోమన్ సామ్రాజ్య చట్టాలు

ఆ చట్టాలు ఏ వర్గాల ప్రయోజనాలను కాపాడాయి? ఈ విషయం మీరెలా తెలుసుకోగలరు?

కొలోన్‌లకు భూమి లేకుండా చేయడం అమానుషం; యెందుకంటే అప్పుడు వాళ్లు యితర ప్రాంతాల భూస్వాములకు గొప్ప నష్టం కలిగిస్తారు. కనుక, కొలోన్‌లు తమ పొలాలకు అంటిపెట్టుకొని వుండాలని మేము ఉత్తరువు చేస్తున్నాం. వాళ్ల పిల్లలు యితర గ్రామాల్లో చేరకూడదు. తమ తండ్రులు కౌలుకు తీసుకున్న భూమికి వాళ్లు కూడా అంటిపెట్టుకొని వుండాలి.

తప్పించుకపోవడానికి పథకాలు వేసే కొలోన్‌లకు బానిసల లాగే గొలుసులు వేయవచ్చు.

? **1.** కాన్‌స్టాంటిన్ సామ్రాజ్యాన్ని యే పద్ధతుల ద్వారా బలపరచ ప్రయత్నించాడు? **2.** క్రైస్తవ చర్చి స్థానం 4వ శతాబ్దిలో ఎలా మారింది? ఎందుకు మారింది? **3.** ప్రాచీన ప్రపంచపు విజ్ఞానశాస్త్రంపట్లా, కళాఖండాలపట్లా క్రైస్తవ చర్చి వైఖరి ఎలా వుండేది? ఆ వైఖరికి కారణాలను వివరించండి. **4.** ప్రాచీన ప్రపంచంలో మతం పాత్రని గురించి సాధారణ నిర్ధారణ చెయ్యండి. **5.** డియోక్లెటియన్ పాలన ఆరంభానికీ, కాన్‌స్టాంటినోపుల్‌కి రాజధాని బదలాయింపుకీ మధ్య ఎన్నేళ్ల కాలవ్యవధి వుంది?

# § 60. పశ్చిమ రోమన్ సామ్రాజ్య పతనం

(మాప్ 10)

రోమన్ రిపబ్లిక్ ఎప్పుడు ఆవిర్భవించిందో, రోమన్ సామ్రాజ్యం ఎప్పుడు ఆవిర్భవించిందో జ్ఞాపకం చేసుకోండి.

**1. సామ్రాజ్యంపై బర్బరుల దాడులు తీవ్రమవడం.** సామ్రాజ్యం బలహీనపడేకొద్దీ సామ్రాజ్య సరిహద్దులమీద బర్బరుల దాడులు తీవ్రమయ్యాయి. బర్బరుల తెగలు శక్తివంతమైన సమాఖ్యల్లో సంఘటితమయ్యాయి. లక్షల సంఖ్యలో అసంఘటిత బర్బర్ల సైనికులు గుమికూడి రోమన్ రక్షణ స్థావరాలమీద దాడిచేసేవాళ్లు.

బర్బరుల దాడులను తిప్పికొట్టేందుకు చక్రవర్తులు బర్బరులకి బంగారం చెల్లించవలసివచ్చేది లేక వాళ్లమీద పోరాడేందుకు యితర తెగలవాళ్లని కొలువులో పెట్టుకోవలసివచ్చేది. దీనికిగాను నిరుపేదలైన జనాభా దగ్గర ఏటా పన్నులు వసూలుచెయ్యడం కష్టతరమైంది.

**2. రోమన్ సామ్రాజ్యంలోకి గోథ్‌ల చొరబాటు.**

క్రీ.శ. 4వ శతాబ్ది రెండవ అర్ధభాగంలో సంచారులైన హూణుల ఒక పెద్ద తండా కాస్పియన్ సముద్ర తీరంలోని స్టెప్ మైదానాల నుంచి యూరప్‌లోకి చొరబడింది. వాళ్లు దిట్టమైన తమ గుర్రాలమీద ఎడతెరిపిలేకుండా పయనిస్తూ తమ దోవలోని సమస్తాన్నీ నాశనంచేశారు.

గోథ్‌లు అనే జర్మన్ తెగలు అంతకు కొంచెం ముందు ఉత్తర నల్ల సముద్ర తీర ప్రాంతాల్లో స్థిరపడ్డారు. వాళ్లు హూణుల దాడిని తట్టుకోలేక డాన్యూబ్ నదీ తీరానికి తిరోగమించారు.

గోథ్‌లు రోమన్ సామ్రాజ్య ప్రాంతంలో స్థిరపడేందుకు చక్రవర్తి అనుమతి పొందారు. వేలకొలది గోథ్‌లు తమ భార్యా బిడ్డలతో నావలమీదా, బల్లకట్లమీదా డాన్యూబ్ నదిని దాటి, డాన్యూబ్ నది కుడి ఒడ్డుమీదకి చేరుకున్నారు. చక్రవర్తి అధికారులు వాళ్లకు ఆహారం యిస్తామని వాగ్దానం చేసి, అంతా తామే సంగ్రహించుకున్నారు. ఆకలితో అలమటించే గోథ్‌లు ఒక ముక్క బ్రెడ్డుకోసం తమ కొడుకులనూ, కూతుళ్లనూ బానిసలుగా అమ్మవలసివచ్చింది, తామే బానిసలుగా అమ్ముడు పోవలసివచ్చింది. గోథ్‌లు తిరుగబడి కాన్‌స్టాంటినోపుల్ దిశగా యాత్ర చేశారు.

వాళ్లను చక్రవర్తే స్వయంగా సైన్యంతో యెదిరించాడు. 378లో ఏడ్రియనోపుల్ వద్ద యుద్ధం జరిగింది. తిరుగుబాటుదార్లు రోమన్ సైన్యాన్ని ఓడించారు. చక్రవర్తిని చంపారు. అతని వారసుడు యెంతో కష్టంమీద గోథిక్ నాయకులకు లంచం యిచ్చి, తిరుగుబాటును అపగలిగాడు. గోథ్‌లకి బాల్కన్ ద్వీపకల్పపు పశ్చిమ భాగంలో భూమి లభించింది. సామ్రాజ్యం మధ్యలో పెద్ద సంఖ్యలో స్థిరపడ్డ యుద్ధప్రియులైన గోథ్‌లు సామ్రాజ్యానికి ప్రమాదకరంగా తయారయ్యారు.

**3. సామ్రాజ్యపు విభజన.**

395లో మొత్తం సామ్రాజ్యాన్ని యిద్దరు చక్రవర్తులు పంచుకున్నారు. తూర్పు సామ్రాజ్యం, పడమటి సామ్రాజ్యం అని రెండు సామ్రాజ్యాలు యేర్పడ్డాయి. తూర్పు సామ్రాజ్యంలో బాల్కన్ ద్వీపకల్పమూ, ఈజిప్టూ, ఆసియాలోని రోమన్ రాష్ట్రాలూ వుండేవి. పడమటి సామ్రాజ్యంలో ఇటలీ, యూరప్, ఆఫ్రికాల్లోని పశ్చిమ రోమన్ రాష్ట్రాలు వుండేవి.

తూర్పు సామ్రాజ్య పరిస్థితి కంటె పశ్చిమ సామ్రాజ్య స్థితి కష్టంగా వుండేది. జనం దివాళా పరిస్థితిలోనూ, నగరాలు నిర్మానుష్యంగానూ వుండేవి. దీనికితోడు అక్కడ తిరుగుబాట్లు తరుచుగా ప్రజ్వలించేవి.

**4. గోథ్‌లు రోమ్‌ను పట్టుకోవడం.**

పశ్చిమ సామ్రాజ్యపు బలహీనతను ఆసరాగా తీసుకొని, యుద్ధప్రియుడైన అలారిక్‌ను నాయకునిగా యెన్నుకొని, గోథ్‌లు ఇటలీమీద దండెత్తారు. రోమ్ దూతలు నగర రక్షకుల సంఖ్యాధిక్యతను చూపి అలారిక్‌ని భయకంపితుణ్ణి చెయ్యాలని ప్రయత్నించారు. ''గడ్డి యెంత ఒత్తుగా వుంటే, దాన్ని కొయ్యడం అంత తేలిక'' అని జవాబిచ్చాడు అలారిక్.

సామ్రాజ్యాన్ని రక్షించే వాడెవడూ లేడు. చక్రవర్తి ఒక బలమైన కోటలో దాక్కున్నాడు. కిరాయి సైనికులను నమ్మడానికి లేదు — వాళ్లలో అత్యధిక భాగం బర్బరులే. సామ్రాజ్యాన్ని ద్వేషించే బానిసలూ, కొలోన్‌లూ బానిస యజమానుల ఎస్టేట్లను ధ్వంసంచేసేవాళ్లు, ధనికులమీదా, అధికారులమీదా దాడులు చేసేవాళ్లు.

గోథ్‌లు రోమ్‌ను ముట్టడించారు. బలమైన బురుజులతో నగరం చుట్టూవున్న దుర్భేద్యమైన రాతి గోడలమీద దాడిచేసే సాహసం అలారిక్‌కు లేకపోయింది. కాని ఒకి రాత్రి బానిసలు కోట ద్వారాలు తెరిచారు. గోథ్‌లు లోపలికి దుమికారు.

1. ఆశ్విక బర్బరుడు (ఒక ప్రాచీన రోమన్ చిత్రం ఆధారంగా గీసిన చిత్రం). 2. రోమ్‌లోని దుర్గ ప్రాకార ద్వారాలు. 3వ శతాబ్దిలో రోమ్ నగరం బలిష్ఠమైన కొత్త కోట గోడలతో, బురుజులతో పటిష్ఠం చెయ్యబడింది


1


2

ఏది ఆ కాలపు నగరాల్లోకెల్ల మిక్కిలి పెద్దదో, ఏ నగరం ముందు యూరప్, ఆసియా, ఆఫ్రికాల ప్రజలు వందల సంవత్సరాల పాటు భయంతో గజగజలాడేవారో, ఆ రోమ్ నగరం దాదాపు ప్రతిఘటన యేమీ లేకుండా అస్తవ్యస్తమైన బర్బరుల గుంపుకి 410లో లొంగిపోయింది. గోథ్‌లు రోమ్‌ను మూడు రోజులపాటు కొల్లగొట్టారు. తర్వాత వాళ్ళు నిర్మానుష్యమైన నగరాన్ని విడిచి వెళ్ళిపోయారు (వర్ణ చిత్రం 22 చూడండి).

5. పశ్చిమ సామ్రాజ్యంలోకి జర్మన్‌ల చొరబాటు.

గోథ్‌ల తర్వాత యితర జర్మన్ తెగలు ఉప్పెనలాగా పశ్చిమ రోమన్ సామ్రాజ్యం మీద పడ్డాయి. తీవ్ర ప్రతిఘటన లేకపోవడంతో జర్మన్లు గాల్లియానూ, ఇటలీనీ, స్పెయిన్‌నూ వశపరచుకున్నారు. స్పెయిన్‌నుండి వాళ్ళు ఉత్తర ఆఫ్రికాపై దండయాత్ర చేశారు.

జర్మన్లు ప్రళయ ఝుంఝులా సామ్రాజ్య మంతటా వ్యాపించారు. తమ దారిలో కనిపించిన దంతా ధ్వంసంచేసేవాళ్ళు. వాళ్ళు సారవంతమైన ప్రాంతాల్లో స్థిరపడి, అక్కడ వున్న ద్రాక్ష తోటలు నరికివేసి, వాటి స్థానంలో రై, బార్లీ విత్తేవాళ్ళు, ఆలివ్ తోటలను పచ్చిక బీళ్ళగా మార్చేవాళ్ళు. కోట కట్టుకోడానికి వాళ్ళకు రాళ్ళు అవసరమైనప్పుడు, ఒక అంతః పురానివో, దేవళానివో గోడలు పడగొట్టేవాళ్ళు. ఈవిధంగా అనేక నగరాలు శిథిలాలుగా మారి, వాటిలో గడ్డి, పొదలూ బలిసిపోయాయి.

5వ శతాబ్ది మధ్యలో ఆఫ్రికాలో స్థిరపడిన వాండల్స్ అనే జర్మన్ గణాలు ఇటలీకి వచ్చి, రోమ్‌ను పట్టుకున్నాయి. రోమ్ కొల్ల రెండు వారాలు సాగింది. వాండల్సు కొల్లగొట్టడమే గాక, తమకు అక్కర లేనిదంతా ముక్కలు ముక్కలు

చేశారు. వాళ్ళు విగ్రహాలు పగలగొట్టారు, పుస్తకాలు కాల్చేశారు, భవనాలకు అగ్గి పెట్టారు. వాళ్ల దాడి తర్వాత రోమ్‌లో 7,000 మంది మనుషులు మాత్రం సజీవంగా మిగిలారు.*

6. పశ్చిమ రోమన్ సామ్రాజ్య అంతం.

476లో జర్మన్ సేనా నాయకుల్లో ఒకడు చిట్టచివరి రోమన్ చక్రవర్తిని సింహాసనచ్యుతుణ్ణి చేశాడు. పశ్చిమ రోమన్ సామ్రాజ్యం అంతరించింది. తూర్పు సామ్రాజ్యం బర్బరుల దాడిని ఎంతో కష్టంమీద తిప్పికొట్టగలిగింది.

పీడితుల తిరుగుబాట్ల మూలంగానూ, బర్బరుల దండయాత్రల మూలంగానూ పశ్చిమ రోమన్ సామ్రాజ్యం నాశనం చెయ్యబడింది. ఆ సామ్రాజ్య పతనంతో పశ్చిమ యూరప్‌లో బానిస యాజమాన్య వ్యవస్థ పూర్తిగా కూలిపోయింది. అందుకే, పశ్చిమ రోమన్ సామ్రాజ్య పతనం ప్రాచీన ప్రపంచ చరిత్ర అంతంగా పరిగణింపబడింది.

? 1. 4వ–5వ శతాబ్దాల్లో రోమన్ సామ్రాజ్యపు యే భాగాల్లో తిరుగుబాట్లు జరిగాయో మాప్‌లో చూపించండి. 2. బర్బరులు రోమన్ సామ్రాజ్యంలోకి యే ప్రధాన మార్గాల్లో చొరబడ్డారో మాప్‌లో చూపించండి. 4వ–5వ శతాబ్దాల్లో వాళ్ల దాడులు ఎందుకు తీవ్రతరమయ్యాయి? 3. అలారిక్ రోమ్ నగరాన్ని ఆక్రమించుకోగా ప్రముఖ సేనా నాయకుడు హన్నిబల్ ఎందుకు రోమ్‌ని ముట్టడించనైనా ముట్టడించలేక పోయాడు? 4. పశ్చిమ రోమన్ సామ్రాజ్య పతనానికి ప్రధాన కారణాలు యేమిటి? 5. ఆక్టేవియన్ నిరంకుశ పాలన నాటినుంచి లెక్కపెడితే రోమ్ సామ్రాజ్యం ఎన్నేళ్లు నిలిచివుంది? కాన్నే యుద్ధానికీ, అలారిక్ రోమ్‌ను ఆక్రమించుకోడానికీ మధ్య ఎన్నేళ్ల కాలవ్యవధి వుంది?

## మీకు ప్రాచీన రోమ్ చరిత్ర తెలుసా?

280వ పేజిలోని కాలక్రమ పట్టికను చూసి, పాఠ్య పుస్తకంలో ప్రాచీన రోమ్ చరిత్ర ఏ నాలుగు దశలుగా విభజింపబడిందో నిర్వచించి, యీకింది ప్రశ్నలనుబట్టి ఆ నాల్గింటిలో ప్రతి ఒక్కదాన్నీ వివరించండి:

అ) ఆ దశ ఆద్యంతాల్లో రోమన్ రాజ్య ప్రాంతాన్ని మాప్‌లో చూపించండి.

ఆ) అంతకుముందరి దశతో పోలిస్తే, రోమ్ ఆర్థిక వ్యవస్థలో సంభవించిన మార్పులు యేమిటి?

ఇ) జనాభాలోని ఏ వర్గాల (గ్రూపుల) మధ్య పోరాటం జరిగింది?

ఈ) రోమన్ రాజ్యంలో ఎలాంటి పరిపాలనా వ్యవస్థ అమల్లో వుంది? ఆ దశలో పరిపాలనలో ఏ మార్పులు సం

---

* దీన్నిబట్టి ''వాండలిజం'' అనే పదం పుట్టింది. కళాఖండాలనూ, యితర సాంస్కృతిక స్మారక చిహ్నాలనూ అకారణంగా ధ్వంసం చేయడం అని దాని అర్థం.

తవ్వకాలలో లభించిన రోమన్ ఫోరమ్, పల టీనెలు (ఫొటో). 260వ పేజిలోని చిత్రం తోనూ, అలాగే 19, 20 వర్ణ చిత్రాల తోనూ దీన్ని పోల్చిచూడండి



భవించాయి? రోమన్ సైన్యంలో ఉన్నది యెవరు? ఆ దశలో రోమన్ సైన్యంలో సంభవించిన మార్పులు యేమిటి?

ఉ) ఆ దశలో సంభవించిన ముఖ్య ఘటనలు యేమిటి?

రోమ్ చరిత్రలోని వివిధ దశల వివరణ రోమ్ చరిత్ర క్రమాన్ని గుర్తుచేసుకునేందుకు తోడ్పడుతుంది.

వేర్వేరు దశలను వివరించి, ''ప్రాచీన రోమ్ చరిత్ర'' పట్టికను, కింద యివ్వబడిన నమూనా ప్రకారం, ''గ్రీసు చరిత్రలోని ప్రధాన దశలు'' పట్టికను నింపండి:

| రోమ్ చరిత్రలో ప్రధాన దశలు | రోమన్ రాజ్య భూప్రాంతం | ఆర్థిక వ్యవస్థలో మార్పులు | జనాభా మధ్య పోరాటం | రాజ్య పరిపాలన వ్యవస్థ పద్ధతి | అతి ముఖ్య ఘటనలు, తేదీలు |
|---|---|---|---|---|---|
| | | | | | |

## ప్రాచీన రోమ్ చరిత్ర కాలక్రమ పట్టిక

| ముఖ్య దశలు | శతాబ్ది | ప్రధాన ఘటనలు, తేదీలు |
|---|---|---|
| రోమన్ బానిస యాజమాన్య రాజ్యం ఏర్పడడం | క్రీ.పూ. 8 | పురాణ గాథ ప్రకారం రోమ్ క్రీ.పూ. 753లో స్థాపించబడింది |
| | క్రీ.పూ. 7 | |
| | క్రీ.పూ. 6 | క్రీ.పూ. 509. రోమ్‌లో రిపబ్లిక్ స్థాపన |
| | క్రీ.పూ. 5 | |
| | క్రీ.పూ. 4 | |
| రోమ్ మధ్యధరా ప్రాంతంలో మిక్కిలి బలమైన రాజ్యం అవడం | క్రీ.పూ. 3 | క్రీ.పూ. 218–201. రెండవ ప్యూనిక్ యుద్ధం |
| | క్రీ.పూ. 2 | క్రీ.పూ. 133. టిబెరియస్ గ్రాఖ్ భూ సంస్కరణ చట్టం |
| | క్రీ.పూ. 1 | క్రీ.పూ. 74–71. స్పార్టకస్ తిరుగుబాటు<br>క్రీ.పూ. 49. సీజర్ రోమ్‌ని ఆక్రమించుకోవడం<br>క్రీ.పూ. 30 |
| రిపబ్లిక్ పతనం. సామ్రాజ్య స్థాపన. సామ్రాజ్య ఉన్నత దశ | క్రీ.శ. 1 | క్రీ.శ. 14. ఆక్టేవియన్ పాలన |
| | క్రీ.శ. 2 | 115–116. ట్రాయన్ చక్రవర్తి పాలనలో రోమ్ చివరి దండయాత్రలు |
| రోమన్ సామ్రాజ్య క్షీణ దశ, పతనం | క్రీ.శ. 3 | 284. డియోక్లెటియన్ పాలన ఆరంభం |
| | క్రీ.శ. 4 | 395. రోమన్ సామ్రాజ్య విభజన |
| | క్రీ.శ. 5 | 410. గోథ్‌లు రోమ్‌ను ఆక్రమించుకున్నారు<br>476. పశ్చిమ రోమన్ సామ్రాజ్య పతనం |

## ప్రాచీన ప్రపంచ చరిత్రలోని అతి ముఖ్య విషయాలను మీరు ఏ మేరకు నేర్చుకున్నారో

### సరిచూసుకోండి

| | |
|---|---|
| ప్రపంచంలో అన్ని దేశాల జనాభా మొదటో ఆదిమ సమష్టి వ్యవస్థలో జీవించారు. | ఆదిమ సమష్టి వ్యవస్థ మౌలిక లక్షణాలు యేమిటి? ఆదిమ ప్రజలు దేన్ని గురించి తెలుసుకున్నారు, వాళ్ళు యేమి చెయ్యడం నేర్చుకున్నారు? |
| ఆదిమ సమష్టి వ్యవస్థనుంచి బానిస యాజమాన్య వ్యవస్థకి పరివర్తన ప్రాచీన తూర్పు దేశాల్లో ఆరంభమైంది. | ప్రాచీన తూర్పులోని ఏ దేశాల వాసులు బానిస యాజమాన్య వ్యవస్థకు పరివర్తనను మొదట ఆరంభించారు? బానిస యాజమాన్య వ్యవస్థకు పరివర్తన ఎందుకు యీ దేశాల్లోనే ఆరంభమైందో వివరించండి. ఈ పరివర్తన దాదాపుగా ఎప్పుడు మొదలైంది? ప్రాచీన తూర్పు దేశాల్లో ఏ వర్గాలు తలెత్తాయి? |
| ప్రాచీన తూర్పులో రాజుకి అపరిమిత అధికారాలు గల పెద్ద రాజ్యాలు తలెత్తాయి. | వర్గాలు ఏర్పడటంతో రాజ్యాలు ఎందుకు అవతరించాయి? ప్రాచీన తూర్పులో మీకు గుర్తున్న పెద్ద రాజ్యాలు యేమిటి? వాటిని మాప్‌లో చూపండి. |
| మొత్తం ప్రపంచ ఆర్థిక వ్యవస్థ, సంస్కృతుల అభివృద్ధిలో ప్రాచీన తూర్పు ప్రజలు గణనీయమైన పాత్ర వహించారు. | వ్యవసాయం, పశుపాలన, చేతివృత్తులు, శాస్త్రీయ విజ్ఞానం, రాత, కళల అభివృద్ధికి ప్రాచీన తూర్పు ప్రజలు ఎలా దోహదం చేశారు? |
| యూరప్‌లో బానిస యాజమాన్య వ్యవస్థ ఆదిలో గ్రీసులో తలెత్తింది. ఆ వ్యవస్థ తూర్పు దేశాల్లో కంటె గ్రీసులో మరింత అభివృద్ధి చెందింది. | గ్రీసులో బానిస యాజమాన్య వ్యవస్థకు పరివర్తన ఎప్పుడు జరిగింది? ఆ పరివర్తనకు కారణాలు యేమిటి? ఆ వ్యవస్థ అక్కడ ఎప్పుడు శిఖర స్థాయిని అందుకుంది? తూర్పు దేశాలతో పోలిస్తే గ్రీసులో బానిస యాజమాన్య వ్యవస్థ విశిష్ట లక్షణాలు యేమిటి? |
| గ్రీకు నగర రాజ్యాలు మధ్యధరా, తదితర సముద్ర తీరాల వెంట విస్తృతంగా వ్యాపించాయి. | గ్రీసు, ప్రాచీన తూర్పు దేశాల్లోని ప్రాచీన రాజ్యాల మధ్య ప్రధానమైన తేడాలు యేమిటి? గ్రీకు రాజ్యాలకీ తూర్పు రాజ్యాలకీ, ఉన్న ఉమ్మడి లక్షణాలు యేమిటి? |

| | |
|---|---|
| ప్రాచీన గ్రీకు సంస్కృతి వికసించింది. | గ్రీకు సంస్కృతి శీఘ్ర అభివృద్ధికి కారణాలు యేమిటి? ప్రాచీన గ్రీసులో విజ్ఞానశాస్త్రం, కళలు, విద్య వికసించాయన్న విషయాన్ని దేన్నిబట్టి తెలుసుకోవచ్చు? |
| గ్రీకు-మాసిడోనియన్ రాజ్యాలు తూర్పు మధ్యధరా సముద్ర తీరంలో ఏర్పడ్డాయి. దానిలో బానిస యాజమాన్య ఆర్థిక వ్యవస్థ మరింత వేగంగా అభివృద్ధి చెందనారంభించింది. | అలెగ్జాండర్ తన తూర్పు దండయాత్ర ఎప్పుడు మొదలుపెట్టాడు? మాసిడోనియన్ ఆక్రమణల మూలంగా మిక్కిలి పెద్ద రాజ్యాలు యేవి తలెత్తాయో పేర్కొని, వాటిని మాప్‌లో చూపించండి. మాసిడోనియన్ ఆక్రమణల మూలంగా తూర్పు దేశాల ప్రజల జీవితాల్లో వచ్చిన మార్పులు యేమిటి? |
| గ్రీకు, తూర్పు సంస్కృతుల పరస్పర ప్రభావం మూలంగా తూర్పు మధ్యధరా తీర ప్రాంతాల్లో విజ్ఞానశాస్త్రంలోనూ, కళల్లోనూ ఒక నూతన వెల్లువ వచ్చింది. | క్రీ.పూ. 3వ–2వ శతాబ్దాల్లో తూర్పు మధ్యధరా తీర ప్రాంతంలో సంస్కృతిలో వచ్చిన వెల్లువకి సూచనలు యేమిటి? ఉదాహరణలు పేర్కొనండి. |
| ప్రాచీన ప్రపంచంలో రోమన్ రాజ్యం మిక్కిలి పెద్ద రాజ్యం. | రోమన్ రిపబ్లిక్ ఎప్పుడు ఏర్పడింది? రోమ్‌లో సామ్రాజ్యం ఎప్పుడు నెలకొల్పబడింది? రోమన్ రాజ్య ప్రాంతం అత్యధిక ప్రమాణాన్ని ఎప్పుడు చేరుకుంది? రోమన్ సామ్రాజ్యంలో అంతకుముందున్న మీకు తెలిసిన ఏ రాజ్యాల భూప్రాంతం యిమిడివుంది? |
| రోమన్లు ప్రాచీన ప్రపంచపు యితర ప్రజల సాంస్కృతిక విజయాలను విస్తృతంగా వినియోగించుకొని, ప్రాచీన ప్రపంచ సంస్కృతి అభివృద్ధికి విశేషంగా తోడ్పడ్డారు. | పరాజిత ప్రజల సంస్కృతినుంచి రోమన్లు ఏమి స్వీకరించారు? ప్రపంచ సంస్కృతి అభివృద్ధిలో రోమ్ ప్రాముఖ్యం యేమిటి? |
| బానిస యాజమాన్య వ్యవస్థ రోమ్‌లో అపూర్వమైన అభివృద్ధిని సాధించింది. బానిస యాజమాన్య వ్యవస్థ అభివృద్ధి రోమన్ రాజ్య నాశనానికి దారితీసింది. | రోమ్‌లో బానిస యాజమాన్య వ్యవస్థ అత్యధిక అభివృద్ధి స్థాయిని అందుకుందన్న విషయాన్ని నిరూపించండి. అలాంటి అభివృద్ధికి కారణాలు యేమిటి? రోమ్‌లో రిపబ్లిక్కూ, సామ్రాజ్యమూ బానిస యాజమాన్య రాజ్యపు మౌలిక విధులను ఎలా నిర్వర్తించాయి? బానిస యాజమాన్య వ్యవస్థ అభివృద్ధి ఆర్థిక వ్యవస్థ క్షీణించడానికీ, రోమన్ సామ్రాజ్య పతనానికీ ఎందుకు, ఎలా దారితీసింది? |

# ఉపసంహారం

20 లక్షల సంవత్సరాలకి పైగా కాలంలో మానవజాతి పయనించిన సుదీర్ఘమైన, కష్టభూయిష్టమైన మార్గం గురించి మీరు తెలుసుకున్నారు. ఆదిలో మానవులు జంతువుల మాదిరిగా వుండేవాళ్లు. వాళ్లు తమ కనీస జీవితావసరాలను సంపాదించుకోవడం సైతం దుస్సాధ్యంగా వుండేది. తీవ్రమైన శ్రమ ద్వారానూ, గుంపులుగా జీవించడం ద్వారానూ ఆదిమ మానవులు ప్రకృతికి వ్యతిరేకంగా జరిగిన భీషణ పోరాటంలో తట్టుకొని నిలబడటమే కాకుండా, తమ శ్రమ పనిముట్లనూ, శ్రమ కార్యకలాపాలనూ మెరుగుపరచుకోవడం ద్వారా తమని తాము అభివృద్ధిచేసుకున్నారు, ప్రకృతిని గురించిన ప్రత్యక్ష జ్ఞానాన్ని సంపాదించుకున్నారు. ఒక మనిషిని వేరొక మనిషి దోచుకోవడం గాని, వర్గాలు గాని, రాజ్యం గాని లేని ఆదిమ సమష్టి వ్యవస్థలో జనం జీవించారు. ఆదిమ మానవుల జీవితాల్లోని కష్టాలూ, వాళ్లకి వున్న అరకొర జ్ఞానమూ మతా విర్భావానికి దారితీశాయి.

శ్రమ పనిముట్లూ, ఆదిమ మానవుల కార్యకలాపాలూ అభివృద్ధిచెందడం మూలంగా మానవ శ్రమ అంతకుముందరికంటె మరింత ఉత్పాదకమై, కొందరు మనుషులు మరికొందరు మనుషుల శ్రమను దోచుకునే అవకాశాన్ని కల్పించింది. అది వర్గాల ఆవిర్భావానికీ, బానిస యాజమాన్య వ్యవస్థ స్థాపనకీ దారితీసింది.

బానిస యాజమాన్య వ్యవస్థ మనుషులకి అత్యంత క్రూరమైన పీడన, దుర్భరమైన అవమానాలు, విపరీతమైన రక్తపాతంతో, వినాశంతో కూడిన యుద్ధాల రూపంలో ఎనలేని కష్టాలనూ, కడగళ్లనూ కలిగించింది. కానైతే, ఆదిమ సమష్టి వ్యవస్థనుంచి బానిస యాజమాన్య వ్యవస్థకి పరివర్తన చరిత్ర గతిలో ప్రధానమైన ఒక ముందంజ. ప్రాచీన కాలంలో శ్రమ పనిముట్లు ఎంతో సరళంగా వుండేవి. వాటితో పనిచేసేందుకు శరీర శ్రమ మాత్రమే సరిపోయేది. అందుకని గనుల్లో, కార్ఖానాల్లో, ఓడలమీద, వ్యవసాయంలో బానిస శ్రమను విస్తృతంగా వినియోగించడం సాధ్యమైంది. పలువురు బానిసల, బీదల శ్రమ వినియోగం ఎడారులనూ, అడవులనూ పంటచేలుగా, పళ్లతోటలుగా మార్చడం, నగరాలు నిర్మించడం, నౌకల్లో సముద్రాల్లోనూ, మహాసముద్రాల్లోనూ పయనించడం సాధ్యమయ్యాయి. బానిసల, బీదల శ్రమని దోచుకోవడం యితరులు విజ్ఞానశాస్త్రంలోనూ, కళల్లోనూ నిమగ్నులవడాన్ని సాధ్యం చేసింది. ప్రాచీన కాలంలో

సృజింపబడిన లిఖిత భాష, విజ్ఞానశాస్త్రం, కళలూ, దరిమిలా ప్రపంచ సంస్కృతి అభివృద్ధికి ప్రాతిపదికగా వినియోగపడ్డాయి.

బానిస యాజమాన్య వ్యవస్థ అభివృద్ధి దాని అనివార్య పతనానికి దారితీసింది. బానిస శ్రమ స్వేచ్ఛాయుత శ్రమకి చోటు లేకుండా చేసింది. బానిస శ్రమ నాణ్యత చాలా నాసి. బానిస శ్రమతో సాంకేతికాభివృద్ధి మెరుగుదలలు దాదాపు అసాధ్యమయాయి. ఆర్థిక వ్యవస్థ, సంస్కృతుల యితోధికాభివృద్ధికి బానిస యాజమాన్య వ్యవస్థ ఒక బంధమవడమే కాకుండా, వాటి పతనానికి కూడా దారితీసింది. పీడితుల వర్గపోరాటం బానిస యాజమాన్య రాజ్యాలను బలహీనపరచింది.

జన బాహుళ్యం బానిస యాజమాన్య వ్యవస్థని నాశనంచేసి, ఆర్థిక వ్యవస్థ, సంస్కృతుల యితోధికాభివృద్ధికి మార్గాన్ని సుగమంచేశారు.

పాఠకులకు మనవి

ఈ పుస్తకాన్ని గురించీ, దీని అనువాదాన్ని గురించీ, కూర్పును గురించీ మీ అభిప్రాయాలను యీకింది చిరునామాకు తెలియజేయండి:

Progress Publishers
17, Zubovsky Boulevard
Moscow, USSR

మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్
4–1–435
బాంక్ స్ట్రీట్
హైదరాబాదు – 500001

విశాలాంధ్ర బుక్ హౌస్
4–2–237
సుల్తాన్ బజార్
హైదరాబాదు – 500195

విశాలాంధ్ర బుక్ హౌస్
కార్ల్ మార్క్స్ రోడ్డు
విజయవాడ – 520002

విశాలాంధ్ర బుక్ హౌస్
కాలేజి రోడ్డు
అనంతపురం – 515004

విశాలాంధ్ర బుక్ హౌస్
గాంధీ రోడ్డు
తిరుపతి – 517501

విశాలాంధ్ర బుక్ హౌస్
సూపర్ బజారు ఎదుట
విశాఖపట్నం – 530002

విశాలాంధ్ర బుక్ హౌస్
రష్యన్ షాపింగ్ కాంప్లెక్స్
స్టీల్ ప్లాంట్ టౌన్‌షిప్
విశాఖపట్నం – 530031

విశాలాంధ్ర బుక్ హౌస్
పాత మునిసిపల్ ఆఫీసు ఎదుట
మెయిన్ రోడ్డు
హనుమకొండ – 506001

విశాలాంధ్ర బుక్ హౌస్
అరండల్ పేట
మెయిన్ రోడ్డు
గుంటూరు – 522002

విశాలాంధ్ర బుక్ హౌస్
మెయిన్ రోడ్డు
కాకినాడ – 533001

ప్రగతి ప్రచురణాలయం
1990లో ప్రచురించబోయే
ఈక్రింది పుస్తకంకోసం ఎదురు చూడండి:

## "మధ్య యుగాల చరిత్ర"

రచన: ఇ. అగిబాలోవా, జి. దొన్‌స్కోయ్

ఈ పాఠ్యగ్రంథం క్రీ. శ. 5వ శతాబ్దినుంచి, 17వ శతాబ్దివరకు, అంటే ఫ్యూడలిజం పతనమై, పెట్టుబడిదారీ సంబంధాలు ఆవిర్భవించేవరకు పశ్చిమ యూరప్, భారతదేశం, చైనాల, మరికొన్ని యితర దేశాల చరిత్రను తెలియజేస్తుంది.

ఈ పుస్తకం సుదూర తీరాలకు, అపరిచిత దేశాలకు సాహసిక సముద్ర యానాలను గురించీ, ఎవరి సృజనాత్మక వారసత్వాన్ని ప్రపంచం యీనాటికీ ప్రశంసిస్తోందో అలాంటి ప్రముఖ పండితులు, రచయితలు, కళాకారులు, కవులు, హస్తకళా నిపుణలను గురించీ తెలియజేస్తుంది.

పుస్తకంలో వర్ణ చిత్రాలూ, తెలుపు నలుపు చిత్రాలూ, రంగు మాప్‌లూ వున్నాయి.

ఈ పుస్తకం విద్యార్థులకే గాక అందరి ఆదరాభిమానాలూ పొందగలదని ఆశిస్తున్నాం.

# రోమన్ సామ్రాజ్య విస్తరణ (క్రీ.పూ. 3వ శతాబ్దికీ 2వ శతాబ్దికీ మధ్య)



## అలెగ్జాండర్ ది గ్రేట్ తూర్పు దండయాత్రలు (క్రీ.పూ. 334–325)




## అలెగ్జాండర్ ది గ్రేట్ సామ్రాజ్యం, దాని విచ్ఛిత్తి




## ప్రాచీన ఇటలీ (క్రీ.పూ. 3వ శతాబ్ది మధ్య నాటికి)

8

రోమ్ స్థాపన

టైబర్
మార్స్ మైదానం
కాపిటోలియమ్
పలటీన్
పెద్ద సర్కస్

పలటీనే: పలటీనే నగర జన్మస్థానం
క్రీ.పూ. 4వ శతాబ్దిలో రోమ్ నగర కుడ్యం

ఆల్ప్స్
పో
టైబర్
రోమ్
కార్సికా ద్వీపం
సార్డీనియా ద్వీపం
కపువా
నేపుల్స్
పాంపేయ్
బ్రండీజియమ్
టారెంటమ్
మెస్సానా
సిసిలీ
సిరక్యూజ్
కార్థేజ్

రోమన్ రిపబ్లిక్ విస్తీర్ణం:
క్రీ.పూ. 6వ శతాబ్ది అంతం నాటికి
క్రీ.పూ. 3వ శతాబ్ది మధ్య (ప్యూనిక్ యుద్ధాల ఆరంభం నాటికి)
ప్రధాన మార్గాలు
ప్రధాన గ్రీకు నగరాలు
రోమన్ జనావాస ప్రాంతాలు
ప్యూనిక్ యుద్ధాల ఆరంభం నాటికి కార్థేజియన్ల ఆక్రమణలో వున్న ప్రాంతాలు
75 0 75 150కి.మీ.

ప్రాచీన తూర్పు

③ భారత దేశం, చైనా

సంచార తెగలు

సిల్కు మహా మార్గం

అముదర్యా

బాక్ట్రియా

తక్షశిల

భారత దేశంలోని అత్యంత ప్రాచీన నగరాల త్రవ్వకాల స్థలాలు

సింధు

టిబెట్

హిమాలయాలు

బ్రహ్మపుత్ర

గంగ

పాటలీపుత్రం

అరేబియా సముద్రం

బంగాళాఖాతం

యాంగ్జీ

తూర్పు చైనా

తూర్పు చైనా సముద్రం

తైవాన్

హైనాన్

దక్షిణ చైనా సముద్రం

మెకాంగ్

గంగా మైదాన ప్రాంతంలోని తొలి రాజ్యం (క్రీ.పూ. 7వ శతాబ్దం)

భారత దేశంలోని మిక్కిలి పెద్ద ప్రాచీన రాజ్యపు సరిహద్దులు (క్రీ.పూ. 3వ శతాబ్దం)

భారత దేశం, చైనాల ప్రధాన ప్రాచీన వ్యాపార మార్గాలు




4 ప్రాచీన గ్రీసు
(క్రీ.పూ. 4వ శతాబ్ది అంతంవరకు)
ఒలింపస్ శిఖరం
ఉత్తర గ్రీసు
మధ్య గ్రీసు
హెరోనియా
డెల్ఫి
థీబ్స్
ప్లేటియా
అట్టికా
మెరథాన్
ఏథెన్స్
పిరేయస్
కొరింథ్
ఒలింపియా
ఎలిస్
మెసినియా
పైలోస్
లకోనియా
ఇథాకా
యుబోయా
లెమ్నోస్
లెస్బోస్
ట్రాయ్ (ఇలియోన్)
హియోస్ ద్వీపం
సమోస్ ద్వీపం
ఎఫెసస్
మిలెటస్
డెలోస్
రోడెస్
క్నోసస్
క్రీట్
పెల్లా
క్రీ.పూ. 1వ సహస్రాబ్ది ఆరంభం నాటికి గ్రీకులు నివసిస్తున్న ప్రాంతం
ప్రధాన గ్రీకు నగరాలు
గ్రీసులోని ప్రధాన ప్రాంతాల పరిహద్దులు, పేర్లు
60 0 60 120కి.మీ.


ప్రాచీన గ్రీసు స్మారక చిహ్నాలు
డెల్ఫిలోని కోశాగారం
హెరోనియాలోని విగ్రహం
పార్థెనాన్
ఒలింపియాలోని దేవాలయం
మైకేనేలోని సింహద్వారాలు
ఏగినా ద్వీపంలోని దేవాలయం
ప్రాచీన లిపి ఫలక
లెమ్నోస్ ద్వీపం
లెస్బోస్
హియోస్ ద్వీపం
సమోస్ ద్వీపం
డెలోస్ ద్వీపంలోని దేవాలయం
ట్రాయ్ కుడ్యాలు
పెర్గమమ్‌లోని ఉబ్బెత్తు శిల్పాలు
మిలెటస్ సమీపంలోని మండపం
హాలికర్నసస్‌లోని సమాధి
స్తంభాలు
రోడెస్ ద్వీపం
క్నోసస్‌లోని రాజభవనం
క్రీట్
50 0 50కి.మీ.


అట్టికా (క్రీ.పూ. 5వ శతాబ్ది)
ప్లేటియా
డెకెలేయా
మెరథాన్
ఏథెన్స్
పిరేయస్
సలమిస్
ఏగినా
లౌరియం గనులు
ఏథెన్స్ రాజ్యపు పరిహద్దులు
ప్రధాన వ్యవసాయ ప్రాంతాలు
పొడవు గోడలు
0 15కి.మీ.


ఏథెన్స్ (క్రీ.పూ. 5వ శతాబ్ది)
సిరామికస్
అగోరా
అక్రోపొలిస్
ప్నిక్స్
డయోనిసస్ నాటకశాల
మెరథాన్‌కి
ఇలిసస్
పొడవు గోడ
సిరామికస్: కుమ్మర్ల వాడ
ప్నిక్స్: ప్రజా సభల సమావేశ స్థలాలు



5 గ్రీసు వలసలు ఏర్పడడం
(క్రీ.పూ. 8వ–5వ శతాబ్దాలు)
మస్సీలియా
కార్సికా
రోమ్
సార్డీనియా
నేపుల్స్
సిసిలీ
సిరక్యూజ్
కార్తేజ్
డాన్యూబ్
బాల్కన్ ద్వీపకల్పం
మాసిడోనియా
బైజాంటియమ్
ఆసియా మైనర్
మిలెటస్
హెరాక్లియా
క్రీట్
సిరేనె
ఒల్బియా
పాంటికపేయమ్
తానాయిస్
టైర్
క్రీ.పూ. 8వ శతాబ్ది ఆరంభం నాటికి గ్రీసు రాజ్య ప్రాంతం
గ్రీకుల ఆక్రమణలోని తీర ప్రాంతాలు
ప్రధానమైన గ్రీకు వలసలు
గ్రీకుల దండయాత్రల ప్రధాన మార్గాలు
300 0 300కి.మీ.

## 11 బానిస యాజమాన్య రాజ్యాల విస్తీర్ణపు పెరుగుదల (ప్రాచీన కాలంనుంచి క్రీ.శ. 2వ శతాబ్ది వరకు)















10

# రోమన్ రాజ్య విచ్ఛిత్తి, పశ్చిమ రోమన్ సామ్రాజ్య పతనం

ఉత్తర సముద్రం
బాల్టిక్ సముద్రం
లోండినియమ్ (లండన్)
ల్యుటేసియా (పారిస్)
టోలెటమ్ (టోలెడో)
విస్తులా నది
ఎల్బ్
రైన్
డాన్యూబ్
హూణులు
రవేన్న
రోమ్
కార్సికా ద్వీపం
సార్డీనియా ద్వీపం
సిసిలీ ద్వీపం
సిరక్యూజ్
మధ్యధరా సముద్రం
వాండల్ తెగలు
హెర్సోనేస్
నల్ల సముద్రం
ఏడ్రియనోపుల్
కాన్‌స్టాంటినోపుల్
ఏథెన్స్
క్రీట్ ద్వీపం
సైప్రస్ ద్వీపం
టైర్
అలెగ్జాండ్రియా
నైలు
దోన్
వోల్గా




4వ శతాబ్ది అంతం నాటికి రోమన్ సామ్రాజ్యపు సరిహద్దులు
క్రీ.శ. 395లో రోమన్ సామ్రాజ్యపు విభజన రేఖ
పశ్చిమ రోమన్ సామ్రాజ్యం
తూర్పు రోమన్ సామ్రాజ్యం
4వ–5వ శతాబ్దాల్లో సామ్రాజ్యానికి వ్యతిరేకంగా తిరుగుబాట్లు జరిగిన ప్రాంతాలు
బర్బరుల దాడుల మార్గాలు
రోమన్ సరిహద్దుల్లో దుర్గ నిర్మాణాలు

225 0 225 450కి.మీ.

## 2 ఈజిప్టు, మెసొపొటేమియా
(క్రీ.పూ. 6వ శతాబ్దం)












మాపుల పట్టీ

1 తూర్పు అర్ధగోళంలో మానవులు జీవించిన ప్రదేశాలు 8,000–5,000 సంవత్సరాల క్రితం
2 ప్రాచీన తూర్పు: ఈజిప్టు, మెసపొటేమియా (క్రీ.పూ. 6వ శతాబ్దం)
3 ప్రాచీన తూర్పు: భారత దేశం, చైనా
4 ప్రాచీన గ్రీసు (క్రీ.పూ. 4వ శతాబ్ది అంతానికి)
5 గ్రీసు వలసల ఏర్పాటు (క్రీ.పూ. 8వ–5వ శతాబ్దాలు)
6 అలెగ్జాండర్ ది గ్రేట్ తూర్పు దండయాత్రలు (క్రీ.పూ. 334–325)
7 అలెగ్జాండర్ ది గ్రేట్ సామ్రాజ్యం, దాని విచ్ఛిత్తి
8 ప్రాచీన ఇటలీ (క్రీ.పూ. 3వ శతాబ్ది మధ్య నాటికి)
9 రోమన్ సామ్రాజ్య విస్తరణ (క్రీ.పూ. 3వ శతాబ్దికీ 2వ శతాబ్దికీ మధ్య)
9అ స్పార్టకస్ నాయకత్వాన బానిసల తిరుగుబాటు (క్రీ.పూ. 74–71)
10 రోమన్ రాజ్య విచ్ఛిత్తి, పశ్చిమ రోమన్ సామ్రాజ్య పతనం
11 బానిస యాజమాన్య రాజ్యాల విస్తీర్ణపు పెరుగుదల (పాచీన కాలంనుంచి క్రీ.శ. 2వ శతాబ్దివరకు)
12 గ్రీకు అక్షరమాల ప్రాతిపదికమీద ఆధునిక అక్షరమాలల వ్యాప్తి

ఈ మాప్‌లు ఎఫ్. పి. కొరోవ్కిన్
దర్శకత్వంలో కూర్చబడ్డాయి

# ఎఫ్. కొరోవ్కిన్ రచించిన
# “ప్రాచీన ప్రపంచ చరిత్ర”కు అనుబంధం
# మాప్‌లు



